ఓం

# శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి

## పదవ సంపుటము

## కర-ముండక-మాండూక్యోపనిషత్తులు

## నారద భక్తి సూత్రములు

ప్రకాశకులు

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము

**శ్రీ వ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘ ప్రచురణ - 2001 సం
ప్రతులు 1000

వెల -

ప్రతులకు
మేనేజర్, శ్రీవ్యాసాశ్రమం
వ్యాసాశ్రమం పోస్టు, ఏర్పేడు మార్గం
చిత్తూరు జిల్లా - ఆంధ్రప్రదేశ్ - 517621

లేజర్ టైప్‌సెట్టింగ్
**అన్నపూర్ణ గ్రాఫిక్స్**
53, ఆర్ ఎస్ గార్డెన్స్, తిరుపతి

ముద్రణ
**శ్రీపారాశర్య ముద్రణాలయము**
శ్రీ వ్యాసాశ్రమం, చిత్తూరుజిల్లా

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పాఠకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంధ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు



ఓమ్

# కఠ- ముండక- మాండూక్యోపనిషత్తులు
# నారదభక్తి సూత్రములు

## విషయానుక్రమణిక

## నారద భక్తి సూత్రములు



మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు

ఓమ్

ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

# తొలిపలుకు

కఠోపనిషత్తు కృష్ణయజుర్వేదీయ కఠశాఖకు సంబంధించినది కఠప్రోక్తమగుటచే కఠోపనిషత్తని పేరు వచ్చినది ఉపనిషద్వాఙ్మయమున సుప్రసిద్ధములు, ప్రముఖములు నైన దశోపనిషత్తులలో నియ్యది అన్యతమము దీనియందు రెండు అధ్యాయములు, ప్రతి అధ్యాయమున మూడేసి వల్లులు గలవు ఇందు యమ నచికేతసుల సంవాదరూపముతో బ్రహ్మవిద్య విశదముగ వర్ణింపబడినది దురూహములగు ఆధ్యాత్మిక విషయములు, ఆత్మ స్వరూపము కథారూపమున స్పష్టపఱుపబడినవి శ్రీమద్భగవద్గీతలో కొన్నిచోట్ల ఈ కఠోపనిషన్మంత్రములయొక్క శబ్దసామ్యము, మఱికొన్ని చోటులందు అర్థసామ్యము కాననగుచున్నది శ్రీగురుదేవులు (బ్రహ్మీభూత మహర్షి శ్రీసద్గురు మలయాళస్వాములవారు) తమ భావార్థ ప్రతిపాదనలో దీనిని సోదాహరణముగ వివరించిరి ఈ ఉపనిత్తులో ఇతర ఉపనిషత్తులలోవలె ఆత్మతత్త్వమే గాక నచికేతసుని చరిత్ర సాత్త్విక భావోపేతముగ ఆదర్శవంతముగ చిత్రింపబడినది

నచికేతసుని తండ్రియగు వాజశ్రవసుడు విశ్వజిద్యాగమును జేసెను ఆ యజ్ఞాంతమున సర్వస్వము దక్షిణగ దాన మీయవలసియుండును అపుడే ఆ యజ్ఞము పరిపూర్ణము, ఫలప్రదము కాగలదు కాని తండ్రియైన వాజశ్రవసుడో పుత్రవ్యామోహముచే నతని నటులే ఉంచి, ముసలివై చావ సంసిద్ధముగా నున్న నిరుపయోగములైన గోవులను బ్రాహ్మణులకు దానమిచ్చుచున్నాడు దీనిని చూచి నచికేతసు డూరకుండలేక, తండ్రి చేయు యాగము నిరర్థకమగుచున్న దని యెంచి, తండ్రికి గలిగిన పుత్రమోహము నెటులైనా పోగొట్టవలయునను తలంపుతో, ఆస్తికభావముతో, బాల చాపల్యముతో చివరికి 'తండ్రీ ! నన్నెవరికిచ్చెదవు' - అని ప్రశ్నించెను (తత కస్మై మాం దాస్యసీతి) రెండు మూడు సార్లు నచికేతసు డీవిధముగ తండ్రి నడిగెను కాని కార్యాంతరవ్యగ్రమానసు

డగుటచే తండ్రి పుత్రుని ప్రశ్నలకు విసిగి చీకాకు జెంది 'పో - నిన్ను మృత్యువున కిచ్చెద' ననెను ( మృత్యవే త్వా దదామీతి) తండ్రి కోపముతో నిటు లనుచున్నాడని తెలిసియు పితృవాక్యపరిపాలకుడగు నచికేతసుడు తండ్రి మాటనుపేక్షించక మృత్యువు అనబడు యముని యొద్దకు వెళ్ల సంసిద్ధుడాయెను, తండ్రివాక్యమును యధార్థము గావింపవలయుననియే నచికేతసుని సంకల్పము

పితృవాక్య పరిపాలనకొఱకయ్యే గదా శ్రీరామచంద్రుడు సమస్త రాజ్యమును వదలి అరణ్యములకేగి పలుబాధల బొందెను దశరధుడు భావి పరిణామమును గుర్తెరుగక ప్రేమవశమున కైకేయికి వరమిచ్చెను కాని శ్రీరామచంద్రుడు తండ్రి యిచ్చిన వరముయొక్క ఉచితానుచితములను విచారించక పితృవాక్యపరిపాలనమే కర్తవ్యమని తలచి సర్వమును పరిత్యజించి పితృవాక్యమును సత్యము గావించెను

అట్లే ద్రౌపదీ స్వయంవరమునకు పంచపాండవులు వెళ్ళిరి అందు అర్జునుడు మత్స్యయంత్రమును గొట్టెను ద్రౌపదిని దీసికొని అయిదుగురు అన్నదమ్ములు తల్లియైన కుంతీదేవి యొద్దకు వచ్చి 'అమ్మా ! మేమొక పండును దెచ్చితి' మని విన్నవించిరి కుంతీదేవి విచారించకయే సంతోషముతో 'అబ్బాయిలూ ! మీరైదుగురు పంచుకొని తినండి' అని చెప్పెను తల్లియొక్క యామాట సర్వధా లోక విరుద్ధము, అనాచరణీయము కాని మాతృభక్తి పరాయణులగు పంచపాండవులు మాతృవచనమును అక్షరశః పరిపాలించిరి

ఈలాగుననే నచికేసునికిని పితృవాక్యపరిపాలనము ముఖ్యసమస్య యైనది పితృవాక్యమును సత్యము గావించుటకు తండ్రియొక్క మోహజనిత వాత్సల్యమును నివారించుటకు నచికేతసుడు ఐహిక సుఖముల నెల్ల త్యాగముజేసి తన జీవితమునే బలియొనర్చెను అయితే తండ్రి మాటలు విన్నతరువాత నచికేతసుడు - తండ్రి యాజ్ఞప్రకారము నేను మృత్యు సాన్నిధ్యమును చేరగలను మృత్యువు నుండి తప్పించుకొనువా రెవరును లేరు కాని నాతో మృత్యువున కేమి పని ! మృత్యువు నన్ను దక్షిణగా స్వీకరించి పొందగల ఫలమేమిటి ! - అని విచారింపసాగెను తండ్రిగూడ ముందు కోపముతో 'మృత్యువున కిచ్చెదన' ని

యన్నను తరువాత పశ్చాత్తాప పడసాగెను పుత్రవియోగమునకై పరితపించుచున్న తండ్రికి పుత్రుడు వైరాగ్యము నుపదేశించెను 'పుట్టిన తరువాత చావు అనునది అనివార్యము సస్యముద్భవించుచున్నది, పరిణామము నొంది పండి చివరికి నశించుచున్నది ఈ శరీర పరిస్థితియు నంతయే, కాన దుఃఖించు టెందులకు! మనపూర్వులు సత్యవాక్యపరిపాలనమునకై యెంతటి త్యాగమొనర్చిరో స్మరింపుము కర్తవ్యధర్మము నాలోచించు కొనుము ఆడినమాటకు వెనుదీయకుము, శోకింపకుము, సత్యవాక్య పరిపాలకుడవై సంతోషముతో యమాలయమునకు వెళ్ళ నాకనుజ్ఞ యిమ్ము' - అని నచికేతసుడు తండ్రిని ప్రార్థించెను ఇటుల ప్రార్థించి తండ్రినోదార్చి పితృవాక్య పరిపాలనమే దీక్షగా గల నచికేతసుడు యమలోకమున కేగెను నచికేతసుని యా యమలోకగమన మతనికే గాదు ఆతని తండ్రికే గాదు, తన్నిమిత్తముగ సకల ప్రపంచమునకును మంగళప్రదమైనది యమ నచికేతసంవాదరూపముతో బ్రహ్మవిద్య ప్రకటితమై భవబంధ విచ్ఛేదకమైనది కదా !

నచికేతసుడు తండ్రి యాజ్ఞప్రకారము యమలోకమున కరిగెను కాని ఆ సమయమునకు యముడింటియొద్దలేడు యముని సందర్శనము కానంతవఱకు, తాను వచ్చిన కార్యము సిద్ధింపనంతవఱకు అన్నాహారముల గ్రహింపనని అతడు పట్టుబట్టెను ఈ ప్రకారము దృఢవ్రతుడై నిరాహారియై యమ గృహమున నచికేతసుడు మూడు రాత్రులు గడిపెను మూడు రోజులైన తరువాత యముడు స్వగృహమునకు తిరిగివచ్చెను యమునికీ వృత్తాంతము ఒక అతిధి వచ్చి తమద్వారముకడ మూడురోజుల నుండిఉపవాసమున్నాడను సంగతి యెఱింగింపబడెను అందులకు యముడు మిక్కిలి విచారించెను ఇంటికి వచ్చిన అతిధిని సత్కరించక తిరస్కరించినచో, అన్నాహారమును గ్రహింపకయే అతిధి వెడలి పోయినచో ఆ యింటి యజమానియగు గృహస్థునియొక్క సమస్త పుణ్యములు సకలైశ్వర్యములు నశించును ఈ సత్యమును గుర్తెఱిగిన యముడు తమ గృహమున మూడు రోజుల నుండి ఉపవాసమున్న నచికేతసుని యొద్దకు వెళ్ళి శాంతివచనములతో అర్ఘ్యపాద్యాదుల నొసగి సత్కరించెను ఇందుచే అతిధి సత్కారఫలము, తత్తిరస్కృతిచే గలుగు అనర్థము స్పష్టపడుచున్నది,

సత్కారానంతరము యముడు నచికేతసునితో 'మూడురోజులు నిరాహారివై యుంటివి కాన తద్దోషపరిహారార్థము మూడు వరముల కోరుకొను' మనెను

నచికేతసుడు అట్లే మూడు వరముల కోరుకొనెను సర్వప్రథమముగ పితృపరితోషరూపమైన వరమును కోరెను అనగా తండ్రి యేదో పరధోరణితో మృత్యువున కిచ్చెదననెను కాని పుత్రునిపై మోహము గలవాడై తరువాత నతనిని యమగృహమునకు బంపుటకు దుఃఖించెను పుత్రుడో తండ్రి వాక్యము అసత్యము కాగూడదనం భావముతో యమలోకమునకు వెళ్ళెనం ఇట్లుండ యమగృహమునుండి తిరిగి వెళ్ళిన తన పుత్రుని జూచి తండ్రి కోపించునేమో యని శంకించి నచికేతసుడు ప్రథమ వరరూపమున 'నాతండ్రికి నాపై కోపము గలుగకుండుగాక ! ఉన్న కోప ముపశమించు గాక ! శాంతచిత్తుడై, ప్రసన్నమనస్కుడై, క్రోధరహితుడై నీయొద్దనుండి తిరిగి వెళ్ళిన నన్ను అన్యునిగా భావించక 'యతడు నాపుత్రుడే' యని గుర్తించి ప్రేమతో నన్నాదరించుగాక !' యని కోరుకొనెను యముడు అట్లేయని మొదటి వరము నిచ్చెను దుఃఖితుడైన తండ్రిని ప్రసన్నుని జేయుటనునది దృష్టఫలము కనుక ముందుగ నచికేతసుడు దీనిని కోరెను

స్వాభావికముగ మనుష్యుడు లౌకికశాంతి లభించిన తరువాత పారలౌకిక సుఖము నాకాంక్షించును పారలౌకిక సుఖాకాంక్ష ప్రబలమగుచో నాతడు ఇక లౌకిక సుఖమును సయితము త్రోసిపుచ్చును ఇది లోక సహజము నచికేతసుడును లౌకికమగు పితృసంతోషరూప వరమును గోరుకొని తరువాత పారలౌకిక సుఖసాధనభూతమైన అగ్ని విజ్ఞానమును రెండవ వరముగా కోరెను శ్రద్ధాళువైన నచికేతసునికి నీ వరముగూడ ఈయబడెను అగ్ని లోకమునకు ఆదికారణమని స్తుతించి హవనకుండ మెటుల నిర్మించవలయునో, ఎట్టి, ఎన్ని యిటుకలతో వేదికను నిర్మించవలయునో, ఎటుల అగ్నిచయన మొనర్పవలయునో యా విషయముల నెల్ల యముడు విపులముగా దెలిపెను సూక్ష్మగ్రాహి, శ్రద్ధావంతుడు, జిజ్ఞాసాపరుడునగు నచికేతసుడు యముడు చెప్పిన దానినంతయు శ్రద్ధగా విని విన్నది విన్నట్లు యమునికి తిరిగి వినిపించెను శిష్యుని మేధాసంపత్తికి,

యోగ్యతకు మెచ్చుకొని సంతోషపడి యముడు పూర్వోక్తములగు మూడు వరములకంటె వేరుగా మఱియొక వరము నిచ్చెను

'నాచే ఉపదేశింపబడిన యా అగ్ని చయనము ఇక మీదట నీ పేరుతో 'నాచికేతాగ్ని' యని పిలుపబడును' - అని ప్రసన్నుడై యముడు అతిరిక్తవరము నొకదాని నిచ్చెను

నచికేతసుడు స్వర్గసాధనభూతమైన ''అగ్నివిద్య''ను వరించినందున నతడు స్వర్గసుఖాభిలాషి యని తలంపరాదు మొదటి వరము స్వపితృ హృదయశాంత్యర్థమైనటుల, ఈ రెండవ వరముకూడా సకల మానవ హితార్థమే వరింపబడినది కర్మనిష్ఠులు స్వర్గాది సుఖములచేతనే పరితృప్తులగుదురు వారి పురోగతికై అగ్నిచయనాది కర్మానుష్ఠాన మవసరము కనుక సామాన్యుల నిమిత్తమై నచికేతసుడీ రెండవ వరమును కోరుకొనెనే కాని తన కొఱకు గాదు నచికేతసుని అంతఃకరణవృత్తిని, మానసిక యోగ్యతను పరీక్షించుటకై యముడు అనేక ప్రలోభముల జూపినను వాటిని ఆశింపక తత్త్వజిజ్ఞాసతో ఆత్మవిషయక ప్రశ్ననే మూడవవరముగా అడిగినందున నచికేతసుని యభీష్టము, జిజ్ఞాస యేదియో వెల్లడి యగుచున్నది

*యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేஉ*
*స్తీత్యేకే నాయ మస్తీతి చైకే ।*
*ఏతద్విద్యామనుశిష్టస్త్వయాஉహం*
*వరాణామేష వరస్తృతీయః ॥*

మనుష్యుడు చనిపోయిన తరువాత జీవాత్మ మిగిలియుండునని కొందఱు, అట్లుండదని మఱికొందఱు రెండు విధములుగ వాదించుచున్నారు కావున నీవు నాకీవిషయమును చక్కగ బోధించి సందేహనివృత్తి జేయుము నేను కోరు మూడవ వరమిదియే

ఈ విధముగ నచికేతసుడు మరణానంతరాత్మాస్తిత్వమును గుఱించి ప్రార్థింప నతడు నచికేతసుని జిజ్ఞాసను పరీక్షింప గోరి - 'నాయనా ! యావిషయమై పూర్వము దేవాదులు సయితము సందేహపడిరి అస్తి - నాస్తి

విచికిత్సకు గురియైరి ఈ ధర్మము ( ఆత్త్వము) చాల సూక్ష్మమైనది సులభముగ గ్రాహ్యము కానిది కావున నన్ను బలవంతపెట్టక యీ ప్రశ్నను వదలి మఱియొక వరమును గోరుకొను మనెను కాని నచికేతసుడు అందుల కంగీకరింపలేదు 'అయ్యా ! ఈ విషయమున విద్వాంసులు, దేవతలు గూడ సందేహించిరనియు, సులభగ్రాహ్యము కాదనియు నీవే చెప్పుచున్నావు కాన మరణానంతరము జీవునియొక్క స్థితిని మృత్యురూపుడవగు నీవు దప్ప వేరొక రెఱుగజాలరు నీవంటి వక్త నాకు లభించడు కూడ దీనికి మించిన వేరొక దానిని వరించను' అని నచికేతసుడు దృఢముగా పలికెను

నచికేతసుని నేవిధముగానైనను ఈ ఆత్మవిషయక ప్రశ్ననుండి మరల్చవలయునను తలంపుతో యము డనేకవిధ ప్రలోభముల జూపెను 'నచికేతసుడా ! నూరు సంవత్సరముల వయస్సుగల పుత్రపౌత్రులను, ఏనుగులను, బంగారును, అసంఖ్యాకములగు పశువులను, అశ్వములను కోరుకొనుము ఇంతియే గాదు విశాలమగు మహీరాజ్యమును వరించుము ఎన్ని సంవత్సరములు నీవు జీవింపదలంచుచున్నావో అంత జీవితమును గోరుము, ఇచ్చెదను నీకు కావలసిన ధనమును, చిరంజీవిత్వమును ఇచ్చి, నిన్నీ మహీవలయమునకు రాజుగ జేసెదను నీ యిచ్చ వచ్చినటుల సమస్తభోగముల ననుభవింపుము వేయేల -

*యే యే కామా దుర్లభా మర్త్యలోకే*
*సర్వాన్ కామాగ్ంశ్ఛందతః ప్రార్థయస్వ ।*
*ఇమా రామాః సరథాః సతూర్యాః*
*న హీదృశా లంభనీయా మనుష్యైః ।*
*ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ*
*నచికేతో ! మరణం మానుప్రాక్షీః ॥*

మనుష్యలోకమున దుర్లభములగు నెల్లకోరికలను స్వేచ్ఛగ కోరుకొనుము వాని నన్నిటిని నీకొసగుదును రథముల నధిష్ఠించి వాద్యధ్వనులతో సుందరీమణులు నీకై వేచియున్నారు ఇదిగో ! వీరిని స్వీకరించి వీరి సేవల నందుకొనుము కామోపభోగముల స్వైరముగ ననుభవింపుము వీరు

మనుష్యులకు లభించువారు కారు కావున నిక మరణానంతరము ఆత్మయొక్క అస్తిత్వమును గూర్చి మాత్రము నన్ను ప్రశ్నించకుము - అని యిటుల యముడు తన వాక్చాతుర్యముతో భోగ్యవస్తు ప్రలోభనమును జూపి నచికేతసుని మనోధైర్యమును, జిజ్ఞాసాదార్ఢ్యమును పరీక్షించెను కాని దృఢమతి, ఉత్తమాధికారి యగు నచికేతసుడు యముని ప్రలోభములకు లొంగక యాక్రింది విధముగ ప్రత్యుత్తర మీయ నారంభించెను

*శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః ।*
*అపి సర్వం జీవితమల్ప మేవ తవైవ వాహాస్తవ నృత్యగీతే ॥*

యమాచార్యా ! భోగము లశాశ్వతములు రేపటి వరకు ఉండునో ఉండవో సందేహము గలిగినవి ఇట్టి భోగవిలాసములు మరణధర్మముగల మానవుని సమస్తేంద్రియములయొక్క తేజస్సును, పటుత్వమును జీర్ణ మొనరించును జీవితమా బుద్బుదప్రాయము కావున నీవు నాకీయదలంచిన రామామణులను నీకడనే యుంచుకొనుము అట్లే వాహనాదులు, నృత్యగీతములు అన్నియు నీవే ఉంచుకొనుము నా కవసరము లేదు

*న వి త్తేన తర్పణీయో మనుష్యో*
*లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా ।*
*జీవిష్యామో యావదీశిష్యసి త్వం*
*వరస్తు మే వరణీయస్స ఏవ ॥*

మనుష్యుడు ధనముచే తృప్తినొందడు ధనతృష్ణకు మితి యెక్కడిది? నిన్ను దర్శించినచో నీ కృపాదృష్టిచే వలసినంత ధనమును, కోరినంత ఆయువును పొందగలము కాని అవి యన్నియు అస్థిరములేగదా ! వాటి నటులుంచి నేకోరిన వరమునే నాకిమ్ము

*అజీర్యతా మమృతానా ముపేత్య*
*జీర్యన్మర్త్యః క్వధస్థః ప్రజానన్ ।*
*అభిధ్యాయన్ వర్ణరతి ప్రమోదా*
*నతిదీర్ఘే జీవితే కో రమేత ॥*

వార్ధక్యము, మరణము లేని దేవతల సాన్నిధ్యమును జేరియు, వారివలన పొందదగిన ఉత్తమ ప్రయోజనమును కోరక, ధరాతలమునందున్న విషయసుఖములు తుచ్ఛములు, దుఃఖహేతువులు, అని దెలిసియు జరాగ్రస్తుడు, మరణ శీలుడునగునే బుద్ధిమంతుడు దీర్ఘజీవితము నాశించును? ఎవడును వాంఛింపడు నేనును నీసన్నిధి జేరితిని కాన నాకు విషయోపభోగములతో బని లేదు

*యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో*
*యత్సామ్పరాయే మహతి బ్రూహి నస్తత్।*
*యోఽయం వరో గూఢ మనుప్రవిష్టో*
*నాన్యం తస్మాన్నచికేతా వృణీతే ॥*

ఓ యముడా! మరణానంతరము ఈ జీవాత్మ శరీరముతో బాటు నశించునా లేక నిలచియుండునా! యని అందఱును సందేహించుచున్నారు ఈ సందేహమే నన్నును కలతబెట్టుచున్నది ఈ ప్రశ్న చాల నిగూఢమైనది దీనిని యెఱింగిన గాని నాకు శాంతి లేదు నీవు ఆశబెట్టిన స్త్రీపుత్ర ధన ధాన్యాదులు నా కవసరము లేదు పరలోక గతాత్మవిజ్ఞానమును మాత్రమే నాకు బోధింపుము దుర్బోధము, గహనమునగు ఆత్మవిషయకవరము దప్ప నచికేతసుడు అనిత్యవస్తు విషయకమగు వరమును దేనిని కోరడు

ఈ విధముగ నచికేతసుడు తన మనోభీష్టమును స్పష్టముగ వ్యక్తపఱచెను దీనిచే నతనియొక్క తీవ్రమైన జిజ్ఞాస, ఆత్మసందర్శనాకాంక్ష ద్యోతకమగుచున్నది యముడు చూపిన యెట్టి ప్రలోభనమునకును లొంగక 'వరస్తు మే వరణీయస్స ఏవ' 'నాన్యం తస్మాన్నచికేతా వృణీతే' అని తన దృఢమతిని, లౌకిక సుఖపరాఙ్ముఖతను, ఆత్మాభిరతిని ఎఱుకపఱచెను

ఇటుల నచికేతసుడు లౌకిక పారలౌకిక సకలసుఖములయందు విరక్తుడై, శమదమాది సాధనసంపన్నుడై, వివేక వంతుడై, తీవ్ర ముముక్షుత్వము గలవాడై యుండుటను యముడు గ్రహించి అతని హృదయములో నభిజ్వలించుచున్న తీవ్రజిజ్ఞాసాగ్నిని చల్లార్చుటకై ఆత్మవిజ్ఞానామృతము నభివర్షించెను

ఆవిజ్ఞానవర్షమే నేటికిని యీ కఠోపనిషద్రూపమున సమస్తలోకమునకు శాంతిని ప్రసాదించుచున్నది యముడు శ్రేయః ప్రేయోమార్గముల చక్కగ విభజించి, వివేకి, ధీరుడునగువాడు శ్రేయోమార్గమును, మందుడు, అవివేకి ప్రేయోమార్గమును అనుసరించుననియు బోధించెను మఱియు శ్రేయోమార్గమే గమ్యము ఆత్మతత్త్వమే విజ్ఞేయము, ఆత్మ దురూహ్యము అది తర్కగమ్యము కాదు అయినను దానిని దెలిసికొను ఉపాయము గలదని - 'యమేవైష వృణుతే తేన లభ్యః' అని తత్ప్రాప్త్యుపాయమును, ఆత్మస్వరూపమును బహువిస్తారముగ సరళముగ బోధించెను 'అథ మర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనమ్'

ఆత్మతత్త్వమును దెలిసికొన్న దానికి ఫలము మరణ శీలుడగు మర్త్యుడు అమృతస్వరూపు డగుటయే 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' ఆత్మవేత్త సాక్షాత్ బ్రహ్మస్వరూపుడే యగునని బ్రహ్మవిద్యాఫలము వర్ణింపబడెను 'బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృత్యుః' బ్రహ్మానుభూతిని బొందినవాడు విరక్తుడు అమృతస్వరూపుడు నగుననియు దెలుపబడెను ఈ ప్రకారము ఆత్మజ్ఞానము సర్వశ్రేష్ఠమనియు, సకలదుఃఖోపశమనమునకు ఆనందప్రాప్తికి హేతువనియు వర్ణింపబడినది ఇదియే గ్రంథ ప్రతిపాద్యమగు ముఖ్యవిషయము

యమ నచికేత సంవాదరూపముతో నీ యుపనిషత్తున్నది కథ కల్పితము, అర్థవాదము అని కొందఱును, లేదు సత్యమని మఱికొందఱును భావించుచున్నారు ఏది యెట్లయినను ఈ ఆఖ్యాయికాపద్ధతి దురూహ్యమగు ఆత్మతత్త్వమును దెలుపుటకు సముచితమైనది దీనిచే శ్రోతలకు, పాఠకులకు ఆత్మవిజ్ఞాన విషయమై నూతనోత్సాహము జనించును విషయము సరళముగ బోధపడును కనుకనే కఠర్షి ఈ ఆఖ్యాయికాసరణి ననుగమించి ఆత్మతత్త్వమును సులభముగ బోధించెను

*నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః ।*
*నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥*

పాపకర్మలనుండి నివృత్తుడు కానివాడు, ఇంద్రియచాంచల్యము ఉడుగనివాడు అసమాహితుడు అనగా విక్షిప్తచిత్తుడు, సమాహితచిత్తుడైనను

ఏకాగ్రతాఫలమును గోరుచుండుటచే యెవని చిత్తము నిరంతరము చంచలమై అశాంతమై యుండునో అట్టివాడును యీ ఆత్మను బ్రహ్మజ్ఞానము ద్వారా పొందజాలడు మఱి యెవడు దుశ్చరితము అనగా పాపకర్మమునుండి విరతుడో, ఇంద్రియచాపల్యము లేనివాడో, సమాహితచిత్తుడో, శాన్తమానసుడో అట్టివాడే సద్గురుకృపచే బ్రహ్మజ్ఞానముద్వారా ఆత్మప్రాప్తిని బొందునని అధికార నిర్ణయము గావింపబడెను

. . . . . . . . . . . . . . . . . . . .

*యమేవైష వృణుతే తేన లభ్యః*
*తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥*

ఎవడు ఈ ఆత్మను తెలిసికొనవలయునని ఆకాంక్షించునో అట్టి వానికే అయ్యది లభ్యమగును అట్టి ఆత్మస్వరూపదర్శనాభిలాషికి ఆత్మ తన యధార్థస్వరూపమును ప్రకటిత మొనర్చుచున్నది ఇందుచే ఆత్మ సాక్షాత్కారము ఆత్మకృపాసాధ్యమని తెలియబడుచున్నది కాన అమృతత్వప్రాప్తిసాధనమైన ఆత్మసాక్షాత్కారమును బొంది తమ జీవితమును సఫల మొనర్చుకొనుటకై సర్వజీవులు ప్రయత్నింపవలయును

*ఇహ చేదవేదీ దథ సత్యమస్తి*
*న చేదిహావేదీన్మహతీ వినష్టిః ॥*

ఈ శ్రుతిచే బ్రహ్మజ్ఞానమే లేక ఆత్మప్రాప్తియే మానవజీవితము యొక్క సాఫల్యమునకు చిహ్నమని తెలియబడుచున్నది ఉత్కృష్టమైన యీ మానవజన్మము నొందియు ఆత్మసాక్షాత్కారమును బొందనిచో, అందులకై ప్రయత్నించనైనా ప్రయత్నించనిచో ఈ జీవితము వ్యర్థమే అతడు అనంతకాలపర్యంతము జన్మమృత్యురూప సంసారప్రవాహములో బడి కొట్టుకుపోవలసినదే కాన మహావినాశశీలమగు అట్టి ప్రవాహములో బడక ఆత్మానందప్రాప్తిని బడయుటయే మానవుని కర్తవ్యము ఈ ఉపనిషత్తు అట్టి కర్తవ్యమును రోచకరీతితో ప్రబోధించుచు సాధకుని ఆత్మజ్ఞానాభిముఖుని గావించుచున్నది

కనుకనే శ్రీ సద్గురు స్వాములవారికి ఈ ఉపనిషత్తునందొక విధమైన ప్రత్యేకాభిమానము వ్యాసాశ్రమస్వాధ్యాయ గ్రంథత్రయములో దీని నొకటిగా శ్రీవారు పరిగణించిరి వ్యాసాశ్రమము తరపున అనగా శ్రీవారి కరకమలముద్వారా సన్న్యాసాశ్రమంస్వీకారేచ్ఛగలవారు శ్రీమద్భగవద్గీత, కఠోపనిషత్తు, పాతంజలయోగసూత్రములు - ఈ మూడు గ్రంథములను తప్పక కంఠస్థము చేసి యుండవలయు నని కఠిన నియమమును బెట్టిరి ఈ కఠోరనియమమును పాటింపజాలకయే అనేకులు ఇతరత్ర సన్న్యాసాశ్రమమును స్వీకరించుచుండిరి ఆత్మతత్త్వాభిలాషికి ఈ యుపనిషత్తు ఎంతో ఉపకరించుటయే శ్రీవారి యా నియమమునకు, ఆదేశమునకు హేతువు

అందుచేతనే శ్రీవారు స్వయంగా ఈ ఉపనిషత్తునకు 'శ్రీ భగవద్గీతా భావార్థము' అను విశేషార్థమును గీతా సామ్యమును జూపుచు వ్రాసిరి ఈ ఉపనిషద్భావమునే గీతాచార్యుడు అర్థతః గ్రంచెనేమో యని తోచుచున్నది అనేక చోటులందు శబ్దసాదృశ్యము గూడ కాన్పించుచున్నది శ్రీవారు వీటినన్నిటిని ఆ యా మంత్రముల తాత్పర్యమునందు వివరించి చూపిరి పాండిత్యప్రకర్షను జూపక సరళమగు శైలిలో వ్రాయబడియుండుటచే అల్పమగు భాషాజ్ఞానము గల జిజ్ఞాసులందరికిని నియ్యది ఉపకరించగలదని తలంపు

ఈ ద్వితీయ సంస్కరణమున గ్రంథము యథాశక్తి సంశోధింపబడినది [1]మఱియు పాఠకులకు ముందుగనే గ్రంథస్థవిషయ మవగతమగునటుల సంగ్రహముగా 'తొలిపలుకు' రూపమున కథ, ప్రతిపాద్యవిషయము వర్ణింపబడినది ముందుగ దీనిని పఠించి యైనను సాధకపాఠకులు గ్రంథాధ్యయన తత్పరులు కాగలరని ఆశ మఱియు ప్రతిమంత్రమునకును ముందు నూతనముగా 'అవతారిక' కూర్చబడినది సంబంధజ్ఞానమున కియ్యది మహోపకారము కాగలదు కాన విశిష్టమగు ఈ నూతన సంస్కరణము పాఠకులను పూర్వాధికముగ నాకర్షించగలదని విశ్వాసము

---

1 1963లో ఈ గ్రంథము యొక్క ద్వితీయ ముద్రణకు ప్రథమ పీఠాధిపతి శ్రీవిమలానంద స్వాములవారు వ్రాసిన తొలిపలుకిది (స ల)

అయినను ఏవేని సహజములగు దొసగులుండవచ్చు విద్వాంసులు తెలిపినచో మరు ముద్రణయందు సముచిత రీతిని పరిష్కరింపబడును

''ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్''

ఇట్టి మతిని, శక్తిని ప్రసాదించినందులకు శ్రీ సద్గురు పరబ్రహ్మమునకు సభక్తిక నమోవాకములు

ఓం జయ్ గురుదేవ్

నెప్రహూ ప్రథమవర్ధంతి, ఇట్లు
27-5-1963 విమలానంద
శ్రీవ్యాసాశ్రమము



ఓమ్

# పీఠిక

శ్రీ భగవద్గీత ఉపనిషత్తుల సారమని గీతాధ్యాన శ్లోకములోనే తెలియవచ్చుచున్నది

*సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।*
*పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥*

ఉపనిషత్తు లన్నియు గోవులు శ్రీకృష్ణభగవానుడు పాలు పితుకువాడు బుద్ధిశాలి యగు అర్జునుడు భోక్త యగు వత్సము (అట్టి అపూర్వ సామగ్రిని గూర్చి) పితుకబడిన క్షీరమే మహత్తైన గీతామృతము

ఉపనిషత్తుల సారమే భగవద్గీత యని తెలుపదలచుటచే ఈ కఠోపనిషత్తును ముద్రించుటకు కారణము అన్ని ఉపనిషత్తులకన్నను కఠోపనిషద్భాగము గీత యందెక్కువగా గాన బడుటచే దీనియొక్క ప్రభావ మెట్టిదో విజ్ఞులు తెలిసికొన వచ్చును

*నిర్మథ్య చతురో వేదాన్ మునినా భారతం కృతమ్ ।*
*భారతోదధిమ్మథ్నస్య గీతా నిర్మథనస్యచ ।*
*సారముద్ధృత్య తం కృష్ణో అర్జునస్య ముఖే హుతమ్ ॥*

నాలుగు వేదములను శ్రీబాదరాయణమునీంద్రులు చక్కగా మథించి భారతమను మహాగ్రంథము నొనర్చిరి ఆ భారతమను క్షీరమును ధ్యానముచే

కాచి పెరుగుగా జేసిరి శ్రీకృష్ణభగవానుడు అట్టిభారతమను పెరుగుకడవను గీతయను కవ్వముచేత చక్కగా చిలికి, సారభూతమయిన అమృతమును (నవనీతమును) గైకొని అర్జునుని కొసంగెను అర్జునునకు వేదాంతసార ముపదేశించెనని భావము

*భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్ ।*
*గీతా గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥*

భారతామృత సర్వస్వము శ్రీకృష్ణభగవంతుని వక్త్రమునుండి వెలువడెను గీత యను గంగోదకమును పానము చేయువారికి పునర్జన్మము గలుగదు అనగా మోక్షము సిద్ధించును

*సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః ।*
*సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో రవిః ॥*

సూర్యుడేలాగున సర్వతేజోమయుడై యున్నాడో, గంగ యేలాగున సర్వతీర్థమయమై యున్నదో, విష్ణువేలాగున సర్వవేదమయుడై యున్నాడో, ఆలాగున భగవద్గీత సర్వ శాస్త్రమయమై యుంటున్నది

*భారతే భగవద్గీతా తథా నామ సహస్రకమ్ ।*
*గాయత్ర్యాస్సమ్మితం ప్రోక్తం పుణ్యే పాపక్షయే తథా ॥*

*పాఠేన యత్ఫలం ప్రోక్తం అర్థజ్ఞానాచ్చతుర్గుణమ్ ।*
*మద్భక్తేభ్యశ్శ్రావణాచ్చ పుణ్యం దశగుణం స్మృతమ్ ॥*

*వ్యాఖ్యానాచ్చాపి శిష్యేభ్యః పుణ్యం శతగుణం స్మృతమ్ ॥*

మహాభారతమునందు భగవద్గీతయు, విష్ణు సహస్ర నామమున్ను గలవు ఈ గీత గాయత్రీ మహామన్త్రమునకు సమానము గాయత్రీ మంత్రము పుణ్యప్రాప్తికిని, పాపక్షయమునకును సమర్థమై యెంత మహిమ గలిగి యున్నదో, గీతయు నట్టిదే పారాయణముచేనెంత పుణ్యము గలుగునో, దానికంటె అర్థముతో గూడ పఠించిన నాల్గు రెట్లు అధిక ఫలము సిద్ధించును భగవద్భక్తులకు శ్రవణము

జేయించిన పదిరెట్లధిక పుణ్యము లభించును ఈ గీతకు వ్యాఖ్యానము జేసి భక్తులచే పఠింప జేసినచో, నూరురెట్లధిక పుణ్యఫలము గలుగును ఇదే విధముగా గీత 18 అధ్యాయములను శ్రీకృష్ణభగవాను డుపదేశించెను

*య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।*
*భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥*

ఎవ డీపరమరహస్యమగు గీతాశాస్త్రమును నా భక్తులకు జెప్పుచున్నాడో, వాడు నాయందు సర్వోత్కృష్టమయిన భక్తిని జేసినవాడై నన్నే పొందుచున్నాడు దీని యందు సంశయము లేదు

*న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।*
*భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥*

మనుష్యులలో నా భక్తులకు గీతను జెప్పువాని కంటే అధిక ప్రియమును జేయువాడు మఱియొకడు నాకు లేనే లేడు భూమియందు వానికంటె ఇతరుడు మిక్కిలి యిష్టుడు నాకు కలుగనుగూడ గలుగడు అనగా గీతను జనులకు తెలుపువానికన్న అధిక భక్తుడిదివరకు నుండియుండలేదు, ఇప్పుడుండుటలేదు, ఇక నుండను బోడు అని భగవానుడు స్వయముగా వచించెను

ఓమ్ తత్ సత్

ఇట్లు,
మీ చరాచర సుఖాభిలాషి
**శ్రీమలయాళస్వామి**

ఓమ్

# ఉపనిషచ్ఛబ్దార్థము

కొందరు శాస్త్రకారులు 'ఉపనిషత్' అను పదమునకు ఈ ప్రకారము అర్థము చెప్పుచున్నారు 'సమస్తసంసారక్లేశ పరిహారోపాయప్రదర్శకత్వాత్ ఉప నిషాదయంతి - అత్యంతం సంసారక్లేశం నాశయంతి ఇత్యనయా వ్యుత్పత్త్యా ఏషాం గ్రంథానాం ఉపనిషదితి నిర్వచనం కేచిదాహుః' - సమస్తసంసారక్లేశము నశించునట్టి ఉపాయమును చూపించి సంసారక్లేశమును మిగుల నాశమొనర్చునవి కనుక యా గ్రంథము లుపనిషత్తులు అని చెప్పబడుచున్నవి మఱి కొందరు - 'అపరే పునః సర్వస్యాపి 'వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః' ఇత్యనయా రీత్యా బ్రహ్మ ప్రతిపాదకత్వాత్, ఏషాం పునః గ్రంథానాం సాక్షాదేవ బ్రహ్మ ప్రతిపాదకత్వమస్తీతి ఇదం వైలక్షణ్యమభిప్రేత్య' 'వేదముల కన్నిటికి నేనే తెలియదగినవాడను' ఇవి మొదలగు వాక్యములచే ఆయాదేవతా ప్రతిపాదకత్వమున్నను, సాక్షాత్తుగా నివి బ్రహ్మమునే బ్రతిపాదించుచున్నవి అను అభిప్రాయముచేత 'ఉప సాక్షాత్ నిషీదతి' - సాక్షాత్తుగా పరబ్రహ్మ ప్రతిపాదనలో నుంటున్నది కనుక 'ఉపనిషత్తు' అని చెప్పిరి

నవీనులు కొందఱు = 'గురోః సకాశే ఏకాంతే నిషణ్ణైః శిష్యైః గ్రాహ్యత్వాత్ అత్రోపదిశ్యమానస్య తత్త్వస్య ఇమా ఉపనిషద ఇతి -గురువుదగ్గర కూర్చొన్న శిష్యులచేత గ్రహించదగిన తత్త్వము గనుక ఉపనిషత్తు లని చెప్పుచున్నారు 'ఉపనిషత్' అను పదముయొక్క అర్థమును శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు అచ్చటచ్చట సంబంధ భాష్యములందు సంగ్రహముగా వివరించియున్నారు అర్థాని నిటనైకొందము కఠోపనిషత్సంబంధ భాష్యమునందు -

'సదేర్ధాతోః విశరణ గత్యవసాదనార్థస్య ఉపనిపూర్వస్య క్విప్ప్రత్యయా న్తస్య రూపం ఉపనిషదితి' = ఉప, ని అను రెండు ఉపసర్గలు ముందు గల్గిన సద్ల ధాత్వర్థమేమన (1) శైథిల్యము, (2) గమనము, (3) నాశనము, 'యే ముముక్షవః దృష్టానుశ్రవికవిషయవితృష్ణాః సన్తః 'విద్యాం ఉపసద్య ఉపగమ్య తన్నిష్ఠతయా నిశ్చయేన శీలయన్తి తేషాం అవిద్యాదేః సంసారబీజస్య విశరణాత్ హింసనాత్ వినాశనాత్ ఇత్యనేన అర్థయోగేన విద్యా ఉపనిషదిత్యుచ్యతే'

ఏ ముముక్షువులు ఇహలోక పరలోక విషయముల యందిచ్ఛలేనివారై విద్యను బొంది తన్నిష్ఠులై నిశ్చయముగా శీలించుచున్నారో అట్టివారియొక్క సంసారమునకు గారణ మగు నవిద్యాదులను నశింపజేయు చున్నది ఇట్టి యర్థ సంబంధముచే విద్య ఉపనిషత్తని చెప్పబడుచున్నది అనగా, ఉప= విద్యను పొంది, ని= నిశ్చయముగా, సద్ = నశించుచున్నది ( అవిద్య నశించుచున్నది ) దీనికి ప్రమాణము 'నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే' ఆ పరబ్రహ్మమును తెలిసికొని మృత్యుముఖము నుండి విడివడును 'పూర్వోక్త విశేషణాన్ ముముక్షూన్ వా పరం బ్రహ్మ గమయతీతి బ్రహ్మ గమయితృత్వేన యోగాత్ బ్రహ్మవిద్యా ఉపనిషత్' పరబ్రహ్మమును బొందించునది గనుక ఉపనిషత్తనగా బ్రహ్మవిద్య ఉప, ని = మిక్కిలి, సీదయతీతి సద్ = పొందించునది సాక్షాత్తుగా పరబ్రహ్మమును బొందించునది యుపనిషత్తని యర్థము ఇందులకు ప్రమాణము 'బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృత్యుః' బ్రహ్మమును బొంది శుద్ధుడై యమృతత్వమును బొందుచున్నాడు

మఱియు ముండక సంబంధ భాష్యమున నున్నదానిని జూడుడు ''య ఇమాం బ్రహ్మవిద్యాముపయన్తి ఆత్మభావేన శ్రద్ధాభక్తి పురస్సరాః సన్తః గర్భజన్మ జరారోగాద్యనర్థ పూగం నిశాతయతి పరం వా బ్రహ్మ గమయతి అవిద్యాది సంసారకారణం చాత్యంతముపసాదయతి వినాశయతీత్యుపనిషత్ ఉప, ని పూర్వస్య సదేరేవమర్థస్మరణాత్'' = ఎవరీ బ్రహ్మవిద్యను బొంది యాత్మభావముతో శ్రద్ధాభక్తులతో గూడుకొన్నవారై యుంటున్నారో, వారియొక్క జన్మజరా రోగాద్యనర్థ సముదాయమును, నిషీదయతి, నిశాయతి= భేదించుచున్నది లేక పరబ్రహ్మమును బొందించుచున్నది మఱియు సంసార కారణ భూతమగు నవిద్యను సమూలముగ నశింపజేయుచున్నది గనుక యుపనిషత్తు ఈ ప్రకారము ఉప, ని ఇతి ఉపసర్గ ద్వయపూర్వక సద్ల్ ధాతువు యొక్క యర్థము చెప్పబడినది,

ఇకను తైత్తిరీయ భాష్యమును '' ఉపనిషదితి విద్యోచ్యతే తచ్ఛీలినాం గర్భజన్మజరాది నిశాతనాత్ తదవసాదనాద్వా బ్రహ్మణో వా ఉపనిగమయితృత్వాత్

ఉపనిషణ్ణం వాఽస్యాం పరం శ్రేయ ఇతి'' = ఉపనిషత్తనగా విద్య, అట్టి విద్యను పొందినవారికి జరామరణాద్యనర్థజాతము నశించుటవలనను, బ్రహ్మమును బొందించుటవలనను, ఈవిద్య యందు పరమశ్రేయస్సు నిహితమై యున్నది గనుకను ఉపనిషత్తనగా బ్రహ్మవిద్య ఈప్రకారముగా శ్రీ ఆచార్యస్వాములవారు ఉపనిషదర్థ నిరూపణము జేసియున్నారు ఇందుచే సంసారహేతుకములగు న విద్యాదులను, తజ్జన్యములగు జనన మరణాదులను నశింపజేయునవి, పరబ్రహ్మమును బొందించునవి ఉపనిషత్తులు అను నర్థము సిద్ధించుచున్నది

ఓమ్ తత్ సత్

ఓమ్

ఓం నమో భగవతే వైవస్వతాయ మృత్యవే
బ్రహ్మవిద్యాచార్యాయ నచికేతసే చ ।



# శాన్తిపాఠము

*ఓం సహ నా వవతు ।*

*సహ నౌ భునక్తు ।*

*సహ వీర్యం కరవావహై ।*

*తేజస్వి నావధీతమస్తు ।*

*మావిద్విషావహై ।*

*ఓం శాన్తి శ్శాన్తి శాన్తిః ।*

ఉపనిషత్ప్రతిపాదిత పరమాత్మ శిష్యాచార్యులమగు మమ్మిరువురను రక్షించు గాక !

బ్రహ్మవిద్యా ఫలమును మేమిరువురము కలసి మెలసి అనుభవించెదము గాక !

మేమిరువురము విద్యాసంబంధ సామర్థ్యమును కలిసి సంపాదింతుము గాక ।

మా ఇరువురి స్వాధ్యాయము తేజోవంత మగుగాక !

మేమిరువురము ఒకరి నొకరము ద్వేషించుకొన కుందుము గాక ।

అధ్యాత్మికాధిభౌతికాధిదైవిక త్రివిధశాంతులు చేకూరు గాక !!!

ఓమ్ తత్ సత్

ఓమ్

*''ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత !''*

అజ్ఞాన తమస్సున నిద్రించు ఓ జనులారా ! లెండు, అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుడు శ్రేష్ఠులగు ఆచార్యులనాశ్రయించి తత్త్వము తెలిసికొనుడు

(కఠోపనిషత్తు 1-3-14)

*తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।*
*ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥*

తత్త్వద్రష్టలగు జ్ఞాని పుంగవుల శరణుజొచ్చి, వారికి భక్తిపూర్వకముగ నమస్కరించి, సమయోచితముగ ప్రశ్నించుము గురు సేవచే వారిని తృప్తిపఱచుము అపుడు వారు సంతుష్టులై నీకు ఆత్మ విజ్ఞానమును ఉపదేశింపగలరు

(గీత- 4- 34)

*ఇహచేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః ।*
*తతస్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥*

మనుష్యుడు తన శరీరపతనమునకు పూర్వమే ఆత్మతత్త్వమును తెలిసికొనకపోయినచో వివిధలోకములందు శరీరమును ధరించి నానావిధ సుఖ దుఃఖముల ననుభవింపవలసియుండును కాన మరణించుటకు ముందే మేల్కొనుట భావ్యము

(కఠోపనిషత్తు 2-3-4)



ఓమ్

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము - ప్రథమవల్లి

అవతారిక - వాజశ్రవసుని దానము - కథారంభము

మూలం॥ *ఓం ఉశన్హవై వాజశ్రవసస్సర్వవేదసం దదౌ।*
*తస్య హ నచికేతా నామ పుత్ర ఆస ॥* **1**

పదచ్ఛేదం॥ ఉశన్ - హ - వై - వాజశ్రవసః - సర్వవేదసం - దదౌ - తస్య - హ - నచికేతా - నామ - పుత్రః - ఆస

టీక॥ వాజశ్రవసః = వాజశ్రవుని పుత్రుండగు వాజశ్రవసుడు, ఉశన్ = (విశ్వజిద్యాగాచరణమువలన లభించెడి ఫలమును) అభిలషించిన వాడై, సర్వవేదసం = తనయొక్క సర్వస్వమును, దదౌ = (దక్షిణారూపమున) ఇచ్చెను, తస్య = ఆవాజశ్రవసునకు, నచికేతా నామ = నచికేతుడను పేరుగల, పుత్రః = పుత్రుడు, ఆస = ఉండెను

తాత్పర్యము ॥ వాజశ్రవసుడు విశ్వజిన్నామక యజ్ఞమందు ఋత్విక్కులకు సర్వస్వమును దానముగ నిచ్చెను ఆయనకు నచికేతసుడను కుమారుడు ఉండెను

అవ - తండ్రి యిచ్చు దక్షిణలను చూచిన నచికేతసునికి కలిగిన భావము

మూ॥ *తగ్ం హ కుమారగ్ం సన్తం దక్షిణాసు నీయమానాసు*
*శ్రద్ధాఽఽవివేశ సోఽమన్యత ॥* **2**

పద॥ తం - హ - కుమారం - సంతం - దక్షిణాసు - నీయమానాసు - శ్రద్ధా ఆవివేశ - సః - అమన్యత

టీక॥ సన్తం = ప్రథమ వయస్సునందున్న, తం హ = ~~ఆ ప్రసిద్ధమైన, కుమారం~~ కుమారుడగు నచికేతసుని, దక్షిణాసు = యజ్ఞ దక్షిణాలు, నీయమానాసు =

ఇయ్యబడుచుండగా, శ్రద్ధా = ఆ స్తిక్యబుద్ధి, ఆవి వేశ = ప్రవేశించెను, సః = ఆ నచికేతసుడు, అమన్యత = తలచెను

తా॥ వాజశ్రవసుడు యజ్ఞమున ఋత్విక్కులకు దక్షిణల నిచ్చుచుండగా బాల్యావస్థయందుండు నచికేతసునిలో ఆస్తిక్యబుద్ధి ప్రవేశించెను ఆస్తిక్యబుద్ధి గలవాడై నచికేతసుండు (ఈ క్రింది విధముగ) దలంచెను

అవ - తండ్రి యిచ్చు దక్షిణల గుఱించి నచికేతసుడు శంకించుచున్నాడు

మూ ॥ *పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః ।*
*అనందా నామ తే లోకాస్తాన్స గచ్ఛతి తా దదత్ ॥* **3**

పద ॥ పీతోదకాః - జగ్ధతృణాః - దుగ్ధదోహాః - నిరింద్రియాః - అనందాః- నామ- తే - లోకాః - తాన్ - సః - గచ్ఛతి - తాః - దదత్

టీక ॥ పీతోదకాః = పానము జేయబడిన ఉదకములు గల, జగ్ధతృణాః = భక్షింపబడిన గడ్డి గల, దుగ్ధదోహాః = పితుకబడిన పాలుగల, నిరింద్రియాః = దుర్బలేన్ద్రియములు గల, తాః = ఆ గోవులను, దదత్, దానము చేయునట్టి, సః = వాడు, అనందాః నామ = సుఖములేనట్టి వగు, తే = ఆ ప్రసిద్ధములగు, లోకాః = ఏ లోకములు గలవో, తాన్ = ఆ అనందలోకములను, గచ్ఛతి = పొందుచున్నాడు

తా ॥ ఎవడు వయసు మీరి నీరుత్రాగుటకు గడ్డితినుటకు గూడ శక్తిలేక ట్టిపోయి దుర్బలేంద్రియవములతో నున్నఇట్టి నిస్సారవములగు గోవుల చ్చుచున్నాడో ఆ యజమాని అసౌఖ్యములగు లోకములను పొందుచున్నాడు

అవ - తండ్రితో నచికేతసుడు తన భావమును వ్యక్తపరచుచున్నాడు

మూ ॥ *స హోవాచ పితరం తత కస్మై మాం దాస్యసేతి ద్వితీయం*
*తృతీయం తగ్ంహోవాచ మృత్యవే త్వా దదామీతి ॥* **4**

పద ॥ సః - హ - ఉవాచ - పితరం - తతః - కస్మై - మాం - దాస్యసి - ఇతి - ద్వితీయం - తృతీయం - తం - హ - ఉవాచ - మృత్యవే - త్వా - దదామి- ఇతి

టీక ॥ సః = ఆ నచికేతసుడు, పితరం = తండ్రినిగూర్చి, తత = ఓ తండ్రీ। మాం= నన్ను, కస్మై = ఎవరికొఱకు, దాస్యసీతి = ఇచ్చు చున్నావని, ద్వితీయం = రెండుసారులు, తృతీయం = మూడు సారులు, ఉవాచ హ = పలికెను, తం= ఆ నచికేతసునిగూర్చి, త్వా= నిన్ను, మృత్యవే = మృత్యువుకొఱకు, దదామీతి= ఇచ్చుచున్నానని, ఉవాచ హ = పలికెను

తా ॥ నచికేతసుడు పూర్వోక్త ప్రకారము తలచి అనంతరము నన్ను ఏ ఋత్విక్కునకు నిచ్చుచున్నావని రెండు మూడు పర్యాయములు తండ్రినడుగగా ఆయన కోపపడి నిన్ను మృత్యువున కిచ్చుచున్నానని పలికెను

అవ - తండ్రిమాటలు విని నచికేతసుడు వితర్కించు కొనుచున్నాడు

మూ ॥ *బహూనామేమి ప్రథమో బహూనామేమి మధ్యమః ।*
*కిగ్ంస్విద్యమస్య కర్తవ్యం యన్మయాఽద్య కరిష్యతి ॥* 5

పద ॥ బహూనాం - ఏమి - ప్రథమః - బహూనాం - ఏమి - మధ్యమః - కిం - స్విత్ - యమస్య - కర్తవ్యం - యత్ - మయా - అద్య - కరిష్యతి

టీక ॥ బహూనాం = అనేకమంది శిష్యులలో, ప్రథమః = ముఖ్యుడనై, ఏమి = వచ్చు (అగు) చున్నాను, బహూనాం = అనేకమంది శిష్యులలో, మధ్యమః = మధ్యముడనుగా, ఏమి = వచ్చు (అగు) చున్నాను, యమస్య = యమునికి, కర్తవ్యం = చేయదగిన ప్రయోజనము = కింస్విత్ = ఏమి యున్నది ?, మయా= నాతో, అద్య = ఇప్పుడు, కిం కరిష్యతి = ఏమి చేయును ?

తా ॥ ఈ ప్రకారము తండ్రిచేత పలుకబడిన నచికేతసుడు 'అనేకమంది శిష్యులలో నేను మొదటివాడనుగాను, మఱికొందఱిలో మధ్యముడనుగాను వచ్చుచున్నాను యమునకు నాచేత చేయదగిన కర్తవ్యమేమున్నది ? అనగా యమునికి నా వలన కాగల కార్యమేమి కలదు ! నాచే నతడెట్టిపనిని గొనును ? అని తర్కించుకొనెను

అవః - కోపముతో 'నిన్ను మృత్యువున కిచ్చెదను' అని తరువాత పశ్చాత్తాపపడుచున్న తండ్రిని నచికేతసుడు ఓదార్చుచున్నాడు

మూ ॥ *అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే !*
*సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాఽఽజాయతే పునః ॥* 6

పద ॥ అనుపశ్య - యథా - పూర్వే - ప్రతిపశ్య - తథా - అపరే - సస్యం - ఇవ - మర్త్యః - పచ్యతే - సస్యం - ఇవ - ఆజాయతే - పునః

టీక ॥ పూర్వే = పూర్వులగు తాతముత్తాతలు, యథా = ఏ విధముగా ప్రవర్తించిరో (దానిని) అనుపశ్య = దీర్ఘముగా ఆలోచించుకొనుము, తథా = అదే విధముగా, అపరే = ఇతరులు ప్రవర్తించు విధమును, ప్రతిపశ్య = ఆలోచించుకొనుము, మర్త్యః = మరణమే స్వభావముగా గలిగిన మనుష్యుడు, సస్యం ఇవ = పైరువలె, పచ్యతే = జీర్ణుడై మరణించుచున్నాడు, పునః = మఱల, సస్యం ఇవ = పైరువలెనే, ఆజాయతే = పుట్టుచున్నాడు

తా ॥ మన పూర్వులగు తాత ముత్తాతలు మున్నగు వారలు ఏ విధముగా ప్రవర్తించిరో దీర్ఘముగా ఆలోచించుకొనుము అదే విధముగా ఈ కాలమందున్న పెద్దలు ఎటుల ప్రవర్తించుచున్నారో, దానిని ఆలోచించుకొనుము మరణమే స్వభావముగా గలిగిన మనుష్యుడు పైరువలె జీర్ణుడై మరణించుచున్నాడు మఱల పైరువలెనే పుట్టుచున్నాడు

అవః - నచికేతసుడు యమలోకమున కేగుట, అచట జరిగిన వృత్తాంతము

మూ ॥ *వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్ ।*
*తస్యైతాగ్ం శాన్తిం కుర్వన్తి హర వైవస్వతోదకమ్ ॥* 7

పద ॥ వైశ్వానరః - ప్రవిశతి - అతిధిః - బ్రాహ్మణః - గృహాన్ - తస్య - ఏతాం - శాన్తిం - కుర్వన్తి - హర - వైవస్వత - ఉదకమ్

టీక ॥ వైశ్వానరః = అగ్నిహోత్రుడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడగు, అతిధిః = అతిధిరూపముగలవాడై, గృహాన్ = ఆయాగృహములను, ప్రవిశతి = ప్రవేశించుచున్నాడు, తస్య = ఆ బ్రాహ్మణాతిధి రూపియగు అగ్నిహోత్రునకు, ఏతాం = ఈ, శాన్తిం = శాంతిని, కుర్వన్తి = చేయుచున్నారు, వైవస్వత = ఓ వైవస్వతుడా ! ఉదకం = పాద్యార్ఘ్యము జలమును, హర = తీసికొనిరమ్ము

తా ॥ అగ్నిహోత్రుడు బ్రాహ్మణుడై అతిధిరూపముతో ఆయా గృహస్థ గృహములను ప్రవేశించుచున్నాడు అగ్ని హోత్రునకు ఈ శాన్తిని జేయుచున్నారు గావున ఓ వైవస్వతుడా ! పాదములను కడుగుకొనుటకు జలము దెమ్ము

అవః - అతిధి తిరస్కారమువలన గలుగు అనర్థము చెప్పబడుచున్నది

మూ ॥ ఆశాప్రతీక్షే సంగతగ్ం సూనృతాం
చేష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్ ।
ఏతద్వృంక్తే పురుషస్యాల్ప మేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే ॥ 8

పద ॥ ఆశాప్రతీక్షే - సంగతం - సూనృతాం - చ - ఇష్టాపూర్తే - పుత్రపశూన్ - చ- సర్వాన్ - ఏతత్- వృంక్తే - పురుషస్య - అల్పమేధసః - యస్య - అనశ్నన్- వసతి - బ్రాహ్మణః - గృహే

టీక ॥ యస్య = ఏ, అల్పమేధసః = అల్పప్రజ్ఞగల, పురుషస్య = పురుషుని యొక్క, గృహే = గృహమునందు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, అనశ్నన్ = భుజింపక, వసతి = నివసించుచున్నాడో, ఏతత్ = ఈ నివసించుట యనునది ( తస్య = ఆగృహ యజమానియగు పురుషునియొక్క), ఆశాప్రతీక్షే = ఆశా ప్రతీక్షలను, సంగతం = సత్పురుషుల సహవాసమువలన గలిగిన ఫలమును, సూనృతాం = సత్య వాక్ప్రియమజన్య ఫలమును, ఇష్టాపూర్తే = ఇష్టాపూర్తముల నాచ రించుటవలన గలిగిన ఫలమును, పుత్రపశూన్చ = పుత్రపశువులను, సర్వాన్ = అన్నింటిని = వృంక్తే = నాశనమొనర్చుచున్నది

తా ॥ ఏ అల్పప్రజ్ఞగల పురుషునియొక్క గృహమునందు బ్రాహ్మణుడు భుజింపక నివసించుచున్నాడో, ఈనివసించుట యనునది ఆ గృహయజమాని యగు పురుషునియొక్క ఆశాప్రతీక్షలను, ( అజ్ఞాతములగు ఇష్ట పదార్థముల వాంఛ ఆశ యనియు, జ్ఞాతపదార్థాకాంక్ష ప్రతీక్షయనియు అనబడును) సత్పురుషుల సహవాసమువలన గలిగిన ఫలమును, సత్యవాక్ప్రియమజన్య ఫలమును, ఇష్టాపూర్తముల నాచరించుట వలనగలిగిన ఫలమును, పుత్రపశువులను అన్నింటిని నాశన మొనర్చుచున్నది

అవః - యముడు నచికేతసుని వరములను కోరుకొనుమనుట

మూ ॥ తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మే
అనశ్నన్బ్రహ్మన్నతిథిర్నమస్యః ।
నమస్తేఽస్తు బ్రహ్మన్స్వస్తి మేఽస్తు
తస్మాత్ప్రతి త్రీన్వరాన్వృణీష్వ ॥ 9

పద ॥ తిస్రః - రాత్రీః - యత్ - అవాత్సీః - గృహే - మే - అనశ్నన్ - బ్రహ్మన్ - అతిథిః - నమస్యః - నమః - తే - అస్తు - బ్రహ్మన్ - స్వస్తి - మే - అస్తు - తస్మాత్ - ప్రతి - త్రీన్ - వరాన్ - వృణీష్వ

టీక ॥ బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తముడా ! యత్ = ఓ కారణమువలన, మే = నాయొక్క, గృహే = గృహమునందు, నమస్యః = నమస్కరింపదగిన అతిథిః= అతిథివిగా వచ్చినవాడవై, అనశ్నన్ = భుజింపకయే, తిస్రః రాత్రీః = మూడుదినములు, అవాత్సీః = నివసించియున్నాడవో, తత్ = ఆ కారణమువలన, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక, బ్రహ్మన్= ఓ నచికేతసుడా ! మే = నాకు, స్వస్తి = మంగళము, అస్తు = అగుగాక, తస్మాత్ = అందువలన, ప్రతి = అందులకు బదులుగా, త్రీన్వరాన్ = మూడు వరములను, వృణీష్వ = నా నుండి కోరుకొనుము

తా ॥ ఓ బ్రాహ్మణోత్తముడా ! ఏ కారణమువలన నాయొక్క గృహమునందు నమస్కరింపదగిన అతిథివిగా వచ్చినవాడవై భుజింపకయే మూడు దినములు నివసించియున్నాడవో, ఆ కారణమువలన నీకు నమస్కారమగు గాక! ఓ నచికేతసుడా ! నాకు మంగళము అగుగాక ! అందువలన మూడు రాత్రులకు బదులుగా మూడు వరములను నానుండి కోరుకొనుము

అవః - నచికేతసుడు పితృపరితోషరూపమైన ప్రథమ వరమును కోరుచున్నాడు

మూ ॥ శాంతసంకల్పస్సుమనా యథా స్యా
ద్వీతమన్యుర్గౌతమో మాఽభి మృత్యో !

*త్వ(త్ప)సృష్టం మాఽభివదే(త్ప)తీత*
*ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే ॥* **10**

పద ॥ శాంతసంకల్పః - సుమనాః - యథా - స్యాత్ - వీతమన్యుః - గౌతమః- మా- అభి - మృత్యో - త్వ(త్ప)సృష్టం - మా - అభివదేత్ - ప్రతీతః - ఏతత్ - త్రయాణాం - ప్రథమం - వరం - వృణే

టీక ॥ మృత్యో = ఓ మృత్యుదేవా, గౌతమః = గౌతమగోత్రోద్భవుడగు నాతండ్రి, మా అభి = నన్నుగూర్చి, శాంతసంకల్పః = శాంతించిన సంకల్పములు గలవాడై, సుమనాః = ప్రసన్నహృదయుడై, మా అభి = నన్నుగూర్చి, వీతమన్యుః = పోయిన రోషము గలవాడుగా, యథా స్యాత్ = ఏ విధముగా నగునో, త్వ(త్ప)సృష్టం = నీచేత విడువబడి యింటికి పంపబడిన, మా = నన్నుగూర్చి, ప్రతీతః = పొందబడిన స్మృతి గలవాడై, అభివదేత్ = పలుకునో, ఏతత్ = ఇదియే, త్రయాణాం = నీవిచ్చెదనన్న మూడు వరములలో, ప్రథమం వరం = మొదటి వరముగా, వృణే = వరించుచున్నాడను

తా ॥ ఓ మృత్యుదేవా ! నీవు వరములు నాకీయదలచినచో మా తండ్రి యగు గౌతముడు శాంతించిన సంకల్పములు గలవాడుగా నుండుగాక ! నాయందు ప్రసన్నహృదయు డగు గాక ! నీచేత తిరిగి యింటికి బంపబడిన నన్ను జూచి 'ఈ బాలకుడు నా పుత్రుడే సుమీ' యని అతనికి జ్ఞాపకశక్తి గలిగి యుండునటుల అనుగ్రహింపుము దీనినే నీవు ఇచ్చెదనన్న మూడు వరములలో మొదటివరముగా గోరుకొనుచున్నాను

అవ - నచికేతసు డడిగిన మొదటి వరమును యముడిచ్చుచున్నాడు

మూ ॥ *యథా పురస్తాద్భవితా ప్రతీత*
*ఔద్దాలకిరారుణిర్మ(త్ప)సృష్టః ।*
*సుఖగ్ం రా(త్రీః శయితా వీతమన్యు*
*స్త్వాం దదృశివాన్మృత్యుముఖా(త్ప)ముక్తమ్ ॥* **11**

పద ॥ యథా - పురస్తాత్ - భవితా - ప్రతీతః - ఔద్దాలకిః - అరుణిః - మ(త్ప)సృష్టః- సుఖం - రాత్రీః - శయితా - వీతమన్యుః - త్వాం - దదృశివాన్ - మృత్యుముఖాత్ - ప్రముక్తమ్

టీక ॥ ఔద్దాలకిః = ఔద్దాలకియనియు, ఆరుణిః = ఆరుణియనియు పేరుగల వాజశ్రవసుడు, మత్ప్రసృష్టః = నాచేత ననుజ్ఞ యివ్వబడినవాడై, ప్రతీతః = పొందబడిన స్మృతిగలవాడై, పురస్తాత్ = ముందు, మృత్యుముఖాత్ = యముని ముఖమునుండి, ప్రముక్తం = విడువంబడిన, త్వాం = నిన్ను, దదృశివాన్ = చూచినవాడై, వీతమన్యుః = పోయిన కోపము గలవాడుగాను, సుఖం = సుఖముగా, రాత్రీః = రాత్రులను గురించి (రాత్రులందు) శయితా = శయనించువాడు గాను, భవితా = కాగలడు

తా ॥ నచికేతసు డడిగిన ప్రథమ వరమునకు అంగీకారమును మృత్యుదేవత యొసంగుచున్నది నీవు నన్ను కోరిన ప్రకారము నీయందిదివఱకు నీతండ్రి యెట్టి ప్రేమ గలిగియుండెనో, అట్టి ప్రేమనే యికమీదకూడా నీయందు గలిగియుండగలడు నా యనుగ్రహమువలన మనస్సునందెట్టి వ్యాకులత లేక సుఖముగా రాత్రిళ్లు నిద్రించగలడు మృత్యుముఖమునుండి విడువబడిన నిన్ను గాంచి క్రోధము లేనివాడై శాంతచిత్తుడై ప్రీతితో నుండగలడు

అవ - స్వర్గప్రశంస

మూ ॥ *స్వర్గే లోకే న భయం కించనాస్తి*
*న తత్ర త్వం న జరయా బిభేతి ।*
*ఉభే తీర్త్వా అశనాయాపిపాసే*
*శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥* **12**

పద ॥ స్వర్గే - లోకే - న - భయం - కించన - అస్తి - న - తత్ర - త్వం - న - జరయా - బిభేతి - ఉభే - తీర్త్వా - అశనాయాపిపాసే - శోకాతిగః - మోదతే - స్వర్గలోకే

టీక ॥ స్వర్గే లోకే = స్వర్గలోకమునందు, భయం = రోగాదిభయము, కించన= కొంచమైనను, నాస్తి = లేదు, తత్ర = ఆ స్వర్గలోకమునందు, త్వం = నీవు, న = లేవు, జరయా = ముదిమిచేతను న బిభేతి = భయపడుట లేదు, అశనాయాపిపాసే = ఆకలి దప్పికలను, ఉభే = రెంటిని, తీర్త్వా = దాటి, శోకాతిగః = బాహ్యమానసశోక విరహితుడై, స్వర్గలోకే = స్వర్గలోకమునందు, మోదతే = సంతోషించుచున్నాడు

తా ॥ స్వర్గలోకమునందు రోగాది నిమిత్తములవల్ల గలుగదగిన భయమేమియు గలుగజాలదు అచ్చట జరాభయమేమియు నుండదు మఱియు స్వర్గలోకమునం దుండు వారిని ఆకలి దప్పులు బాధింపవు బాహ్యమానసిక శోకము లేమియు గలుగజాలవు సర్వదుఃఖముల నధిగమించి జీవుడచట మిక్కుటమైన సుఖము ననుభవించును

అవ - రెండవ వరము - స్వర్గసాధనభూతమగు అగ్నివిద్యను గూర్చి నచికేతసుడు ప్రశ్నించుచున్నాడు

మూ ॥ *స త్వమగ్నిగ్ం స్వర్గ్యమధ్యేషి మృత్యో*
*ప్రబ్రూహి త్వగ్ం శ్రద్దధానాయ మహ్యమ్ ।*
*స్వర్గలోకా అమృతతత్వం భజన్త*
*ఏతద్ద్వితీయేన వృణే వరేణ ॥* ***13***

పద ॥ సః - త్వం - అగ్నిం - స్వర్గ్యం - అధ్యేషి - మృత్యో - ప్రబ్రూహి - త్వం - శ్రద్దధానాయ - మహ్యం - స్వర్గలోకాః - అమృతత్వం- భజన్తే - ఏతత్ - ద్వితీయేన - వృణే - వరేణ

టీక ॥ మృత్యో ! = ఓ మృత్యుదేవా ! సః = ఆ, త్వం = నీవు, స్వర్గ్యం = స్వర్గసాధనభూతమైన, అగ్నిం = అగ్ని విజ్ఞానమును, అధ్యేషి = గుర్తెరుంగుదువు, శ్రద్ధధానాయ = శ్రద్ధగల, మహ్యం = నా కొఱకు, ప్రబ్రూహి= బోధింపుము, స్వర్గలోకాః = స్వర్గలోకమునుపొందిన వారలై, అమృతతత్వం= (ఏ) మరణరాహిత్యమును (దేవత్వమును), భజన్తే = పొందుచున్నారో, ఏతత్= అట్టి అగ్ని విజ్ఞానమును, ద్వితీయేన = రెండవదియగు, వరేణ = వరముచే, వృణే = వరించుచున్నాడను

తా ॥ ఓ మృత్యుదేవా ! నీవు స్వర్గసాధనభూతమైన అగ్ని విజ్ఞానమును బాగుగా గుర్తెరుంగుదువు కనుక శ్రద్ధావంతుడనగు నాకు దానిని బోధింపుము ఏ అగ్ని విజ్ఞానము చేత యజమానులు స్వర్గలోకమును పొందుదురో అట్టి అగ్ని విజ్ఞానమును నేను రెండవ వరముగా గోరుచున్నాడను

అవ - స్వర్గసాధనభూతమగు అగ్నివిద్యను చెప్పెదనని యముడు ప్రతిజ్ఞ చేయుచున్నాడు

మూ ॥ ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ
స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్ ।
అనన్తలోకాప్తిమథో ప్రతిష్ఠాం
విద్ధి త్వమేతం నిహితం గుహాయామ్ ॥ **14**

పద ॥ ప్ర - తే - బ్రవీమి - తత్ - ఉ - మే - నిబోధ - స్వర్గ్యం - అగ్నిం- నచికేతః - ప్రజానన్ - అనన్తలోకాప్తిం - అథో - ప్రతిష్ఠాం- విద్ధి - త్వం - ఏతం - విహితం - గుహాయామ్

టీక ॥ (హే !) నచికేతః ! = ఓ నచికేతసుడా ! స్వర్గ్యం = స్వర్గమునకు సాధనభూతమగు, అగ్నిం = అగ్నిచయనమును, ప్రజానన్ = బాగుగా నెఱింగివ నేను, తే = నీకు, తత్ ఉ = ఆ యగ్నిచయన విజ్ఞానమును, ప్రబ్రవీమి = ఉపదేశించుచున్నాడను, మే = నాయొక్క ఉపదేశమువలన, నిబోధ = తెలిసికొనుము, ఏతం = ఈ యగ్నిని, అనంతలోకాప్తిం = స్వర్గలోక సంప్రాప్తి సాధనముగా, అథో = అనంతరము, ప్రతిష్ఠాం = స్థితిని, గుహాయాం= బుద్ధిగుహయందు, నిహితం = ఉంచబడిన దానినిగాను, త్వం = నీవు, విద్ధి= తెలిసికొనుము

తా ॥ ఓ నచికేతసుడా ! స్వర్గసాధనభూతమైన అగ్ని చయనమును బాగుగా నెఱిగిన నేను నీకిపు డుపదేశించుచున్నాడను ఈ అగ్ని విజ్ఞానమును స్వర్గప్రాప్తికి సాధన మైనదానినిగాను, విద్వాంసుల బుద్ధి గుహయం దున్నదానిని గాను దెలిసికొనుము

అవ - యముడు నచికేతసునికి అగ్నివిద్యను బోధించుట

మూ ॥ లోకాదిమగ్నిం తమువాచ తస్మై
యా ఇష్టకా యావతీర్వా యథా వా ।
స చాపి తత్ప్రత్యవదద్యథోక్త
మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః ॥ **15**

పద ॥ లోకాదిం - అగ్నిం - తం - ఉవాచ - తస్మై - యాః - ఇష్టకాః - యావతీః- వా - యధా - వా - సః - చ - అపి - తత్ - ప్రత్యవదత్- యధోక్తం - అధ- అస్య - మృత్యుః - పునః - ఏవ - అహ - తుష్టః

టీక ॥ మృత్యుః = యముడు, లోకాదిం = లోకములకు మొదటిదగు, తం = ప్రసిద్ధమైన, అగ్నిం = అగ్నిని, యధా వా = ఏ విధముచేత, యావతీః = ఎన్ని సంఖ్యలుగల, ఇష్టకాః = ఇటికలు (యజ్ఞవేదికకు ఉపయోగమైన ఇటికరాళ్ళు), యాః = ఏవియో (వాటినన్నిటిని) తస్మై = ఆ నచికేతసునికొఱకు, ఉవాచ = పలికెను (చెప్పెను), సచాపి = ఆ నచికేతసుడును, తత్ = ఆ చెప్పినదానిని, యధోక్తం = చెప్పినది చెప్పినట్లుగా, అస్య = ఈ యమునికి, ప్రత్యవదత్ = తిరిగి చెప్పెను, అధ = అనంతరము, మృత్యుః = యముడు, తుష్టః = సంతోషించినవాడై, పునరేవ = మరలకూడ, ఆహ = పలికెను

తా ॥ జీవలోకమున కాదిభూతమగు అగ్నివిద్యను, హవనకుండమునకు కావలసిన యిటుకలను, వాని పరిమాణమును, అగ్ని సంచయన విధానమును విధి ప్రోక్తముగ యముడు నచికేతసునకు తెలియజెప్పెను అంత నచికేతసుడు యధోక్తముగా తు-చ తప్పక దానిని తిరిగి చెప్పగా యముడు విని సంతోషించి నచికేతసునితో మఱల నిట్లనియె

అవ - ప్రసన్నుడైన యముడు మఱియొక వరము నిచ్చుచున్నాడు

మూ ॥ ***తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా***
***వరం తవేహాద్య దదామి భూయః ।***
***తవైవ నామ్నా భవితాఽయమగ్నిః***
***సృఙ్కాం చేమామనేకరూపాం గృహాణ ॥*** ***16***

పద ॥ తం - అబ్రవీత్ - ప్రీయమాణః - మహాత్మా - వరం - తవ - ఇహ- అద్య - దదామి - భూయః - తవ - ఏవ - నామ్నా - భవితా - అయం - అగ్నిః - సృఙ్కాం - చ - ఇమాం - అనేక రూపాం - గృహాణ

టీక ॥ ప్రీయమాణః = సంతోషించిన, మహాత్మా = మహాత్ముడగు ఆ యముడు, తం = ఆ నచికేతుని గురించి, అబ్రవీత్ = పలికెను తవ = నీకు, ఇహ = ఇచ్చట, అద్య = ఇప్పుడు, భూయః = తిరిగి, వరం = వరమును, దదామి = ఇచ్చుచున్నాను, అయం = ఈ, అగ్నిః= అగ్ని, తవ = నీయొక్క, నామ్నైవ = పేరుచేతనే, భవితా = కాగలదు, అనేకరూపాం = విచిత్రరూపములుగల, ఇమాం = ఈ, సృఙ్కాం చ = రత్నమాలికనుగూడ, గృహాణ = తీసికొనుము

తా ॥ యముడు సంతోషించినవాడై ఓ నచికేతసుడా ! నీవు కోరుకొను రెండవ వరముగాక నీకు తిరిగి ఇంకొక వరమును ఇచ్చుచున్నాను నాచేత ఉపదేశించబడిన ఈ యగ్ని యికమీదట నీ పేరుతో ('నాచికేతాగ్ని' యని) లోకమందు ప్రసిద్ధికెక్కును విచిత్రమగు ఈ రత్నమాలికనుగూడ నీవు తీసికొనుమా ! యని పలికెను

అవ - నాచికేతాగ్ని చయనముచే గలుగు ఫలమును వివరించు చున్నాడు

మూ ॥ *త్రిణాచికేతస్త్రిభిరేత్య సంధిం*
*త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ ।*
*బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా*
*నిచాయ్యేమాగ్ం శాన్తిమత్యన్తమేతి ॥* **17**

పద ॥ త్రిణాచికేతః - త్రిభిః - ఏత్య - సన్ధిం - త్రికర్మకృత్ - తరతి - జన్మమృత్యూ- బ్రహ్మజజ్ఞం - దేవం - ఈడ్యం - విదిత్వా - నిచాయ్య - ఇమాం - శాంతిం- అత్యన్తం - ఏతి

టీక ॥ త్రిణాచికేతః = త్రిణాచికేతుడు (నచికేతాగ్నిని మూడుసార్లు అనుష్ఠించువాడు త్రిణాచికేతు డనబడును) త్రిభిః = మాతృపిత్రాచార్యుల తోటి, సన్ధిం = సంధానమును (సంబంధమును), ఏత్య = పొంది, త్రికర్మకృత్ = యాగాధ్యాపనదానములను చేయువాడై, జన్మమృత్యూ = జనన మరణములను, తరతి = అతిక్రమించు చున్నాడు, బ్రహ్మజజ్ఞం = సర్వజ్ఞుడైన, ఈడ్యం = స్తోత్రార్హుడగు, దేవం = స్వప్రకాశకుడగు దేవుని, విదిత్వా = తెలిసికొని, నిచాయ్య= చూచి, అత్యంతం = మిక్కిలి, ఇమాం = ఈ, శాంతిం = ఉపరతిని, ఏతి = పొందుచున్నాడు

తా ॥ నచికేతాగ్నిని మూడుసార్లు అనుష్ఠించువాడు పిత్రాద్యాజ్ఞలను చక్కగా పాలించి యధావిధిగా యాగాదుల చేసి జననమరణముల దాటుచున్నాడు మఱియు సర్వజ్ఞుడును, స్తోత్రార్హుడును, స్వప్రకాశ స్వరూపుడును నగు పరమాత్మను తెలిసికొని పరమశాంతిని పొందుచున్నాడు

అవ - పూర్వోక్త నచికేతాగ్ని చయన ఫలమునే ప్రకారాంతరముగ చెప్పుచున్నాడు

మూ ॥ *త్రిణాచికేత స్త్రయమేతద్విదిత్వా*
*య ఏవం విద్వాగ్ంశ్చినుతే నాచికేతమ్ ।*
*స మృత్యుపాశాన్పురతః ప్రణోద్య*
*శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥* **18**

పద ॥ త్రిణాచికేతః - త్రయం - ఏతత్ - విదిత్వా - యః - ఏవం - విద్వాన్ - చినుతే - నాచికేతం - సః - మృత్యుపాశాన్ - పురతః - ప్రణోద్య - శోకాతిగః - మోదతే - స్వర్గలోకే

టీక ॥ త్రిణాచికేతః = త్రిణాచికేతుడగు, యః విద్వాన్ = ఏ విద్వాంసుడు ఏతత్త్రయం = ఈ చెప్పబడిన మూడింటిని (పూర్వోక్తములగు హవనకుండమునకు ఎట్టి యిటుకలు ? ఎన్ని కావలయును ? ఎటుల చయన మొనర్చవలయును ? అను మూడు విషయములను), విదిత్వా = తెలిసికొని, నాచికేతం = నాచికేతాగ్నిని, చినుతే = చయన మొనర్చుచున్నాడో, సః = వాడు, మృత్యుపాశాన్ = మృత్యుపాశములను, పురతః = ముందుగా, ప్రణోద్య = తన శరీరమునుండి దూరముగా తీసివేసికొని, శోకాతిగః = మానస దుఃఖరహితుడై, స్వర్గలోకే = స్వర్గలోకమందు (మోక్షమందు), మోదతే= ఆనందించుచున్నాడు

తా ॥ ఎవడు నచికేతాగ్నిని చక్కగా దెలిసికొని విధ్యుక్త ప్రకారము యాగము చేయుచున్నాడో, వాడు మరణమును పొందకముందే అధర్మాజ్ఞాన రాగద్వేషాదిరూప మృత్యుబంధమును దేహపాతమునకు పూర్వమే పోగొట్టుకొన్నవాడై, మానసిక దుఃఖము నతిక్రమించినవాడై స్వర్గలోకమున నానందించుచున్నాడు

అవ - రెండవ వరముయొక్క ఉపసంహారము, మూడవ వరమును కోరుకొనుమనుట

మూ ॥ ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో
యమవృణీథా ద్వితీయేన వరేణ ।
ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యన్తి జనాస
స్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥ 19

పద ॥ ఏషః - తే - అగ్నిః - నచికేతః - స్వర్గ్యః - యం - అవృణీథాః - ద్వితీయేన-వరేణ - ఏతం - అగ్నిం - తవ - ఏవ - ప్రవక్ష్యన్తి - జనాసః - తృతీయం - వరం - నచికేతః - వృణీష్వ

టీక ॥ హే నచికేతః = ఓ నచికేతసుడా ! ద్వితీయేన = రెండవదైన, వరేణ = వరముచేత, యం = ఏ అగ్నిని, అవృణీథాః = వరించితివో, ఏషః = ఈ, అగ్నిః = అగ్ని, తే = నీకు, స్వర్గ్యః = స్వర్గప్రాప్తిసాధనమైనది, జనాసః = జనులందరు, ఏతం అగ్నిం = ఈ యగ్నిని, తవైవ = నీకే ( నీకు సంబంధించిన దానిని గానే), ప్రవక్ష్యన్తి = పలుకగలరు, నచికేతః = నచికేతసుడా!, తృతీయం వరం = మూడవ వరమును, వృణీష్వ = వరింపుము

తా ॥ ఓ నచికేతసుడా ! రెండవ వరముచేత స్వర్గప్రాప్తికి సాధనభూతమగు ఏ నాచికేతాగ్నిచయనవిజ్ఞాన రూపమగు వరమును పొందియున్నావో, అది నీకు సంబంధించినదే ఇది మొదలుకొని జనులందరు దీనిని నీకు సంబంధించిన దానినిగానే ('నాచికేతాగ్ని' యని) చెప్పుచుందురు ఇక నీకు నేనిచ్చెదనన్న మూడవ వరమును కోరుకొనుము

అవ - నచికేతసుడు ఆత్మ రహస్య విషయకమైన మూడవ వరమును కోరుచున్నాడు

మూ ॥ యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
ఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే ।
ఏతద్విద్యామనుశిష్టస్త్వయాఽహం
వరాణామేష వరస్తృతీయః । 20

పద ॥ యా - ఇయం - ప్రేతే - విచికిత్సా - మనుష్యే - అస్తి - ఇతి - ఏకే- న - అయం - అస్తి - ఇతి - చ - ఏకే - ఏతత్ - విద్యాం - అనుశిష్టః - త్వయా- అహం - వరాణాం - ఏషః - వరః - తృతీయః

టీక ॥ యా = ఏ, ఇయం = ఈ, విచికిత్సా = సంశయము (కలదో), మనుష్యే = మనుష్యుడు, ప్రేతే = మరణించినవాడుకాగా, అయం = దేహేంద్రియము లకంటె భిన్నముగ ఈ ఆత్మ యనునది, అస్తి ఇతి = ఉన్నదని, ఏకే = కొందఱును, అయం = ఈ యాత్మ యనునది, న అస్తి ఇతి చ = దేహేంద్రియములకంటే భిన్నముగ లేదని, ఏకే = మఱి కొందఱును (పలుకుచున్నారు), త్వయా = నీచేత, అనుశిష్టః = శాసింపబడిన, అహం= నేను, ఏతత్ = దీనిని, విద్యాం = తెలిసికొందును గాక!, వరాణాం = మూడు వరములలో, ఏషః = ఈ, వరః = వరము, తృతీయః = మూడవదియగు గాక!

తా ॥ మనుష్యుడు మరణించిన తరువాత శరీరేంద్రియ మనోబుద్ధులకు వ్యతిరిక్తముగ నీ దేహమునుండి దేహాంతరమును పొందునట్టి ఆత్మ యనునది ఒకటి ఉన్నదని కొందఱును, లేదని కొందఱును పలుకుచున్నారు ఈ రెండు పక్షములలో ఏది న్యాయమో తెలిసికొనగోరుచున్నాను నా యీ సంశయమును నివర్తింప జేయవలయును ఈ విషయమును మూడవవరముగా దలంచి నాకు బోధింపుము

అవ - నచికేతసుడు ఆత్మ తత్త్వోపదేశమునకు యోగ్యుడా కాడా? యని యముడు పరీక్షించుచున్నాడు

మూ ॥ *దేవై రత్రాపి విచికిత్సితం పురా*
*న హి సుజ్ఞేయమణురేష ధర్మః ।*
*అన్యం వరం నచికేతో ! వృణీష్వ*
*మా మోపరోత్సీరతి మా సృజైనమ్ ॥* **21**

పద ॥ దేవైః - అత్ర - అపి - విచికిత్సితం - పురా - న - హి - సుజ్ఞేయం- అణుః - ఏషః - ధర్మః - అన్యం - వరం - నచికేతః - వృణీష్వ - మా - మా - ఉపరోత్సీః - అతి - మా - సృజ - ఏనమ్

టీక ॥ హే ! నచికేతః = ఓ నచికేతుడా ! అత్ర = ఈ ఆత్మతత్త్వ విషయమునందు, పురా = పూర్వకాలమునందు, దేవైః = దేవతలచేత గూడ, విచికిత్సితం = సంశయింపబడినది, సుజ్ఞేయం = సుఖముగా తెలిసికొనదగినది, న హి = కాదు, ఏషః ధర్మః = ఈ ఆత్మ ధర్మము, అణుః = మిక్కిలి సూక్ష్మమైనది (కావున), అన్యం = వేరైన, వరం= వరమును, వృణీష్వ = వరింపుము, మా = నన్ను, మా ఉపరోత్సీః = నిర్బంధించకుము, మా = నన్ను గుఱించి, ఏనం= ఈ వరమును, అతిసృజ = విడువుము

తా ॥ ఓ నచికేతసుడా ! ఆత్మ విషయమైన ఈ ధర్మము అతి సూక్ష్మమైనది, తెలియ నలవి కానిది కనుక నన్ను నిర్బంధించక దీనిని విడిచి మఱియొక వరమును నీవుకోరుమా యని యముడు బలికెను

అవ - నచికేతసుడు తన స్థిరచిత్తత్వమును వ్యక్తపరచుచున్నాడు

మూ ॥ *దేవైరత్రాపి విచికిత్సితం కిల*
*త్వం చ మృత్యో ! యన్న సుజ్ఞేయమాత్థ ।*
*వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో*
*నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్ ॥* **22**

పద ॥ దేవైః - అత్ర - అపి - విచికిత్సితం - కిల - త్వం - చ - మృత్యో - యత్ - న - సుజ్ఞేయం - ఆత్థ - వక్తా - చ - అస్య - త్వాదృక్ - అన్యః - న - లభ్యః- న - అన్యః - వరః - తుల్యః - ఏతస్య - కః - చిత్ -

టీక ॥ దేవైః అపి = దేవతలచేతగూడ, అత్ర = ఈ బ్రహ్మవిద్యావిషయమై, విచికిత్సితం కిల = సందేహింపబడినది గదా, హేమృత్యో ! = ఓ యముడా ! యత్ = ఏ కారణమువలన, త్వం చ = నీవును, న సుజ్ఞేయం = సులభముగా తెలియ శక్యమైనది కాదని, ఆత్థ = పలికి తివో (అందుచే), అస్య = ఈ ఆత్మతత్త్వముయొక్క, వక్తా = చెప్పెడువాడు, త్వాదృక్ = నీవంటి, అన్యః= మఱియొకడు, న చ లభ్యః = లభింపడు, ఏతస్య = ఈ వరమునకు, తుల్యః= సమానమైనట్టిది అన్యః = మరొక, వరః = వరము, కశ్చిత్ న = ఒకటియు లేదు

తా ॥ ఓ యముడా ! ఈ ఆత్మధర్మమునుగూర్చి (అనగా మరణానంతరము ఆత్మ ఉన్నదా ! లేదా ! అని) దేవతలుకూడా సంశయగ్రస్తులైయుండిరని నీవే చెప్పుచున్నావు గదా ! ఆ కారణమున ఈ ఆత్మతత్త్వమును గూర్చి నీవలెచెప్పువాడు మఱియొకడు లభింపజాలడు మఱియు ఈ వరమునకు సమానమగు వేఱొక వరమును నాకు లభింపబోదు

అవ - ఆత్మ విషయక ప్రశ్ననుండి నచికేతసుని మఱలించుటకై యముడు మూడు మంత్రములయందు ప్రలోభనముల జూపుచున్నాడు

మూ ॥ శతాయుషః పుత్రపౌత్రాన్వృణీష్వ
బహూన్పశూన్హస్తిహిరణ్యమశ్వాన్ ।
భూమేర్మహదాయతనం వృణీష్వ
స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి ॥ **23**

పద ॥ శతాయుషః - పుత్రపౌత్రాన్ - వృణీష్వ - బహూన్ - పశూన్ - హస్తి హిరణ్యం- అశ్వాన్ - భూమేః - మహత్ - ఆయతనం - వృణీష్వ - స్వయం- చ - జీవ - శరదః - యావత్ - ఇచ్ఛసి

టీక ॥ శతాయుషః = నూరు సంవత్సరములు ఆయుస్సు గల్గిన, పుత్రపౌత్రాన్ = కొమాళ్ళను మనుమలను, బహూన్ = అనేకవిధములగు, పశూన్ = గవాది పశువులను, హస్తిహిరణ్యం = గజసువర్ణములను, అశ్వాన్ = గుఱ్ఱములను, వృణీష్వ = కోరుకొనుము, భూమేః = భూమియొక్క, మహత్ = విస్తీర్ణమైన, ఆయతనం = ఆశ్రయమును, వృణీష్వ = కోరుకొనుము, యావత్= ఎంతమట్టుకు, శరదః = సంవత్సరములను, ఇచ్ఛసి = కోరుచున్నావో, స్వయం చ = నీవును, తావత్ = అంతమట్టుకు, జీవ = జీవించుమా

తా ॥ ఓ నచికేతసుడా ! దుర్లభమగు ఆత్మతత్త్వమును తప్ప యితరమైన దీర్ఘాయుస్సుగల పుత్రపౌత్రులను, అసంఖ్యములగు గజ తురగాది పశువులను, హిరణ్యాదికములను, విస్తీర్ణమగు భూమండలమును, వీటి ననుభవించుటకు తగిన నీవు కోరినంత ఆయుర్దాయమును కోరుకొనుము ఇచ్చెదనని యముడు పలికెను

అవ - యమ ప్రలోభనము

మూ ॥ ఏతత్తుల్యం యది మన్యసే వరం
వృణీష్వ విత్తం చిరజీవికాం చ ।
మహాభూమౌ నచికేత స్త్వమేధి
కామానాం త్వా కామాభాజం కరోమి ॥ 24

పద ॥ ఏతత్తుల్యం - యది - మన్యసే - వరం - వృణీష్వ - విత్తం - చిరజీవికాం - చ - మహాభూమౌ - నచికేతః - త్వం - ఏధి - కామానాం - త్వా - కామభాజం - కరోమి

టీక ॥ ఏతత్తుల్యం = నేనిపుడు చెప్పినదానితో సమానమైన, వరం = మఱొక వరమును, మన్యసే యది = నీవు తలంచిన యెడల, వృణీష్వ = వరింపుము, విత్తం = ధనమును, చిరజీవికాం చ = చిరజీవిత్వమునున్ను, వృణీష్వ = వరింపుము, నచికేతః = ఓ నచికేతుడా !, మహాభూమౌ = విశాలమైన భూలోకమునందు, త్వం = నీవు, ఏధి = వృద్ధిబొందుము, త్వా = నిన్ను, కామానాం = కామములలో, కామభాజం = కోరిక లన్నిటిని పొందిన వానినిగా, కరోమి = చేయుచున్నాడను

తా ॥ ఓ నచికేతసుడా ! నీవు అపారమగు ధనమును, చిరంజీవిత్వము నున్ను కోరినవాడవై యీమహాభూమియందు వృద్ధి పొందుము ! నిన్ను దేవమనుష్య కామనలలో, ఆప్తకామునిగా (సర్వాభీష్టములను పొందినవానినిగా) చేయుచున్నాను

అవః - యమ ప్రలోభనము

మూ ॥ యే యే కామా దుర్లభా మర్త్యలోకే
సర్వాన్కామాగ్ శ్ఛందతః ప్రార్థయస్వ ।
ఇమా రామాస్సరథాస్సతూర్యా
న హీదృశా లంభనీయా మనుష్యైః ।
ఆభిర్మ(త్ప)త్తాభిః పరిచారయస్వ
నచికేతో మరణం మాఽనుప్రాక్షీః ॥ 25

పద ॥ యే - యే - కామాః - దుర్లభాః - మర్త్యలోకే - సర్వాన్ - కామాన్-ఛందతః - ప్రార్థయస్వ - ఇమాః - రామాః - సరథాః - సతూర్యాః- న హి- ఈదృశాః - లంభనీయాః - మనుష్యైః - ఆభిః - మత్ప్రత్తాభిః - పరిచారయస్వ - నచికేతః - మరణం - మా - అనుప్రాక్షీః

టీక ॥ మర్త్యలోకే = మనుష్యలోకమునందు, యే యే కామాః = ఏయే కోరికలు, దుర్లభాః = పొందనలవి కానివో, సర్వాన్ = (ఆయా) సమస్తమైన, కామాన్= కోరికలను, ఛందతః = ఇష్టప్రకారము, ప్రార్థయస్వ = కోరుకొనుము, సరథాః= రథములతో కూడుకొన్నవారు, సతూర్యాః = వాద్యధ్వనులతో కూడుకొన్న వారునునైన, ఈదృశాః = ఇటువంటి, ఇమాః = ఈ, రామాః = స్త్రీలు, మనుష్యైః = మనుష్యులచేత, న లంభనీయాః = పొందుటకు శక్యము గానివారలు, మత్ప్రత్తాభిః = నాచేత నీకొసంగబడిన, అభిః = ఈ యప్సరస్త్రీలచేత, పరిచారయస్వ = పరిచర్య చేయించుకొనుము, నచికేతః= ఓ నచికేతుడా!, మరణం = మరణ సంబంధమైన ప్రశ్నను, మాఽనుప్రాక్షీః= అడుగకుమా

తా ॥ ఓ నచికేతసుడా! మర్త్యలోకమందు ఏ యే కోరికలు పొంద నలవి కావో ఆ కోరికలన్నిటిని నీ ఇష్టప్రకారము కోరుము మనుష్యులచే పొందుటకు సాధ్యవముకాని ఈ అప్సరసలను నీకు నిచ్చుచున్నాను వీరిచే పరిచర్య చేయించుకొనుము కాని మరణ సంబంధమైన ప్రశ్నను మాత్రము అడుగకుము

అవః - యముని ప్రలోభనములకు లొంగక నచికేతసుడు మహా సరోవరము వోలె అక్షుబ్ధుడై ప్రత్యుత్తర మిచ్చుచున్నాడు

మూ ॥ ***శ్వోభావా మర్త్యస్య యదన్తకైత -***
***త్సర్వేంద్రియాణాం జరయన్తి తేజః***
***అపి సర్వం జీవితమల్పమేవ***
***తవైవ వాహా స్తవ నృత్యగీతే ॥*** ***26***

పద ॥ శ్వోభావాః - మర్త్యస్య - యత్ - అంతక - ఏతత్ - సర్వేంద్రియాణాం - జరయన్తి - తేజః - అపి - సర్వం - జీవితం- అల్పం - ఏవ - తవ - ఏవ - వాహాః - తవ - నృత్యగీతే

టీక ॥ హే అంతక ! = ఓ యముడా !, శ్వోభావాః = నశ్వరములగు భోగములు, యత్ = ఏ కారణమువలన, మర్త్యస్య = మనుష్యుని యొక్క, సర్వేంద్రియాణాం = సమస్తేంద్రియముల యొక్క, ఏతత్ = ఈ, తేజః = తేజస్సును, జరయన్తి = కృశింపజేయు చున్నవో, (ఆ కారణముచే), సర్వం= సమస్తమైన, జీవితమపి = ఆయుస్సును, అల్పమేవ = స్వల్పమే కాన, వాహాః= రధాదులు, తవైవ = నీకే (ఉండుగాక), నృత్యగీతే = నాట్యగానములు, తవైవ = నీకే (ఉండుగాక!)

తా ॥ ఓ యముడా ! నీవు చెప్పిన నశ్వరములగు సర్వభోగములు సర్వేంద్రియముల తేజస్సును (పటుత్వమును) నశింపజేయుచున్నవి బ్రహ్మాదుల ఆయుస్సుగూడ మిక్కిలి స్వల్పమైయున్నది (బుద్బుద ప్రాయము) ఇట్టి స్వల్పాయుస్సుగల నాకు నీ భోగములతో నేమి ప్రయోజనము ! కాన నా కీయ దలంచిన రామామణులను నీకడనే యుంచుకొనుము, నృత్యగీతములను నీ గృహమునందే కాపాడుకొనుము సర్వ భోగములును నీకే యుండుగాక ! నాకిట్టివేవియు అవసరము లేదు అని నచికేతసుడు పలికెను

అవః - నచికేతసుడు భోగవైతృష్ణ్యమును, తుచ్ఛత్వమును తెలుపుచున్నాడు

మూ ॥ న విత్తేన తర్పణీయో మనుష్యో
లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా ।
జీవిష్యామో యావదీశిష్యసి త్వం
వరస్తు మే వరణీయస్స ఏవ ॥ 27

పద ॥ న - విత్తేన - తర్పణీయః - మనుష్యః - లప్స్యామహే - విత్తం - అద్రాక్ష్మ - చేత్, త్వా - జీవిష్యామః - యావత్ - ఈశిష్యసి - త్వం - వరః - తు - మే- వరణీయః - సః - ఏవ

టీక ॥ మనుష్యః = మనుష్యుడు, విత్తేన = ధనముచేత, న తర్పణీయః = తృప్తి పొందించ దగినవాడు కాడు, త్వా = నిన్ను, అద్రాక్ష్మచేత్ = చూచితిమేని, విత్తం = ధనమును, లప్స్యామహే = పొందగలము, త్వం = నీవు, యావత్ = ఎంతకాలము, ఈశిష్యసి = తలంచెదవో (అంతకాలము), జీవిష్యామః =

బ్రతుకగలము, మే = నాకు, వరణీయః = వరించదగిన, వరస్తు = వరమైతే, సః ఏవ = అదియే ( ఆ వరమే)

తా ॥ మఱియు అధికమైన ధనముచేత మనుష్యునికి సంతృప్తి గలుగదు ధనమే కావలసినచో నీ వంటివారి సందర్శనము వల్లనే మాకు ధనము లభించును నీవు మేమెంతకాలము జీవించవలయునని తలంతువో అంతకాలము నిరాఘాటముగా జీవించగలము కనుక నాకీవరము లేమియు నక్కఱలేదు నేను వరించిన వరము ''ఆత్మ విజ్ఞానమే'' అదియే నాకు చాలును

తవః - భోగములు తుచ్ఛముల నుటలో, ఆత్మవిజ్ఞానమే వరణీయ మనుటలో హేతువును దెలుపుచున్నాడు

మూ ॥ *అజీర్యతామమృతానాముపేత్య*
*జీర్యన్మర్త్యః క్వధస్థః ప్రజానన్ ।*
*అభిధ్యాయన్వర్ణరతిప్రమోదా*
*నతిదీర్ఘే జీవితే కో రమేత ॥* **28**

పద ॥ అజీర్యతాం - అమృతానాం - ఉపేత్య - జీర్యన్ - మర్త్యః - క్వధస్థః- ప్రజానన్ - అభిధ్యాయన్ - వర్ణరతిప్రమోదాన్ - అతిదీర్ఘే - జీవితే - కః - రమేత

టీక ॥ జీర్యన్ = జీర్ణమగుచున్న, క్వధస్థః = భూమియందున్న, కః = ఏ, మర్త్యః = మనుష్యుడు, అజీర్యతాం = జరామరణాదులులేని, అమృతానాం = దేవతలయొక్క (సామీప్యమును), ఉపేత్య = పొంది, ప్రజానన్ = తెలిసికొన్నవాడై, వర్ణరతిప్రమోదాన్ = అప్సరసాదుల విషయ భోగానందములను, అభిధ్యాయన్ = తుచ్ఛములని యెఱింగినవాడై, అతిదీర్ఘే = మిక్కిలి దీర్ఘమైన, జీవితే = ఆయుస్సునందు, రమేత = రమించును ?

తా ॥ ఓ యముడా ! జరామరణ ధర్మములు గల భూలోకవాసియగు మనుష్యుడు జరామరణములు లేని దేవతలసామీప్యమును పొంది, తన జీవితము అస్థిరమని, శరీరము బుద్బుద ప్రాయమని తలంచియు, అప్సరసాదులయొక్క

విషయభోగానందములు తుచ్ఛములని యెఱింగియు బుద్ధిమంతుడగు వాడు దీర్ఘజీవితము నెటుల ఆశించును !

అవః - ప్రలోభనములను మాని అడిగిన ప్రశ్నే చెప్పవలసి నదిగా నచికేతసుడు యమునితో నొక్కి అడుగుచున్నాడు

మూ ॥ ***యస్మిన్నిదం విచికిత్సంతి మృత్యో !***
***యత్సాంపరాయే మహతి బ్రూహి నస్తత్ ।***
***యోఽయం వరో గూఢమనుప్రవిష్టో***
***నాన్యం తస్మాన్నచికేతా వృణీతే ॥*** **29**

పద ॥ యస్మిన్ - ఇదం - విచికిత్సంత - మృత్యో - యత్ - సాంపరాయే- మహతి- బ్రూహి - నః - తత్ - యః - అయం - వరః - గూఢం - అనుప్రవిష్టః - న - అన్యం - తస్మాత్ - నచికేతాః - వృణీతే

టీక ॥ (హే) మృత్యో ! = ఓ యముడా ! మహతి = గొప్పదగు, సాంపరాయే = పరలోకమునందు, యస్మిన్ = మరణించిన తరువాత గలయే ఆత్మ విషయమై, ఇదం = ఈ సంశయమునుగూర్చి ( మరణా నంతరము జీవాత్మ యుండునా? లేక శరీరముతో బాటు నశిందునా ? అని), విచికిత్సంతి = సంశయగ్రస్తులై విచారించు చున్నారో, తత్ = ఆ ఆత్మతత్త్వమును, నః = మాకు, బ్రూహి= చెప్పుమా, యః = ఏ, అయం = ఈ, వరః = వరము, గూఢం = అతి రహస్యమును, అనుప్రవిష్టః = ప్రవేశిచినది (గాన) ( ఆత్మ విషయికమైన యా వరము లేక ప్రశ్నచాల నిగూఢమైనది), నచికేతాః= నచికేతసుడు, తస్మాత్ = ఆఆత్మవిషయక వరముకంటె, అన్యం = ఇతర పామరులచే కోరదగిన అనిత్యవస్తు విషయకమైన వరమును, న వృణీతే = వరించడు

తా ॥ ఓ యముడా ! మరణించిన తరువాత పరలోకమందు ఆత్మ కలదా? లేదా ? అని దేనిని గుఱించి లోకులు సంశయించుచున్నారో అట్టి ఆత్మతత్త్వమును నాకు బోధింపుము ఆత్మ విషయకమైన యా వరము అతిరహస్యమైనది నిగూఢమైనది, కనుక దీనికంటె ఇతర వరమునందు కోరిక లేదు నేనిక వేరు వరమును కోరను ఈ ఆత్మ స్వరూపమును గుఱించియే తెలుపుమా యని నచికేతసుడు పలికెను

విశేషార్థము ॥ యమధర్మరాజు, నచికేతుడు బ్రహ్మవిద్యకు తగినవాడగునా? కాదా ? అని పరీక్షించుటకొఱకు పైన జెప్పబడిన ప్రేయోమార్గముల నన్నిటిని తెలిపెను ప్రేయోమార్గము లనగా ప్రపంచసౌఖ్యములని భావము నిత్యానిత్య వివేకజ్ఞానము గలవాడే బ్రహ్మవిద్య కర్హత గలవాడగును నిత్యానిత్య వస్తువివేకము గలిగినదానికి గురు తేమనగా ఇహాముత్రఫల భోగ విరాగమే యగును నచికేతసునియం దిది సంపూర్ణముగా గలదు కావుననే యీయుపనిషత్తులో యమధర్మరాజు చెప్పిన సౌఖ్యము లన్నిటి నతడు తృణీకరింప గల్గెను అన్తః కరణము వైరాగ్యముచే శుద్ధము గానివానికి బ్రహ్మవిద్య నుపదేశించిన ఊషర క్షేత్రములో పరిశ్రమ జేసిన కృషివలె వ్యర్థమగును అంతేగాక కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులును వంటిదియే యగును వ్యయ ప్రయాసములు మిగులునేగాని తనకును పరులకును ఉపయోగ పడదు గదా !

బ్రహ్మాదిస్థావరా న్తేషు వైరాగ్యం విషయేష్వను ।
యథైవ కాకావిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్ ॥

బ్రహ్మ మొదలు స్థావరమువఱకు గలసమస్త ప్రపంచ విషయములయందు కాకి మలమందువలె విరక్తి జనించుటయే నిర్మల వైరాగ్యమగును అని శ్రీ శంకరభగవత్పాదులు అపరోక్షానుభూతియందు తెలిపిరి

ఈ లక్షణ మంతయు నచికేతసునియందు మూర్తీభవించియున్నది కావుననే యముడు బ్రహ్మవిద్యను నచికేతసున కుపదేశిచెను ఇప్పుడు గల గురు శిష్యులు ఇట్టి ధర్మమును జూడకపోవుటచేతనే బ్రహ్మవిద్య యందుత్తీర్ణులు గాకపోవుచున్నారు కావుననే అష్టావక్ర మునీంద్రుడు జనక మహారాజును గుఱించి యీలాగున తెలిసిరి

ముక్తిమిచ్ఛసి చేత్తాత ! విషయాన్ విషవత్త్యజ ।
క్షమాఽఽర్జవం దయా తోషం సత్యం పీయూషవద్భజ ॥

ఓ జనకమహారాజా ! నీవు మోక్షము నిచ్ఛగించెదవేని శబ్దస్పర్శ రూప రస గంధాది విషయము లన్నిటిని విషమువలె త్యజింపుము క్షమను, ఋజుత్వమును, దయను, సంతుష్టిని, సత్యమును, అమృతమువలె సేవింపుము

మోక్షో విషయవైరస్యం బన్ధో వైషయికో రసః ।
ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥

మోక్షమనగా సర్వవిషయములనుండి విడుదల పొందుటయే యగును బన్ధమనగా విషయములలో నాసక్తియే యనబడును మీ స్వబుద్ధిచేతను, శాస్త్రముచేతను, గురువాక్యము చేతను తెలియదగినది యిది యొకటియే తరువాత మీయిష్ట మేలాగున నుంటున్నదో ఆలాగున జేయవచ్చును

వైరాగ్యం పుష్కలం న స్యాత్ నిష్ఫలం బ్రహ్మదర్శనమ్ ।
తస్మా ద్రక్ష్యేత విరతిం బుధో యత్నేన సర్వదా ॥

వైరాగ్యము పరిపూర్ణముగా గలుగనిచో బ్రహ్మను దర్శించుట నిష్ఫలమగును కనుక ఆత్మజ్ఞానమును గోరువాడు ఎల్లప్పుడు ప్రయత్నముతో వైరాగ్యమును రక్షించుకొనవలయును

ఈ శ్లోకములను ఇతర గ్రంధములనుండి నిరూపించుటకు కారణమేమనగా, వైరాగ్యము లేనిచో బ్రహ్మప్రాప్తి గలుగదని యముడు చెప్పిన దానిని స్థిరపరచుటకు మాత్రమని గ్రహించునది

కఠోపనిషత్తు ప్రధమాధ్యాయమునందు
ప్రధమవల్లి సమాప్తము
ఓమ్ తత్ సత్



ఓమ్

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము - ద్వితీయవల్లి

అవః - యముడు శిష్యుడగు నచికేతసుని పరీక్షించి జ్ఞానోపదేశార్హునిగా తెలిసికొని శ్రేయః ప్రేయోమార్గముల చెప్పుచున్నాడు

మూ ॥ *అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ*
*స్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః ।*
*తయోశ్శ్రేయ ఆదదానస్య సాధు*
*భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥* 1

పద ॥ అన్యత్ - శ్రేయః - అన్యత్ - ఉత - ఏవ - ప్రేయః - తే - ఉభే - నానార్థే - పురుషం - సినీతః - తయోః - శ్రేయః - ఆదదానస్య - సాధు - భవతి - హీయతే - అర్థాత్ - యః - ఉ - ప్రేయః - వృణీతే

టీక ॥ శ్రేయః = శ్రేయస్సు, అన్యత్ = ఇతరమైనది, ఉతైవ = మఱియు, ప్రేయః = ప్రేయస్సు, అన్యత్ = వేరైనది, తే ఉభే = ఆ రెండును, నానార్థే = భిన్న ప్రయోజనముగలవై, పురుషం = పురుషుని, సినీతః= బంధించుచున్నవి, తయోః = ఆ ప్రేయః శ్రేయస్సులలో, శ్రేయః = శ్రేయస్సును, ఆదదానస్య= గ్రహించువానికి, సాధు = శుభము, భవతి = అగుచున్నది, య ఉ = ఎవడైతే, ప్రేయః = ప్రేయస్సును, వృణీతే = వరించుచున్నాడో, సః = వాడు, అర్థాత్= పరమపురుషార్థమునుండి, హీయతే = విడువబడుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! భిన్నప్రయోజనములగు మోక్షకర్మ మార్గములు రెండును అధికారియగు పురుషుని బంధించుచున్నవి ఈ శ్రేయః ప్రేయో మార్గములు రెంటిలో శ్రేయోరూపమగు మోక్షమార్గము నవలంబించు పురుషుడు శుభమును పొందుచున్నాడు అట్లుగాక అవిద్యాత్మక

ప్రేయోరూపమగు కర్మ మార్గము నవలంబించు పురుషుడు నశించుచున్నాడు అనగా పరమపురుషార్థమునుండి చ్యుతుడగుచున్నాడు

అవః - శ్రేయః ప్రేయోమార్గానుసరణ మానవాధీనమే అయినను అధికముగా ప్రేయోమార్గానుసరణమునకు కారణమేమో నిరూపింపబడు చున్నది

మూ ॥ *శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత*
*స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।*
*శ్రేయ హి ధీరోఽభి ప్రేయసో వృణీతే*
*ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే ॥* **2**

పద ॥ శ్రేయః - చ - ప్రేయః - చ - మనుష్యం - ఏతః - తౌ - సంపరీత్య- వివినక్తి- ధీరః - శ్రేయః - హి - ధీరః - అభి - ప్రేయసః - వృణోతే - ప్రేయః - మందః - యోగక్షేమాత్ - వృణీతే

టీక ॥ శ్రేయశ్చ = శ్రేయస్సున్ను, ప్రేయశ్చ = ప్రేయస్సున్ను, మనుష్యం = మనుష్యుని, ఏతః = పొందుచున్నవి, ధీరః = బుద్ధిశాలి, తౌ = ఆ ప్రేయః శ్రేయస్సులను, సంపరీత్య = బాగుగా ఆలోచించి, వివినక్తి= వేరుచేయుచున్నాడు, ధీరః = బుద్ధిశాలి, ప్రేయసః = ప్రేయస్సుకంటె, శ్రేయోహి = శ్రేయస్సునే, అభివృణీతే= మిక్కిలి యిష్టముగ వరించుచున్నాడు, మందః = స్వల్పబుద్ధిగలవాడు, యోగక్షేమాత్ = దేహాద్యుపచయరక్షణ నిమిత్తమువలన, ప్రేయః = ప్రేయస్సును, వృణీతే = వరించుచున్నాడు

తా ॥ శ్రేయః ప్రేయోమర్గములు రెండును మనుష్యుని వెన్నంటి యుండును బుద్ధిశాలి ఆ మోక్ష - కర్మమార్గములను రెడింటిని చక్కగా విచారించి వేరుపరచి కర్మమార్గముకంటె మోక్షమార్గమునే అధికముగా గ్రహించుచున్నాడు మందబుద్ధి గలవాడు యోగక్షేమములకొఱకు కర్మమార్గమునే గ్రహించుచున్నాడు

వి ॥ ఈ విషయమునే గీత అ 2 శ్లో ॥ 45 లో తెలుపడమైనది

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥

ఓ అర్జునా ! వేదములు త్రిగుణాత్మకములగు విషయములను తెలుపునవిగా నున్నవి త్రిగుణాత్మకవిషయములను, వాంఛలను వదలిన వాడవుగను, కేవలసత్త్వగుణ విశిష్టుడవుగను, సుఖదుఃఖాది ద్వంద్వరహితుడ వుగను, యోగక్షేమరహితుడవుగను, ఆత్మజ్ఞానము గలవాడవుగను కమ్ము

అవ - నచికేతసుని వైరాగ్యము స్తుతింపబడుచున్నది

మూ ॥ స త్వం ప్రియాన్ప్రియరూపాగ్ంశ్చ కామా
నభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః ।
నై తాగ్ం సృంకాం విత్తమయీమవాప్తో
యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః ॥ 3

పద ॥ సః - త్వం - ప్రియాన్ - ప్రియరూపాన్ - చ - కామాన్ - అభిధ్యాయన్ - నచికేతః - అత్యస్రాక్షీః - న - ఏతాం - సృంకాం - విత్తమయీం - అవాప్తః - యస్యాం - మజ్జన్తి - బహవః - మనుష్యాః

టీక ॥ హే నచికేతః ! = ఓ నచికేతసుడా ! సః = ఆ, త్వం = నీవు, ప్రియాన్ = పుత్రాది ప్రియరూపములైన, ప్రియరూపాన్ = అప్సరరసాదుల యొక్క ప్రియరూపములగు, కామాన్ = కోరికలను, అభిధ్యాయన్ = ఆలోచించుచు, అత్యస్రాక్షీః = అతిక్రమించితివి (విడచితివి), బహవః = అనేకులగు, మనుష్యాః = మనుష్యులు, యస్యాం = ఏ సంసృతియందు, మజ్జన్తి = మునుగుచున్నారో, విత్తమయీం = ధనస్వరూపమగు, ఏతాం = ఈ, సృంకాం= కుత్సిత గతిని, నావాప్తః = పొందకపోతివి (విడనాడితివి)

తా ॥ ఓ నచికేతసుడా ! పుత్ర పౌత్రాది సంతానమును, భోగైశ్వర్యములను, సర్వకామములను కోరి బహుజనులు వానియందు మునుగుచుందురు కాని నీవు బాగుగా నాలోచించి నీరసభావమును గుర్తెఱింగి దోషబుద్ధిచే వానిని దూరముగ పరిత్యజించితివి విత్తమయమగు ఈ సంకెలలో బంధింప బడకపోతివి నీ మనోజయము స్తుత్యము

అవః - శ్రేయః ప్రేయోరూపములగు విద్యావిద్యలు పరస్పరము ఛాయాతపముల వలె విరుద్ధ లక్షణములు గలవని నిరూపింపబడుచున్నది

మూ ॥ దూరమేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా ।
విద్యాऽభీప్సినం నచికేతసం మన్యే
న త్వా కామా బహవోऽలోలుపంత ॥ 4

పద ॥ దూరం - ఏతే - విపరీతే - విషూచీ - అవిద్యా - యా - చ - విద్యా - ఇతి- జ్ఞాతా - విద్యాऽ భీప్సినం - నచికేతసం - మన్యే - న - త్వా - కామాః - బహవః - అలోలుపన్త

టీక ॥ యా = ఏది, అవిద్యేతి = అవిద్యయని, జ్ఞాతా = తెలిసికొనబడుచున్నదో, యా = ఏది, విద్యేతి చ = విద్యయనియు, జ్ఞాతా = తెలిసికొనబడుచున్నదో, ఏతే = ఇవి, దూరం = దూరముగా (మిక్కిలి), విపరీతే = భిన్నములైనవియు, విషూచీ = భిన్నప్రయోజనములు గలవియు (నగును), నచికేతసం = నచికేతసుని, విద్యాభీప్సినం = విద్యను గోరువానినిగా, మన్యే = తలంచుచున్నాను, బహవః = అనేకములగు, కామాః = కోరికలు, త్వా = నిన్ను, నాలోలుపన్త = లోభపరుపని వాయెను

తా ॥ జ్ఞానాజ్ఞానములు (విద్యావిద్యలు) రెండును మిక్కిలి వేరైనవై భిన్న ఫలముల నిచ్చునవిగా నున్నవి శ్రేయమును విద్య యనియు, ప్రేయమును అవిద్య యనియు జ్ఞానులు నిరూపించిరి ఈ రెండును విరుద్ధములు ఒకదాని కొకటి చాల దూరము అందు అవిద్యకు సంబంధించిన అనేక విధములగు నప్సరసాది కామములు, భోగైశ్వర్యాది ప్రలోభనములు నిన్ను మోహితుని చేయలేదు వాటి నన్నిటిని పరిత్యజించితివి ఆ కారణముచే నీవు విద్యానురాగివని (జ్ఞానము కోరువాడవని) తలంచుచున్నాను

అవః - అ విద్యాగ్రస్తులగు మూఢుల దుర్గతి వర్ణింపబడుచున్నది

మూ ॥ అవిద్యాయా మన్తరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః ।
దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అంధేనై వనీయమానా యథాऽంధాః ॥ 6

పద ॥ అవిద్యాయాం - అన్తరే - వర్తమానాః - స్వయం - ధీరాః - పండితం మన్యమానాః - దంద్రమ్యమాణాః - పరియన్తి - మూఢాః - అంధేన- ఏవ- నీయమానాః - యధా - అంధాః

టీక ॥ అవిద్యాయామన్తరే = ఘనీభూతమైన యంధకారమధ్యమందు, వర్తమానాః= ఉన్నవారును, స్వయంధీరాః = ప్రజ్ఞావంతులైన, పండితం మన్యమానాః = మేమే పండితులమని తలంచువారును, దంద్రమ్యమాణాః = భ్రమించుచున్నవారునగు, మూఢాః = అజ్ఞానులు, అంధేనైవ = గ్రుడ్డివానిచేతనే, నీయమానాః = తీసికొని పోబడుచున్న, అంధాః యధా = గ్రుడ్డివాండ్రవలె, పరియన్తి = అంతటఁ దిరుగుచుందురు

తా॥ ఘనీభూతమగు నజ్ఞానాంధకారముచే ఆవరింపబడిన యజ్ఞానులు ప్రజ్ఞావంతులమని పండితులమని తలంచువారలై యెచ్చు తగ్గులు గల భూమియందు గ్రుడ్డివానిచేత తీసికొనిపోబడిన గ్రుడ్డివారివాలె ఎపుడును జనన మరణములను పొందుచు ఇహపరలోకములయందు దిరుగుచుందురు వారికి మార్గము లభింపదు అవిద్య యెన్నటికిని ముక్తి నియ్యజాలదు అవిద్యలో మునిగియున్నవాడు ఇతరులకు మార్గదర్శి కాజాలడు

వి ॥ గీత అ 2, శ్లో ॥ 42, 43, 44

**యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ ! నాన్యద స్తీతి వాదినః ॥**

ఓ అర్జునా ! ఆత్మజ్ఞానములేనివారు వేదవాక్యములయొక్క కర్మపరమగు అర్థవాదములం దాసక్తులై 'స్వర్గాదిసుఖముల కంటె నితరమైనది లేదు' ఇట్లని చెప్పు స్వభావముగలవారగుచు ప్రసిద్ధమయినదియును, పూచిన ఎఱ్ఱ బాడిశచెట్టువలె రమ్యమయినదియునగు నే వాక్యమును జెప్పుచున్నారో,

**కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।**
**క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥**

పుత్ర కళత్ర ధనప్రాప్తియందు కోరికగలవారును, స్వర్గభోగమును

గోరినవారునునై జన్మమనెడి కర్మలయొక్క ఫలము నిచ్చునదియు, ఇహ సౌఖ్యముయొక్కయు, ఐశ్వర్యముయొక్కయు ప్రాప్తినిగూర్చి అనేక కర్మభేదములు గలదియైన యేవాక్యమును జెప్పుచున్నారో, అట్టివారికి మనస్సునందు ఏకాగ్రత గాని, నిర్మలత గాని యుండదు

**భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే ॥**

విషయ సౌఖ్యములం దాసక్తులయినవారును, క్రియావిశేష బాహుళ్యముతో గూడినట్టియు, క్రియాఫలమును గురించినదియు, మోదుగపుష్పమువలె రమ్యమైనదియునగు వాక్కు చేత అపహరింపబడిన మనస్సు గలవారునునగు నజ్ఞానులయొక్క అన్తః కరణమునందు నిశ్చలస్వరూపముగల సమాధినిష్ఠ సంభవింపదు ఇట్టివారికి జ్ఞాననిష్ఠయందు మనస్సు నిలువదు

అవ - అట్టి మోహ గ్రస్తులకు గలుగు ఫలము నిరూపింపబడుచున్నది

మూ ॥ *న సామ్పరాయః ప్రతిభాతి బాలం*
*ప్రమాద్యన్తం వి త్తమోహేన మూఢమ్ ।*
*అయం లోకో నాస్తి పర ఇతి మానీ*
*పునః పునర్వశమాపద్యతే మే ॥* **6**

పద ॥ న - సాంపరాయః - ప్రతిభాతి - బాలం - ప్రమాద్యన్తం - విత్తమోహేన - మూఢం - అయం - లోకః - న - అస్తి - పరః - ఇతి - మానీ - పునః-పునః-వశం - ఆపద్యతే - మే

టీక ॥ సామ్పరాయః = పరలోక సాధన విశేషము, విత్తమోహేన = ధనమోహముచేత, ప్రమాద్యన్తం = మిక్కిలి మత్తుడైన, మూఢం = అజ్ఞానముచే విమోహితుడైన, బాలంప్రతి = బాలుని గుఱించి, న భాతి = ప్రకాశింపదు, అయం = ఈ, లోకః = లోకము ( ఒకటే కలదు) పరః = పరలోకము, నాస్తి = లేదు, ఇతి = ఈ ప్రకారము, మానీ = తలంచువాడు, పునః పునః = తిరిగి తిరిగి, మే = నాయొక్క, వశం = స్వాధీనమును, ఆపద్యతే = పొందుచున్నాడు

తా ॥ పుత్రదారధనపశ్వాదులచే విమోహితుడై ప్రమత్తుడగు నజ్ఞానికి పరలోకము, తత్ప్రాప్తిసాధన విశేషము ప్రకాశించదు (గుర్తుకురాదు) ప్రత్యక్షముగా గనపడునదియే లోకమనియు, ఇంతకు వేరైన పరలోకము లేదనియు దలంచి సంసారమునే అనంతసుఖముల కాటపట్టని భావించువాడు మాటిమాటికి పుట్టుచు చచ్చుచు నాయధీను డగుచున్నాడు

అవః - ఆత్మజ్ఞానము దుర్లభమని చెప్పుచున్నాడు

మూ ॥ *శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః*
*శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః ।*
*ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా*
*ఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥*

పద ॥ శ్రవణాయ - అపి - బహుభిః - యః - న - లభ్యః - శృణ్వంతః - అపి - బహవః - యం - న - విద్యుః - ఆశ్చర్యః - వక్తా - కుశలః- అస్య - లబ్ధా- ఆశ్చర్యః - జ్ఞాతా - కుశలానుశిష్టః

టీక ॥ బహుభిః = అనేకులచే, యః = ఏ ఆత్మ, శ్రవణాయాపి = వినుటకొఱకును, న లభ్యః = పొందనలవి కానిదో, శృణ్వన్తః అపి= వినిన వారైనను, బహవః = అనేకులు, యం = ఏ ఆత్మను, న విద్యుః = తెలిసికొనలేకపోయిరో, అస్య= ఈ ఆత్మయొక్క, వక్తా= చెప్పువాడు, ఆశ్చర్యః = అరుదు, కుశలః = నిపుణుడగు, లబ్ధా = పొందువాడును, ఆశ్చర్యః = అరుదు, కుశలానుశిష్టః= నిపుణుడగు నాచార్యునిచేత శిక్షితుండగు, జ్ఞాతా = తెలిసికొనువాడును, ఆశ్చర్యః= అరుదు

తా ॥ ఓ నచికేతసుడా ! ఏ యాత్మ వినుటకును, వినినను దెలిసికొనుటకును నలవిగానిదో అట్టి యాత్మను గుఱించి చెప్పువాడును, దెలిసికొనువాడును అరుదై యున్నారు

వి ॥ గీత అ 7 శ్లో ॥ 3

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

మానవులలో వేలకొలది సంఖ్యలయం దొకానొకడు ఆత్మజ్ఞాన సిద్ధికొఱకు యత్నించుచున్నాడు అట్లు యత్నించినవారలలో ఆత్మశుద్ధిని పొందినవారలలో నహితము ఒకానొకడు నన్ను నిజముగా తెలిసికొని పొందుచున్నాడు

అవ - బ్రహ్మవిద్య అతిసూక్ష్మమగుటచే సామాన్యులచే బోధింప శక్యము కాదని చెప్పుచున్నాడు

మూ ॥ *న నరేణావరేణ ప్రోక్త ఏష*
*సువిజ్ఞేయో బహుధా చింత్యమానః ।*
*అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి*
*అణీయాన్హ్యతర్క్యమణుప్రమాణాత్ ॥* **8**

పద ॥ న - నరేణ - అవరేణ - ప్రోక్తః - ఏష - సువిజ్ఞేయః - బహుధా - చింత్యమానః- అనన్యప్రోక్తే - గతిః - అత్ర - న - అస్తి - అణీయాన్- హి - అతర్క్యం - అణుప్రమాణాత్

టీక ॥ ఏషః = ఈ ఆత్మ, అవరేణ = హీనుడైన, నరేణ = మనుష్యునిచేత, ప్రోక్తః = వాక్కుతో చెప్పబడినదై, బహుధా చింత్యమానః = అనేక ప్రకారములుగా మనస్సుతో తలంపబడుచున్నదై, న సువిజ్ఞేయః = బాగుగా దెలిసికొన శక్యమైనది కాదు, అనన్యప్రోక్తే = బ్రహ్మ సాక్షాత్కారము గలవాని చేత చెప్పబడిన, అత్ర = ఈ ఆత్మయందు, గతిః = ఆత్మేతరమగుదాని కూడిక, నాస్తి = లేదు, అణుప్రమాణాత్ = అణుప్రమాణముకంటె, అతర్క్యం = ఊహింప నలవిగాని ఆత్మ, అణీయాన్ హి = అణుతరమైనదిగదా !

తా ॥ ఇట్టిదని యూహింప నలవిగాని యణుస్వరూపమగు ఆత్మ హీనుడగు మనుజునిచే ననేకవిధముల మనస్సుతో తలంపబడినదై వాక్కుతో జెప్పబడి తెలిసికొనబడదు బ్రహ్మసాక్షాత్కారము గలవానిచే చెప్పబడినదై సులభముగా బాగుగా తెలియబడును ఈ ఆత్మ పరమాణువుకంటెను సూక్ష్మమైనందున ఊహింప నలవిగానిది

వి ॥ గీత అ 13 శ్లో ॥ 6

బహిర న్తశ్చ భూతానామచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥

చరాచర భూతములను వెలుపలను, లోపలను ఉండునట్టిదియు, స్థావరరూపమయినదియు, జంగమరూపమయినదియు నగు ఆ పరమాత్మ సూక్ష్మమగుటచేనెఱుంగబడజాలనిది ఆ పరమాత్మ దూరముగా నుండు నట్టిదియు, సమీపముగా నుండునదియునై యున్నది బహిర్దృష్టిగలవానికి దూరముగాను, అన్తర్దృష్టి గలవానికి దగ్గఱగాను ఉండునని భావము

అవ - ఆత్మతత్త్వము తర్కమున కగమ్యమని చెప్పబడుచున్నది

మూ ॥ నైషా తర్కేణ మతిరాపనేయా
ప్రోక్తాఽన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ ।
యాం త్వమాపస్సత్యధృతిర్బతాసి
త్వాదృఙ్నో భూయా న్నచికేతః ప్రష్టా ॥ 9

పద ॥ న - ఏషా - తర్కేణ - మతిః - అపనేయా - ప్రోక్తా - అన్యేన - ఏవ - సుజ్ఞానాయ - ప్రేష్ఠ- యాం - త్వం - ఆపః - సత్యధృతిః- బత - అసి - త్వాదృక్ - నః - భూయాత్ - నచికేతః - ప్రష్టా

టీక ॥ ఏషా = ఈ, మతిః = ఆత్మవిషయకమైన బుద్ధి, తర్కేణ = ఊహచేత, ఆపనేయా = పొందింపదగినది, న = కాదు, అన్యేనైవ = ఇతరుడగు నాచార్యునిచేతనే, ప్రోక్తా = చెప్పబడినదై, సుజ్ఞానాయ = మంచిజ్ఞానము కొఱకు, భవతి = అగుచున్నది, హేప్రేష్ఠ ! = మిక్కిలి యిష్టుడవగు నో నచికేతసుడా !, త్వం = నీవు, యాం = ఏ బుద్ధిని, ఆపః = పొందితివో (అందుచే), సత్యధృతిః = సత్యమైన ధైర్యముగలవాడవు, అసి = అగుచున్నావు, బత = ఆశ్చర్యము, హేనచికేతః = ఓ నచికేతసుడా !, త్వాదృక్ = నీవంటి, ప్రష్టా = అడుగువాడు, నః = మాకొఱకు, భూయాత్ = కలుగును గాక ।

తా ॥ ఓ నచికేతసుడా ! నీవు ఏ యాత్మబుద్ధిని పొంది ధీరుడవైతివో అట్టి

యాత్మ విషయకమైన బుద్ధి తర్కముచే ఊహలచే పొంద నలవిగాదు అజ్ఞానికంటె అన్యుడగు సద్గురువుచే చెప్పబడినదై జ్ఞానాపాదన సమర్థమగు చున్నది కనుక నీవంటి ప్రశ్న జేయువాడు మాకు లభించు గాక !

వి ॥ గీత 2 శ్లో ॥ 52

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఎప్పుడు నీ బుద్ధి అజ్ఞానకాలుష్యమును దాటగలదో, అప్పుడు ఇక వినదగిన యర్థమును, ఇదివరలో వినిన యర్థమునున్ను పొందగలవు అప్పుడే వైరాగ్యమును పొందినవాడ వగుదువు వేదాంత నిర్ణయార్థము గలిగినవాడ వగుదువు

అవ - కర్మఫల మనిత్యమని బోధించుచున్నాడు

మూ ॥ *జానామ్యహగ్ం శేవధిరిత్యనిత్యం*
*న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్ ।*
*తతో మయా నాచికేతశ్చితోఽగ్ని*
*రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్ ॥* ***10***

పద ॥ జానామి - అహం - శేవధిః - ఇతి - అనిత్యం - న - హి - అధ్రువైః- ప్రాప్యతే - హి - ధ్రువం - తత్ - తతః - మయా - నాచికేతః - చితః - అగ్నిః - అనిత్యైః - ద్రవ్యైః - ప్రాప్త వాన్ - అస్మి - నిత్యమ్

టీక ॥ అహం = నేను, శేవధిః = కర్మపల లక్షణమైన నిధి, అనిత్యమితి = శాశ్వతమైనది కాదని, జానామి = గుర్తెరుగుదును, అధ్రువైః = అనిత్యపదార్థములచేత, ధ్రువం= నిత్యమైన, తత్ = ఆపరమాత్మ వస్తువు, హి = నిశ్చయముగా, న ప్రాప్యతే = పొందబడదు, మయా= నాచేత, నాచికేతః = నచికేతస సంబంధమైన, అగ్నిః = అగ్ని, అనిత్యైః= నిత్యములుగాని, ద్రవ్యైః = పదార్థములచేత, చితః = ప్రేల్చబడినది, తతః = అందువలన, నిత్యం = (సాపేక్షక) నిత్యమైన స్వర్గమును, ప్రాప్తవానస్మి = పొందినవాడనైతిని

తా ॥ భోగైశ్వర్యములు, కర్మఫల మనిత్యమనియు, అనిత్యమగు కర్మఫలవుచే, భోగైశ్వర్యములచే నిత్యవుగు ఆత్మవస్తువు లభింపదని నేనెఱుంగుదును తెలిసియు నేను అనిత్యపదార్థములచేత నచికేతాగ్ని వ్రేల్చి దానిచే సాపేక్షక నిత్యమగు స్వర్గమను పేరుగల యమ సంబంధమగు స్థానమును పొందితిని కనుక నచికేతసుడా ! నీవు నాకంటె అధిక ధీరుడవు

అవ - యముడు నచికేతసు డొనర్చిన త్యాగమును ప్రశంసించుచున్నాడు

మూ ॥ *కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం*
*క్రతోరనన్త్యమభయస్య పారమ్ ।*
*స్తోమమహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా*
*ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః ॥* ***11***

పద ॥ కామస్య - ఆప్తిం - జగతః - ప్రతిష్ఠాం - క్రతోః - అనన్త్యం - అభయస్య - పారం - స్తోమమహత్ - ఉరుగాయం - ప్రతిష్ఠాం - దృష్ట్వా - ధృత్యా - ధీరః= నచికేతః - అత్యస్రాక్షీః

టీక ॥ (హే) నచికేతః ! = ఓ నచికేతసుడా ! కామస్య = కోరికయొక్క, ఆప్తిం = ప్రాప్తిని (లోక పరిసమాప్తిని), జగతః = లోకముయొక్క, ప్రతిష్ఠాం = ప్రతిష్ఠను, క్రతోః = సత్కార్మాచరణయొక్క (యజ్ఞముయొక్క), అనన్త్యం= అన్తములేని ఫలమును, అభయస్య= భయములేమియొక్క, పారం = సీమను, స్తోమమహత్ = స్తుతింపదగిన గొప్పదగు (అణిమాద్యైశ్వర్యాద్యనేకగుణ సహితమైన), ఉరుగాయం = విస్తీర్ణమగు గతిని, ప్రతిష్ఠాం = ఆత్మ (తన) యొక్క అనుత్తమస్థితిని, దృష్ట్వా = చూచి, ధీరః = జ్ఞానము గలవాడవై, ధృత్యా = ధైర్యముచేత, అత్యస్రాక్షీః = (సంసారభోగజాతమును) విడిచితివి

తా ॥ ఓ నచికేతసుడా ! నీవు సమస్తభోగాసక్తిని లేక సర్వకామములకు అవధిభూతమైన హిరణ్యగర్భపదమును, సత్యలోకాదులయొక్క స్థితిని, యజ్ఞఫలముయొక్క ఆనన్త్యమును, అభయపదముయొక్క అవధిని, స్తోత్రార్హమగు అణిమాద్యైశ్వర్యయుక్తమైన విశాలమగు గతిని, ఆత్మ (తన) యొక్క అనుత్తమస్థితిని చూచి యివి యన్నియు బ్రహ్మజ్ఞానవుచే గలుగు

నిరతిశయానందమునకు సాటిరావని యెంచి సమస్తసంసారభోగములను ధైర్యముతో విడచితివి కావున నీవు చాల బుద్ధిమంతుడవు సుమా !

అవ - ఆత్మజ్ఞానఫలము వర్ణింపబడుచున్నది

మూ ॥ *తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం*
*గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ ।*
*అధ్యాత్మయోగాధిగమేన దేవం*
*మత్వా ధీరో హర్షశోకౌ జహాతి ॥* **21**

పద ॥ తం - దుర్దర్శం - గూఢం - అనుప్రవిష్టం - గుహాహితం - గహ్వరేష్ఠం - పురాణం - అధ్యాత్మయోగాధమేన - దేవం - మత్వా- ధీరః - హర్షశోకౌ - జహాతి

టీక ॥ దుర్దర్శం = చక్షురాది బాహ్యేంద్రియములచే చూడ నలవిగా నట్టియు, గూఢం = సూక్ష్ముడైనట్టియు, అనుప్రవిష్టం = సర్వభూతముల యందు ప్రవేశించియున్నట్టియు (వ్యాపించి యున్నట్టియు), గుహాహితం = బుద్ధి గుహయందున్నట్టియు, గహ్వరేష్ఠం = అనేకానర్థసంకులమైన స్థానమం దున్నట్టియు, పురాణం= పురాతనుడైన, తం = ఆప్రసిద్ధుడైన, దేవం = జోత్యిర్మయుడగు పరమాత్మను, అధ్యాత్మయోగాధిగమేన = జ్ఞానయోగ ప్రాప్తిచేత, ధీరః = ధీరుడైన వాడు, మత్వా = తెలిసికొని, హర్షశోకౌ = హర్షశోకములను, జహాతి = వదలుచున్నాడు

తా ॥ అతికష్టముచేత దెలిసికొనదగినవాడును, చక్షురాది బాహ్యేంద్రియములచే దర్శింప నలవి గానివాడును, సమస్త ప్రాణులయొక్క బుద్ధిగుహయందున్నవాడును, శబ్దాది విషయవికార జ్ఞానములచేత మరుగుపరచబడినవాడును, అనేకానర్థముల కారకమైన యీ శరీరమందుండు వాడును, పురాతనుడును, జ్యోతిర్మయుడును నగు నాదిదేవుని (పరమాత్మను) ధీరుడైనవాడు, అధ్యాత్మయోగముచేత (మనస్సును విషయములనుండి మరలించి ఆత్మయందు సంలగ్నపఱచుటయే అధ్యాత్మయోగము) తెలిసికొన్నవాడై హర్షశోకములను వదలుచున్నాడు సుఖదుఃఖములకు లోను గాక చిర స్థిర శాంతినొంది యానందించుచున్నాడని భావము

వి ॥ గీత అ 14 శ్లో ॥ 20

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥

జీవుడు దేహోత్పత్తికి బీజభూతములగు సత్త్వరజస్తమోగుణముల మూడింటి నతిక్రమించి, జనన, మరణ, వార్ధక్యములు, తదితరదుఃఖములు వీనిచే విడువబడినవాడై మోక్షమును పొందుచున్నాడు

అవ - ఆత్మతత్త్వశ్రవణ గ్రహణ ఫలమునే యముడు తిరిగి బోధించుచున్నాడు

మూ ॥ ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః
ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య ।
స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా
వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే ॥

పద ॥ ఏతత్ - శ్రుత్వా - సంపరిగృహ్య - మర్త్యః - ప్రవృహ్య - ధర్మ్యం- అణుం- ఏతం - ఆప్య - సః - మోదతే - మోదనీయం - హి - లబ్ధ్వా - వివృతం - సద్మ - నచికేతసం - మన్యే

టీక ॥ మర్త్యః = మనుష్యుడు, ఏతత్ = ఈ చెప్పబోవునట్టి యాత్మతత్త్వ మును, శ్రుత్వా = విని, సంపరిగృహ్య = ఆత్మభావముతో బాగుగా పరిగ్రహించి, ధర్మ్యం = ధర్మసంబంధమైన, ఏతం = ఈ ఆత్మతత్త్వమును, అప్య = పొంది, సః = ఆ విద్వాంసుడు, మోదపీయం = సంతసింపదగినదానిని, లబ్ధ్వా = పొంది, మోదతే హి = సంతసించుచున్నాడుగదా, నచికేతసం = నచికేతునిగూర్చి, సద్మ = బ్రహ్మలోకము, వివృతం = తెరచి యుంచబడినదిగా, మన్యే= (నేను) తలంచుచున్నాడను

తా ॥ మనుష్యుడు ఈ చెప్పబోవునట్టి యాత్మతత్త్వమును బాగుగా విని ధర్మ్యమును, అతిసూక్ష్మమును అగు నీ ఆత్మత్త్వమును ఆనందదాయకమైన దానినిగా తలంచి పొందుచున్నాడు సంతసించుచున్నాడు గదా ! నచికేతసునిగూర్చి బ్రహ్మలోకము తెరువబడినదని తలంచుచున్నాడను

అవ - నచికేతసుడు సర్వాతీతవస్తువును (ఆత్మను) గుఱించి ప్రశ్నించుచున్నాడు

మూ ॥ **అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మా -**
**దన్యత్రాస్మాత్కృతాకృతాత్।**
**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ**
**యత్తత్పశ్యసి తద్వద ॥** ***14***

పద ॥ అన్యత్ర - ధర్మాత్ - అన్యత్ర - అధర్మాత్ - అన్యత్ర - అస్మాత్ - కృతాకృతాత్- అన్యత్ర - భూతాత్ - చ - భవ్యాత్ - చ - యత్- తత్ - పశ్యసి - తత్ - వద

టీక ॥ ధర్మాత్ = శాస్త్రవిహితమైన ధర్మానుష్ఠానముకంటె, అన్యత్ర = వేరై నదియు, అధర్మాత్ = అధర్మమునకంటె, అన్యత్ర = వేరైనదియు, అస్మాత్ = ఈ, కృతాకృతాత్ = కార్యకారణభూతమైన స్థూలసూక్ష్మ ప్రపంచముకంటె, అన్యత్ర = వేరైనదియు, భూతాచ్చ = జరిగినదానికంటెను, భవ్యాత్ చ = జరుగబోవుదానికంటెను (వర్తమానమైనదానికంటెను), అన్యత్ర = వేరైనదియునగు, యత్ = ఏ బ్రహ్మపదార్థము (గలదో), తత్ = దానిని, పశ్యసి = (నీవు) ఎఱుంగుచున్నాడవు, తత్ = దానిని, వద = (నాకు) చెప్పుము

తా ॥ ఎయ్యది శాస్త్రవిహితధర్మముకంటె వేరైనదో, కార్యకారణ భూతమైన ప్రపంచముకంటె వేరైనదో, మఱియు నెయ్యది భూత భవిష్యత్ వర్తమానములకంటె వేరై నదో, అట్టిదానిని (త్రికాలాభాధిత పదార్థమున (పరమాత్మను)), నీవు ఎఱుంగుదువు నేను బ్రహ్మ విద్యోపదేశమునకు యోగ్యుడనగుచో, నాయందనుగ్రహము గల్గినచో దానిని నాకు బోధింపుము

వి ॥ గీత అ 18 శ్లో ॥ 66

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

సమస్తధర్మములను విడచి నన్నొకనిని మాత్రము శరణు జొచ్చుము నేను నిన్ను సమస్తపాపములనుండి విముక్తుని జేసెదను, దుఃఖింపకుము

అవ - యముడు సర్వప్రాప్యమగు 'ఓం' అను ప్రణవమును ఉపదేశించుచున్నాడు

మూ ॥ సర్వే వేదా యత్పదమామనన్తి
తపాగ్ంసి సర్వాణి చ యద్వదంతి ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥ 15

పద ॥ సర్వే - వేదాః - యత్ - పదం - ఆమనన్తి - తపాంసి - సర్వాణి - చ - యత్- వదన్తి - యత్ - ఇచ్ఛంతః - బ్రహ్మచర్యం - చరన్తి - తత్ - తే - పదం - సంగ్రహేణ - బ్రవీమి - ఓం - ఇతి - ఏతత్

టీక ॥ సర్వే వేదాః = వేదములన్నియు, యత్ = ఏ వస్తువును, పదం = పొందదగినదానినిగా, ఆమనన్తి = ఏకగ్రీవముగా పలుకుచున్నవో, సర్వాణి తపాంసి చ = తపస్సులన్నియును, యత్ = దేనిని, వదన్తి= చెప్పుచున్నవో, యత్ = ఏ వస్తువును, ఇచ్ఛంతః = కోరుచున్నవారలై, బ్రహ్మచర్యం = గురుకులవాసరూపమగు లేక బ్రహ్మప్రాప్త్యర్థమగు బ్రహ్మచర్యమును, చరన్తి= ఆచరించుచున్నారో, తత్ = ఆ, పదం = వస్తువును, తే = నీకు, సంగ్రహేణ= సంగ్రహముగా, బ్రవీమి = చెప్పుచున్నాడను, ఏతత్ = ఈ వస్తువు, ఓమ్ ఇతి= 'ఓమ్' అని గ్రంహింపవలయును

తా ॥ వేదములన్నియు ఏ వస్తువును పొందదగిన దానినిగా జెప్పుచున్నవో, తపస్సులన్నియు ఏ వస్తువును ప్రయోజనముగా జేసికొని ఆచరింపబడుచున్నవో, దేనిని గోరుచున్నవారై గురుకులవాస రూపమగు లేక బ్రహ్మ ప్రాప్త్యర్థమగు బ్రహ్మచర్యము నాచరించుచున్నారో ఆ వస్తువునుగూర్చి నీకు సంగ్రహముగా బోధించుచున్నాడను అది ఓం అని చెప్పబడును దానినే గ్రహింపుము

F5 వి ॥ గీత అ 8 శ్లో ॥ 11

యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥

వేదార్థసారమెఱింగిన ఋషులు, దేనిని నాశము లేనిదానినిగా జెప్పుచున్నారో, రాగద్వేషములు నశించిన యతులు దేనిని ప్రవేశించుచున్నారో, దేనిని ఇచ్ఛగించినవారగుచు శుక బ్రహ్మాది మునీశ్వరులు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నారో దానిని ( ఓంకారమును) నీకు సంక్షేపముగా జెప్పుచున్నాను

అవ - ఓంకారము అక్షరపరబ్రహ్మ స్వరూపమని చెప్పబడుచున్నది

మూ ॥ *ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।*
*ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥* **16**

పద ॥ ఏతత్ - హి - ఏవ - అక్షరం - బ్రహ్మ - ఏతత్ - హి - ఏవ - అక్షరం - పరం - ఏతత్ - హి - ఏవ - అక్షరం - జ్ఞాత్వా - యః - యత్ - ఇచ్ఛతి - తస్య - తత్

టీక ॥ ఏతత్ హి అక్షరం ఏవ = ఈ యక్షరమే, బ్రహ్మ = అపరబ్రహ్మము, ఏతత్ హి అక్షరం ఏవ = ఈ యక్షరమే, పరం = పరబ్రహ్మము, ఏతత్ = ఈ, అక్షరం ఏవ హి = అక్షరమునే ( ప్రణవమునే), యః = ఎవడు, జ్ఞాత్వా = బ్రహ్మమని యెఱింగి ( ఉపాసించి), యత్ ఇచ్ఛతి = దేనిని కోరుచున్నాడో, తస్య = వానికి, తత్ = అయ్యది ( సిద్ధించుచున్నది )

తా ॥ ఈ యక్షరమే అపరబ్రహ్మము ఈ అక్షరమే పరబ్రహ్మము ఈ ప్రణవమునే ఎవ్వడు బ్రహ్మమని ఎఱింగి ఉపాసించునో వానికి నేది కోరిన నది సిద్ధించును

అవ - ఓంకారముయొక్క సర్వశ్రేష్ఠత్వము, తద్విజ్ఞానఫలము నిరూపింపబడుచున్నది

మూ ॥ *ఏతదాలంబనగ్ం శ్రేష్ఠమేతదాలంబన పరమ్ ।*
*ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥* **17**

పద ॥ ఏతత్ - ఆలంబనం - శ్రేష్ఠం - ఏతత్ - ఆలంబనం - పరం - ఏతత్ - ఆలంబనం - జ్ఞాత్వా - బ్రహ్మలోకే - మహీయతే

టీక ॥ ఏతత్ = ఈ ఓంకారరూపమగు, ఆలంబనం = బ్రహ్మప్రాప్తి సాధనము, శ్రేష్ఠం= శ్రేష్ఠమైనది, ఏతత్ ఆలంబనం = ఈ ఓంకార రూపమగు ఆలంబనమే, పరం= సదా పరబ్రహ్మ సంబంధమైనది (శ్రేష్ఠమైనది), ఏతత్ ఆలంబనం = ఈయోంకారరూపమగు ఆలంబనమును, జ్ఞాత్వా = ఎఱింగి, బ్రహ్మలోకే= బ్రహ్మలోకము నందు, మహీయతే = పూజ్యుడగుచున్నాడు

తా ॥ ఈ యోంకారము పరాపర బ్రహ్మసాధన భూతమగుటచేత బ్రహ్మ ప్రాప్త్యాలంబనము అన్నిటిలోపల నియ్యది మిక్కిలి శ్రేష్ఠమైనది పరాపర బ్రహ్మ సంబంధమైన ఈ ఓంకార రూపాలంబనమును దెలిసికొని బ్రహ్మలోకమునందు పూజ్యుడగుచున్నాడు

వి ॥ గీత అ 8 శ్లో ॥ 13

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మా మనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

బ్రహ్మవాచకమైన 'ఓం' అనునట్టి యేకాక్షరము నుచ్చరించుచున్నవాడై, నన్ను (పరమాత్మను) చింతించుచున్నవాడై యెవడు శరీరమును విడచి పోవుచున్నాడో వాడు సర్వోత్తమమయిన మోక్షస్థానమును పొందుచున్నాడు

అవ - ఆత్మకు జనన మరణాదులు లేవని ఆత్మస్వరూపమును బోధించుచున్నాడు

మూ ॥ *న జాయతే మ్రియతే వా విపశ్చి -*
*న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ।*
*అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో*
*న హన్యతే హన్యమానే శరీరే ॥* **18**

పద ॥ న - జాయతే - మ్రియతే - వా - విపశ్చిత్ - న - అయం - కుతః - చిత్ -

న - బభూవ - కః - చిత్ - అజః - నిత్యః - శాశ్వతః - అయం - పురాణః-
న - హన్యతే - హన్యమానే - శరీరే

టీక ॥ విపశ్చిత్ = సర్వజ్ఞమగు, అయం = ఈ యాత్మ, న జాయతే = పుట్టుట లేదు, న మ్రియతే = చచ్చుటయు లేదు, కుతః చిత్ = మఱియొకనినుండి లేక మఱియొక కారణమునుండిగాని, న బభూవ= ఉత్పన్నము కాలేదు, కచ్చిత్ న బభూవ = ఒక్కటియు ఉత్పన్నము కాలేదు, అయం = ఈయాత్మ, అజః = పుట్టుక లేనిది, నిత్యః = నిత్యమైనది, శాశ్వతః = అపక్షయ విరహితమైనది పురాణః = పురాణమైనది, శరీరే = దేహము, హన్యమానే = శస్త్రాదికముచేత కొట్ట బడుచున్నప్పటికిని, (అయం = ఈ ఆత్మ), న హన్యతే= చంపబడదు

తా ॥ సర్వజ్ఞ మగు ఈ యాత్మ పుట్టుటయు లేదు, చచ్చుటయు లేదు ఇయ్యది మఱియొకనినుండి లేక మరొక కారణమునుండి ఉద్భవించలేదు అనగా కారణరహితమైనది ఈ యాత్మ పుట్టుక లేనిది, నిత్యమైనది, అపక్షయాది వికారరహితమైనది, పురాతనమైనది దేహము శస్త్రాదికముచేత కొట్టబడుచున్నప్పటికిని ఈ యాత్మ చంపబడదు

వి ॥ గీత అ 2 శ్లో ॥ 20

**న జాయతే మ్రియతే వా కదా చిన్నాయం భూత్వా భవితా వా న భూయః ।**
**అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥**

ఈ ఆత్మ ఎప్పటికిని పుట్టునది కాదు, చచ్చునదియు కాదు, ఇది వఱకు లేకుండ మఱల యిప్పుడు ఉద్భవించునదియు కాదు మఱేమనిన పుట్టుక లేనిదియు, నిత్యమైనదియు, ఎల్లప్పుడుండునదియు, పురాణమైనదియునైయున్నది కనుక దేహము నశింపజేయబడినదయినను ఈ ఆత్మ నశింపజేయబడదు

అవ - ఆత్మచంపునది కాని, చంపబడునది కాని కాదని చెప్పుచున్నాడు

మూ ॥ *హంతా చేన్మన్యతే హంతుగ్ం హతశ్చేన్మన్యతే హతమ్ ।*
*ఉభౌ తౌ న విజానీతో నాయగ్ం హంతి న హన్యతే ॥* **19**

పద ॥ హంతా - చేత్ - మన్యతే - హంతుం - హతః - చేత్ - మన్యతే - హతం - ఉభౌ - తౌ - న - విజానీతః - న - అయం - హన్తి - న హన్యతే

టీక ॥ హంతా = చంపునట్టివాడు, హంతుం = చంపుటకు, మన్యతే చేత్ = తలంచినయెడల, హతః = చంపబడినవాడు, హతం = చంపబడిన వానినిగా, మన్యతే చేత్ = తలంచినయెడల, తౌ ఉభౌ = వారిద్దరు, న విజానీతః = తెలిసికొనిన వారలుగారు, అయం = ఇతడు (ఈ ఆత్మ), న హంతి = చంపుటలేదు, న హన్యతే = ఇతరునిచేత చంపబడుటయు లేదు

తా ॥ అసంగ స్వభావమగు నిట్టి యాత్మను శరీరమాత్ర దృష్టిగలవాడై నేను చంపెదనని ఎవడు దలంచునో, మఱియు నెవడు తాను చంపబడుచున్నటుల దలంచునో వీరుభయులు ఆత్మ యనగా నేమియో తెలియనివారుగా భావించవలయును ఈ యాత్మ ఒకనిని చంపుటలేదు, ఒకనిచే చంపబడుటయులేదు

వి ॥ గీత అ 2 శ్లో ॥ 19

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హ న్తి న హన్యతే ॥

ఎవడీయాత్మను చంపువానినిగా తలంచుచున్నాడో, ఎవడైతే యా యాత్మను చంపబడువానినిగా తలంచుచున్నాడో, వారిరువురును తత్త్వమును తెలిసినవారు గారు ఈ ఆత్మ చంపునది గాదు, చంపబడునదియు కాదు అని యెఱింగినవాడే నిజమయిన ఆత్మతత్త్వ మెరింగినవాడు

అవ - ఆత్మయొక్క సూక్ష్మత్వమును, తద్దర్శనవిధానమును విశదీకరించుచున్నాడు

మూ ॥ అణోరణీయాన్మహతో మహీయా
నాత్మాఽస్య జంతోర్నిహితో గుహాయామ్ ।
తమక్రతుః పశ్యతి వీతశోకో
ధాతు ప్రసాదాన్మహిమానమాత్మనః ॥ **20**

పద ॥ అణోః - అణీయాన్ - మహతః - మహీయాన్ - ఆత్మా - అస్య- జంతోః- నిహితః - గుహాయాం - తం - అక్రతుః - పశ్యతి - వీతశోకః - ధాతు ప్రసాదాత్ - మహిమానం - ఆత్మనః

టీక ॥ అణోః = సూక్ష్మపరిమాణముగల శ్యామాదికముకంటె, అణీయాన్ = మిక్కిలి సూక్ష్మమైనట్టియు, మహతః = మహాపరిమాణముగల వృధివ్యాదికముకంటె, మహీయాన్ = మిక్కిలి గొప్పదైనట్టియు నగు, ఆత్మా= ఆత్మ, అస్య = ఈ బ్రహ్మాది స్తంబపర్యంతమైన, జంతోః = ప్రాణిజాతము యొక్క, గుహాయాం = బుద్ధిగుహయందు, నిహితః = ఉంచబడియున్నది, తం = అట్టియాత్మను, అక్రతుః = దృష్టాదృష్టబాహ్యవిషయోపరత బుద్ధిగలవాడు (చూచుచున్నాడు), ధాతుప్రసాదాత్ = మనస్సు మున్నగు నింద్రియ సముదాయము యొక్క ప్రసన్నత్వమువలన, ఆత్మనః = ఆత్మయొక్క, మహిమానం = మాహాత్మ్యమును, పశ్యతి= చూచుచున్నాడు, వీతశోకః = శోకరహితుడగుచున్నాడు

తా ॥ అల్పపరిమాణముగల శ్యామాదికముకంటె మిక్కిలి సూక్ష్మమైనదియు, గొప్ప పరిమాణముగల పృధివ్యాదికముకంటె మిక్కిలి మహత్తరమైనదియు నగు ఆత్మ యబ్రహ్మాది స్తంబపర్యంతమైన ప్రాణిజాతముయొక్క బుద్ధిగుహయందు నిహితమైయున్నది అట్టి యాత్మను దృష్టాదృష్ట బాహ్యవిషయోపరత బుద్ధిగలవాడు మాత్రమే కాంచుచున్నాడు ఎప్పుడిట్టి జ్ఞానము లభించునో అప్పుడు మనస్సు మున్నగు ఇంద్రియములు ప్రసన్నములై యుండుటచేత ఆత్మయొక్క మహిమను ఎఱుంగుచున్నాడు, శోకరహితుడున్ను అగుచున్నాడు

వి ॥ గీత అ 2 శ్లో ॥ 64,65

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥

మనస్సును స్వాధీనమందుంచుకొన్నవాడై తనకు వశవర్తులుగా నుండునట్టివి, రాగద్వేషాదులు లేనట్టివియు నయిన యింద్రియములచే ఆత్మ సంరక్షణకు మాత్రము గల విషయముల ననుభవించువాడైనను చిత్తశాంతిని పొందుచున్నాడు మనోనిర్మలత గలుగుచుండగా, నీ బ్రహ్మనిష్ఠునికి సమస్త దుఃఖముల నాశమేర్పడుచున్నది నిర్మలచిత్తునకు శీఘ్రముగా మతి నిలుకడ గలదిగా నగుచున్నది

అవ - ఆత్మ దుర్విజ్ఞేయమని చెప్పుచున్నాడు

మూ ॥ *ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః ।*
*కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి ॥* **21**

పద ॥ ఆసీనః - దూరం - వ్రజతి - శయానః - యాతి - సర్వతః - కః - తం - మదామదం - దేవం - మదన్యః - జ్ఞాతుం - అర్హతి

టీక ॥ ఆసీనః = ఒక్కచోటనే ఉన్నదై అచలమై, దూరం = దూరముగా, వ్రజతి = పోవుచున్నది, శయానః = నిద్రించుచున్నదానివలె ఉన్నదై, సర్వతః = అన్నివైపుల, యాతి = పోవుచున్నది,, తం = ఆ, మదామదం = సంతోష విషాదాత్మకమగు, దేవం = స్వప్రకాశాత్మక మగు ఆత్మను, మదన్యః = నాకంటె అన్యుడగు, కః = ఎవ్వడు, జ్ఞాతుం = తెలిసికొనుటకు, అర్హతి = తగును ?

తా ॥ ఈ యాత్మ ఒక్క చోటనే ఉన్నదై, అచలమై దూరముగా బోవుచున్నది పరుండియున్నదై అంతట వ్యాపించియున్నది సంతోష విషాదాత్మకుడగు ఈ స్వప్రకాశాత్మ దేవుని నాకంటె భిన్నుడగువాడెవ్వడు దెలిసికొనగలడు ? నా వంటిసూక్ష్మబుద్ధిగల పండితునకే ఆత్మ సువిజ్ఞేయమగునని భావము

అవ - ఆత్మవిజ్ఞానముచే దుఃఖనివృత్తి గలుగునని చెప్పుచున్నాడు

మూ ॥ *అశరీరగ్ం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్ ।*
*మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥*

పద ॥ అశరీరం - శరీరేషు - అనవస్థేషు - అవస్థితం - మహాంతం - విభుం - ఆత్మానం - మత్వా - ధీరః - న - శోచతి

టీక ॥ ధీరః = బుద్ధిమంతుడు, ఆత్మానం = ఆత్మను, అశరీరం = శరీర విరహితమైనదానినిగను, అనవస్థేషు = అనిత్యములగు, శరీరేషు = శరీరములయందు, అవస్థితం = ఉన్నదానినిగను, మహాంతం = గొప్పదానినిగను, విభుం = వ్యాపకమైనదానినిగను, మత్వా = తలంచి, న శోచతి= దుఃఖింపడు

తా ॥ ఆత్మ అనిత్యములగు శరీరములయందున్నను శరీర రహితమనియు, అనిత్యపదార్థములలో నిత్యస్వరూపముగ నున్నదనియు, అనంతమహిమోన్నతమనియు, సర్వవ్యాపకమనియు ఎఱింగి బుద్ధిమంతుడు శోకమోహముల నొందడు

వి ॥ గీత అ 13 శ్లో ॥ 28

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥

సమస్తభూతములం దుండునట్టిది, ఆ భూతములు నశించినను నశింపకుండునట్టిదియు నగు పరమాత్మను అన్నిటిలోను సమముగా నెవడు చూచుచున్నాడో వాడే చూచినవాడు తక్కినవారు నేత్రములుండియు ఆత్మ విషయములో నంధప్రాయులే

అవ - అట్టి దుర్విజ్ఞేయమగు ఆత్మ ఆత్మకృపాసాధ్యమని ఉపాయమును చెప్పుచున్నాడు

మూ ॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన ।
యమేవైష వృణుతే తేన లభ్య –
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్ ॥ 23

పద ॥ న - అయం - ఆత్మా - ప్రవచనేన - లభ్యః - న - మేధయా - న- బహునా- శ్రుతేన - యం - ఏవ - ఏషః - వృణుతే - తేన లభ్యః- తస్య - ఏషః - ఆత్మా - వివృణుతే - తనూం - స్వామ్

టీక ॥ అయం ఆత్మ = ఈ యాత్మ, ప్రవచనేన = వాగ్రూపమగు ప్రవచనముచేత, న లభ్యః = పొందుటకు వీలైనదికాదు, మేధయా = గ్రంధార్థ ధారణాసక్తిరూపమగు మేధచేత, న లభ్యః = పొందుటకు, వీలైనది కాదు, బహునా శ్రుతేన = బహుళమైన పాండిత్యముచేతను, న లభ్యః = పొందుటకు వీలైనదికాదు, ఏషః = ఈ సాధకుడు, యం ఏవ = ఏ యాత్మను, వృణుతే = వరించు చున్నాడో, తేన = వానిచేత, లభ్యః = పొందదగినది, తస్య = ఆత్మ కాముడగు అట్టివానికి, ఏషః ఆత్మా = ఈ యాత్మ, స్వాం తనూం = పారమార్థికమగు తన స్వరూపమును, వివృణుతే = ప్రకాశింపజేయుచున్నది

తా ॥ ఓ నచికేతసుడా ! ఆత్మ వేదాధ్యయనాది సాధనములచేత పొంద శక్యమైనది కాదు ఏ యాత్మసాధకుడు ఇతర సాధనలను విడిచి ఆత్మనే ప్రార్థించుచున్నాడో వానికి నీ యాత్మస్వరూపము ప్రత్యక్షమగుచున్నది ఆత్మకామునికి మాత్రమే ఆత్మస్వరూపము అభివ్యక్తమగునవి భావము

వి ॥ గీత అ 11 శ్లో ॥ 53,54

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యధా ॥**

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ! ॥**

నేను వేదాధ్యయనపరులచే చూచుటకు శక్యుడను గాను కృచ్ఛ చాంద్రాయణాది కామ్యతపస్సులచే జూడ శక్యుడను గాను, దానపరులచే జూడ శక్యుడనుగాను యజ్ఞములు జేసినవారిచే చూచుటకు శక్యుడను గాను ఓ అర్జునా ! నేను అనన్యభక్తిచేతనే యధార్థముగా నెఱుంగుటకును, చూచు టకును, నాలో ప్రవేశించుటకును శక్యుడ నగుచున్నాను

అవ - ఆత్మజ్ఞానానధికారిని గుఱించి తెలుపుచున్నాడు

మూ ॥ ***నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః ।***
***నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥***

పద ॥ న - అవిరతః - దుశ్చరితాత్ - న - అశాన్తః - న - అసమాహితః - న - అశాన్తమానసః - వా - అపి - ప్రజ్ఞానేన - ఏనం ఆప్నుయాత్

టీక ॥ దుశ్చరితాత్ = చెడు నడతనుండి, అవిరతః = చాలించనివాడు, ఏనం= ఈ ఆత్మను, నాప్నుయాత్ = పొందడు, అశాన్తః = విషయ సుఖములవలన శాంతి పొందనివాడును, న = పొందడు, అసమాహితః = ఏకాగ్రచిత్తము లేనివాడును, న = పొందడు, అశాన్తమానసోవాఽపి = ఉపరతి నొందక విషయ వ్యాప్తమైన చిత్తముగలవాడు, న = పొందడు, ప్రజ్ఞానేన = జ్ఞానముచేత, ఏనం = ఈ ఆత్మను, ఆప్నుయాత్ = పొందును

తా ॥ ఓ నచికేతసుడా ! చెడు నడవడిక కల్గి ఇంద్రియచలన ముడుగక యేకాగ్రచిత్తము లేక అన్నిటియందు వ్యాపించు చిత్తము గల మనుజుడు ఈ ఆత్మను పొందడు చెడు నడతను వదలి ఇంద్రియ చలనములేక ఏకాగ్రచిత్తము గలిగి యన్నిటియందు వ్యాపించక ఉపరతమనస్సు గల మనుజుడు ఈ యాత్మను జ్ఞానముచేత పొందుచున్నాడు

వి ॥ గీత అ 6 శ్లో ॥ 36

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

యోగము మనోనిగ్రహము లేనివానిచే పొందతగినది గాదు యత్నశీలుడగు మనస్సంయమము గలవానిచే అభ్యాస వైరాగ్యములనెడి యుపాయములచే పొందుటకు సాధ్యమయినదని నాయొక్క మతము

అవ - సాధన సంపత్తి రహితునికి ఆత్మ దురవగాహమను విషయము చెప్పబడుచున్నది

మూ ॥ *యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః ।*
*మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః ॥* **25**

పద ॥ యస్య - బ్రహ్మ - చ - క్షత్రం - చ - ఉభే - భవతః - ఓదనః- మృత్యుః - యస్య ఉపసేచనం కః - ఇత్థా - వేద - యత్ర సః

టీక ॥ బ్రహ్మ చ = బ్రహ్మమును, క్షత్రం చ = క్షత్రమును (సర్వధర్మముల ధరించియున్న సర్వమునకు ప్రాణభూతమగు బ్రాహ్మణ క్షత్రియ వర్ణద్వయముచే చూపింపబడు జంగమస్థావరాత్మక ప్రపంచము), ఉభే = రెండును, యస్య = ఏ యాత్మకు, ఓదనః = అన్నము, భవతః = అగుచున్నవో, యస్య = ఏ యాత్మకు, మృత్యుః = మృత్యువు, ఉపసేచనం = అన్నసాధకమో (శాకము), సః = ఆ యాత్మ, యత్ర = ఎక్కడ నుండునదియు, కః = ఎవడు (సాధన రహితుడు), ఇత్థా = ఈ ప్రకారము (పూర్వమందుచెప్పిన సాధన సంపద గలవానివలె), వేద = తెలిసికొనుచున్నాడు? (తెలిసికొన గలుగును?)

తా ॥ ఓ నచికేతసుడా ! ఏ యాత్మకు చరాచరాత్మకమగు ప్రపంచము అన్నముగాను, మృత్యువు శాకముగా నున్నదో అట్టి యాత్మ యెక్కడ ఉండునది తెలిసికొనుటకు ఆత్మప్రాప్తి సాధనసంపత్తి లేనివాడెవడును సమర్థుడు కాడు

కఠోపనిషత్తు ప్రథమాధ్యాయమునందు
ద్వితీయవల్లి సమాప్తము
ఓమ్ తత్ సత్



ఓమ్

# కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము - తృతీయవల్లి

అవ - గన్త్రగన్తవ్యభేదవముతో జీవాత్మ పరమాత్మల వైలక్షణ్యాము దెలియజేయబడుచున్నది

మూ ॥ *ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే*
*గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థ్యే ।*
*ఛాయా౽౽తపౌ బ్రహ్మవిదో వదన్తి*
*పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః ॥* **1**

పద ॥ ఋతం - పిబన్తౌ - సుకృతస్య - లోకే - గుహాం - ప్రవిష్టౌ - పరమే - పరార్థ్యే - ఛాయా౽౽తపౌ - బ్రహ్మవిదః - వదన్తి - పఞ్చాగ్నయః - యే - చ - త్రిణాచికేతాః

టీక ॥ యే = ఎవరు, త్రిణాచికేతాః = మూడుసార్లు నచికేతాగ్ని చయనము చేయువారును, పంచాగ్నయః = గార్హపత్య, దక్షిణాగ్ని, ఆహవనీయ, సభ్య, వసధి యివి పంచాగ్నులు, వీటి మధ్య తప మొనర్చువారు పంచాగ్ను లనబడుదురు మఱియు ద్యు, పర్జన్య, పృధివీ, పురుష, యోషిత్తులయందు పంచాగ్ని దృష్టి కలవారును పంచాగ్నులనబడుదురు వీరును, బ్రహ్మవిదః = బ్రహవేత్తలును అయియున్నారో, (తే = వారు), లోకే = లోకమందు, పరమే= శ్రేష్ఠమైన, పరార్థ్యే = బ్రహ్మస్థానమైన, గుహాం = బుద్ధి గుహను, ప్రవిష్టౌ = ప్రవేశించియున్న, సుకృతస్య = కర్మయొక్క, ఋతం = సత్యమైన ఫలమును, పిబన్తౌ = అనుభవించుచున్న యాత్మలను, ఛాయా౽౽తపౌ = నీడ యెండలనుగా అనగా విలక్షణ స్వభావవము గలవారినిగా, వదన్తి = చెప్పుచున్నారు

తా ॥ పూర్వవల్లియందు జ్ఞానాజ్ఞానములు విరుద్ధ ఫలములు గలవని చెప్పబడినవి వాని నిక్కడ న్నిర్ణయించుట కొఱకు రథరూపకల్పన జేసి రెండాత్మ లుపన్యసింపబడుచున్నవి

ఓ నచికేతసుడా ! బ్రహ్మవేత్తలు దేహమున బ్రహ్మస్థానమగు హృదయాకాశమందు ప్రవేశించి కర్మఫలము ననుభవించుచున్న యాత్మలు (జీవబ్రహ్మలు) ఛాయాతపములవలె భిన్నములైనవని చెప్పుచున్నారు అట్లే నచికేతాగ్నిని చయనమొనర్చినవారును, ద్యు, పర్జన్య, పృధివీ, పురుష, యోషిత్తులందు అగ్నిభావన జేయు అగ్న్యుపాసకులును చెప్పుచున్నారు

అవ - పరాపర బ్రహ్మలు రెండును జ్ఞాతవ్యములని తెలుపుచున్నాడు

మూ ॥ *యస్సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్ ।*
*అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి ॥*

పద ॥ యః - సేతుః - ఈజానానాం - అక్షరం - బ్రహ్మ - యత్ - పరం- అభయం- తితీర్షతాం - పారం - నాచికేతం - శకేమహి

టీక ॥ ఈజానానాం = యాగము జేయువారలకు, యః = ఏది, సేతుః = కట్టవంటిదో (దానిని అనగా నాచికేతాగ్నిని) మఱియు, యత్= ఏది, పారం= సంసారపారమును (ఒడ్డును), తితీర్షతాం = దాటనిచ్ఛగల బ్రహ్మవేత్తలకు, అభయం = భయరహితమయిన,, పరం = ఆశ్రయస్థానమో అటువంటి, అక్షరం = నాశరహితమైన, బ్రహ్మ = పరబ్రహ్మమును (జ్ఞాతుం = తెలిసికొనుటకు), శకేమహి= సమర్థుల మగుదుము గాక !

తా ॥ ఓ నచికేతసుడా ! కర్మనిష్ఠులకు దుఃఖనివారణ సాధనమగుటచే సేతువైన నచికేతాగ్నిని తెలిసికొందుము గాక ! సంసారోత్తరణము చేయ నిచ్ఛ గల బ్రహ్మవేత్తలకు ఆశ్రయస్థానమగు అక్షరపరబ్రహ్మమునున్ను దెలిసికొందుము గాక ! అనగా పరాపరబ్రహ్మల రెంటిని తెలిసికొనవలయునని తాత్పర్యము

అవ - ఉపాధిపరిచ్ఛిన్నుడగు జీవుడు సంసారమోక్షముల బొందుటకు సాధనములైన దేహేంద్రియాదులందు రూపకాలంకారముతో రథాది కల్పన చేయబడుచున్నది

మూ ॥ *ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరగ్ం రథమేవ తు ।*
*బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥* 3

పద ॥ ఆత్మానం - రథినం - విద్ధి - శరీరం - రథం - ఏవ - తు - బుద్ధిం - తు - సారథిం - విద్ధి - మనః - ప్రగ్రహం - ఏవ - చ

టీక ॥ ఆత్మానం = శరీరాధిష్ఠితమగు నాత్మను, రథినం = రథమందుండు వానినిగాను, తు = మఱియు, శరీరమేవ = దేహమునే, రథం = తేరునుగాను, విద్ధి = తెలిసికొనుము, తు = మఱియు, బుద్ధిం = బుద్ధిని, సారథిం = సారథినిగాను, మన ఏవ = మనస్సునే, ప్రగ్రహం చ = కళ్లెపు త్రాటినిగాను, విద్ధి = తెలిసికొనుము

తా ॥ ఓ నచికేతసుడా ! దేహాధిష్ఠితాత్మను రథికుని గాను, దేహమునే రథమునుగాను, బుద్ధిని సారథినిగాను, మనస్సును కళ్ళెపు త్రాటినిగాను తెలిసికొనుము

అవః - పూర్వోక్తరీతిగనే యింద్రియములందు అశ్వత్వము నారోపించి ఆత్మయొక్క భోక్తృత్వమును వర్ణించుచున్నాడు

మూ ॥ *ఇంద్రియాణి హయానాహుర్విషయాం స్తేషు గోచరాన్ ।*
*ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥*

పద ॥ ఇంద్రియాణి - హయాన్ - ఆహుః - విషయాన్ - తేషు - గోచరాన్- ఆత్మేంద్రియమనోయుక్తం - భోక్తా - ఇతి - ఆహుః - మనీషిణః

టీక ॥ మనీషిణః = విద్వాంసులు, ఇంద్రియాణి = ఇంద్రియములను, హయాన్= గుఱ్ఱములనుగా, ఆహుః = చెప్పిరి, తేషు = ఆ హయరూపములగు నింద్రియములయందు, విషయాౕ = శబ్దాది విషయములను, గోచరాౕ = మార్గములనుగాను, ఆత్మేంద్రియ మనోయుక్తం = దేహేంద్రియ మనస్సులతో గూడుకొన్న యాత్మను, భోక్తేతి = సంసారి యనియు, ఆహుః = చెప్పిరి

తా ॥ విద్వాంసులు పూర్వోక్త రథమునకు నింద్రిదియంవములు గుఱ్ఱములనియు, శబ్దావిపిషయములు సంచార మార్గములనియు చెప్పుదురు

మఱియు కర్తృత్వాదికములులేని యాత్మ దేహేంద్రియ మనస్సులతో గూడుకొన్నదై కర్తృత్వ భోక్తృ త్వాదికమును పొందుచున్నది కాన దేహేంద్రియ మనస్సులతో కూడిన జీవాత్మను జ్ఞానులు 'భోక్త' యందురు

వి ॥ గీత అ 15 శ్లో ॥ 7,8

**మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।**
**మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥**

**శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥**

అనాదియైన జీవాత్మ నా యంశమేయై జంతుజాలము నందుండి ప్రకృతి సంబంధములగు జ్ఞానేంద్రియములైదును, మనస్సును్ను చేరిన ఆరింద్రియములను ఆకర్షించుచున్నాడు ఇంద్రియాధిపతియగు జీవుడు ఏదేని యొక దేహమును ఎప్పుడు పొందునో అప్పుడును, ఆ దేహమునుండి ఎప్పుడు బయలు వెడలునో అప్పుడును, పుష్పాదులనుండి వాయువు పరియళమును గ్రహించుమాడ్కి ఈ షడిన్ద్రియములను గ్రహించి పోవుచున్నాడు,

అవ - సంయమము లేనివానియొక్క పరవశతనం, దుర్గతిని వర్ణించుచున్నాడు

మూ ॥ ***యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా ।***
***తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః ॥*** 5

పద ॥ యః - తు - అవిజ్ఞానవాణ్ - భవతి - అయుక్తేన - మనసా - సదా - తస్య - ఇంద్రియాణి - అవశ్యాని - దుష్టాశ్వాః - ఇవ - సారథేః.

టీక ॥ యస్తు = ఎవడైతే, అయుక్తేన = సమాహితము గాని, మనసా = మనస్సుతో, సదా = ఎల్లప్పుడు, (యుక్తః = కూడుకొన్నవాడై), అవిజ్ఞానవాణ్ = అవివేకి, భవతి = అగుచున్నాడో, సారథేః = సూతునికి, దుష్టాశ్వా ఇవ = చెడుగుఱ్ఱములవలెనే, తస్య = వానికి, ఇంద్రియాణి = ఇంద్రియములనెడు అశ్వములు, అవశ్యాని = స్వాధీనములు కానివి, (భవన్తి = అగుచున్నవి)

తా ॥ ఓ నచికేతసుడా ! ఎవడు ఏకాగ్రతలేని మనస్సు గలవాడై యనివేకి యగుచున్నాడో వానికి ఇంద్రియములు, సమాహితుడుకాని యసమర్థుడగు సారధికి దుష్టాశ్వము లెట్లు స్వాధీనములు గావో ఆ విధముగానే స్వాధీనములు గావు

అవ - సంయమశీలుని స్వభావమును కీర్తించుచున్నాడు

మూ ॥ *యస్తు విజ్ఞానవాన్ భవగతి యుక్తేన మనసా సదా ।*
*తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారధేః ॥* 6

పద ॥ యః - తు - విజ్ఞానవాన్ - భవతి - యుక్తేన - మనసా - సదా - తస్య - ఇంద్రియాణి - వశ్యాని - సదశ్వాః - ఇవ - సారధేః

టీక ॥ యస్తు = ఎవడైతే, సదా = ఎల్లప్పుడు, యుక్తేన = సమాహితమగు, మనసా = మనస్సుతో (యుక్తః = కూడుకొన్నవాడై), విజ్ఞానవాన్= జ్ఞానవంతుడు, భవతి = అగుచున్నాడో తస్య = వానికి, ఇంద్రియాణి= ఇంద్రియములు, సారధేః = రధసూతునికి, సదశ్వా ఇవ = శ్రేష్ఠమైన గుఱ్ఱములవలె, వశ్యాని = స్వాధీనములైనవి, (భవన్తి = అగుచున్నవి )

తా ॥ ఓ నచికేతసుడా ! ఏకాగ్రచిత్తముగల జ్ఞానికి సర్వేంద్రియములు మంచి గుఱ్ఱములు రధసారధికివలెనే స్వాధీనములగుచున్నవి

అవ - అవివేకికి, సంయమరహితునికి సంసారప్రాప్తియే గతియని తెలుపుచున్నాడు

మూ ॥ *యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కస్సదాఽశుచిః ।*
*న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥* 7

పద ॥ యః - తు - అవిజ్ఞానవాన్ - భవతి - అమనస్కః - సదా - అశుచిః- న - సః - తత్ - పదం - ఆప్నోతి - సంసారం - చ - అధిగచ్ఛతి

టీక ॥ యస్తు = ఎవడైతే, అవిజ్ఞానవాన్ = జ్ఞానవము లేనివాడుగాను, అమనస్కః= మనోనిగ్రహము లేనివాడుగాను, సదా = ఎల్లప్పుడు, అశుచిః = అపరిశుద్ధుడుగాను, భవతి = అగుచున్నాడో, సః = వాడు, తత్= పూర్వమందు

చెప్పిన అక్షరస్వరూపమగు, పదం = స్థానమును, నాప్నోతి = పొందడు, సంసారం చ = జనన మరణరూప సంసారమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! జ్ఞానవిహీనుడై మనో నిగ్రహములేని మనుజుడు పరిశుద్ధత లేనివాడై అక్షరస్వరూపమును పొందక సంసారమును పొందుచున్నాడు

వి ॥ గీత అ 2 శ్లో ॥ 67

**ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనో௨నువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥**

విషయములందు ప్రవర్తించుచున్న యింద్రియులలో నేమనస్సు వాటిని అనుసరించి ప్రవర్తించుచున్నదో, ఆ మనస్సు ఈ మనోనిగ్రహము లేనివానియొక్క వివేకజ్ఞానమును, తుపానుగాలి సముద్రము నందు ఓడను హరించునట్లు హరించుచున్నది

అవ - సంయమశీలునికి పరమపదప్రాప్తి గలుగునని విశద పరచుచున్నాడు

మూ ॥ *యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కస్సదా శుచిః ।*
*స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే ॥* **8**

పద ॥ యః - తు - విజ్ఞానవాన్ - భవతి - సమనస్కః - సదా - శుచిః - సః - తు- తత్ - పదం - ఆప్నోతి - యస్మాత్ - భూయః - న - జాయతే

టీక ॥ యస్తు = ఎవడైతే, విజ్ఞానవాన్ = జ్ఞానముగలవాడుగాను, సమనస్కః= యుక్తమనస్సుగలవాడుగాను, సదా = యెల్లప్పుడు, శుచిః = పరిశుద్ధుడుగాను, భవతి = అగుచున్నాడో, సః తు = వాడే, యస్మాత్= ఏస్థానమునుండి, భూయః= మఱల, న జాయతే = పుట్టడో, తత్ = ఆ, పదం = స్థానమును, ఆప్నోతి = పొందుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! యుక్తమనస్సుగల పరిశుద్ధుడగు జ్ఞాని ఏస్థానమును పొందిన మరల పుట్టడో అట్టి స్థానమును పొందుచున్నాడు

అవ - సంయమశీలుడగు వివేకి పొందు పరమపదస్వరూపమునే వర్ణించుచున్నాడు

మూ ॥ విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్నరః ।
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ ॥ 9

పద ॥ విజ్ఞానసారథిః - యః - తు - మనఃప్రగ్రహవాన్ - నరః - సః - అధ్వనః - పారం - ఆప్నోతి - తత్ - విష్ణోః - పరమం - పదమ్

టీక ॥ యస్తు నరః = యే మనుష్యుడైతే, విజ్ఞానసారథిః = వివేకముతో గూడుకొన్న బుద్ధియే సారథిగా గలవాడుగను, మనఃప్రగ్రహవాన్= మనస్సను కళ్ళెమును వశమునందుంచినవాడుగను ఉండునో, సః= వాడు, అధ్వనః = సంసారమార్గమునకు, పారం = అంతమైన, విష్ణోః= వ్యాపకమగు పరబ్రహ్మముయొక్క, పరమం = శ్రేష్ఠమగు, తత్= ఆ, పదం = స్థానమును, ఆప్నోతి = పొందున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! వివేకాత్మకమగు బుద్ధి సారథిగను, సమాహితచిత్తము కళ్లెముగను గల నరుడు ( విద్వాంసుడు) సంసారసాగరమును తరించి శ్రేష్ఠమగు సర్వవ్యాపకపరబ్రహ్మముయొక్క స్థానమును ( పరమపదమును) బొందుచున్నాడు

అవ - రెండు మంత్రములచే ఇంద్రియాదుల తారతమ్యము వర్ణింపబడుచున్నది

మూ ॥ ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।
మనసశ్చ పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥ 10

పద ॥ ఇన్ద్రియేభ్యః - పరాః - హి - అర్థాః - అర్థేభ్యః - చ - పరం - మనః- మనసః- చ పరా - బుద్ధిః - బుద్ధేః - ఆత్మా - మహాన్ - పరః

టీక ॥ ఇన్ద్రియేభ్యః = ఇంద్రియములకంటె, అర్థాః = శబ్దాదివిషయములు, హి = నిశ్చయముగా, పరాః = శ్రేష్ఠములైనవి ( సూక్ష్మములైనవి), అర్థేభ్యశ్చ = విషయములకంటెను, మనః = మనస్సు, పరం = శ్రేష్ఠమైనది, మనసశ్చ =

మనస్సుకంటెను, బుద్ధిః = విజ్ఞానరూపబుద్ధి, పరా - శ్రేష్ఠమైనది, బుద్ధేః = బుద్ధికంటెను, మహాన్ = గొప్పదగు, ఆత్మా = ఆత్మ ( మహాత్తత్త్వము) పరః= శ్రేష్ఠమైనది (సూక్ష్మమైనది)

తా ॥ ఆత్మను పొందుటకొఱకు బుద్ధ్యాదీంద్రియ పర్యంతము వాటివాటితో చేరుకొని ఆ యానామములను పొందు ఆత్మకు గల తరతమభావము నిరూపింపబడుచున్నది

ఓ నచికేతసుడా ! స్థూలస్వరూపమగు నింద్రియాత్మకంటె విషయాత్మయును, విషయాత్మకంటె మన ఆత్మయును, మనోరూపాత్మ కంటె బుద్ధ్యాత్మయును, బుద్ధ్యాత్మకంటె మహదాత్మయును, ఈ ప్రకారము ఒకదానికంటె నొకటి శ్రేష్ఠము, సూక్ష్మము, వీటికన్నిటికంటె కేవలాత్మ సర్వోత్కృష్టమై సూక్ష్మాతిసూక్ష్మమైయున్నది అట్టి యాత్మను తెలిసికొన వలయును

మూ ॥ *మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।*
*పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥* **11**

పద ॥ మహతః - పరం - అవ్యక్తం - అవ్యక్తాత్ - పురుషః - పరః - పురుషాత్ - న- పరం - కించిత్ - సా - కాష్ఠా - సా - పరా - గతిః

టీక ॥ మహతః = మహత్తుకంటె ( అవ్యక్తమునుండి మొదట ఉద్భవించి సర్వజగత్తుకు కారణభూతమగు తత్త్వము మహత్తనబడును), అవ్యక్తం = వ్యక్తపరచుటకు వీలుకాని ప్రకృతి, (సర్వకార్యకారణ శక్తినముదాయరూపము, అస్ఫుటమై, అవ్యాకృతాకాశాది నామముచే చెప్ప దగినదై సర్వమునకు బీజరూపమై, వటవృక్షశక్తి వటబీజము నందువలె పరమాత్మయందు ఓతప్రోత భావముతో నుండు శక్తివిశేషము అవ్యక్త మనబడును), పరం = శ్రేష్ఠమైనది ( మహత్తుకంటె అంతరమైనది), అవ్యక్తాత్ = సర్వకార్యకారణ శక్తిరూపావ్యక్తముకంటె, పురుషః = పురుషుడు (సర్వత్ర నిండియుండు పరమాత్మ), పరః = శ్రేష్ఠుడు (పరిపూర్ణుడగు అంతరుడు), పురుషాత్ = పురుషునికంటె, పరం = శ్రేష్ఠమైనది, కించిత్ = ఏదియును, న = ఏదు, సా = అది, కాష్ఠా = అంతిమమైన

సీమ (సర్వ సూక్ష్మమునకు నాంతరమైన అవధి), సా = అది, పరా= ఉత్కృష్టమగు, గతిః= రక్షకస్థానము (జనన మరణరహితమైన గన్తవ్యస్థానము)

తా ॥ ఓ నచికేతసుడా ! సర్వజగదంకుర ప్రాయమగు మహత్తుకంటె అవ్యక్తమును, సర్వజగదంకురమునకు బీజభూతమైన అవ్యక్తముకంటె పురుషుడును, ఒకదానికంటె ఒకటి అంతరమైనది, సూక్ష్మమైనది సర్వమునకు అంతరమయి పరిపూర్ణమయినది ఆత్మ అట్టి యాత్మయే సర్వావసానము, పరాగతి, అదియే ముఖ్యముగా పొందదగినది

వి ॥ గీత అ 3 శ్లో ॥ 42,43

ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్ ॥

ఇంద్రియములు దేహముకన్న శ్రేష్ఠములు, వానికన్న మనస్సు శ్రేష్ఠము, దానికంటె బుద్ధి శ్రేష్ఠమైనది ఆ బుద్ధికంటెను ఏది శ్రేష్ఠమో, అదియే ఆత్మ యని బ్రహ్మవేత్తలు వచింతురు ఓ అర్జునా ! ఇట్లు బుద్ధి కంటెను ఆత్మను శ్రేష్ఠమైనదానినిగా నెఱింగి ఆత్మచేత నిశ్చలముగ జేసి (నిశ్చయించుకొని) కామరూపమయినదియు, జయింపప్రయాస మైనదియునగు శత్రువును (మూలప్రకృతిని) విడువుము, వధింపుము, ఛేదింపుము దేహము మొదలు ఆత్మవఱకు ఒక్కొక్కటి పైభాగమున నుండునని గ్రహింపనగును ఆత్మయే పరాకాష్ఠ

అవ - సూక్ష్మాతి సూక్ష్మమగు ఆత్మ సూక్ష్మబుద్ధి గ్రాహ్యమని తెలుపుచున్నాడు

మూ ॥ *ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।*
*దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥* **12**

పద ॥ ఏషః - సర్వేషు - భూతేషు - గూఢః - ఆత్మా - న - ప్రకాశతే - దృశ్యతే - తు - అగ్ర్యయా - బుద్ధ్యా - సూక్ష్మయా - సూక్ష్మదర్శిభిః

టీక ॥ ఏషః = ఈ, సర్వేషు = సమస్తములైన (బహ్మ మొదలు తృణ పర్యంతము గల), భూతేషు = భూతములయందు, గూఢః = నిగూఢమై మాయచే ఆవరింపబడిన, ఆత్మా = ఆత్మ, న ప్రకాశతే= ప్రకాశించుటలేదు తు = కాని, సూక్ష్మదర్శిభిః = సూక్ష్మవస్తువును చూచువారలచేత (పూర్వమందు చెప్పబడిన యింద్రియా ద్యాత్మలన్నిటికంటె ఆంతరమై సూక్ష్మమైన యాత్మవస్తువును చూచుస్వభావముగలవారిచేత), అగ్ర్యయా = ఏకాగ్రతగల, సూక్ష్మయా = సూక్ష్మవస్తు నిరీక్షణ తత్పరమైన, బుద్ధ్యా = బుద్ధిచేత, దృశ్యతే= చూడబడుచున్నది

తా ॥ ఓ నచికేతసుడా ! పూర్వోక్తమగు పురుషస్వరూపమైన యాత్మ, బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వభూతములయందు గుప్తమైయుండి ప్రకాశించుట లేదు అయితే అది పూర్వము చెప్పిన ప్రకారము ఇంద్రియాద్యాంతర సూక్ష్మవస్తు దర్శన శీలురగు పండితులచే (తత్త్వవేత్తలచే) బాహ్యాంతర వ్యాపార రహితమగు ఏకాగ్రమైన సూక్ష్మబుద్ధిచేత చూడబడుచున్నది

వి ॥ గీత అ 5, శ్లో ॥ 15,16

**అజ్ఞానేనా వృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ।**
**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

ఆత్మజ్ఞానము అజ్ఞానముచే గప్పబడియున్నది దానిచే జీవ కోట్లు మోహము నొందుచున్నవి. అట్టి ఆత్మజ్ఞానము నావరించినట్టి యెవరి అజ్ఞానము ఆత్మజ్ఞానముచే నశింపజేయబడినదో అట్టివారల కాత్మజ్ఞానము మేఘము వదలిన సూర్యునివలె ఆ పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింప చేయుచున్నది

అవ - ఇంద్రియ నియమపూర్వకముగా ఆత్మోపలబ్ధ్యుపాయము వర్ణింపబడుచున్నది

మూ ॥ *యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని ।*
*జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని ॥* **13**

పద ॥ యచ్ఛేత్ - వాక్ - మనసీ - ప్రాజ్ఞః - తత్ - యచ్ఛేత్ - జ్ఞానే - ఆత్మని - జ్ఞానం - ఆత్మని - మహతి - నియచ్ఛేత్ - తత్ - యచ్ఛేత్ - శాన్తే - ఆత్మని

టీక ॥ ప్రాజ్ఞః = వివేకియగు జిజ్ఞాసువు, వాక్ = వాక్కును, మనసీ = మనస్సునందు, యచ్ఛేత్ = నియమింపవలయును (ఉపసంహారము చేయవలయును), తత్ = ఆ మనస్సును, జ్ఞానే = ప్రకాశస్వరూపమగు, ఆత్మని = బుద్ధ్యాత్మయందు, యచ్ఛేత్ = నియమింపవలయును, జ్ఞానం = ప్రకాశమగుబుద్ధిని, మహతి = మహత్త్వరూపమగు, ఆత్మని = కారణాత్మయందు, నియచ్ఛేత్ = నియమింపవలయును, తత్ = ఆ కారణాత్మక మహతత్త్వమును, శాన్తే = సర్వవికారశూన్యమైన, ఆత్మని = పరమాత్మయందు, యచ్ఛేత్ = నియమింపవలయును

తా ॥ ఓ నచికేతసుడా ! బుద్ధ్యాది వాగింద్రియ పర్యంతము ఆయా యింద్రియస్వరూపమై బహిర్గతమగు నాత్మను బాహ్యమును నిగ్రహించి బాహ్యాంతరములకు మధ్యవర్తియగు వాగాది సర్వేంద్రియాత్మను మనస్సునందును, మనోరూపాత్మను బుద్ధియందును, బుద్ధ్యాత్మను మహదాత్మయందును, మహదాత్మను కేవల నిర్వికారపరమాత్మయందును నియమించి పరమాత్మస్వరూపమును తెలిసికొనవలయును

వి ॥ గీత అ 6 శ్లో ॥ 26

**యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం న యేత్ ॥**

చంచలమయినదియు, నొకదానియందు నిలుకడ లేనిదియు నైన మనస్సు ఎచ్చటెచ్చట సంచరించుచుండునో, అచ్చటచ్చటనుండి మనస్సును మరలించి ఆత్మయందే లయమొనరించవలయును (స్థిరమొనర్చ వలయును), ఏది ఎచ్చటనుండి పుట్టునో, అది అచ్చటనే లయమొందును గాని, మరియొక స్థలమున స్థిరముగా లయమొందజాలదు

అవః - ఆత్మసాక్షాత్కారమున్నకై ఉద్బోధన (హెచ్చరిక) గావింపబడుచున్నది

మూ ॥ *ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత । క్షురస్య*
*ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వద న్తి ॥* **14**

పద ॥ ఉత్తిష్ఠత - జాగ్రత - ప్రాప్య - వరాన్ - నిబోధత - క్షురస్య - ధారా - నిశితా- దురత్యయా - దుర్గం - పథః - తత్ - కవయః- వదన్తి

టీక ॥ (అనాద్యవిద్యయందు నిద్రించుచున్నట్టియో మానవులారా !) ఉత్తిష్ఠత = లెండు (అజ్ఞాన నిద్రనుండి), జాగ్రత = మేల్కొనుడు, వరాన్ = శ్రేష్ఠులగు గురువులను, ప్రాప్య = పొంది, నిబోధత = తెలిసికొనుడు, క్షురస్య = మంగలికత్తియొక్క, నిశితా = తీక్ష్ణముగా చేయబడిన, ధారా = వాయి (అగ్రభాగము), (యథా = ఏప్రకారము), దురత్యయా = దాటుటకు శక్యమైనది కాదో, (తథా= ఆ ప్రకారము), కవయః = సూక్ష్మదర్శులైన పండితులు, తత్ = ఆ ఆత్మతత్త్వరూపమైన, పథః = మార్గమును, దుర్గం= అతికష్టముతో తరించుటకు వీలగునదిగా, వదన్తి = చెప్పుచున్నారు

తా ॥ ఓ నచికేతసుడా ! విద్వాంసులు ఆత్మతత్త్వమును సానపెట్టబడిన మంగలిక త్తియొక్క వాదరవలె సులభముగా పొందనలవి కానిదని చెప్పుచున్నారు కనుక అనాద్యవిద్యా ప్రసుప్తులరగు నో జనులారా ! మీరు లెండు ! అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుడు! బ్రహ్మవేత్తలగు సద్గురువులను సమీపింపుడు వారిని ఆశ్రయించి ఆత్మ త్త్వమును తెలిసికొనుడని జనులకు శ్రుతి మిక్కిలి దయతో తల్లివలె బోధించుచున్నది

వి ॥ గీత అ 4 శ్లో ॥ 34

**తద్విద్ధి ప్రాణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥**

తత్త్వవేత్తలయిన జ్ఞానులు నీకు జ్ఞానము నుపదేశింపగలరు నమస్కారము చేతను సమయము జూచి ప్రశ్నించుటచేతను, గురువునకు ప్రీతికరములగు కార్యముల నాచరించుటచేతను సద్గురువుల ప్రసన్నులజేసి వారినుండి ఆత్మజ్ఞానమును తెలిసికొనుము

అవ - నిర్విశేషాత్మజ్ఞానముచే మృత్యునివృత్తి, అమృతత్త్వప్రాప్తి గలుగునని చెప్పుచున్నాడు

మూ ॥ అశబ్దమస్పర్శమరూపమవ్యయం
తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్।
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే ॥ 15

పద ॥ అశబ్దం - అస్పర్శం - అరూపం - అవ్యయం - తథా - అరసం - నిత్యం - అగంధవత్ - చ - యత్ - అనాది - అనంతం - మహతః- పరం - ధ్రువం- నిచాయ్య - తత్ - మృత్యుముఖాత్ - ప్రముచ్యతే

టీక ॥ యత్ = ఏది, అశబ్దం = శబ్దములేనిదో, అస్పర్శం = స్పర్శము లేనిదో, అరూపం = రూపములేనిదో, అవ్యయం = నాశరహిత మైనదో, తథా = ఆ ప్రకారము, అరసం = రసములేనిదో, అగన్ధవచ్చ= గంధము లేనిదో, నిత్యం= నిత్యమైనదో, తత్ = అటువంటి, అనాది= ఆదిలేని, అనంతం = అంతములేని, మహతః = బుద్ధి సంజ్ఞకమగు మహదాత్మకంటె, పరం = విలక్షణమైనటువంటి, ధ్రువం = నిత్యస్వరూపమగు ఆత్మను, నిచాయ్య = తెలిసికొని, మృత్యుముఖాత్ = మృత్యుముఖమునుండి, ప్రముచ్యతే = విడువబడుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! జనుడు శబ్ద స్పర్శ రూప రసగంధములు లేక నాశరహితమై నిత్యమై ఆద్యంతవములు లేక బుద్ధివిలక్షణమై నిత్య విజ్ఞప్తిస్వరూపమగు కూటస్థపరమాత్మను తెలిసికొని మృత్యువున కభిముఖమగు సంసారమును విడచి ముక్తు డగుచున్నాడు

వి ॥ గీత అ 5, శ్లో ॥ 21

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥

బాహ్యవిషయములయందంటని మనస్సుగల పురుషుడు తన ఆత్మయందు సుఖమేది గలదో, ఆ సుఖమును పొందుచున్నాడు అట్టివాడు బ్రహ్మనిష్ఠ యను సమాధితో గూడకొనిన మనస్సు గలవాడై తరుగని శాశ్వతమయిన బ్రహ్మసుఖము ననుభవించుచున్నాడు

అవ - ఆత్మవిజ్ఞానఫలశ్రుతి జెప్పబడుచున్నది

మూ ॥ *నాచికేతముపాఖ్యానం మృత్యుప్రోక్తగ్ం సనాతనమ్ ।*
*ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే ॥* **16**

పద ॥ నాచికేతం - ఉపాఖ్యానం - మృత్యుప్రోక్తం - సనాతనం - ఉక్త్వా - శ్రుత్వా - చ - మేధావీ - బ్రహ్మలోకే - మహీయతే

టీక ॥ మృత్యుప్రోక్తం = మృత్యువుచేత చెప్పబడిన, సనాతనం = ప్రాచీనమగు, నాచికేతం = నచికేతసునిచే పొందబడిన, ఉపాఖ్యానం = వల్లీత్రయముతో కూడిన కథను, ఉక్త్వా = చెప్పి, శ్రుత్వా చ = వినియు, మేధావీ = ప్రజ్ఞావంతుడు, బ్రహ్మలోకే = బ్రహ్మ లేకమందు, మహీయతే = పూజ్యుడగుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! మృత్యువుచే చెప్పబడిన ప్రాచీన మగు నచికేతనసంబంధమగు నుపాఖ్యానమును వినుటచేతను, చెప్పుటచేతను ప్రజ్ఞ గలవాడై వివేకవంతుడగు జ్ఞాని బ్రహ్మలోకమున పూజ్యుడగు (ముక్తుడగు) చున్నాడు

అవ - ఫలశ్రుతితోబాటు అధ్యాయ ముపసంహరింపబడుచున్నది

మూ ॥ *య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మసంసది ।*
*ప్రయతః శ్రాద్ధకాలే వా తదానంత్యాయ కల్పతే ।*
*తదానంత్యాయ కల్పత ఇతి ॥* **17**

పద ॥ యః - ఇమం - పరమం - గుహ్యం - శ్రావయేత్ - బ్రహ్మసంసది- ప్రయతః- శ్రాద్ధకాలే - వా - తత్ - ఆనన్త్యాయ - కల్పతే - తత్- ఆనన్త్యాయ - కల్పతే- ఇతి

టీక ॥ యః = ఎవడు, పరమం = శ్రేష్ఠమైన, గుహ్యం = రహస్యమైన, ఇమం= ఈ ఉపనిషత్తును, బ్రహ్మసంసది = బ్రహ్మవేత్తలసభయందు (లేక) శ్రాద్ధకాలే వా = శ్రాద్ధకాలమందైనను, ప్రయతః = పరిశుద్ధుడై, శ్రావయేత్ = వినిపించునో (భోక్తలకు), తత్ = ఆ శ్రాద్ధము, ఆనన్త్యాయ = అనన్తఫలముకొఱకు,

కల్పతే = సమర్థమగుచున్నది ఇతి = ఇట్లని కడపట అధ్యాయ పరిసమాప్తికొఱకు రెండు సార్లు ''తదానన్త్యాయ కల్పతే'' అని చెప్పబడినది

తా ॥ ఓ నచికేతసుడా ! అతిరహస్యమై శ్రేష్ఠమగు నీ ఉపనిషత్తు బ్రహ్మసభయందు గాని, శ్రాద్ధకాలమందు భోక్తలకు గాని ఎవడు వినిపించునో ఆ శ్రాద్ధము అనంతఫలము నీయ సమర్థమగుచున్నది

కఠోపనిషత్తు ప్రథమాధ్యాయమునందు

తృతీయవల్లి సమాప్తము

ఓమ్ తత్ సత్



ఓమ్

# కఠోపనిషత్తు

## ద్వితీయాధ్యాయము - ప్రథమవల్లి

అవ - ఆత్మసాక్షాత్కార ప్రతిబంధమును చూపుటకై యీవల్లి ప్రారంభింపబడుచున్నది తత్ప్రతిబంధస్వరూపమైన యింద్రియ బహిర్ముఖత్వము మొదట నిరూపింపబడుచున్నది

మూ ॥ *పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూ*
*స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్ ।*
*కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష*
*దావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥* **1**

పద ॥ పరాఞ్చి - ఖాని - వ్యతృణత్ - స్వయంభూః - తస్మాత్ - పరాఙ్ - పశ్యతి - న - అన్తరాత్మన్ - కః - చిత్ - ధీరః - ప్రత్యగాత్మానం - ఐక్షత్ - అవృత్తచక్షుః- అమృతత్వం - ఇచ్ఛన్

టీక ॥ స్వయంభూః = బ్రహ్మ, ఖాని = ఇంద్రియములను, పరాఞ్చి = బాహ్యములగు రూపాదులను ప్రకాశింపజేయువానినిగా (బహిర్ముఖములుగా), వ్యతృణత్= సృష్టించెను, తస్మాత్ = ఆ కారణమువలన, పరాఙ్ = ఇతరములగు శబ్దాది విషయములను, పశ్యతి = చూచుచున్నవి, అన్తరాత్మన్ = అన్తరాత్మను, న పశ్యతి = చూచుటలేదు, కశ్చిత్ = ఒకానొక, ధీరః = జ్ఞాని, అమృతత్వం = మరణము లేకపోవుటను, ఇచ్ఛన్ = కోరినవాడై, ఆవృత్తచక్షుః = మరల్పబడిన చక్షురాదీంద్రియ సమూహము గల వాడై (అంతర్దృష్టిగలవాడై), ప్రత్యగాత్మానం = ప్రత్యక్స్వరూప పరమాత్మను, ఐక్షత్ = చూచుచున్నాడు, (ఛన్దసి కాలానియ మాద్భూతకాలః)

తా ॥ బ్రహ్మదేవుడు సర్వేంద్రియములను ఆత్మభిన్నములగు శబ్దాది విషయములవైపు పరుగులిడువానినిగా (బహిర్ముఖములుగా) సృజించినాడు

అయ్యెది వాటి స్వభావము కాన అవి బాహ్యావిషయముల గాంచునే గాని ఆత్మస్వరూపమును చూడలేవు కాని ఒకానొక ధీరుడు మోక్షమును గోరువాడై యింద్రియములను బాహ్యావిషయములనుండి మఱలించి అంతర్ముఖ దృష్టి గలవాడై యాత్మస్వరూపమును జూడ గలుగుచున్నాడు అంతర్దృష్టి మాత్రమే ఆత్మ సాక్షాత్కారమునకు కారణమని భావము

వి ॥ గీత అ 15, శ్లో ॥ 11

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**
**యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥**

జ్ఞానసిద్ధికొఱకు యత్నించుచున్న ధ్యానయోగానుష్ఠానపరులు తమయందున్న ఈయాత్మను సందర్శించుచున్నారు ఆత్మసంస్కారము లేని వారు, అన్తఃకరణశుద్ధి లేనివారు మోక్షాపేక్షయందు ప్రయత్నించువారివలె నుండినను ఈ ఆత్మను దర్శింపజాలరు అన్తర్దృష్టిగలవారు మాత్రమే ఆత్మనుగాంచగలరు బహిర్దృష్టిగలవారు చూడజాలరు అంతర్దృష్టికై బాహ్యావృత్తులగు సంస్కారములు నాశము గావలయును

అవ - తత్త్వవేత్తకు అవివేకికి గలభేదమును వివరించుచున్నాడు

మూ ॥ ***పరాచః కామాననుయన్తి బాలా***
***స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్ ।***
***అథ ధీరా అమృతత్వం విదిత్వా***
***ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే ॥*** **2**

పద ॥ పరాచః - కామన్ - అనుయన్తి - బాలాః - తే - మృత్యోః - యన్తి - వితతస్య- పాశం - అథ - ధీరాః - అమృతత్వం - విదిత్వా - ధ్రువం - అధ్రువేషు - ఇహ - న - ప్రార్థయన్తే

టీక ॥ బాలాః = అల్పప్రజ్ఞులైన జ్ఞానులగు బాలురు, పరాచః = బహిర్గతము లైన, కామాన్ = కోరదగిన విషయములను, అనుయన్తి = అనుగమించుచున్నారు, (బాహ్యావిషయములవైపు పరుగులిడుచున్నారు), తే = వారు, వితతస్య = వ్యాప్తమైన అడ్డులేని యాజ్ఞగల, మృత్యోః = యమునియొక్క, పాశం =

బంధమును, యన్తి = పొందుచున్నారు, అథ = అనన్తరము, ధీరాః = ధీరులైన విషయభోగోపరతిగల జ్ఞానులు, అమృతత్వం = ముక్తతను (ముక్తి సుఖమును), ధ్రువం = శాశ్వతమైనదానినిగా, విదిత్వా = తెలిసికొని, ఇహ= అనర్థప్రాయమగు ఈ సంసారమునందలి, అధ్రువేషు = అనిత్య పదార్థములయందు (కమపి = దేనిని) న ప్రార్థయన్తే = కోరరు

తా ॥ ఓ నచికేతసుడా ! విషయసుఖములం దాసక్తిగల అజ్ఞానులు బాహ్యకామములను గోరి జననమరణాదిరూపమైన యనర్థమును పొందుచున్నారు జ్ఞానులు అట్లు గాక మోక్షమును శాశ్వతమని తెలిసికొని యీసంసారమునందు అనిత్యములై న క్షణిక విషయసుఖములను కోరరు

వి ॥ గీత అ 2, శ్లో ॥ 71

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః ॥
నిర్మమో నిరహంకారస్స శాన్తిమధిగచ్ఛతి ॥

ఏ పురుషుడు సమస్తవాంఛలను వదలి ఏ విషయములును కావలయునని తలంపు లేనివాడును, మమకారము లేనివాడును, గర్వము లేనివాడునునై సంచరించుచున్నాడో వాడు పరమశాంతిని పొందుచున్నాడు ప్రకృతి శమించిన స్థానమగు పరమాత్మను పొందుచున్నాడు

అవ - నచికేతసుడడిగిన ఆత్మతత్త్వమును బోధింప నుపక్రమించుచు తొలుత ఆత్మయొక్క సర్వజ్ఞత్వము వర్ణింపబడుచున్నది

మూ ॥ *యేన రూపం రసం గన్ధం శబ్దాన్ స్పర్శాగ్ంశ్చ మైథునాన్ ।*
*ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే ఏతద్వైతత్ ॥* 3

పద ॥ యేన - రూపం - రసం - గన్ధం - శబ్దాన్ - స్పర్శాన్ - చ - మైథునాన్ - ఏతేన - ఏవ - విజానాతి - కిం - అత్ర - పరిశిష్యతే- ఏతత్ - వై - తత్

టీక ॥ యేన = ఏ, ఏతేనైవ = ఈ ఆత్మచేతనే, (లోకః = జనము) రూపం= ఆకారమును, రసం = రసమును, గన్ధం = గన్ధమును, శబ్దాన్ = శబ్దములను, స్పర్శాంశ్చ= స్పర్శములను, మైథునాన్ = మైథున జన్యసుఖములను, విజానాతి = తెలిసికొనుచున్నది,

అత్ర = ఈ ప్రపంచమునందు, కిం = ఏమి, వరిశిష్యతే = మిగిలియున్నది (ఆత్మచే తెలియబడని దేదియును లేదని తాత్పర్యము), వై = నిశ్చయముగా, తత్ = అది, (నీవడిగిన విషయము, దేవతలు సందేహించినదియు), ఏతత్ = ఇదియే

తా ॥ ఏ నచికేతసుడా ! సంపూర్ణలోకము దేహాదివిలక్షణమైన యే యాత్మసాధనముచే శబ్దస్పర్శరూపరసగంధాదులను తెలిసికొనుచున్నదో, యా ప్రపంచమున దేనికి తెలియని దేదియు లేదో అదియే నీవు అడిగిన యాయాత్మ స్వరూపవము దేవతలు శంకించినదియు నదియే ఆత్మప్రేరణచేతనే యింద్రియము లాయావ్యాపారములందు ప్రవృత్తము లగుచున్నవని తాత్పర్యము

వి ॥ గీత అ 13, శ్లో ॥ 2

ఇదం శరీరం కౌన్తేయ ! క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

ఓ అర్జునా ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది దీనిని, దీనియొక్క ధర్మములన్నిటిని యెవడెఱుంగుచున్నాడో వానినే క్షేత్రజ్ఞుడని వేదాంతతత్త్వవేత్తలు జెప్పుదురు ఇచట 'ప్రజ్ఞానం' బ్రహ్మ అను మహా వాక్యార్థము తెలుపబడినది

అవ - ఆత్మ అతిసూక్ష్మము, దుర్విజ్ఞేయము అగుటచే తిరిగి తిరిగి దానినే వేరువిధముగా వర్ణించుచు ఆత్మజ్ఞాని శోకరహితుడగునని చెప్పుచున్నాడు

మూ ॥ స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి ।
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥

పద ॥ స్వప్నాన్తం - జాగరితాన్తం - చ - ఉభౌ - యేన - అనుపశ్యతి - మహాన్తం - విభుం - ఆత్మానం - మత్వా - ధీరః - న శోచతి

టీక ॥ స్వప్నాన్తం = స్వప్నమందలి ప్రపంచమును, జాగరితాన్తం చ = జాగ్రదవస్థయందలి ప్రపంచమును, ఉభౌ = రెండైన స్వప్న జాగ్రత్ప్రపంచములను (లోకః = లోకము), యేన = ఏ యాత్మ స్వరూపముచేత, అనుపశ్యతి = చూచుచున్నదో, (తం = అటువంటి),

మహాన్తం = గొప్పదగు, విభుం = సర్వవ్యాపకమగు, ఆత్మానం = ఆత్మను, ధీరః = జ్ఞాని, మత్వా = తెలిసికొని, న శోచతి= దుఃఖింపడు

తా ॥ ఓ నచికేతసుడా ! లోకము జాగ్రత్స్వప్న ప్రపంచములను ఏ యాత్మస్వరూపముచే చూచుచున్నదో అట్టి పరిపూర్ణాత్మను జ్ఞాని తెలిసికొని దుఃఖరహితు డగుచున్నాడు

వి ॥ ఇదియు పైచ్చెపిన గీతాశ్లోకము ననుసరించియే యున్నది

అవ - బ్రహ్మవేత్తయొక్క నిర్భయత్వము వర్ణింపబడుచున్నది

మూ ॥ *య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమన్తికాత్ ।*
*ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే । ఏతద్వైతత్ ॥* 5

పద ॥ యః - ఇమం - మధ్వదం - వేద - ఆత్మానం - జీవం - అన్తి కాత్- ఈశానం - భూతభవ్యస్య - న - తతః - విజుగుప్సతే - ఏతత్ - వై - తత్

టీక ॥ యః = ఎవడు, ఇమం = ఈ, మధ్వదం = కర్మఫలమును అనుభవించుచున్న, జీవం = జీవస్వరూపమగు, (ప్రాణాదిసముదాయమును ధరించుచున్న), ఆత్మానం = ఆత్మను, అన్తికాత్= సమీపమునందుండి, భూతభవ్యస్య = కాలత్రయమునకు, ఈశానం= నియామకునిగా, వేద = తెలిసికొనుచున్నాడో, తతః = ఆ తెలిసికొనుటవలన, న విజుగుప్సతే = క్లేశమునుపొందదు, వై = నిశ్చయముగా తత్ = అది, (నీవడిగిన విషయము దేవతలును సందేహించినదియు) ఏతత్ = ఇదియే

తా ॥ ఓ నచికేతసుడా ! ఎవడు ప్రాణాదిసముదాయమును ధరించువాడై కర్మఫలభోక్తయగు జీవుని, సమీపమునందుండి కాలత్రయనియామకునిగా (ఈశ్వరునిగా) తెలిసికొనుచున్నాడో వాడు ఈ తెలిసికొనుటవలన క్లేశమును పొందడు అతనికెట్టి భయమునుండదు ఇదే నీవడిగిన యాత్మస్వరూపము

అవ - బ్రహ్మజ్ఞానియొక్క సార్వాత్మ్యదర్శనము వర్ణింపబడుచున్నది

మూ ॥ *యః పూర్వం తపసో జాతమద్భ్యః పూర్వమజాయత ।*
*గుహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభిర్వ్యపశ్యత । ఏతద్వైతత్ ॥ 6*

పద ॥ యః - పూర్వం - తపసః - జాతం - అద్భ్యః - పూర్వం - అజాయత - గుహాం - ప్రవిశ్య - తిష్ఠన్తం - యః - భూతేభిః - వ్యపశ్యత - ఏతత్ - వై - తత్

టీక ॥ యః = ఏ ముముక్షువు, అద్భ్యః = ఉదకములకంటె (పంచమహాభూతములకంటె), పూర్వం = ముందు, అజాయత = పుట్టెనో, (తం = అటువంటి), పూర్వం = ముందు, తపసః = జ్ఞానాదిలక్షణ బ్రహ్మవలన, జాతం = పుట్టినట్టిన్ని, భూతేభిః = కార్యకారణ లక్షణములైన భూతములతోడ, గుహాం = హృదయగుహను, ప్రవిశ్య = ప్రవేశించి, తిష్ఠన్తం= ఉన్నటువంటి వానిని, యః = ఎవడు, వ్యపశ్యత = వివేచనమెునర్చి చూచుచున్నాడో (వాడే బ్రహ్మను దర్శించినవాడగును), వై = నిశ్చయముగా, ఏతత్= ఇదియే, తత్ = అది (నీవడిగిన బ్రహ్మస్వరూపము)

తా ॥ ఓ నచికేతసుడా ! ఎవడు సృష్టికి పూర్వము సత్యజ్ఞానానందాత్మకమగు బ్రహ్మమువలన పంచభూతములకంటె పూర్వము పుట్టి కార్యకారణ భూతములతో సహ సమస్త ప్రాణుల బుద్ధిగుహయందు ప్రవేశించి యున్నటుల చూచుచున్నాడో వాడే నిశ్చయముగా బ్రహ్మస్వరూపమును ఎఱింగినవాడు సర్వకారణమగు నదియే నీవు అడిగిన ఆత్మస్వరూపము

అవ - ప్రకారాంతరముచే బ్రహ్మజ్ఞాని సార్వాత్మ్యదర్శనము వర్ణింపబడుచున్నది

మూ ॥ *యా ప్రాణేన సంభవత్యదితిర్దేవతామయీ ।*
*గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీం యా భూతేభిర్వ్యజాయత । ఏతద్వైతత్ ॥7*

పద ॥ యా - ప్రాణేన - సంభవతి - అదితిః - దేవతామయీ - గుహాం- ప్రవిశ్య - తిష్ఠన్తీం - యా - భూతేభిః - వ్యజాయత - ఏతత్ - వై- తత్

టీక ॥ యా = ఏ, దేవతామయీ = సత్యదేవతాస్వరూపమగు, అదితిః = అదితి, ప్రాణేన =హిరణ్యగర్భస్వరూపముతో, (పరస్మాత్ = పరబ్రహ్మమువలన), సంభవతి = పుట్టుచున్నదో, యా = ఏది, భూతేభిః = పృథివ్యాది భూతములతోగూడి, వ్యజాయత = పుట్టెనో, (తాం = అట్టి) గుహాం = బుద్ధిగుహను, ప్రవిశ్య = ప్రవేశించి, తిష్ఠన్తీం = ఉంటున్న (ఆ ప్రాణాత్మను

చూడుము), వై = నిశ్చయముగా, ఏతత్ = ఇదియే, తత్ = అది ( నీవడిగిన ఆత్మస్వరూపము)

తా ॥ ఓ నచికేతసుడా ! శబ్దాదివిషయముల ననుభవించుటచే అదితి యనబడు సర్వదేవతాత్మకమైన హిరణ్యగర్భరూపమైన యే ప్రాణాత్మ గలదో, మఱియు నేది భూతము లతో గూడ నుత్పన్నమై సర్వప్రాణుల బుద్ధిగుహయందు ప్రవేశించియున్నదో అదియే నీ వడిగిన యా యాత్మ

అవ - అరణిస్థమగు అగ్నియందు బ్రహ్మదృష్టి వర్ణింపబడుచున్నది

మూ ॥ *అరణ్యోర్నిహితో జాతవేదా*
*గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః ।*
*దివే దివ ఈడ్యో జాగృవద్భి*
*ర్హవిష్మద్భిర్మనుష్యేభిరగ్నిః । ఏతద్వైతత్ ॥* 8

పద ॥ అరణ్యోః - నిహితః - జాతవేదాః - గర్భః - ఇవ - సుభృతః - గర్భిణీభిః - దివేదివే - ఈడ్యః - జాగృవద్భిః - హవిష్మద్భిః - మనుష్యేభిః - అగ్నిః - ఏతత్ - వై - తత్

టీక ॥ జాతవేదాః = అగ్ని, గర్భిణీభిః = గర్భిణి స్త్రీలచేత, సుభృతః = చక్కగా భరించబడిన, గర్భ ఇవ = గర్భమువలె, అరణ్యోః = రెండు అరణులయందు (అగ్నిని చిలుకు కట్టెలయందు), నిహితః = ఉంచబడినది మఱియు ఆ, అగ్నిః = అగ్ని, జాగృవద్భిః = జాగరణశీలురును, హవిష్మద్భిః = ఆజ్యాదిహవిస్సులతో గూడినవారునగు, మనుష్యేభిః = మనుష్యులచేత (యాజకులచేత), దివేదివే = ప్రతిదినమును, ఈడ్యః = స్తుతింపదగినది, వై = నిశ్చయముగా ఏతత్ = ఈ అగ్నియే, తత్ = (నీవడిగిన) ఆ బ్రహ్మస్వరూపము

తా ॥ ఓ నచికేతసుడా ! గర్భిణీ స్త్రీలచే సురక్షితముగా ధరింపబడిన గర్భమువలె అగ్ని ఉత్తరారణి, అధరారణి- వీటియందు నిహితమై వ్యాపకమై యున్నది అయ్యది (అగ్ని) జాగరణశీలురగు ఆజ్యాది హోమ సామగ్రియుక్తులైన మనుష్యులచేత స్తుతింపబడుచున్నది ఈ అగ్నియే నీవడిగిన యా పరమాత్మస్వరూపము

అవ - ప్రాణాత్మయందు బ్రహ్మదృష్టి నిరూపింపబడుచున్నది

మూ ॥ *యతశ్చోదేతి సూర్యో అస్తం యత్ర చ గచ్ఛతి ।*
*తం దేవాస్సర్వేఽర్పితా స్తదు నాత్యేతి కశ్చన । ఏతద్వై తత్ ॥* **9**

పద ॥ యతః - చ - ఉదేతి - సూర్యః - అస్తం - యత్ర - చ - గచ్ఛతి - తం - దేవాః - సర్వే - అర్పితాః - తత్ - ఉ - న - అత్యేతి - కః - చ - న - ఏతత్- వై - తత్

టీక ॥ సూర్యః = సూర్యుడు, యతశ్చ = ఏప్రాణాత్మనుండి, ఉదేతి = ఉదయించుచున్నాడో, యత్రచ = ఏ ప్రాణాత్మయందు, అస్తం = లయమును, గచ్ఛతి = పొందుచున్నాడో, తం = ఆ ప్రాణాత్మను, సర్వే = సమస్తమైన, దేవాః = అగ్న్యాదిదేవతలు, అర్పితాః = ప్రవేశించుచున్నారు, తత్ ఉ = దానిని, కశ్చన = ఎవడును, నాత్యేతి= అతిక్రమింపడు, వై = నిశ్చయముగా, ఏతత్ = ఈ ప్రాణాత్మయే, తత్ = అది ( నీవడిగిన పరబ్రహ్మ స్వరూపము )

తా ॥ ఓ నచికేతసుడా ! ఏ ప్రాణాత్మనుండి సూర్యుడుదయించి లయమగుచున్నాడో, ఆధిదైవికములగు ఏ అగ్న్యాదిదేవతలు, ఆధ్యాత్మికములగు వాగాదులు ఏ ప్రాణాత్మయందు ప్రవేశించియున్నవో, ఏ బ్రహ్మమును ( ప్రాణాత్మను) ఎవరును అతిక్రమింపలేకున్నారో అట్టి ప్రాణాత్మయే నీ వడిగిన యాత్మస్వరూపమని తెలియుము

అవ - నానాత్వమును నిషేధించుచు భేదదృష్టి గలవానికి జనన మరణములే గతి యని వివరించుచున్నాడు

మూ ॥ *యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ ।*
*మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥* **10**

పద ॥ యత్ - ఏవ - ఇహ - తత్ - అముత్ర - యత్ - అముత్ర - తత్- అను - ఇహ - మృత్యోః - సః - మృత్యుం - ఆప్నోతి - యః - ఇహ - నానా - ఇవ- పశ్యతి

టీక ॥ ఇహ = ఈ లోకమందు లేక దేహేంద్రియాది సంఘాతమందు, యత్ = ఏ

పరమార్థతత్త్వము (భాసించుచున్నదో), తదేవ = ఆ పరమార్థతత్త్వమే, అముత్ర = పరలోకమందు (లేక దేహేంద్రియాదులకు పరముగా) (భాసించుచున్నది), అముత్ర = పరలోకమునందు, యత్ = ఏ పరమార్థతత్త్వము గలదో, తదను = ఆ పరమార్థతత్త్వము, ఇహ = ఈ లోకమందు (కార్య కారణోపాధులతో నానారూపాత్మకముగా భాసించుచున్నది), యః= ఎవడు, ఇహ = ఈ పరమార్థతత్త్వమునందు, నానేవ = భిన్నభావముగ, పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, మృత్యోః= మృత్యువునుండి, మృత్యుం = మరణమును, ఆప్నోతి = పొందుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! ఇహలోక పరలోకములయందుండెడి యాత్మ యొకటియే కాని వేరు కాదు అనగా దేహేంద్రియాదులందు, తద్భిన్నముగ నున్నట్టి ఆత్మ ఒక్కటియే కాని వేరు గాదు అట్టి ఈయాత్మయందు ఎవడు భిన్నత్వమును గాంచుచున్నాడో, వాడు మృత్యువునుండి మృత్యువును, అనగా పునః పునః జనన మరణరూప సంసారమును పొందుచున్నాడు

అవ - ఏకత్వవిజ్ఞానసాధనను చెప్పుచున్నాడు

మూ ॥ *మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కించన ।*
*మృత్యోస్స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి ॥* **11**

పద ॥ మనసా - ఏవ - ఇదం - ఆప్తవ్యం - న - ఇహ - నానా - అస్తి - కించన - మృత్యోః - సః - మృత్యుం - గచ్ఛతి - యః - ఇహ - నానా - ఇవ - పశ్యతి

టీక ॥ ఇదం = ఈ యాత్మస్వరూపము, మనసైవ = మనస్సుచేతనే, ఆప్తవ్యం = పొందదగినది, ఇహ = ఈ ఆత్మస్వరూపమునందు, కించన = కొంచమును, నానా = భేదము, నాస్తి = లేదు, యః = ఎవడు, ఇహ = ఈ యాత్మ స్వరూపమునందు, నానేవ = భేదము వలెనే (నానాత్వమునే), పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, మృత్యోః = మృత్యువునుండి, మృత్యుం = మరణమును, గచ్ఛతి = పొందుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! ఈ యాత్మస్వరూపము మనస్సు చేత పొందదగినది దీనియందు అణుమాత్రమైనను భేదము లేదు ఎవడు

అవిద్యాగ్రస్తుడై ఆత్మయందు భేదమును లేక నానాత్వమును చూచుచున్నాడో వాడు మాటిమాటికి మరణమును (జననమరణరూప సంసారమును) పొందుచున్నాడు

అవ - హృదయపుండరీకస్థమగు బ్రహ్మస్వరూపము వర్ణింపబడుచున్నది

మూ ॥ *అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి ।*
*ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే । ఏతద్వై తత్ ॥ 12*

పద ॥ అఙ్గుష్ఠమాత్రః - పురుషః - మధ్యే - ఆత్మని - తిష్ఠతి - ఈశానః- భూతభవ్యస్య - న - తతః - విజుగుప్సతే - ఏతత్ - వై - తత్

టీక ॥ భూతభవ్యస్య = కాలత్రయమునకు, ఈశానః = నియామకుడగు, పురుషః= పురుషుడు, మధ్యేఆత్మని = శరీరమునందు, అఙ్గుష్ఠమాత్రః = అఙ్గుష్ఠపరిమాణముగలవాడై, తిష్ఠతి = ఉంటున్నాడు తతః = ఆ పురుషుడు కాలత్రయేశ్వర స్వరూపుడగుటవలన, న విజుగుప్సతే = (తనను) రక్షించుకొన నిశ్చయింపడు, వై = నిశ్చయముగా ఏతత్ = ఇదియే, తత్ = అది, (నీ వడిగిన బ్రహ్మస్వరూపము )

తా ॥ ఓ నచికేతసుడా ! ఈ దేహమందు హృదయాకాశమున అంగుష్ఠమాత్రుడై యున్న ఆత్మను కాలత్రయనియామకునిగా దెలిసికొని జ్ఞాని స్వసంరక్షణను కోరడు ఇదే నీవడిగిన యాత్మస్వరూపమని గ్రహించుము

అవ - ఆత్మ లేక పరబ్రహ్మ స్వయంప్రకాశమనియు, కాలాబాధ్య మనియు చెప్పుచున్నాడు

మూ ॥ *అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః ।*
*ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః । ఏతద్వైతత్ ॥ 13*

పద ॥ అఙ్గుష్ఠమాత్రః - పురుషః - జ్యోతిః - ఇవ - అధూమకః - ఈశానః- భూతభవ్యస్య - సః - ఏవ - అద్య - సః - ఉ - శ్వః - ఏతత్ - వై - తత్

టీక ॥ అఙ్గుష్ఠమాత్రః = అఙ్గుష్ఠపరిమాణముగల (యః = ఏ) పురుషః = జీవుడు, అధూమకః = పొగ లేని, జ్యోతిరివ = తేజస్సువంటివాడో మఱియు,

భూతభవ్యస్య = కాలత్రయమునకు, ఈశానః = నియామకుడో, స ఏవ = ఆ కూటస్థస్వరూపుడగు జీవుడే, అద్య= ఇప్పుడు, (ఉంటున్నాడు) శ్వః = రేపున్ను, స ఉ = ఆ కూటస్థసంరూపుడగు పురుషుడే (జీవుడే) (వర్తిష్యతే= ఉండగలడు), వై = నిశ్చయముగా, ఏతత్= ఇదియే, తత్= అది, (నీవడిగిస బ్రహ్మతత్త్వము)

తా ॥ ఓ నచికేతసుడా ! యోగులచే హృదయాకాశనుందు ఏ పురుషుడు (జీవుడు) అంగుష్ఠప్రమాణుడై సర్వజగన్నియామకుడుగా ప్రకాశమానమగు (ధూమరహితమైన) తేజస్సువలె జూడబడుచున్నాడో ఆ కూటస్థస్వరూపుడగు జీవుడే యిప్పుడున్నాడు ఇకమీదట గూడ నతడే యుండగలడు ఇదే నీ వడిగిన యాత్మస్వరూపము

వి ॥ గీత ॥అ 18, శ్లో ॥61,62

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేஉర్జున ! తిష్ఠతి ।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా।
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

ఓ అర్జునా ! సమస్తప్రాణులకు నియామకుడు, సర్వాంతర్యామి యగు నీశ్వరుడు (పరమాత్మ) దేహయన్త్రముల నధిష్ఠించియున్న సమస్త ప్రాణులను మాయావి కీలు బొమ్మలనువలె, మాయచేత త్రిప్పుచు సమస్త ప్రాణుల హృదస్థానమం దధివసించియున్నాడు ఓ అర్జునా ! అన్ని విధములచేతను ఆ సర్వేశ్వరునే శరణు పొందుము ఆ సర్వేశ్వరుని యనుగ్రహమువలన సర్వోత్కృష్టమయిన పరమశాంతిని అనగా ప్రకృతిరహితమగు నుపరతిని శాశ్వతమగు మోక్షపదవిని పొందగలవు

అవ - నానాత్వమును జూచువానికి గలుగు దుష్ఫలమును చెప్పుచు భేదదృష్టిని నిషేధించుచున్నాడు

మూ ॥ *యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి ।*
*ఏవం ధర్మాన్ పృథక్ పశ్యంస్తానేవానువిధావతి ॥* **14**

పద ॥ యథా - ఉదకం - దుర్గే - వృష్టం - పర్వతేషు - విధావతి - ఏవం - ధర్మాన్- పృథక్ - పశ్యన్ - తాన్ - ఏవ - అనువిధావతి

టీక ॥ దుర్గే = పర్వతోన్నత ప్రదేశమందు, వృష్టం = వర్షింపబడిన, ఉదకం= జలము, యథా = ఏ ప్రకారము, పర్వతేషు = పర్వతములయందు, తత్పరిసరనిమ్న ప్రదేశములందు, విధావతి = పరుగులిడి ప్రవహించుచున్నదో, ఏవం = ఈ ప్రకారముగ (జీవుడు), ధర్మాన్= ఆత్మలను (ప్రతిశరీరమునందు), పృథక్= వేరుగ, పశ్యన్ = చూచుచున్నవాడై, తానేవ = ఆ వేరైనశరీరధర్మములనే అనువిధావతి= అనుసరించిపోవుచున్నాడు (పొందుచున్నాడు)

తా ॥ ఓ నచికేతసుడా ! పర్వతాగ్రమునందు పడిన యుదకము ప్రవహించి భిన్నమై యెట్లు నశించునో, అట్లే జీవుడు ఆత్మభిన్నములుగాని ధర్మములను (జీవాత్మలను) శరీరభేదము ననుసరించి ప్రతిశరీరమందును వేరు వేరుగ నున్నటుల దలంచినవాడై శరీరభేదములనే బొందును అనగా భిన్నాత్మబుద్ధి గల వాడై సంసారమను గోతిలో పడి శరీరముల తోడనే పుట్టుచు గిట్టుచునుండునని తాత్పర్యము

వి ॥ గీత అ 16, శ్లో ॥ 20

**అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌన్తేయ ! తతో యాన్త్యధమాం గతిమ్ ॥**

ఎ అర్జునా ! అసురయోనియందు జన్మించిన మూఢులు నన్ను పొందకయే ప్రతిజన్మయందును అంతకంటే నీచజన్మమును పొందుచున్నారు

అవ - భేదదృష్టి తొలగిన మననశీలుడగు బ్రహ్మవేత్తయొక్క విశుద్ధవిజ్ఞానై కరసమగు ఆత్మస్వరూపము వర్ణింపబడుచున్నది

మూ ॥ *యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి ।*
*ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ ! ॥* **15**

పద ॥ యథా - ఉదకం - శుద్ధే - శుద్ధం - ఆసిక్తం - తాదృక్ - ఏవ - భవతి - ఏవం- మునేః - విజానతః - ఆత్మా - భవతి - గౌతమ !

టీక ॥ హే గౌతమ ! = ఓగౌతముడా ! యథా = ఏప్రకారము, శుద్ధం = నిర్మలమైన,

ఉదకం = జలము, శుద్ధే = నిర్మలోదకమందు, ఆసిక్తం= పోయబడినదై, తాదృగేవ = ఆ నిర్మలోదకముగానే, భవతి = అగుచున్నదో, ఏవం = ఈ ప్రకారముగ, విజానతః = ఆత్మను దెలిసికొన్న, మునేః = మననశీలుడగు మునియొక్క, ఆత్మా = ఆత్మ, (శుద్ధమైనదిగ) భవతి = అగుచున్నది

తా ॥ ఓ నచికేతసుడా ! నిర్మలోదకమం దుంచబడిన నిర్మలజలము ఏప్రకారము ఏకరసమై నిర్మలముగానే యగుచున్నదో ఆ ప్రకారముగానే బ్రహ్మాత్మైక్యజ్ఞానమును బడసిన మననశీలుడగు జ్ఞానియొక్క యాత్మయు పరిశుద్ధమై అభిన్నమై భాసించును కనుక భేదదృష్టిని పరిత్యజించి అందఱును సదా ఆత్మైకత్వ దర్శనమునే గాంచవలయును

కఠోపనిషత్తు ద్వితీయాధ్యాయమునందు
ప్రథమవల్లి సమాప్తము
ఓం తత్ సత్



ఓమ్

# కఠోపనిషత్తు

## ద్వితీయాధ్యాయము - ద్వితీయవల్లి

అవః - బ్రహ్మతత్త్వము దుర్జ్ఞేయమగుటచే ప్రకారాంతముచే తిరిగి దానినే నిరూపించుచున్నాడు

మూ ॥ పురమేకాదశద్వార మజస్యావక్రచేతసః ।
అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే । ఏతద్వై తత్ ॥ 1

పద ॥ పురం - ఏకాదశద్వారం - అజస్య - అవక్రచేతసః - అనుష్ఠాయ - న - శోచతి - విముక్తః - [redacted] విముచ్యతే - ఏతత్ - వై - తత్

టీక ॥ అవక్రచేతసః = కుటి[redacted]ములేని (నిత్య విజ్ఞాన స్వరూపుడైన), (యస్య= ఏ), అజస్య = జన్మ[redacted]రహితుడగు పరమేశ్వరునకు, ఏకాదశద్వారం= పదునొకండు ద[redacted]లు గలశరీరము (చక్షుశ్శ్రోత్రనాసావదన కుహరములును[redacted]యు నాపష్ట బ్రహ్మరంధ్రములు ననునివి పదునొకండు) [redacted]ణమో, (తం = ఆపరమేశ్వరుని), అనుష్ఠాయ= ధ్యానముచేసి, [redacted]ఖించడు విముక్తః = రాగద్వేషాదులచేత లేక అవిద్యాకామ[redacted]నుండ విముక్తుడై (జీవన్ముక్తుడై), విముచ్యతే= సంసార బ[redacted]డునబడుచున్నాడు (విదేహముక్తుడై తిరిగి శరీరమును[redacted] నిశ్చయముగా, ఏతత్ = ఇదియే, తత్ = అది (నీవడిగిన[redacted].

తా ॥ ఓ [redacted]నాది వికారములులేని పర బ్రహ్మమునకు పదునొకండు ద[redacted]కొనియున్న యీ దేహమే పట్టణముగా నున్నది (ఈ [redacted]చున్నవాడు కాబట్టే యితనికి పురుషుడని పేరు) ఈ ఎ[redacted]యైన పరబ్రహ్మమును రాగాదివిముక్తుడై ఏషణారహితు[redacted]వించియుండగనే ముక్తుడై (జీవన్ముక్తుడై)

జననమరణరూపమైన సంసారబంధము నుండి విముక్తు డగుచున్నాడు విదేహముక్తు డగుచున్నాడని భావము నీవడిగిన ఆ యాత్మ తత్త్వము ఇదియే

వి ॥ గీత అ 5, శ్లో ॥ 13

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥

ఇంద్రియముల వశపరచుకొన్నవాడగు దేహి మనస్సుచేత సమస్తకర్మలను పరిత్యజించి తానేమియు చేయనివాడును, జేయింపని వాడునునై తొమ్మిది వాకిళ్లు గల పట్టణమైన శరీరమందు సుఖముగా నుంటున్నాడు ఇచట పదునొకండు ద్వారములు తెలుపడమైనవి గీతయందు తొమ్మిది ద్వారములను తెలిపియున్నారు ఈ నవద్వారములు సామాన్యముగా మనుష్యాది సకల ప్రాణులకును గలవు, ఇది ప్రాకృతజీవుల లక్షణము అప్రాకృతజీవితము గలుగునప్పుడు కుండలినీ ప్రబోధము, బ్రహ్మరంధ్రము అను రెండు ద్వారములు తెరువబడును అవి జీవన్ముక్తి గలిగి ఈశ్వరత్వము సిద్ధించినప్పుడే గలుగును అంతవఱకు మానవుని హృదయమందు గల దేవుడు తలుపు మూసియుండు దేవాలయమునందువలె మూయబడి యుండును తలుపు తెరువబడిన తరువాత దేవుడు కనుపించునట్లు పైరెండు ద్వారములు తెరువబడిన తరువాత ఆత్మదర్శనము గలుగును దీనికే హృదయగ్రంధి భేదనమనియు, హృదయకమల వికాసమనియు పేర్లు

అవ - ఆత్మ ఏకశరీరవర్తి గాదు, సర్వశరీరములందు ఉండునదని ఆత్మయొక్క సర్వాత్మత్వము వర్ణింపబడుచున్నది

మూ ॥ హగ్ంసశ్శుచిషద్వసురన్తరిక్షస
ద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ ।
నృషద్వరసదృతసద్వ్యోమస
దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ ॥ 2

పద ॥ హంసః - శుచిషత్ - వసుః - అన్తరిక్షసత్ - హోతా - వేదిషత్ - అతిథిః - దురోణసత్ - నృషత్ - వరసత్ - ఋతసత్ - వ్యోమసత్- అబ్జాః - గోజాః- ఋతజాః - అద్రిజాః - ఋతం - బృహత్

టీక ॥ (ఈయాత్మ) హంసః = గమనమొనర్చునది, (ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు పోవునది, లేక అవిద్యను హనన మొనర్చునది) శుచిషత్ = ఆకాశమున (సూర్యరూపముతో) సంచరించునది, వసుః = వసువు, అనగా సర్వవ్యాపకమైనది, అంతరిక్షసత్ = ఆకాశమున (వాయురూపముతో) సంచరించునది, వేదిషత్ = పృథివియందున్న, హోతా = అగ్నిస్వరూపము, దురోణసత్ = కలశమునందున్న, అతిథిః = సోమము, లేక దురోణసత్ = గృహములందున్న, అతిథిః = అతిథిరూపము, నృషత్ = మనుష్యులయందుం డునది, వరసత్ = శ్రేష్ఠములైన దేవతాది శరీరములందుండునది, ఋతసత్ = సత్యమునందు లేక యజ్ఞమునందు ఉండునది, వ్యోమసత్ = ఆకాశమునందుండు నదియునై యున్నది, (మఱియు) అబ్జాః = (శంఖశుక్తిమకరాది రూపములతో) జలమందుద్భవించునవి, గోజాః = వ్రీహియవాది రూపముతో పృథివియం దుత్పన్నములైనవి, ఋతజాః = యజ్ఞాంగరూపముతో జనించునవి, (లేక యజ్ఞమువలన బుట్టునవి) అద్రిజాః = పర్వతములనుండి నదీరూపముతో ఉత్పన్నములగునవి (ఇవి యన్నియు ఆ ఆత్మరూపములే) మఱియు ఆ ఆత్మ, ఋతం = సత్య స్వరూపమైనది, బృహత్ = సర్వకారణమగుటచే మహత్తర మైనదియునై యున్నది

తా ॥ ఓ నచికేతసుడా ! నీ యీ శరీరరూప పురమందుండు ఆత్మయే బ్రహ్మస్వరూపము గాదు, మఱేమనిన ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు పోవుచు సర్వశరీరవర్తియైనదియు, ఆకాశమున సూర్యరూపముతో సంచరించు చున్నదియు, సర్వవ్యాపకమై ఆకాశమున వాయురూపముతో నున్నదియు, పృథివియందు అగ్నిరూపముతో నున్నదియు, కలశమునందున్న సోమరసమును, గృహములందున్న అతిథియు ఆ ఆత్మయే మఱియు మనుష్యులలో, దేవతలలో, యజ్ఞములలో, ఆకాసములో నుండునది ఆ యాత్మయే, ఇంకను జలమునందు శంఖశుక్తిమకరాదిరూపముతో నుండునది, భూమియందు వ్రీహియవాది రూపముతో నుండునది, యజ్ఞాంగరూపముతో నుండునది, పర్వతములనుండి ఉద్భవించు నదీరూపమున నుండునది, సత్యస్వరూపమై సర్వ కారణ మగుటచే బృహత్తైనదియు ఆ యాత్మ

స్వరూపమేయని తెలియుము అనగా జగత్తులందు సర్వప్రాణులలో, సర్వ వస్తువులలో సర్వాంతర్యామియై సర్వవ్యాపకమై యున్న ఆత్మ ఒక్కటే గాని వేఱు గాదని తాత్పర్యము

వి ॥ గీత అ 7, శ్లో ॥ 19

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

వివేకి యగువాడు అనేకజన్మములయందు అనుష్ఠానపరుడై కడపట జ్ఞానవంతుడై సమస్త ప్రపంచము వాసుదేవస్వరూపమని తెలిసి నన్ను పొందుచున్నాడు అట్టి ఏకాత్మజ్ఞానము గల మహానుభావుడు దుర్లభుడు

అవ - ప్రాణాపానాది క్రియలకు అత్మయే అధిష్ఠానమని చెప్పబడుచున్నది

మూ ॥ ***ఊర్ధ్వం ప్రాణమున్నయత్యపానం ప్రత్యగస్యతి ।***
***మధ్యే వామనమాసీనం విశ్వే దేవా ఉపాసతే ॥*** **3**

పద ॥ ఊర్ధ్వం - ప్రాణం - ఉన్నయతి - అపానం - ప్రత్యక్ - అస్యతి - మధ్యే - వామనం - ఆసీనం - విశ్వే - దేవాః - ఉపాసతే

టీక ॥ యః - ఎవడు (ఏ యాత్మ), ప్రాణం = ప్రాణవాయువును, ఊర్ధ్వం= ఉపరిభాగమునను, ఉన్నయతి = పొందించుచున్నదో, అపానం = అపానవాయువును, ప్రత్యక్= క్రిందికి, అస్యతి = విసరివేయుచున్నదో, మధ్యే= హృదయమధ్యమునందు, ఆసీనం = ఉన్నటు వంటి, వామనం = పొందదగిన (తం = ఆ యాత్మస్వరూపమును), విశ్వే = సమస్తమైన, దేవాః = ఇంద్రియములు, ఉపాసతే = ఉపాసించుచున్నవి, (సేవించుచున్నవి)

తా ॥ ఓ నచికేతసుడా ! ఏపరమాత్మ హృత్పద్మమునుండి ప్రాణాపానాది వాయువులను ఉర్ధ్వాధోగమనములను బొందించుచున్నదో అటువంటి పరమాత్మను శ్రోత్ర త్వక్చక్షు రాదీంద్రియములు, శబ్దస్పర్శరూపాది విషయములను కానుకగా దెచ్చి సమర్పించుచు సేవించుచున్నవి

అవ - దేహస్థమగు ఆత్మయే దేహేంద్రియాదుల కాధారమని చెప్పుచున్నాడు

మూ ॥ అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః ।
దేహాద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే । ఏతద్వైతత్ ॥ 4

పద ॥ అస్య - విస్రంసమానస్య - శరీరస్థస్య - దేహినః - దేహాత్ - విముచ్య మానస్య- కిం - అత్ర - పరిశిష్యతే - ఏతత్ - వై - తత్

టీక ॥ శరీరస్థస్య = శరీరమునందున్న, విస్రంసమానస్య = దేహమునుండి పరిభ్రష్టమగుచున్న, దేహాత్ = దేహమునుండి, విముచ్యమానస్య = విడువబడుచున్న, దేహినః = దేహియగు, అస్య = ఈ యాత్మకు, అత్ర = ఈ దేహమందు, కిం = ఏమి, పరిశిష్యతే = మిగిలియున్నది, వై = నిశ్చయముగా, ఏతత్ = ఇదియే, తత్ = అది, ( నీవడిగిన ఆత్మతత్త్వము)

తా ॥ ఓ నచికేతసుడా ! ఈ యాత్మ ఈ దేహమును విడిచిపోగా పూర్వోక్తప్రాణాదులు, ఇంద్రియసముదాయము వీటిలో ఏది నిలిచియుంటున్నది ? ఏదియు శేషించుట లేదు పురస్వామి నగరమును విడిచిపోగా ఆనగరమునకు, తన్నగరవాసులకును ఎట్టి దుర్దశ సంభవించునో అటులనే పురస్వామియగు ఆత్మ యా శరీరమునుండి తొలగిపోవుటతోడనే శరీరస్థములగు ప్రాణేంద్రియాదుల గతియు నంతియే యని తెలియ వలయును ఆత్మ వియోగము గలిగిన మరుక్షణమే యింద్రియాదులన్నియు నిర్వీర్యములై వినష్టములగుచున్నవి కాన ఈ ప్రాణేంద్రియాదులకు విలక్షణమై చైతన్యవంతమైయుండునదియే ఆత్మ ఇదియే నీవడిగిన యాత్మస్వరూపము

అవ - ప్రాణాపానాదులవల్ల గాక ఆత్మశక్తిచేతనే మానవుడు జీవించుచున్నాడని తెలుపుచున్నాడు

మూ ॥ న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ।
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ ॥ 5

పద ॥ న - ప్రాణేన - న - అపానేన - మర్త్యః - జీవతి - కః - చ - న - ఇతరేణ - తు - జీవన్తి - యస్మిన్ - ఏతౌ - ఉపాశ్రితౌ

టీక ॥ కశ్చన మర్త్యః = ఏ మనుష్యుడును, ప్రాణేన = ప్రాణవాయువు చేత, న జీవతి= జీవింపడు, అపానేన = అపానవాయువుచేత, న జీవతి = జీవింపడు, యస్మిన్=

ఏ యాత్మయందు ఏతౌ = ఈ ప్రాణాపానవులు, ఉపాశ్రితౌ = ఆశ్రయించియున్నవో, ఇతరేణ తు= ప్రాణాపానవ్యతిరిక్తమైన అట్టియాత్మ చేతనే (మనుష్యులు), జీవన్తి= జీవించుచున్నారు

తా ॥ ఓ నచికేతసుడా ! ఆత్మ దేహమందున్నంతవఱకు ప్రాణాపానవులు దేహము నాశ్రయించి యున్నవి ఆత్మ దేహమును విడచుటతోడనే ప్రాణాపానములును తొలగిపోవుచున్నవి కాన ప్రాణాపానములచే మనుజు డెవడును జీవింపడు ప్రాణేంద్రియ సంఘాతమునకు భిన్నమై తదాధార భూత మైన ఆత్మచేతనే మనుజుడు జీవించుచున్నాడని తెలియుము

వి ॥ ప్రాణాపానముల నిరోధముచేత ధన్యుడ నయితి నని తలంచరాదు ప్రాణాపానములను ముఖ్యప్రాణమయిన యే ఆత్మ నడుపుచున్నదో, ఆ ఆత్మను దెలిసికొనినప్పుడే మానవుడు కృతార్థుడగునని ప్రాణాయామపరాయణులు తెలిసికోవలయును

అవ - యముడు ఆత్మతత్త్వమును, మరణానంతరము ఆత్మస్థితిని తెలిపెద ననుచున్నాడు

మూ ॥ *హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్ ।*
*యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ ॥* **6**

పద ॥ హన్త - తే - ఇదం - ప్రవక్ష్యామి - గుహ్యం - బ్రహ్మ - సనాతనం - యథా - చ - మరణం - ప్రాప్య - ఆత్మా - భవతి - గౌతమ

టీక ॥ హే గౌతమ ! = ఓ నచికేతసుడా ! హన్త = ఇప్పుడు, గుహ్యం = రహస్యమైన, సనాతనం = ప్రాచీనమగు, ఇదం = ఈ, బ్రహ్మ = బ్రహ్మస్వరూప మును, తే= నీకు, ప్రవక్ష్యామి = చెప్పెదను (కిం) చ = మఱియు, ఆత్మా = ఆత్మ (బ్రహ్మతత్త్వము నెరుగనియెడల), మరణం = మరణమును, ప్రాప్య = పొంది, యథా భవతి = ఏమగుచున్నదో, (ఎటులుండునోదానినిగూర్చి, ప్రవక్ష్యామి = చెప్పెద వినుము)

తా ॥ ఓ నచికేతసుడా ! నీకిక సనాతనమైన రహస్యభూతమగు బ్రహ్మస్వరూపమును జెప్పెదను మఱియు నేబ్రహ్మతత్త్వము నెరుగనిచో

మరణము బొందిన తరువాత ఆత్మ ఏమగుచున్నదో ఆవిధమును గూడ జెప్పెదను వినుము

అవ - మరణానంతరము ఆత్మయొక్క స్థితిని లేక గతిని విశదీకరించుచున్నాడు

మూ ॥ *యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః ।*
*స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్ ॥* 7

పద ॥ యోనిం - అన్యే - ప్రపద్యన్తే - శరీరత్వాయ - దేహినః - స్థాణుం - అన్యే - అనుసంయన్తి - యథా కర్మ - యథా శ్రుతమ్

టీక ॥ అన్యే = ఇతరులగు (కొంతమంది), దేహినః = జీవులు, యథాకర్మ = కర్మనతిక్రమింపకుండా, కర్మననుసరించి, యథాశ్రుతం = జ్ఞానము నతిక్రమింపకుండా, (ఉపార్జిత విజ్ఞానానుసారము) శరీరత్వాయ = మనుష్యాదిదేహములను పొందుటకొఱకు, యోనిం= అండజజరాయుజాదియోనులను, ప్రపద్యన్తే = పొందుచున్నారు, అన్యే = (అధములగు) మఱికొందఱు, స్థాణుం = స్థావరత్వమును, అనుసంయన్తి = పొందుచున్నారు

తా ॥ ఓ నచికేతసుడా ! అజ్ఞానులగు కొందఱు జీవులు వారివారి ఉపార్జిత జ్ఞానకర్మల ననుసరించి శరీరమును ధరించుటకొఱకు అండజ జరాయుజాది యోనులను పొందుచున్నారు మఱికొందఱు అధమసంస్కారులు స్థావరత్వమును జడములగు వృక్షాదిస్థావరయోనులను వరుసగ పొందుచున్నారు

అవ - పూర్వప్రతిజ్ఞాతమగు గుహ్యబ్రహ్మోపదేశము గావింపబడుచున్నది

మూ ॥ *యఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః ।*
*తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే ।*
*తస్మింల్లోకాశ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన ! ఏతద్వైతత్ ॥ 8*

పద ॥ యః - ఏషః - సుప్తేషు - జాగర్తి - కామం - కామం - పురుషః - నిర్మిమాణః - తత్ - ఏవ - శుక్రం - తత్ - బ్రహ్మ - తత్ - ఏవ - అమృతం - ఉచ్యతే - తస్మిన్ - లోకాః - శ్రితాః - సర్వే - తత్ - ఉ - న - అత్యేతి - కః - చ - న - ఏతత్ - వై - తత్

టీక ॥ యః = ఏ, ఏషః = ఈ, పురుషః = పురుషుడు, సుప్తేషు = సర్వజీవులు (ప్రాణాదికము) నిద్రించుచుండగా, కామంకామం = ప్రతికోరికను (ఈప్సితార్థమును), నిర్మిమాణః = సృష్టించుచు, జాగర్తి = మేల్కొనుచున్నాడో, తదేవ = అదే (అతడే), శుక్రం = పరిశుద్ధమైనది, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, తదేవ = అదే, అమృతం = నాశరహితమైనదిగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తస్మిన్ = ఆ పరమాత్మయందు, సర్వే = సమస్తములైన, లోకాః = పృధివ్యాది లోకములు, శ్రితాః = ఆ శ్రయించుచున్నవి, కశ్చన = ఎవడును, ఉ = నిశ్చయముగా, తత్ = దానిని, నాత్యేతి = అతిక్రమింపజాలడు, వై = నిశ్చయముగా, ఏతత్ = ఇదియే, తత్ = అది (నీవడిగిన ఆత్మ)

తా ॥ ఓ నచికేతసుడా ! సర్వజీవులు, సమస్తప్రాణాదికము నిద్రించుచుండగా ఏ పురుషుడు స్వాభీష్టపదార్థములను అవిద్యద్వారా నిర్మించుచు మేల్కొని యుంటున్నాడో, వాడే పరిశుద్ధమై అమృత స్వరూపమగు పరబ్రహ్మ దానియందే సర్వ ప్రపంచము అధిష్ఠితమైయున్నది, దానినెవడును అతిక్రమింపజాలడు ఇదే నీవడిగిన యాత్మస్వరూపము

అవ - దృష్టాంతపూర్వకముగా ఆత్మయొక్క సర్వవ్యాపకత్వము, ఉపాధికృత ప్రతిరూపత్వము వర్ణింపబడుచున్నది

మూ ॥ ***అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో***
***రూపం రూపం ప్రతిరూపో బభూవ ।***
***ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా***
***రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥*** ***9***

పద ॥ అగ్నిః - యథా - ఏకః - భువనం - ప్రవిష్టః - రూపం - రూపం - ప్రతిరూపః - బభూవ - ఏకః - తథా - సర్వభూతాన్తరాత్మా - రూపం - రూపం - ప్రతిరూపః - బహిః - చ

టీక ॥ యథా = ఏప్రకారము, ఏకః = ఒకటియైన, అగ్నిః = అగ్ని, భువనం = లోకమును, ప్రవిష్టః = ప్రవేశించినదై, రూపం రూపం = ప్రతి యాకారమును గురించి, ప్రతిరూపః = సమానాకృతి గలది, బభూవ = ఆయెనో, తథా =

ఆప్రకారము, ఏకః = ఒకటియైన, సర్వభూతాన్తరాత్మా = సర్వభూతముల యందుండు అన్తరాత్మ, రూపం రూపం = ప్రతి యాకృతిని గురించి, ప్రతిరూపః = సమానాకృతి గలదిగా, బభూవ = ఆయెను, బహిః = వెలుపలను, ( అదియే ప్రకాశించుచున్నది )

తా ॥ ఓ నచికేతసుడా ! ఒకేయగ్ని ప్రకాశస్వరూపమైనదయ్యు, (ఆకాశమువలె నిర్వికారమై సర్వవ్యాపకమై యుండియు) ఏ ప్రకారము లోకమునందు ప్రవేశించి ఆయా కాష్ఠాదిదహ్యమానపదార్థములకు అనుగుణముగా అనేకరూపములు గలది యాయెనో అప్రకారము ఒకే ఆత్మ ఆయా భూతములయందు ( శరీరములందు) ప్రవేశించి తత్తదనుగుణమైన రూపము గలది యగుచున్నది మఱియు వాటికంటె బయటను తన నిర్వికారవ్యాపక రూపముతో వెలుగుచున్నది

అవ - మఱియొక దృష్టాంతము చూపబడుచున్నది

మూ ॥ *వాయుర్యథైకో భువనం ప్రవిష్టో*
*రూపం రూపం ప్రతిరూపో బభూవ ।*
*ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా*
*రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥* **10**

పద ॥ వాయుః - యథా - ఏకః - భువనం - ప్రవిష్టః - రూపం - రూపం- ప్రతిరూపః - బభూవ - ఏకః - తథా - సర్వభూతాన్తరాత్మా - రూపం-రూపం - ప్రతిరూపః - బహిః -చ

టీక ॥ యథా = ఏప్రకారము, ఏకః = ఒకటియైన, వాయుః = వాయువు, భువనం = లోకమును, ప్రవిష్టః = ప్రవేశించినదై, రూపంరూపం= ప్రతియాకృతిని గురించి, ప్రతిరూపః = సమానరూపము గలది, బభూవ = ఆయెనో, తథా= ఆ ప్రకారము, ఏకః = ఒకటియైన, సర్వభూతాన్తరాత్మా = సర్వభూతముల యందుండు అంతరాత్మ, రూపం రూపం = ప్రతియాకారమును గురించి, ప్రతిరూపః = సమానరూపము గలదిగా, బభూవ = ఆయెను, బహిశ్చ = వెలుపలను, ( తన నిర్వికార వ్యాపకరూపముతో నున్నది)

తా ॥ ఓ నచికేతసుడా ! ఒకే వాయువు లోకమందు ప్రవేశించి ఏప్రకారము ఆయా రూపములకు సమానరూపము గలది యాయెనో ఆ ప్రకారము ఒకే ఆత్మ సర్వభూతముల యందుండి ఆయాభూతములకు సమానమైన ఆకృతి గలది యగుచున్నది మఱియు వాటికి బయటను తన నిర్వికార వ్యాపక రూపముతో భాసించుచున్నది

వి ॥ గీత అ, 6, శ్లో ॥ 29

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

యోగముతో గూడిన మనస్సుగలవాడు సమస్తజంతువుల యందును సమభావముగలవాడై తన్ను సమస్తభూతములయందున్న వానిని గాను, సమస్తభూతములను తన యందున్న వానినిగాను చూచుచున్నాడు

అవ - ఆత్మ సర్వవ్యాపకమైనను సూర్యునివలె అసంగము, నిర్లిప్తము అని నిరూపించుచున్నాడు

మూ ॥ సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః ।
ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥ 11

పద ॥ సూర్యః - యథా - సర్వలోకస్య - చక్షుః - న - లిప్యతే - చాక్షుషైః- బాహ్యదోషైః - ఏకః - తథా - సర్వభూతాన్తరాత్మా - న - లిప్యతే- లోకదుఃఖేన - బాహ్యః

టీక ॥ యథా = ఏప్రకారము, సూర్యః = సూర్యుడు, సర్వలోకస్య = సమస్తలోకమునకు, చక్షుః = నేత్రమై, చాక్షుషైః = నేత్రసంబంధములైన, బాహ్యదోషైః = అపవిత్ర పదార్థ సంసర్గమువలన గలుగు బాహ్యదోషములచేత, న లిప్యతే = లిప్తుడు కాడో, తథా = ఆప్రకారము, ఏకః = ఒకటియైన యాత్మ, సర్వభూతాన్తరాత్మా = సర్వ భూతములయందుండు అంతరాత్మస్వరూపమై,

లోకదుఃఖేన = లోక సంబంధమగు దుఃఖముచేత, న లిప్యతే = అంటబడునది కాదు (సః = ఆ యాత్మ), బాహ్యః = విపరీతాధ్యాసవలన కలుగు సుఖ దుఃఖములకంటె బాహ్యమైనది

తా ॥ ఓ నచికేతసుడా ! సూర్యుడే ప్రకారము సమస్త లోకమునకు చక్షుః స్వరూపుడై, (నేత్రమునకు సహాయము చేయువాడై) ఆ నేత్ర సంబంధములగు అపరిశుద్ధవస్తు సంసర్గమువలన కలిగిన బాహ్యదోషములచే నంటబడడో, ఆప్రకారము సర్వభూతాన్తరాత్మయై సర్వజీవుల కృత్యములను ప్రకాశింపజేయు అద్వితీయుడగు పరమాత్మ శరీరసంబంధము లైన జరామరణాది బాహ్యదుఃఖములచే లిప్తము కాదు ఆత్మ నిర్వికారము, నిర్లిప్తము ఆత్మ విపరీతాధ్యాసవలన గలుగు లౌకిక సుఖదుఃఖములకంటె బాహ్యమైనది సర్వాంతర్యామియై అన్ని ప్రాణులలో నున్నను అవి చేయు కర్మలకు గాని, కర్మ ఫలములకు గాని కర్త, భర్త గాదు అయ్యది సాక్షిమాత్రము

వి ॥ గీత అ 13, శ్లో ॥ 34

**యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ! ॥**

ఓ అర్జునా ! ఎటుల నొకే సూర్యుడు సమస్తప్రపంచమును ప్రకాశింప జేయుచున్నాడో, అటుల క్షేత్రజ్ఞమగు పరమాత్మ సమస్తశరీరముల బ్రకాశింపజేయుచు శరీరధర్మముల వేటిని నంటక యుంటున్నది

అవ - ఆత్మదర్శికే నిత్యసుఖము, శాశ్వతశాంతి గలుగునని చెప్పుచున్నాడు

మూ ॥ *ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా*
*ఏకం రూపం బహుధా యః కరోతి ।*
*తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః*
*తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥* **12**

పద ॥ ఏకః - వశీ - సర్వభూతాన్తరాత్మా - ఏకం - రూపం - బహుధా - యః - కరోతి - తం - ఆత్మస్థం - యే - అనుపశ్యన్తి - ధీరాః - తేషాం - సుఖం - శాశ్వతం - న - ఇతరేషామ్ ॥

టీక ॥ ఏకః = సమానాధికుడులేని ఏకస్వరూపముగు, వశీ = సర్వమును స్వాధీనపరచుకొనియుండు, సర్వభూతాంతరాత్మా = సమస్తభూతములకు నంతరాత్మస్వరూపమైన, యః = ఏపరమాత్మ, ఏకం = ఒకటియగు, రూపం= శుద్ధవిజ్ఞాన ఘనరూపమును, బహుధా = అనేకప్రకారములుగ, కరోతి = చేయుచున్నాడో, తం = అటువంటి, ఆత్మస్థం = స్వశరీర హృదయాకాశము నందున్న ఆత్మను, యే ధీరాః = ఏజ్ఞానులు, అనుపశ్యన్తి= శాస్త్రా చార్యోపదేశానంతరము ప్రత్యక్షముగ జూచుచున్నారో, అనుభవించుచున్నారో, తేషాం = అట్టి పరమాత్మస్వరూప సాక్షాత్కారమును పొందిన వివేకవంతులకు, శాశ్వతం = నిత్యమైన, సుఖం = ఆత్మానంద సుఖము, (భవతి = కలుగుచున్నది), ఇతరేషాం= ఇతరులకు, న = లేదు, (కలుగదు)

తా ॥ ఓ నచికేతసుడా ! సర్వాంతర్యామియగు ఏయాత్మ సమానాధికములు లేనిదై, స్థావర జంగమాత్మక సర్వ జగత్తును తనయందుంచుకొన్నదై ఏకమైన తన శుద్ధవిజ్ఞానఘనస్వరూపమును నామరూపభేదములచేత అనేకవిధముల జేయుచున్నదో, అట్టి స్వబుద్ధిగుహ యందు చైతన్యస్వరూపముతో నభివ్యక్తమైన యా పరమాత్మను బాహ్యదృష్టితొలగి అంతర్ముఖులగు నే జ్ఞానులు శాస్త్రాచార్యోపదేశానంతరము సాక్షాత్కరించుకొనుచున్నారో వారికి నిత్యముగు బ్రహ్మానంద సుఖము గలుగుచున్నది అవిద్యావ్యవధానముండుటచే అజ్ఞానులకు నిట్టి సుఖము గలుగదు

అవ - ప్రకారాంతముచే ఆత్మజ్ఞానఫలము వర్ణింపబడుచున్నది

మూ ॥ *నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా*
*మేకో బహూనాం యో విదధాతి కామాన్ ।*
*తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః*
*తేషాం శాన్తిశ్శాశ్వతీ నేతరేషామ్ ॥* **13**

పద ॥ నిత్యః - అనిత్యానాం - చేతనః - చేతనానాం - ఏకః - బహూనాం- యః - విదధాతి - కామాన్ - తం - ఆత్మస్థం - యే - అనుపశ్యన్తి - ధీరాః - తేషాం- శాన్తిః - శాశ్వతీ - న - ఇతరేషామ్

టీక ॥ యః = ఏసర్వజ్ఞుడగు పరమాత్మ, అనిత్యానాం = నశించువానిలో, నిత్యః = నశింపనివాడో, చేతనానాం = చేతనులగు బ్రహ్మాది సర్వజీవులలో, చేతనః = చేతనుడో (చైతన్యమును గలుగ జేయువాడో), మఱియు, ఏకః = ఒక్కడై, బహూనాం = అనేకులకు, కామాన్ = కర్మఫలరూపములగు కోరికలను విదధాతి= ఇచ్చుచున్నాడో, ఆత్మస్థం = హృదయగుహయందుండు, తం = ఆ పరమాత్మను, యే = ఏ, ధీరాః = ధీరులు, అనుపశ్యన్తి = ప్రత్యక్షముగ జూచుచున్నారో, తేషాం = వారలకు, శాశ్వతీ = నిత్యమైన, శాన్తిః = ఉపరతి (స్యాత్ = అగును), ఇతరేషాం = ఇతరులకు, న = కలుగదు

తా ॥ ఓ నచికేతసుడా ! ఏ పరమాత్మ సర్వజనులకు వారివారి కర్మఫలాను గుణమగు ఫలము నిచ్చుచు, నశించువానిలో నశింపనివాడై, బ్రహ్మాది స్తంబపర్యంతము గల సర్వ జీవులకు చేతనస్వరూపుడై చైతన్యప్రదాతయై యున్నాడో, అట్టి యా బుద్ధిగుహయందుండు పరమాత్మను ఏజ్ఞానులు మరలింపబడిన సర్వేంద్రియవృత్తులు గలవారై చూచుచున్నారో వారికి శాశ్వతమగు శాంతి లభించును ఇతరులకు ( అజ్ఞానులకు) గలుగదు

వి ॥ గీ అ 13, శ్లో ॥ 29

**సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥**

అన్ని భూతములయందున్నట్టి ఈశ్వరుని సమభావముతో జూచుచున్నవాడై తనను తనచేత హింసించుకొనడు, అందువలన సర్వోత్కృష్టమగు మోక్షమును పొందుచున్నాడు

అవ - అనిర్దేశ్యమగు ఆత్మను గుఱించి నచికేతసుడు తన సందేహమును వ్యక్తపరుచుచున్నాడు

మూ ॥ **తదేతదితి మన్యన్తేఽనిర్దేశ్యం పరమం సుఖమ్ ।**
**కథన్ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా ॥** ***14***

పద ॥ తత్ - ఏతత్ - ఇతి - మన్యన్తే - అనిర్దేశ్యం - పరమం - సుఖం - కథం - ను- తత్ - విజానీయాం - కిము - భాతి - విభాతి - వా

టీక ॥ అనిర్దేశ్యం = (ప్రాకృత పురుషులచే) ఇట్టిదని నిర్ణయింప శక్యము గాని, పరమం= శ్రేష్ఠమైన, సుఖం = బ్రహ్మానందసుఖమును (తత్త్వజ్ఞులు), తత్ = అది, ఏతదితి = ఇదియని, మన్యన్తే = తలచుచున్నారు, తత్ = ఆ యానందసుఖమును, కథం ను = ఏప్రకారము, విజానీయాం = తెలిసికొనగలను, తత్ = అది, భాతి కిము = స్వప్రకాశస్వరూపమై, భాసించుచున్నదా, వా = (లేక) విభాతి = బుద్ధిగోచరమై విశేషముగా ప్రకాశించుచున్నదా !

తా ॥ ఓ యముడా ! ప్రాకృతబుద్ధిగలవారలకు ఇట్టిదని చెప్పి నిరూపింప శక్యముగాని శ్రేష్ఠమగు పరమానందస్వరూపపరమాత్మను సర్వేంద్రియనివృత్తి గల జ్ఞానులు ఈ హృదయగుహ యందుండు దానినిగానే తలంచుచున్నారు దానిని నేనే విధముగా తెలిసికొనగలను ? అది స్వప్రకాశరూపమై వెలుగొందుచున్నదా ? లేక నాబుద్ధిచేత చూడదగునటుల విశేషముగా ప్రకాశించుచున్నదా ?

అవ - ఆత్మ సర్వప్రకాశకము, స్వప్రకాశము అని నిరూపించుచున్నాడు

మూ ॥ *న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం*
*నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః ।*
*తమేవ భాన్తమనుభాతి సర్వం*
*తస్య భాసా సర్వమిదం విభాతి ॥* **15**

పద ॥ న - తత్ర - సూర్యః - భాతి - న - చన్ద్రతారకం - న - ఇమాః - విద్యుతః - భాన్తి - కుతః - అయం - అగ్నిః - తం - ఏవ - భాన్తం - అనుభాతి - సర్వం - తస్య - భాసా - సర్వం - ఇదం - విభాతి

టీక ॥ తత్ర = ఆ పరబ్రహ్మమునందు, (ఆ పరబ్రహ్మమును) సూర్యః = సర్వమును ప్రకాశింపజేయునట్టి సూర్యుడు, న భాతి = ప్రకాశింపజేయుట లేదు, చంద్రతారకం = చంద్ర నక్షత్రములు, న భాతి = ప్రకాశింపజేయుటలేదు, ఇమాః = ఈ, విద్యుతః = మెరుపులు, న భాన్తి = ప్రకాశింపజేయవు, అయం= ఈ, అగ్నిః = అగ్ని, కుతః = ఎట్లు ప్రకాశింపజేయును ! సర్వం = సూర్యాది

సమస్తము, భాన్తం = స్వయంజ్యోతియై ప్రకాశించుచున్న, తమేవ= ఆ పరబ్రహ్మస్వరూపమునే, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నది, ఇదం= ఈ, సర్వం = సూర్యాదిసమస్తము, తస్య = ఆ పరబ్రహ్మముయొక్క, భాసా = కాంతిచేత, విభాతి = మిక్కిలి ప్రకాశించుచున్నది

తా ॥ ఓ నచికేతసుడా ! ఈ సూర్యాది సమస్తతేజో విశేషములు ఆ పరబ్రహ్మమును ప్రకాశింపజేయలేవు ఈ చంద్రాదితేజోరూపములన్నియు ప్రకాశాత్మకమగు పరబ్రహ్మము ననుసరించి ప్రకాశించుచున్నవి అనగా ఆ పరబ్రహ్మముయొక్క ప్రకాశముచేతనే సూర్యాది తేజోవిశేషములు ప్రకాశించుచున్నవి కాని ఆ ఆత్మ ప్రకాశాపేక్షలేకుండ స్వయముగా ప్రకాశించునది మఱి యేదియు లేదు ఆ పరబ్రహ్మస్వరూపము కార్యరూపమైన సృష్టియందు ప్రవేశించి అనేక విధములగు తేజోరూపములతో ప్రకాశించుచున్నది కనుక ఆ పరబ్రహ్మము స్వప్రకాశరూపమగుట స్వయముగానే తెలియబడు చున్నదని యముడు పలికెను

వి ॥ గీ అ 15, శ్లో ॥ 6

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।**
**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥**

ఏ విష్ణుస్థానమును (పరమాత్మను) పొంది జీవులు తిరిగి జన్మము నకురారో, అద్దానిని సూర్యుడు ప్రకాశింప జేయజాలడు చంద్రుడు ప్రకాశింపజేయజాలడు అగ్ని ప్రకాశింపజేయజాలదు అదియే నాయొక్క పరమపదము

కఠోపనిషత్తు ద్వితీయాధ్యాయమునందు

ద్వితీయవల్లి సమాప్తము.

ఓం తత్ సత్



ఓమ్

# కఠోపనిషత్తు

## ద్వితీయాధ్యాయము - తృతీయవల్లి

అవః - సంసారరూపమగు అశ్వత్థవృక్షము వర్ణింపబడుచున్నది

మూ ॥ ఊర్ధ్వమూలో అవాక్శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః ।
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే ।
తస్మింల్లోకాశ్శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన । ఏతద్వైతత్ ॥ 1

పద ॥ ఊర్ధ్వమూలః - అవాక్శాఖః - ఏషః - అశ్వత్థః - సనాతనః - తత్ - ఏవ - శుక్రం - తత్ - బ్రహ్మ - తత్ - ఏవ - అమృతం - ఉచ్యతే - తస్మిౙ - లోకాః - శ్రితాః - సర్వే - తత్ - ఉ - న - అత్యేతి - కః - చ - న - ఏతత్-వై - తత్

టీక ॥ ఊర్ధ్వమూలః = అన్నిటికి పరమైన పరబ్రహ్మస్వరూపమే వేరుగాగల, అవాక్ శాఖః = స్వర్గనరకాదులను అడ్డముగా వ్యాపించియున్న కొమ్మలు గల, ఏషః= ఈ, అశ్వత్థః = సంసారవృక్షము, (నశ్వోఽపి స్థాస్యతీతి అశ్వత్థః = రేపటివఱకు ఉండక క్షణమాత్రములో నశించునదిగాన అశ్వత్థమనబడును), సనాతనః= ప్రాచీనమైనది ( ప్రవాహరూపమున అనాది) ( యత్= ఏది, అస్య= ఈసంసారవృక్షమునకు, మూలం = మొదలో), తదేవ = సంసారవృక్షమూల మైన యా బ్రహ్మస్వరూపమే, శుక్రం = తేజోమయమైన పరిశుద్ధ స్వరూపము, తత్ = అదే, బ్రహ్మ = ( సర్వమహత్తుగుటచే) బ్రహ్మయనియు, తదేవ = ఆ బ్రహ్మస్వరూపమే, అమృతం = నాశములేని దనియు, ఉచ్యతే = చెప్పబడుచున్నది తస్మిన్ = ఆ బ్రహ్మస్వరూపమునందే, సర్వే లోకాః = పృధివ్యాది సమస్తలోకములు, శ్రితాః = ఆశ్రయించి యున్నవి, ఉ = మఱియు, కశ్చన = ఎవడును, తత్ = ఆ బ్రహ్మమును, నా త్యేతి = అతిక్రమింపజాలడు, వై = నిశ్చయముగా, ఏతత్ = ఇదియే, తత్ = అది ( నీవడిగిన ఆత్మతత్త్వము)

తా ॥ ఓనచికేతసుడా ! ఈ సంసారవృక్ష మతివిచిత్రమైనది దీని మొదలు మీదికిని, కొమ్మలు క్రిందికిని ఉండును నాశస్వభావము కలది యగుటచే దీనిని అశ్వత్థమందురు అయినను ప్రవాహరూపమున అనాది యగుటచే సనాతన మనెదరు ఈ సంసారవృక్షమునకు మూలమైన పరమాత్మ పరిశుద్ధము, జ్యోతిర్మ యమైనది అదియే సర్వమహత్తగుటచే బ్రహ్మ యనియు, సృష్టి ప్రళయకాలము లందు మార్పుజెందక నిర్వికారమై యుండుటచే అమృతమనియు చెప్పబడును ఇట్టి నిర్వికార తేజోరూప పరమాత్మయందే సమస్తలోకములు ఆశ్రయమొంది యున్నవి దాని నెవరును ఉల్లఘించజాలరు నీవడిగిన బ్రహ్మపదార్థమిదియే

వి ॥ గీ అ 15, శ్లో ॥ 1

**ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥**

దేనికి వేదములు ఆకులుగా నున్నవో, అట్టి అశ్వత్థమనెడు పేరుగల సంసారవృక్షమును పై భాగమునందు వేరు గలదిగను, క్రింది భాగమున కొమ్మలు గలదిగను, నాశరహిత మయినదిగను మహర్షులు జెప్పుచున్నారు లేక వేదము లీలాగున జెప్పుచున్నవి అట్టి అశ్వత్థవృక్షము నెవడెఱుంగుచున్నాడో, వాడే వేదము నెఱింగిన వాడగుచున్నాడు అట్టిబ్రహ్మము నెఱుంగనివాడు వేదముల జదివినను చదువనివానితో సమానుడు అట్టి పరమాత్మ నెఱింగినవాడు వేదముల జదువకపోయినను చదివినవాడే ఈ అధ్యాయములో గల మొదటిశ్లోకమునుండి నాలుగు శ్లోకములవరకు చదివిన మాత్రమే దీని సంపూర్ణమగు నర్థము గోచరము కాగలదు, గీత అ 15 మొదటినుండి చదువుడు

అవ - జగత్కారణ బ్రహ్మవిజ్ఞానముచే అమృతత్వప్రాప్తి సిద్ధించునని చెప్పుచున్నాడు

మూ ॥ *యదిదం కిం చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతమ్ ।*
*మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥ 2*

పద ॥ యత్ - ఇదం - కిం - చ - జగత్ - సర్వం ప్రాణే- ఏజతి - నిస్సృతం - మహత్భయం - వజ్రం - ఉద్యతం - యే - ఏతత్ - విదుః, అమృతాః - తే భవన్తి

టీక ॥ యత్కించ = ఏకొంచమైనను, ఇదం = ఈ, (కనిపించు), సర్వం= సమస్తమైన, జగత్ = లోకము, ప్రాణే = పరబ్రహ్మమందు, నిస్సృతం= బయలువెడలినదై, ఏజతి = కంపమునొందుచున్నది (చేష్టితమగుచున్నది, మఱియు నది అవివేకులకు), ఉద్యతం = పైకెత్తిధరింపబడిన, వజ్రమివ = వజ్రాయుధమువలె, మహద్భయం= మహాభయంకరమైనది, యే = ఎవరు, ఏతత్ = దీనిని (ఈ రహస్యమును), విదుః = తెలిసికొనుచున్నారో, తే = వారు, అమృతాః= మరణధర్మము లేనివారుగా, భవన్తి = అగుచున్నారు

తా ॥ ఓ నచికేతసుడా ! బ్రహ్మాది స్థావరాంతము వరకుండెడు ఈసమస్తజగత్తు సర్వప్రాణులకు ప్రాణస్వరూపమగు నా పరబ్రహ్మమునుండి పుట్టి స్వస్వకర్మలందు నియమపూర్వకముగా ప్రవృత్తమగుచున్నది కనుకనే జగత్కారణముగు ఈ పరమాత్మ తన్నియమము నుల్లంఘించువారికి వజ్రపాణివలె మహాభయంకరమైనది వజ్రాయుధమును చేతధరించిన ప్రభువును జూచి సేవకు లెట్లు ప్రవర్తింతురో, ఆప్రకారము సూర్యచంద్ర గ్రహనక్షత్రాదులన్నియు పరబ్రహ్మముయొక్క, ఆజ్ఞకు లోబడి నియమపూర్వకముగా చలించుచున్నవి ఈ రహస్యమును ఎవరు తెలిసికొనుచున్నారో వారు మరణ రహితులగుచున్నారు అమృతస్వరూపు లగుచున్నారని భావము

వి ॥ గీ అ 8, శ్లో ॥ 15

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।**
**నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః ॥**

సర్వోత్తమమగు ముక్తిపదమును పొందిన మహానుభావులు నన్ను పొందినవారై దుఃఖభాజన మయినదియు, అనిత్యమయినదియునగు జన్మమును మఱల పొందరు

అవ - పరమాత్మసర్వభయంకరము, సర్వశాసకము, సర్వనియంత అని నిరూపించుచున్నాడు

మూ ॥ ***భయాదస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః ।***
***భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః ॥*** 3

పద ॥ భయాత్ - అస్య - అగ్నిః - తపతి - భయాత్ - తపతి - సూర్యః - భయాత్- ఇన్ద్రః - చ - వాయుః - చ - మృత్యుః - ధావతి - పఞ్చమః

టీక ॥ అస్య = ఈపరమాత్మయొక్క, భయాత్ = భీతివలన, అగ్నిః = అగ్ని, తపతి= మండుచున్నది, భయాత్ = (ఈ పరమాత్మయొక్క) భీతివలన, సూర్యః= సూర్యుడు, తపతి = తపింపజేయుచున్నాడు, (ప్రకాశించుచున్నాడు), ఇన్ద్రశ్చ= ఇంద్రుడున్ను, వాయుశ్చ = వాయువును, పఞ్చమః = అయిదవదగు, మృత్యుః = మృత్యువున్ను, భయాత్ = (ఈ పరమాత్మయొక్క) భీతివలన, ధావతి = స్వస్వవ్యాపారమునందు ప్రవర్తించుచున్నవి

తా ॥ ఓ నచికేతసుడా ! ఈ పూర్వము చెప్పబడిన పరమాత్మవలని భయముచేత అగ్ని, సూర్యుడు, ఇంద్రాది సర్వదేవతలును వారి వారి వ్యాపారములందు అతిజాగ్రత్త గలవారలై ప్రవర్తించుచున్నారు మృత్యువున్ను తన్నియమము ననుసరించి ప్రవర్తిల్లుచున్నది

అవ - ఈ జన్మలో అట్టి పరమాత్మజ్ఞానమును సంపాదించనిచో జననమరణరూప సంసారము ప్రాప్తించునని చెప్పుచున్నాడు

మూ ॥ ***ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః ।***
***తతస్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥***

పద ॥ ఇహ - చేత్ - అశకత్ - బోద్ధుం - ప్రాక్ - శరీరస్య - విస్రసః - తతః - సర్గేషు - లోకేషు - శరీరత్వాయ - కల్పతే

టీక ॥ ఇహ = ఈ జన్మమునందు, శరీరస్య = శరీరముయొక్క, విస్రసః = పడిపోవుటకంటె (వినాశమునకు) ప్రాక్ = పూర్వము, (బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపమును) బోద్ధుం = తెలిసికొనుటకు, అశకచ్చేత్ = శక్తుడగుచో (మంచిది, సంసారబంధమునుండి విముక్తుడగును, లేనిచో), తతః = ఆ పరబ్రహ్మమును తెలిసికొనకపోవుటవలన, సర్గేషు లోకేషు = సకలప్రాణిసృష్టికి ఆధారభూతములగు పృధివ్యాది లోకములయందు, శరీరత్వాయ = దేహభావముకొఱకు, కల్పతే= సమర్థుడగుచున్నాడు

తా ॥ ఓ నచికేతసుడా ! జనుడు తన దేహపాతముకంటే పూర్వమే ఈలోకమందు (ఈజీవితమునందే) పరమాత్మను తెలిసికొనినచో సంసార

బంధనమునుండి విముక్తుడగును లేనిచో జననమరణశీలములగు పృథివ్యాది లోకములలో వివిధ శరీరములను పొందుచున్నాడు కాబట్టి శరీరపతనముకంటె ముందుగానే ఆత్మజ్ఞానసంపాదనమునకై ప్రయత్నింపవలెను

వి ॥ గీ అ 5, శ్లో ॥ 19

ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥

ఎవరి మనస్సు సకల ప్రాణులయెడల పరమాత్మ సమముగా నున్నదను సమభావమందు స్థిరమైయున్నదో, అట్టివారు ఈ దేహముతో నీ లోకమునందే జనన మరణములకు హేతువగు సంసారబంధమును జయించిన వారగుచున్నారు పరబ్రహ్మము సమభావము, దోషరహిత మయినది కనుక అట్టి బ్రహ్మానుభవము గలవారు సదా పరబ్రహ్మమందే యున్నవారగుచున్నారు

గీత అ 5 శ్లో ॥ 23

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥

ఎవడీ లోకమునందే శరీరమును విడుచుటకు ముందుగానే కామ క్రోధాది జన్యమగు తీవ్రతను సహించుటకొఱకు శక్తుడో, అట్టి మనుజుడు యోగసిద్ధి గలవాడును, శాశ్వత సౌఖ్యము గలవాడుగను అగుచున్నాడు ఈ శ్రుతి స్మృతులను బట్టి చూచిన జీవించియున్నప్పుడే ముక్తుడు గావలయునని స్పష్టమగుచున్నది

అవ - స్థాన భేదముచే ఆత్మదర్శన తారతమ్యమును వివరించుచున్నాడు

మూ ॥ *యథాఽఽ దర్శే తథాఽఽత్మని*
*యథా స్వప్నే తథా పితృలోకే ।*
*యథాఽఽప్సు పరీవ దదృశే తథా గన్ధర్వ లోకే*
*ఛాయాఽఽతపయోరివ బ్రహ్మలోకే ॥* 5

పద ॥ యధా - ఆదర్శే - తథా - ఆత్మని - యధా - స్వప్నే - తథా - పితృలోకే - యధా - అప్సు - పరి - ఇవ - దదృశే - తథా - గంధర్వలోకే - ఛాయాఽఽతపయోః - ఇవ - బ్రహ్మలోకే

టీక ॥ యధా = ఏప్రకారము, ఆదర్శే = అద్దమందు, (ప్రతిబింబము స్పష్టముగ కనిపించుచున్నదో), తథా = ఆప్రకారము, ఆత్మని = నిర్మలమైనబుద్ధియందు (ఆత్మ స్పష్టముగ భాసించుచున్నది), యధా = ఏప్రకారము, స్వప్నే = స్వప్నమునందు, (జాగ్రద్వాసన వలన పుట్టిన వస్తువు అస్పష్టముగా చూడబడుచున్నదో), తథా = ఆ ప్రకారము, పితృలోకే = పితృలోకమునందు (ఆత్మ అస్పష్టముగా చూడబడుచున్నది), యధా = ఏ ప్రకారము, అప్సు = జలమునందు (అస్పష్టావయవములు గల తనరూపము), పరిదదృశ ఇవ = చూడబడ్డ దానివలె నున్నదో(అస్పష్టముగా చూడబడుచున్నదో), తథా = ఆ ప్రకారము, గంధర్వలోకే = గంధర్వలోకమందు( ఆత్మ అస్పష్టముగా చూడబడుచున్నది), ఛాయా తపయో రివ = ఎండనీడలవలె, బ్రహ్మలోకే = బ్రహ్మలోమునందు (ఆత్మదర్శనము స్పష్టముగా నగుచున్నది)

తా ॥ ఓనచికేతసుడా ! మనుష్యుడు తన దేహప్రతి బింబమును అద్దమందెట్లు స్పష్టముగా చూచునో, ఆప్రకారము ఈలోకమందే నిర్మలమైన తన బుద్ధియందు ఆత్మస్వరూపమును స్పష్టముగా చూడగలడు స్వప్నమునందు జాగ్రద్వాసనా వాసితుడగుట చేతను, పితృలోకమందు కర్మఫలోప భోగమందాసక్తుడగుటచేతను, తన ఆత్మరూపము అస్పష్టముగా కానగును గంధర్వలోకమున గూడ ఉదకమునందు ప్రతిబింబము వలె ఆత్మదర్శనము అస్పష్టమే ఒక్క బ్రహ్మలోకమందు మాత్రమే ఛాయాతపములవల ఆత్మస్వరూపము స్పష్టముగా చూడబడుచున్నది కాని ఆ బ్రహ్మలోక ప్రాప్తి బహుదుర్లభము కాన ఈలోకమునందే ఆత్మజ్ఞాన సంపాదనకై ప్రయత్నించ వలసియుండును

వి ॥ గీత అ 6 శ్లో ॥ 45

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥

పట్టుదలతో యత్నించుచున్న యోగి కల్మషరహితుడై అనేక జన్మలయందభ్యసించిన జ్ఞానసాధన గలవాడై యోగసిద్ధిని పొందును ఆపిమ్మట సర్వోత్తమమయిన మోక్షమును పొందుచున్నాడు పైజెప్పిన శ్రుతివలన మానుష్యజన్మము

మోక్షముకొఱకు శ్రేష్ఠమయినదని గ్రహించుకొన వలయును ఈవిషయమై అనేక శాస్త్రములు గలవు ఇతర శాస్త్రములెవ్వియు దీనియందుజేర్చకూడదనియు, గీతాశాస్త్రమెుక్కటియే నిరూపింప బడవలయుననియు, తలంచుటచే అట్టి ప్రమాణములు చేర్చబడలేదు అట్టి శ్రేష్ఠమయిన జన్మ దొరికియు, సామాన్యులు దానియందుగల సారమును గ్రహింపజాలక వ్యర్థజీవు లగుచున్నారు

అవ - ఆత్మజ్ఞానమును పొందు విధానము, తత్ప్రయోజనము నిరూపింపబడుచున్నది

మూ ॥ ఇన్ద్రియాణాం పృథగ్భావముదయాస్తమయౌ చ యత్।
పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి ॥ 6

పద ॥ ఇన్ద్రియాణాం - పృథగ్భావం - ఉదయాస్తమయౌ - చ - యత్ - పృథక్ ఉత్పద్యమానానాం - మత్వా - ధీరః - న - శోచతి

టీక ॥ పృథగుత్పద్యమానానాం = వేరు వేరు తత్త్వములనుండి పుట్టుచున్న, ఇన్ద్రియాణాం = ఇన్ద్రియములయొక్క, యత్ = ఏ, పృథగ్భావం= భిన్నభావముకలదో దానిని, చ = మఱియు, ఉదయాస్తమయౌ = ఉత్పత్తి ప్రళయములను, ధీరః = జ్ఞాని, మత్వా = తెలిసికొని, న శోచతి = దుఃఖింపడు

తా ॥ ఓ నచికేతసుడా ! ఆకాశాది పంచమహాభూతముల నుండి వేరువేరుగ ఉత్పన్నములైన ఇన్ద్రియములు విశుద్ధ చిన్మాత్రస్వరూపమైన ఆత్మకంటె భిన్నములనియు, జాగ్రత్స్వప్నావస్థాదృష్టితో గలుగు ఉత్పత్తి వినాశములు ఇంద్రియధర్మములే గాని ఆత్మ ధర్మములు కావనియు దెలిసికొని ధీరు డగు ఆత్మజ్ఞాని శోకింపడు

వి ॥ గీత అ 14, శ్లో ॥ 2

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥

ఈ జ్ఞానము నాశ్రయించి నా సమానధర్మమును ( భగవత్సమాన స్థితిని) పొందినవారై జగత్సృష్టికాలమందును జన్మించరు ప్రళయకాలమందు (మరణకాలమందు) దుఃఖింపరు

టీక ॥ యధా = ఏప్రకారము, ఆదర్శే = అద్దమందు, (ప్రతిబింబము స్పష్టముగ కనిపించుచున్నదో), తథా = ఆప్రకారము, ఆత్మని = నిర్మలమైనబుద్ధియందు (ఆత్మ స్పష్టముగ భాసించుచున్నది), యథా = ఏప్రకారము, స్వప్నే = స్వప్నమునందు, (జాగ్రద్వాసన వలన పుట్టిన వస్తువు అస్పష్టముగా చూడబడుచున్నదో), తథా = ఆ ప్రకారము, పితృలోకే = పితృలోకమునందు (ఆత్మ అస్పష్టముగా చూడబడుచున్నది), యథా = ఏ ప్రకారము, అప్సు = జలమునందు (అస్పష్టావయవములు గల తనరూపము), పరిదదృశ ఇవ = చూడబడ్డ దానివలె నున్నదో(అస్పష్టముగా చూడబడుచున్నదో), తథా = ఆ ప్రకారము, గంధర్వలోకే = గంధర్వలోకమందు( ఆత్మ అస్పష్టముగా చూడబడుచున్నది), ఛాయా తపయో రివ = ఎండనీడలవలె, బ్రహ్మలోకే = బ్రహ్మలోమునందు ( ఆత్మదర్శనము స్పష్టముగా నగుచున్నది)

తా ॥ ఓనచికేతసుడా ! మనుష్యుడు తన దేహప్రతి బింబమును అద్దమందెట్లు స్పష్టముగా చూచునో, ఆప్రకారము ఈలోకమందే నిర్మలమైన తన బుద్ధియందు ఆత్మస్వరూపమును స్పష్టముగా చూడగలడు స్వప్నమునందు జాగ్రద్వాసనా వాసితుడగుట చేతను, పితృలోకమందు కర్మఫలోప భోగమందాసక్తుడగుటచేతను, తన ఆత్మరూపము అస్పష్టముగా కాననగును గంధర్వలోకమున గూడ ఉదకమునందు ప్రతిబింబము వలె ఆత్మదర్శనము అస్పష్టమే ఒక్క బ్రహ్మలోకమందు మాత్రమే ఛాయాతపములవల ఆత్మస్వరూపము స్పష్టముగా చూడబడుచున్నది కాని ఆ బ్రహ్మలోక ప్రాప్తి బహుదుర్లభము కాన ఈలోకమునందే ఆత్మజ్ఞాన సంపాదనకై ప్రయత్నించ వలసియుండును

వి ॥ గీత అ 6 శ్లో ॥ 45

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥

పట్టుదలతో యత్నించుచున్న యోగి కల్మషరహితుడై అనేక జన్మలయందభ్యసించిన జ్ఞానసాధన గలవాడై యోగసిద్ధిని పొందును ఆపిమ్మట సర్వోత్తమమయిన మోక్షమును పొందుచున్నాడు పైజెప్పిన శ్రుతివలన మానుష్యజన్మము

వ్యాపకః= వ్యాపకమైనదియు, అలిఙ్గ ఏవచ = వస్తుజ్ఞానమునకు హేతుభూతమైన బుద్ధియొక్క సంసర్గము లేనిదియునై యున్నది (సర్వసంసార ధర్మరహితమని భావము)

తా ॥ ఓ నచికేతసుడా ! మనుష్యుడు ఏయాత్మస్వరూపమును తెలిసికొని సంసారబంధ వినిర్ముక్తుడై అమృతత్వమును బొందుచున్నాడో, ఆ యాత్మ అవ్యక్తముకంటె శ్రేష్ఠమైనది మఱియు ఆకాశాది వ్యాపక పదార్థములకంటె వ్యాపకమైనది సర్వవస్తుజ్ఞానమునకు హేతువైన బుద్ధిచే రహితము గాని అలింగము, సర్వసంసార ధర్మరహితమని తాత్పర్యము

వి ॥ గీ అ 5, శ్లో ॥ 27,28

స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవా న్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥
యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥

ఎవడు బాహ్యములగు స్పర్శాది విషయములను బయటనే యుంచి మనస్సునందు చొరనీయక దృష్టిని కనుబొమ్మల మధ్య నిలిపి ముక్కులోపల సంచరించు ప్రాణాపానవాయువులను సమముగా జేసి యింద్రియములను, మనస్సును, బుద్ధిని వశీభూత మొనర్చుకొన్నవాడును, ఆశ, భయము, క్రోధము తొలగిపోయినవాడును, మోక్షమందాసక్తిగల వాడునునగు మునియో వాడు (మననశీలుడు) ఎల్లప్పుడు ముక్తుడే, అమృతత్వము నొందినవాడే యగుచున్నాడు ఇచ్చట తెలుపబడినది కేవల కుమ్భకయోగము ఇది అపాయము లేనిది, ధ్యానయోగులకు మిగుల సహాయకారి యగును

అవ - జ్ఞాపకరహితమగు ఆత్మను దర్శించు ప్రకారము, తత్ప్రయోజనము నిరూపింపబడుచున్నది

మూ ॥ న సందృశే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ।
హృదా మనీషా మనసాఽభిక్లృప్తో
య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥

పద ॥ న - సంధృశే - తిష్ఠతి - రూపం - అన్య - న - చక్షుషా - పశ్యతి కః - చ - న - ఏనం - హృదా - మనీషా - మనసా - అభిక్లృప్తః - యే - ఏతత్ - విదుః - అమృతాః - తే - భవన్తి

టీక ॥ అస్య = ఈ యాత్మయొక్క, రూపం = స్వరూపము, సంధృశే = దర్శనవిషయమై (ప్రత్యక్షమునందు), న తిష్ఠతి = ఉండదు, కశ్చన= ఎవడును, చక్షుషా = నేత్రముచేత (ఇతరేంద్రియముల చేతను) ఏనం= ఈయాత్మస్వరూపమును, న పశ్యతి = చూడజాలడు, (మఱియు నీయాత్మ) మనీషా = సంకల్ప వికల్పాదిరూపమైన మనస్సును నియమించుచున్న, హృదా = హృదయమందుండు బుద్ధిచేత, మనసా = మననరూపమైన సమ్యగ్దర్శనముద్వారా, అభిక్లృప్తః= ప్రకాశితమగుచున్నది, యే = ఎవరు, ఏతత్ = ఈయాత్మను (బ్రహ్మ స్వరూపముగా), విదుః = ఎఱుంగుదురో, తే = వారు, అమృతాః = మరణము లేనివారుగా, భవన్తి = అగుచున్నారు

తా ॥ ఓ నచికేతసుడా ! ఆత్మస్వరూపము రూపరహితమగుటచే చక్షురాదీంద్రియములకు గోచరమైనది కాదు మఱియు నితరములగు నేయింద్రియములచేతగూడా ఈ ఆత్మస్వరూపమును ఎవడును చూడజాలడు అయితే సంకల్పవికల్పాదిరూపమైన మనస్సును సంయమమొనర్పగల హృదయస్థమగు బుద్ధియొక్కటియే అట్టి ఆత్మ నెఱుంగుటకు సాధనము సంకల్పాదిరహితమైన అట్టి బుద్ధిచే సమ్యగ్దర్శనము ద్వారా ఆత్మ జూచుటకు శక్యమగుచున్నది ఎవరు ఈ యాత్మను బ్రహ్మస్వరూపముగా దెలిసికొనుచున్నారో వారు జనన మరణ రహితులగు చున్నారు అనగా ముక్తులగు చున్నారు

అవ - బుద్ధి నిస్సంకల్పమగుటకు తగిన యోగసాధన, పరమపద ప్రాప్తి వర్ణింపబడుచున్నది

మూ ॥ *యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।*
*బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిమ్ ॥* **10**

పద ॥ యదా - పఞ్చ - అవతిష్ఠన్తే - జ్ఞానాని - మనసా - సహ - బుద్ధిః - చ - న - విచేష్టేత - తాం - అహుః - పరమాం - గతిమ్

టీక ॥ యదా = ఎప్పుడు, పఞ్చ = అయిదైన, జ్ఞానాని = జ్ఞానేంద్రియములు, మనసా సహ = మనస్సుతోగూడ, (ఆత్మన్యేవ = ఆత్మయందే), అవతిష్ఠన్తే = స్థిరముగా నుంటున్నవో - బుద్ధిశ్చ = నిశ్చయాత్మకమగు బుద్ధియును, న విచేష్టేత = స్వవ్యాపారమునందు చలించదో, (వివిధముగా చేష్టింపదో, లేక విరుద్ధచేష్టలు చేయదో) తాం = దానిని, పరమాం = ఉత్కృష్టమైన, గతిం = మోక్షగతినిగా, ఆహుః = చెప్పిరి, (చెప్పుదురు)

తా ॥ ఓ నచికేతసుడా ! చక్షురాది జ్ఞానేంద్రియము లైదును, మనస్సుతోగూడ ఎప్పుడు తమతమ విషయములనుండి నివృత్తములై ఆత్మయందు స్థిరపడుచున్నవో, మఱియు నిశ్చయాత్మికయగు బుద్ధియును స్వవ్యాపారమందు వ్యాపింపకయుండునో అనగా వివిధముగ చేష్టింపదో లేక విరుద్ధచేష్టలు చేయక నిశ్చలమైయుండునో అట్టి దశయే పరమగతి యనబడును అదే శ్రేష్ఠమైన మోక్షము

వి ॥ గీ అ 6, శ్లో ॥ 19

**యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥**

నియమింపబడిన చిత్తముగలవాడును, ధ్యానయోగాభ్యాసియు నగు ఆత్మధ్యానయోగియొక్క మనస్సునకు గాలి లేనిచోట నుండెడి దీపము ఏప్రకారము చలింపకయుండునో, అట్టి నిశ్చలస్థితి ఉపమానముగా చెప్పబడినది గాలిలేని స్థలములోనుండు దీపమువలె స్వరూపస్థితిలో నుండుటయే జ్ఞానముయొక్కయు, యోగముయొక్కయు పర్యవసానస్థితియని గ్రహింపవలయును

అవ - యోగస్వరూపమును నిరూపించుచున్నాడు

మూ ॥ ***తాం యోగమితి మన్యన్తే స్థిరామింద్రియధారణామ్ ।***
***అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ ॥*** **11**

పద ॥ తాం - యోగం - ఇతి - మన్యన్తే - స్థిరాం - ఇంద్రియధారణాం - అప్రమత్తః- తదా - భవతి - యోగః - హి - ప్రభవాప్యయౌ

టీక ॥ తాం = అట్టి, స్థిరాం = అచంచలమైన, ఇంద్రియధారణాం = బాహ్యాభ్యన్తరేంద్రియధారణమును, యోగమితి = యోగముని, మన్యన్తే = తలంచుచున్నారు, తదా = అప్పుడు (యోగి), అప్రమత్తః= ప్రమాదము లేనివాడు, భవతి = అగుచున్నాడు, హి = ఏలయన, యోగః = యోగము, ప్రభవాప్యయౌ = జననాపాయ ధర్మములు గలది

తా ॥ ఓ నచికేతసుడా ! పూర్వోక్తమైన బాహ్యాభ్యంతరేంద్రియధారణమునే, అచంచలమైన యూపరమగతినే యోగమునుగా జెప్పుచున్నారు అట్టి దశయందు యోగి అప్రమత్తుడగుచున్నాడు ఈ యింద్రియ సంయమావస్థయందు అవిద్యాద్యారోప రహితమగుటచే ఆత్మ స్వస్వరూపావస్థితమగు చున్నది, యోగము ఉత్పత్తివినాశములు గలదిగాన యోగి అప్రమత్తుడై యుండవలయును

అవ - ఇంద్రియాగోచరమగు ఆత్మ లేనేలేదను అసద్వాదియొక్క సంశయమును నివారించి సద్బుద్ధియే ఆత్మోపలబ్ధికి సాధనమని నిరూపించు చున్నాడు

మూ ॥ *నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా ।*
*అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ॥* **12**

పద ॥ న - ఏవ - వాచా - న - మనసా - ప్రాప్తుం - శక్యః - న - చక్షుషా - అస్తి - ఇతి - బ్రువతః - అన్యత్ర - కథం - తత్ - ఉపలభ్యతే

టీక ॥ (ఆత్మా = ఆత్మ), వాచా = వాక్కుచేత, ప్రాప్తుం = పొందుటకు (నిర్ణయించుటకు) నైవ శక్యః = శక్యమైనదికాదు, మనసా = మనస్సు చేత, చింతింప, న = శక్యము కాదు, చక్షుషా = నేత్రముచేతను, న = దర్శింప వీలుకాదు, (ఆత్మా = ఆత్మ), అస్తి = ఉన్నదని, బ్రువతః = చెప్పెడువానికంటె, అన్యత్ర = ఇతరుడగు నాస్తికుని యందు, తత్ = ఆయాత్మస్వరూపము, కథం = ఎట్లు, ఉపలభ్యతే = పొందబడును ?

తా ॥ ఓ నచికేతసుడా ! ఆత్మ అవాఙ్మానసగోచరము అయ్యది వాక్కుచేగాని, మనస్సుచేగాని, నేత్రాది ఇతరేంద్రియములచేగాని పొంద శక్యమైనది కాదు ఈ దృశ్యజగత్తుకు కారణభూతమైన ఆత్మ యున్నదని చెప్పెడు ఆస్తికునికి మాత్రమే అది లభ్యమగును అతనికంటె వేఱగు జగత్కారణమైన ఆత్మలేదని

చెప్పెడు నా స్తికునికి అనిర్వాచ్యమైన ఆత్మ యెటుల లభించగలదు ? శ్రద్ధా విరహితుడైన నాస్తికునికి ఆత్మస్వరూపము పొంద సాధ్యము కాదని భావము

అవ - 'ఆత్మ ఉన్నది' అని విశ్వసించు సద్వాదికి మాత్రమే ఆత్మ యాధార్థ్యజ్ఞానము గలుగునని చెప్పుచున్నాడు

మూ ॥ అస్తీత్యేవోపలబ్ధవ్యస్తత్త్వభావేన చోభయోః ।
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి ॥ **13**

పద ॥ అస్తి - ఇతి - ఏవ - ఉపలబ్ధవ్యః - తత్త్వభావేన - చ - ఉభయోః - అస్తి - ఇతి - ఏవ - ఉపలబ్ధస్య - తత్త్వభావః - ప్రసీదతి

టీక ॥ (ఆత్మ) అస్తీత్యేవ = 'ఉన్నది' అనియే, ఉపలబ్ధవ్యః = పొందదగినది, (కిం) చ = మఱియు, తత్త్వభావేన = ఆత్మ నిరుపాధికము, నిర్వికారము అను యధార్థజ్ఞానముచేతను, (ఉపలబ్ధవ్యః = పొందదగినది), ఉభయోః = సోపాధికాత్మాస్తిత్వభావము, నిరుపాధిక తత్త్వభావము (యధార్థజ్ఞానము) ఈ రెంటిలో, అస్తీత్యేవ = (ఆత్మ) ఉన్నదనియే, ఉపలబ్ధస్య = పొందినవానికి (జగత్కారణభూతమగు సోపాధికాత్మ ఉన్నది - అని ఆత్మోపలబ్ధిని పొందిన వానికి), తత్త్వభావః = నిరుపాధికమైన ఆత్మయొక్క యధార్థ జ్ఞానము లేక స్వరూపము, ప్రసీదతి = ప్రత్యక్షమగుచున్నది లేక అభిముఖమగుచున్నది

తా ॥ బుద్ధ్యాద్యుపాధి విశిష్టమైన ఆత్మ కార్యరూపమైన జగత్తునందు సద్రూపముతో ననుగతమై 'యున్నది' అను అస్తిత్వభావముచేతను మఱియు 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' అను శ్రుతిచే (వికారము వాగ్విలాసము మాత్రమే, ఘట శరావాదినామధేయమును నంతియే కారణభూతమైన మృత్తిక మాత్రమే సత్యము) నిర్వికారమై, అసంగమై, నిరుపాధికమైయున్న ఆత్మ (బ్రహ్మ) ఒక్కటియే సత్యము, తద్భిన్నమంతయు మిధ్య - అను యధార్థ జ్ఞానముచేతను ఆత్మ పొందదగియున్నది ఈ సోపాధికాత్మాస్తిత్వభావము, నిరుపాధిక తత్త్వభావము (ఆత్మయాధార్థ్య జ్ఞానము) ఈ రెంటిలో 'సోపాధికాత్మ ఉన్నది' అని ఆత్మోపలబ్ధిని బొందినవానికి నిరుపాధికాద్వితీయాత్మస్వరూపము అభిముఖమగును, ప్రత్యక్షమగును,

తేటతెల్లమగునని భావము తొలుత సోపాధికాత్మజ్ఞానము గలుగుచో తదనంతర మట్టివానికి నిరుపాధిక బ్రహ్మస్వరూపము విస్పష్టమగునని దెలియవలయును

అవ - పరమార్థదర్శి అమృతస్వరూపుడగు నదియు వివరించుచున్నాడు

మూ ॥ *యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।*
*అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥* **14**

పద ॥ యదా - సర్వే - ప్రముచ్యన్తే - కామాః - యే - అస్య - హృది - శ్రితాః - అథ - మర్త్యః - అమృతః - భవతి - అత్ర - బ్రహ్మ - సమశ్నుతే

టీక ॥ అస్య = ఈవిద్వాంసునియొక్క, హృది = హృదయమందు, శ్రితాః= ఆశ్రయించియున్న, యే = ఏ, సర్వే = సమస్తమైన, కామాః = కోరికలు, యదా = ఎప్పుడు, ప్రముచ్యన్తే = విడిపోవుచున్నవో, (అపుడు), అథ = అనన్తరము, మర్త్యః = మనుజుడు, అమృతః = మరణములేనివాడు, భవతి= అగుచున్నాడు, అత్ర = ఇక్కడనే, బ్రహ్మ = బ్రహ్మమ్మును, సమశ్నుతే = పొందుచున్నాడు

తా ॥ జ్ఞానోదయమునకు పూర్వము హృదయమునందున్న సమస్త కామములు ఎప్పుడు (జ్ఞానోదయానంతరము) నాశమును పొందుచున్నవో అప్పుడు మరణశీలుడగు మనుష్యుడు జననమరణరూపసంసారము లేనివాడై ముక్తుడగు చున్నాడు ఆత్మసాక్షాత్కారమునకు పూర్వము మరణశీలుడై తదనంతరము అవిద్యాకామకర్మరూపమగు మృత్యువు నశించుటచే అమృతస్వరూపు డగుచున్నాడు మృత్యువినాశమగుటచే పరలోకాదిగమన మసంభవము కాన సమస్తబంధనములు తొలగినందున అట్టి బ్రహ్మవేత్త యిచటనే జీవించియుండగనే బ్రహ్మస్వరూపమును బొందుచున్నాడు సాక్షాత్ బ్రహ్మ స్వరూపుడే అగుచున్నాడని భావము 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' అని శ్రుతి

అవ - గ్రంథిభేదనమే అమృతత్వమని నిరూపించుచున్నాడు

మూ ॥ *యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః ।*
*అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ॥* **15**

పద ॥ యదా - సర్వే - ప్రభిద్యన్తే - హృదయస్య - ఇహ - గ్రన్థయః - అథ - మర్త్యః- అమృతః - భవతి - ఏతావత్ - అనుశాసనమ్,

టీక ॥ యదా = ఎప్పుడు, ఇహ = ఇక్కడ జీవించియుండగనే, హృదయస్య= బుద్ధియొక్క, సర్వే = సమస్తమైన, గ్రన్థయః = గ్రంధులు (అజ్ఞాన బంధములు), ప్రభిద్యన్తే = భేదింపబడుచున్నవో (అపుడు), అథ = అనన్తరము, మర్త్యః = మనుజుడు, అమృతః = మరణము లేనివాడు, భవతి= అగుచున్నాడు, ఏతావత్ = ఇదియే, అనుశాసనమ్ = (వేదాంత శాస్త్రముయొక్క) అజ్ఞ (అనగా నుపదేశము)

తా ॥ బుద్ధిగతములగు నేను, నాది, నాధనము, నేను సుఖిని, దుఃఖిని అనునట్టి అవిద్యాప్రత్యయములు (హృదయగ్రంధులు) 'నేను' అసంగుడను, నిర్వికారుడను, అసంసారిని, సాక్షాత్ బ్రహ్మస్వరూపుడను అనునట్టి బ్రహ్మాత్మ ప్రత్యయముచే ఎపుడు తొలగిపోవునో అపుడు మరణశీలుడగు మనుజుడు అమృతస్వరూపుడగు చున్నాడు ఇదియే సంపూర్ణవేదాంతశాస్త్రముయొక్క ఆజ్ఞ ఉపదేశమని గ్రహింపుము

వి ॥ గీత అ 6, శ్లో ॥ 31

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సర్వభూతాంతరాత్ముడనగు నన్నెవడు అభేదబుద్ధి గలవాడై ఆత్మైకత్వస్థితిని బొందినవాడై భజించుచున్నాడో, అట్టి ఆత్మధ్యానయోగి సర్వ విధముల ప్రవర్తించుచున్నవాడైనను నాయందుండువాడగుచున్నాడు అనగా హృదయగ్రంధులు నశించి సాక్షియగు ఆత్మయొక్క ప్రబోధము గలిగినవాడు గృహస్థాశ్రమమందుండినను, సన్న్యాసాశ్రమమునందుండినను నిష్కామకర్మ పరుడైనను లేక యే కర్మము జేయక సదా ఆత్మధ్యానపరాయణుడై యుండినను ముక్తుడే యని భావము

అవ - మందాధికారియగు బ్రహ్మజ్ఞాని అన్యదేవతోపాసకులు, సామాన్యజనులు పొందు గతి అగ్నివిద్యాఫలశ్రుతి నిరూపింపబడుచున్నది

మూ ॥ శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా,
తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి ॥ 16

పద ॥ శతం - చ - ఏకా - చ - హృదయస్య - నాడ్యః - తాసాం - మూర్ధానం- అభినిస్సృతా - ఏకా - తయా - ఊర్ధ్వం - ఆయన్- అమృతత్వం - ఏతి - విష్యక్ - అన్యాః - ఉత్క్రమణే - భవన్తి

టీక ॥ హృదయస్య = హృదయముయొక్క, నాడ్యః = ప్రధానమైన నాడులు, శతం చ = నూరును, ఏకా చ = ఒకటియు, (సన్తి = కలవు), తాసాం = ఆ నాడులలో, ఏకా = ఒకటియగు సుషుమ్న యను నాడి, మూర్ధానం = శిరస్సును, (భిత్వా = భేదించుకొని), అభినిస్సృతా = బయలు వెడలినది, తయా = ఆ నాడిద్వారా, ఊర్ధ్వం = పైకి, అయన్ = పోవువాడు, అమృతత్వం= అమరత్వమును, ఏతి = పొందుచున్నాడు, విష్వక్ = నానావిధగతులుగల, అన్యాః = ఇతరనాడులు, ఉత్క్రమణే = జీవము (ప్రాణముబయలు వెడలుటయందు, నిమిత్తం = కారణము), భవన్తి = అగుచున్నవి

తా ॥ హృదయదేశమందు నూటఒక్క నాడులు గలవు అందు సుషుమ్న యను ఒక నాడి శిరస్సును భేదించుకొని ఊర్ధ్వాభిముఖమై పోవుచున్నది దాని నూతగ గొనిపోవు పురుషుడు అమృతత్వమును పొందును బ్రహ్మవిద్యయందు మందాధికారులైనవారును, ఇతర ఉపాసనామార్గము నవలం బించినవారును నగు సాధకులు పూర్వోక్తసుషుమ్నా మార్గముగ ఊర్ధ్వాభిముఖులై సూర్యమండలము ద్వారా బ్రహ్మలోకమును బొంది అమృతత్వమును పొందుచున్నారు. అనగా బ్రహ్మలోకమునందు అనుపమ భోగముల నెల్ల అనుభవించి బ్రహ్మతోగూడ ముక్తులై శాశ్వతామృతత్వస్థితిని బొందెదరని తాత్పర్యము అట్లు గాక వివిధ గతులలో గూడుకొనియున్న ఇతర నాడులు ప్రాణోత్క్రమణమునకు కారణము లగుచున్నవి అనగా ఉపాసనా రహితులైన అజ్ఞానులు ఇతర నాడులద్వారా బయలువెడలి సంసారబంధమున చిక్కుకొనెదరు సుషుమ్న ఒక్కటి మాత్రము ఊర్ధ్వగతికిని (మోక్షమునకును), తక్కిన నాడులు సంసారప్రాప్తికిని హేతువులని తాత్పర్యము

వి ॥ అ 8, శ్లో ॥ 24

అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

అగ్న్యభిమానదేవతయు జ్యోతిరభిమానదేవతయు, దివసాభిమానదేవతయు, ఆరుమాసముల ప్రమాణముగల ఉత్తరాయణాభిమాన దేవతయును గల మార్గము శుక్లమార్గ మనబడును బ్రహ్మవిదు లయిన జనులు ఈ మార్గమున బోయిన క్రమముగా పరబ్రహ్మమును పొందుచున్నారు ఇది ఉపాసనాపద్ధతిని గురించి చెప్పబడినదని తెలియవలెను

అవ - ఉపనిషత్ప్రోక్తమగు సంపూర్ణార్థమును ఉపసంహరించుచున్నాడు

మూ ॥ *అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః।*
*తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ ।*
*తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి ॥* 17

పద ॥ అఙ్గుష్ఠమాత్రః - పురుషః - అన్తరాత్మా - సదా - జనానాం - హృదయే - సన్నివిష్టః - తం - స్వాత్ - శరీరాత్ - ప్రవృహేత్ - ముఞ్జాత్ - ఇవ - ఇషీకాం - ధైర్యేణ - తం - విద్యాత్ - శుక్రం - అమృతం - తం - విద్యాత్ - శుక్రం - అమృతం - ఇతి

టీక ॥ అఙ్గుష్ఠమాత్రః = అఙ్గుష్ఠపరిమితి గల, పురుషః = పురుషుడు, (పురమనగా శరీరము, దానియందు శయనించువాడు పురుషుడనబడును, ఆత్మయని భావము) అన్తరాత్మా = అన్తరాత్మ (యనబడును, అయ్యది), జనానాం = (సకల) ప్రాణులయొక్క, హృదయే = హృదయమునందు, సన్నివిష్టః = ప్రవేశించియున్నది, తం = ఆ హృదయమందుండు అన్తరాత్మను, స్వాత్ = స్వకీయమగు, శరీరాత్ = దేహమునుండి, ముఞ్జాత్ = ముంజగడ్డినుండి, ఇషికామివ= (దానిమధ్యనుండు) ఈనెనువలె (గడ్డిపరకనువలె), ధైర్యేణ = ధైర్యముతో ప్రమాదములేక, ప్రవృహేత్ = వేరుపరుపవలయును, తం = ఆ వేరుపరుపబడిన అఙ్గుష్ఠ మాత్రపురుషుని, శుక్రం = పరిశుద్ధమగు, అమృతమితి = అమృతస్వరూపమని (పూర్వోక్త చిన్మాత్రస్వరూప

పరబ్రహ్మమని), విద్యాత్ = తెలిసికొనవలెను, తం = ఆ వేరు పరుపబడిన అంగుష్ఠమాత్రపురుషుని, శుక్రం = పదిశుద్ధమగు, అమృతమితి = అమృతస్వరూపమని (పూర్వోక్త చిన్మాత్రస్వరూప పరబ్రహ్మ మని), విద్యాత్= తెలిసికొనవలెను, (ఉపనిషత్తుయొక్క సమాప్తి కొఱకు రెండుసార్లు చెప్పబడినది)

తా ॥ అంగుష్ఠమాత్ర పరిమాణముగల పురుషుడు (ఆత్మ) సమస్తప్రాణులయొక్క హృదయమందున్నవాడై అంతరాత్మ యనబడుచున్నాడు అట్టి అన్తరాత్మను ముంజగడ్డినుండి దాని ఈనెను పైకిదీసినటుల తనశరీరమునుండి వేరుపరచవలయును పరమాత్మ శరీరములోనున్నను శరీరధర్మములు లేనిదని గుర్తించవలయును శరీరేంద్రియాదులకంటె ఆత్మ భిన్నమని యెఱుంగవలయును ఆ వేరుపరుపబడిన అంగుష్ఠ మాత్ర పురుషుని పరిశుద్ధమైన చిన్మాత్రామృతమయబ్రహ్మముగా దెలియవలయును

అవ - ఆత్మవిద్యాస్తుతికొఱకు నిరూపింపబడిన ఆఖ్యాయిక (కథ) ఉపసంహరింపబడుచున్నది

మూ ॥ *మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా*
*విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్ ।*
*బ్రహ్మప్రాప్తో విరజోఽభూద్విమృత్యు*
*రన్యోఽప్యేవం యో విదధ్యాత్మమేవ ॥* **18**

పద ॥ మృత్యుప్రోక్తాం - నచికేతః - అథ - లబ్ధ్వా - విద్యాం - ఏతాం - యోగవిధిం- చ - కృత్స్నం - బ్రహ్మ - ప్రాప్తః - విరజః - అభూత్- విమృత్యు - అన్యః - అపి - ఏవం - యః - విత్ - అధ్యాత్మం - ఏవ

టీక ॥ నచికేతః = నచికేతసుడు, మృత్యుప్రోక్తాం = యమునిచే చెప్పబడిన, ఏతాం= ఈ, విద్యాం = బ్రహ్మవిద్యను, కృత్స్నం = సమస్తమైన, యోగవిధిం చ = యోగవిధినిన్ని, లబ్ధ్వా = పొంది, అథ = అనన్తరము, బ్రహ్మ = బ్రహ్మస్వరూపమును, ప్రాప్తః = పొందినవాడై, విరజః = పాపరహితుడుగను, విమృత్యుః = పోయినమృత్యువుగలవాడుగను (ముక్తుడుగ) అభూత్ =

ఆయెను, అన్యోఽపి = ఇతరుడుగూడ, యః = ఎవడు, అధ్యాత్మం = ఆధ్యాత్మికవిద్యను (ఆత్మస్వరూపమును), ఏవం ఏవ = ఈప్రకారముగానే, విత్ = తెలిసికొనుచున్నాడో, (సః = వాడు, నచికేతా ఇవ = నచికేతసునివలె, విరజః విమృత్యుః = (బ్రహ్మప్రాప్తి ద్వారా) పాపరహితుడు, మృత్యువిహీనుడును, (భవతి= అగుచున్నాడు)

తా ॥ ఈ ప్రకారము నచికేతసుడు యమునిచేత చెప్పబడిన యాత్మవిద్యను, సాధనఫల విశిష్టమైన యోగవిధిని దెలిసికొని ధర్మాధర్మముల కతీతుడై మరణరహితుడై బ్రహ్మప్రాప్తిని పొందెను ఈ ప్రకారముగానే మఱి యితరు డెవడైనను ఆత్మవిద్యను పొందినయెడల వాడును విరజుడై (పాపరహితుడై) మృత్యురహితుడై బ్రహ్మప్రాప్తిని బడయును

శాంతిమంత్రము -

మూ ॥ ***సహనావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై ।***
***తేజస్వినావధీతమస్తు । మావిద్విషావహై ॥*** ***19***

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

పద ॥ సహ - నౌ - అవతు - సహ - నౌ - భునక్తు -నహ - వీర్యం - కరవావహై - తేజస్వి - నౌ - అధీతం - అస్తు - మా - విద్విషావహై

ఓం - శాంతిః - శాంతిః - శాంతిః

టీక ॥ నౌ = శిష్యాచార్యులమగు మా యిద్దరిని, సహ = కూడ (వేరుచేయక పరమాత్మ), అవతు = రక్షించు గాక ! నౌ = మాయిద్దరిని, సహ = కలసి మెలసి, భునక్తు = ఉపనిషదర్థమును అనుభవింపజేయును గాక ! సహ = మేమిరువురము కూడనే, వీర్యం = బ్రహ్మవిద్యా సామర్థ్యమును, కరవావహై= కలుగజేయుదుముగాక ! (సంపాదితుము గాక !) నౌ = మాయిద్దరియొక్క, అధీతం = అధ్యయనము చేయబడిన బ్రహ్మవిద్య, తేజస్వి = తేజోవంతమైనది, అస్తు = అగుగాక ! మావిద్విషావహై = మేమిద్దరము శిష్యాచార్యులము ఎప్పుడు ద్వేషించుకొనకుందుము గాక !

ఓం శాంతిః శాంతిః శాంతిః = సర్వదోషములు శమించుటకొఱకు లేక ఆధ్యాత్మికాధిభౌతి కాధిదైవికములగు త్రివిధ దుఃఖముల యుపశాంతికై మూడు సారులు శాంతి శబ్దముచ్చరింపబడినది

తా ॥ ఉపనిషచ్ఛ్రుతిపాదితమగు పరమాత్మ శిష్యాచార్యులమగు మమ్మిరువురను రక్షించు గాక !

బ్రహ్మవిద్యాఫలమును మేమిరువురము కలసి మెలసి అనుభవింతుము గాక !

మేమివురము విద్యాసంబంధ సామర్థ్యమును కలసి సంపాదింతుము గాక !

మా యిరువురి స్వాధ్యాయము తేజోవంతమగు గాక !

మేమిరువురము ఒకరి నొకరము ద్వేషించుకొనకుందుము గాక !

అధ్యాత్మికాధిభౌతికాధిదైవిక త్రివిధ తాపశాంతులు చేకూరు గాక !!

కఠోపనిషత్తు ద్వితీయాధ్యాయమందు తృతీయవల్లి సమాప్తము

ఇతి కఠోపనిషత్ సమాప్తా

ఓం తత్ సత్



ఓమ్

# పీఠిక

శ్రీవ్యాసాశ్రమమునకు సంబంధించిన ముముక్షువులలో ముఖ్యులు శ్రీభగవద్గీతను, కఠోపనిషత్తును, పాతంజలయోగదర్శనమును కంఠస్థము జేయవలయునను నియమము గలదు కఠోపనిషత్తుతో సహా ముండకోప నిషత్తున్ను, మాండూక్యోపనిషత్తున్ను పఠనము జేయుట ఉత్తమోత్తమపక్షమని గూడ గలదు ఇట్టి వారికి మాత్రమే సన్న్యాస మివ్వవలయునని నియమమేర్పడి యున్నది పైజెప్పిన మూడుపనిషత్తుల మూలమునకు సంబంధించిన టీకయు హృదయస్థము జేయవలసి యుండును ఈవిషయమై కఠోపనిషత్తు మొదలగు మూడుపనిషత్తుల వ్యాఖ్యానములు జూడగా టీకలోను, తాత్పర్యములోను అతివిస్తారముగా అర్థములు గనపడుటచేత సామాన్య ప్రజ్ఞగలవారు మూలమునకు సంబంధపడిన టీకను మాత్రము జ్ఞాపకము జేసికొనుట కనుకూలముగా పైకనిన మూడుపనిషత్తులను తెనుంగున వ్రాసిన బాగుండునని తలంచుటే యిప్పుడు ముద్రించినలాగున వ్రాయుటకు కారణము విశాలబుద్ధియు, విద్యయు గలవారు బాహుళ్యముగా వ్రాయబడియుండు పైకనబరుప బడిన మూడుపనిషత్తులను చూడవచ్చును

ఈ ఉపనిషదర్థము లతిగహనములగుటచే శ్రీవిద్యారణ్య మునివరుండు ముఖ్యములగు 20 ఉపనిషత్తులకు వివరణముగా వ్రాసియుండు అనుభూతి ప్రకాశములో గల ముండకోపనిషత్తు వివరణము గూడ దీనిలో చేర్చబడినది ఇది శ్లోకరూపమగుటచేతను, ఉపనిషన్మూల మంత్రమునకు సరియైనదగుట చేతను ముముక్షువుల ధారణ కనుకూలమగునని తలంచడమైనది దీనియందున్ను కొన్ని స్థలములలో ఒక్కొక్క ఉపనిష న్మూలమంత్రమునకు విస్తారముగా కొన్ని శ్లోకములు వ్రాసియున్నారు అదియు బహుళమగుటచే అన్నిటిని గ్రహించలేదు, మూలమునకు ముఖ్యముగా అనుకూలపడు ఒకటి గాని, రెండు గాని, మాత్రమే శ్లోకములు చేర్చబడినవి ఎందుకనగా అట్లైన సామాన్యవిద్యయు,

సామాన్యమేధాశక్తియు గల వారికి సహ ఉపనిషన్మూలము టీకయున్న అవగాహనము జేయ అనుకూలముండును కావున ఈ యుపనిషత్తుయొక్క మూలమును మాత్రము హృదయస్థము జేసికొనిన చాలును ఉపనిషత్పఠనము అతిపావనమైనది సమస్త పాపముల నశింపజేయునది సంసార సంబన్ధ శోకసాగరమును తరింపజేయునది పరమాత్మప్రాప్తిని గలుగజేయునది బ్రహ్మానందమునొసంగునది నిరతిశయానందమగు ముక్తిని కలిగించునది అందుచే దీనిని వ్రాయుట అయినది

మూ॥ *స యో హ వై పరమం బ్రహ్మ వేద*
*బ్రహ్మైవ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి ।*
*తరతి శోకం తరతి పాప్మానం*
*గుహా గ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి ॥*

ఎవడు శ్రేష్ఠమగు పరబ్రహ్మము దెలియుచున్నాడో, ఆ మహనీయుడు పరబ్రహ్మ స్వరూపుడగుచున్నాడు ఇట్టి బ్రహ్మవేత్త వంశమునందు ఎప్పుడైన బ్రహ్మవేత్తయయినవాడు పుట్టకపోడు వాడు దుఃఖమును దాటుచున్నాడు పాపముల నతిక్రమించుచున్నాడు అజ్ఞాన గ్రంధులనుండి విముక్తుడై అమృతస్వరూపుడగుచున్నాడు ఓం శివమ్

ఇట్లు
మీ చరాచర సుఖాభిలాషి
**శ్రీమలయాళస్వామి**



# ముణ్డకోపనిషచ్ఛబ్దార్థము

1 ముడి ఖండనే, 2 ముడి మార్జనే, 3 ముడిఖండన ప్రమర్దనయోః అను మూడు ధాతువులకు కప్రత్యయము చేర్చిన ముండకమను శబ్దము నిష్పన్నమగుచున్నది ముండకమనగా 1 అజ్ఞానమును ఖండించునది 2 ముముక్షువులగువారికి సర్వసంశయములను తొలగించునది 3 అవిద్యను ఖండించి సత్యమైన జ్ఞానమును గలుగజేయునది 1 ముముక్షువులగువారి యొక్క దుశ్ఛేద్యమయిన అవిద్యాపాశమును ఖండించుటయందు సమర్థమగుటచేతను, 2 ముముక్షువులగువారియొక్క దుర్భేద్యమగు సంశయ సమూహమును తుడిచివేయుటచేతను, 3 ముముక్షువులయొక్క అజ్ఞానమును ఖండించుటచేతను ముండకోపనిషత్తని చెప్పబడుచున్నది

ఈ ముండకోపనిషత్తునందు 3 ముండకములును, ఒక్కొక్క ముండకమునందు రెండేసి ఖండములున్నవి మొత్తము 3 ముండకములు, 6 ఖండము లిందు గలవు

ఈ ముండకోపనిషత్తు అష్టోత్తర శతోపనిషత్తులలో అయిదవ ఉపనిషత్తగును

మూ ॥ *ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః ।*
*ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ ॥*

తా ॥ 1 ఈశ, 2 కేన, 3 కఠ, 4 ప్రశ్న, 5 ముండ, 6 మాండూక్య, 7 తిత్తిరి, 8 ఐతరేయ, 9 ఛాందోగ్య, 10 బృహదారణ్యక ములని దశోపనిషత్తులు

ఓం తత్ సత్



# ముండకోపనిషత్తు

ఓం  నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥

ఓం  భద్రం కర్ణేభిశ్శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరైరంగైస్తుష్టువాగ్ంస స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః ॥

పదవిభాగము - భద్రం - కర్ణేభిః - శ్రుణయామ - దేవాః - భద్రం - పశ్యేమ - అక్షభిః - యజత్రాః - స్థిరైః - అంగైః - తుష్టువాంసః - తనూభిః - వ్యశేమ- దేవహితం - యత్ - ఆయుః

టీక ॥ దేవాః = ఓ యింద్రాది దేవతలారా ! కర్ణేభిః = మా శ్రోత్రేంద్రియ ములచేత, భద్రం = మంగళపద సమూహమును, శ్రుణుయామ = విందుముగాక, యజత్రాః = పూజనీయులమైన మేము, అక్షభిః = నేత్రములచేత, భద్రం = మంగళప్రదములగు కృత్యములను, పశ్యేమ = చూచెదము గాక, స్థిరైః = చక్కగానున్న, అంగైః = అవయవములచేతను, తనూభిః = అవికలములగు శరీరవములచేతనం, తుష్టువాంసః = మీ సంబంధమైన స్తుతిని జేయుచున్నవారమై, దేవహితం = భగవంతునిచేత మాకొసంగబడిన, యత్= ఏ, ఆయుః = అయుస్సు గలదో, ( తత్ = ఆ ఆయుస్సును) వ్యశేమ = చక్కగా పొందుదుము గాక!

తా ॥ ఓ యింద్రాది దేవతలారా ! మీ యనుగ్రహమువలన ఎల్లప్పుడు మా చెవులతో సత్యసిద్ధాంతమునే శిష్యాచార్యులమగు మేము వినుచుందుము గాక! అట్టి సచ్ఛ్రవణముచేత పవిత్రులమైన మేము సర్వకాలములయందు సత్కృత్యములనే చూచుచుందుము గాక! భగవంతుడు మాకనుగ్రహించి యిచ్చి యున్న కరచరణాద్యఖిలావయవములు చక్కగా ఆ యా కర్మలను నిర్వహించుకొనుటకు సమర్థములై యుండి అతడొసంగిన సంపూర్ణ ఆయుస్సును జీవించియుందుము గాక!

# ప్రథమ ముణ్డకే - ప్రథమః ఖండః

మూలం ॥ ఓం బ్రహ్మా దేవానాం ప్రథమస్సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా ।
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా
మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ ॥ ౧

పద ॥ బ్రహ్మా - దేవానాం - ప్రథమః - సంబభూవ - విశ్వస్య - కర్తా - భువనస్య - గోప్తా - సః - బ్రహ్మవిద్యాం - సర్వవిద్యాప్రతిష్ఠాం - అథర్వాయ - జ్యేష్ఠపుత్రాయ - ప్రాహ

టీక ॥ విశ్వస్య = ప్రపంచమును, కర్తా = సృష్టించువాడును, భువనస్య = లోకమును, గోప్తా = పాలించువాడునగు, బ్రహ్మా = బ్రహ్మదేవుడు ,దేవానాం = దేవతలలోపల, ప్రథమః = మొదటివాడు, సంబభూవ = ఆయెను, సః = ఆబ్రహ్మ, జ్యేష్ఠపుత్రాయ = మొదటి కుమారుడగు, అథర్వాయ = అథర్వుడను వానికొఱకు, సర్వవిద్యాప్రతిష్ఠాం = సమస్తవిద్యలకు ఆశ్రయమైన, బ్రహ్మవిద్యాం= బ్రహ్మవిద్యను, ప్రాహ = చెప్పెను

తా ॥ ఈ అథర్వణోపనిషత్తునందు గురువుయొక్క అనుగ్రహము చేత పొందదగిన బ్రహ్మవిద్య చెప్పబడియున్నది దీనిచే బ్రహ్మజ్ఞానార్థులగు సత్పురుషుల అజ్ఞానస్వరూపములైన హృదయగ్రంధులు నశించుచున్నవి ఈ ఉపనిషత్తు శ్రద్ధాభక్తి పూర్వకముగా బ్రహ్మవిద్యను ఆత్మభావనచేత పొందువారలకు గర్భజన్మజరారోగములు మొదలగు అనర్థసముదాయమును నశింపజేయుచు పరబ్రహ్మ ప్రాప్తిని కలుగజేయుచున్నది కనుక బ్రహ్మవిద్యా ప్రతిపాదకమగు ఈ ఉపనిషత్తు ప్రారంభింపబడుచున్నది సృష్టి కర్తయైన, జగత్పాలకుడగు, ఇంద్రాదిదేవతలలో మొదటివాడైన ఆ బ్రహ్మ సర్వసృష్టిలో మొదటి పుత్రుడగు అథర్వుడను వానికొఱకు ఏ విద్యచేత తెలియదగిన సర్వవిద్యలు సమాప్తియై జనుడు సర్వవిద్యాసంపన్నుడగునో అట్టి సర్వవిద్యాశ్రయమైన బ్రహ్మవిద్యను చెప్పెను

**అనుభూతి ప్రకాశము, షష్ఠాధ్యాయము**

బ్రహ్మవిద్యాం శౌనకాయ యామువాచాంగిరా మునిః ।
అధర్వణే ముణ్డకేఽసౌ విశదీకృత్య వక్ష్యతే ॥ 1

శౌనకఋషికి ఏబ్రహ్మవిద్యను యంగిరసముని చెప్పినాడో అధర్వణ వేదమందలి ముండకోపనిషత్తులో జెప్పంబడిన యా విద్యను నేను స్పష్ట పరతును

మూలం ॥ అధర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽ,
ధర్వా తాం పురోవాచాంగిరే బ్రహ్మవిద్యామ్ ।
స భారద్వాజాయ సత్యవాహాయ ప్రాహ
భారద్వాజోఽం గిరసే పరావరామ్ । 2

పద ॥ అధర్వణే - యాం - ప్రవదేత - బ్రహ్మ - అధర్వా - తాం - పురా- ఉవాచ- అంగిరే - బ్రహ్మవిద్యాం - సః - భారద్వాజాయ - సత్యవాహాయ - ప్రాహ- భారద్వాజః - అంగిరసే - పరావరా

టీక ॥ బ్రహ్మ = బ్రహ్మ, యాం = ఏబ్రహ్మ విద్యను, అధర్వణే = అధర్వుడనువాని కొఱకు , ప్రవదేత = చెప్పెనో, అధర్వా =అధర్వుడు, పురా = పూర్వము, తాం = ఆ, బ్రహ్మవిద్యాం = బ్రహ్మ విద్యను, అంగిరే = అంగిరునికొఱకు, ఉవాచ = చెప్పెను, సః = ఆ అంగిరుడు, భారద్వాజాయ = భారద్వాజ గోత్రుడగు, సత్యవాహాయ = సత్యవాహుడనెడివానికొఱకు, ప్రాహ = తెలిపెను, భారద్వాజః = భారద్వాజుడు, అంగిరసే = అంగిరసునికొఱకు, పరావరాం = వరుసగా వచ్చిన, (తాం = ఆ బ్రహ్మవిద్యను) ప్రాహ = ఉపదేశించెను

తా ॥ బ్రహ్మదేవుడు అధర్వునికొఱకు ఏ బ్రహ్మవిద్యను జెప్పెనో, ఆ బ్రహ్మవిద్యను పూర్వము అధర్వుడు అంగిరునికొరకున్ను, అంగిరుడు భారద్వాజునికొఱకున్ను, భారద్వాజుడు అంగిరసునకొఱకున్ను ఈ ప్రకారము క్రమముగా ఒకరికి ఒకరు పరంపరగా బోధించినవారైరి

అను ॥ చతుర్ముఖాదికే సంప్రదాయే యో మునిరఙ్గిరాః ।
ఉపసద్య యథాశాస్త్రమేతం పప్రచ్ఛ శౌనకః ॥ 2

బ్రహ్మ మొదలుకొనిన సంప్రదాయములోనివాడగు నంగిరుని శాస్త్రప్రకారము సేవించి ఈ శాస్త్రమును శౌనకుడడిగెను

మూ ॥ శౌనకో హ వై మహాశాలో ఽఙ్గిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ
కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి ॥ 3

పద ॥ శౌనకః - హ - వై - మహాశాలః - అంగిరసం - విధివత్ - ఉపసన్నః- పప్రచ్ఛ- కస్మిన్ - ను - భగవః - విజ్ఞాతే - సర్వం - ఇదం - విజ్ఞాతం - భవతి - ఇతి

టీక ॥ మహాశాలః = గొప్ప గృహస్థుడగు, శౌనకః = శౌనకుడు, హవై = ప్రసిద్ధముగా, అంగిరసం = భారద్వాజ పుత్రుడగు అంగిరసుని గురించి, విధివత్ = శాస్త్రోక్త ప్రకారము, ఉపసన్నస్సన్ = సమీపించినవాడై, హే భగవః = పూజ్యుడవగు ఓ అంగిరస మహర్షీ, కస్మిన్ను = ఏది, విజ్ఞాతే = తెలుసుకొన బడుచుండగా, ఇదం = ఈ, సర్వం = సమస్తము, విజ్ఞాతం = తెలియబడినది, భవతీతి = అగుచున్నదని, పప్రచ్ఛ = అడిగెను

తా ॥ గొప్ప గృహస్థుడైన శౌనకుడను ఋషి ఈ పూర్వము చెప్పిన ప్రకారము బ్రహ్మ మొదలుకొని గురుశిష్య న్యాయముచే ఒకరి వలన ఒకరు పొందుటచేత పరంపరాగతమైన యా బ్రహ్మవిద్యను భారద్వాజునివలన పొంది బ్రహ్మవేత్తయై యుండెడు అంగిరసునిగూర్చి శాస్త్రమందు జెప్పిన ప్రకారము పుష్పసమిత్కుశ ఫలాదులను తీసుకొని పోయి పూజించి పూజ్యుడవగు ఓ అంగిరస మహర్షీ ! జనుడు ఏ వస్తువును తెలిసికొనుచుండగా ఈ కనపడెడి సమస్తమున్నూ తెలియబడినదగుచున్నదో దానిని నాకుపదేశించుమా యని ప్రార్థించి అడిగెను

అను ॥ ఏకస్మిన్విదితే సర్వం విజ్ఞాతమితి వైదికీ ।
ప్రసిద్ధిరస్తి తద్వస్తు కిం స్యాన్నిశ్చిత్య మే వద ॥ 3

ఒక్కటి తెలిసిన సర్వము దెలియునని శ్రుతియందు ప్రసిద్ధము కలదు ఆ వస్తువేదో నిశ్చయించి నాకుం జెప్పుము

మూ ॥ తస్మై సహోవాచ ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ । ४

పద ॥ తస్మై - సః - హ - ఉవాచ - ద్వే - విద్యే - వేదితవ్యే - ఇతి - హ - స్మ - యత్ - బ్రహ్మవిదః - వదంతి - పరా - చ - ఏవ - అపరా- చ

టీక ॥ సః = ఆ అంగిరసుడు, తస్మై = అ శౌనకునికొఱకు, ఉవాచ హ = వచించెను బ్రహ్మవిదః = వేదార్థమును చక్కగా తెలిసినవారు, యత్ = పరమాత్మ వస్తువును, (ప్రాప్తుం = పొందుటకొఱకు) ద్వే = రెండైన, విద్యే = విద్యలు, వేదితవ్యే = తెలిసికొనదగినవి, ఇతిహస్మ= ఈప్రకారము, వదంతి = చెప్పుచున్నారో, (తే = ఆ రెండు విద్యలు), పరా చైవ = పరమాత్మ విద్యయున్ను, అపరా చ = అపరమాత్మ విద్యయున్ను

తా ॥ శౌనకుడిట్లడుగగా అంగిరసుండు వేదార్థా భిజ్ఞులగువారు శ్రేష్ఠమగు పరమాత్మ విద్యనున్ను, ధర్మాధర్మసాధనములను ఆధర్మా ధర్మ ఫలములనున్ను తెలియపరచెడి అపరవిద్యనున్ను ఈ రెండు విద్యలను తెలిసికొనదగినవిగా జెప్పుచున్నారని ఆ శౌనకునితో వచించెను

అను ॥ శృణు విద్యే ఉభే తావద్వేదితవ్యే పరాపరే ।
పృష్టం వస్తు తయోర్మధ్యే గమ్యతే పరవిద్యయా । 4

వినుము, రెండు విద్యలు తెలియదగినవి, పరవిద్య, యపర విద్యయని నీవడిగిన వస్తు వారెంటిలో పరవిద్యచేత దెలియనగును

మూ ॥ తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి । అథ పరా యయా తదక్షరమధిగమ్యతే ॥ ೫

పద ॥ తత్ర - అపరా - ఋగ్వేదః - యజుర్వేదః - సామవేదః - అథర్వవేదః- శిక్షా- కల్పః- వ్యాకరణం - నిరుక్తం - ఛందః - జ్యోతిషం - ఇతి - అథ - పరా - యయా - తత్ - అక్షరం - అధిగమ్యతే

టీక ॥ తత్ర = ఈ పూర్వము జెప్పిన ఆపరాపర విద్యలలో, ఋగ్వేదః = ఋగ్వేదమున్ను, యజుర్వేద = యజుర్వేదమున్ను, సామవేదః =

సామవేదమున్ను, అధర్వవేదః = అధర్వవేదమున్ను, శిక్షా = శిక్షాశాస్త్రమున్ను, కల్పః = కల్ప శాస్త్రమున్నూ, వ్యాకరణం = వ్యాకరణశాస్త్రమున్ను, నిరుక్తం= నిరుక్త శాస్త్రవమున్ను, ఛందః = ఛందశ్శాస్త్రవమున్ను, జ్యోతిషం = జ్యోతిశ్శాస్త్రవమున్ను, (ఏతే = ఈ నాలుగు వేదములున్ను ఆరు శాస్త్రములున్ను) అపరా ఇతి = అపరవిద్య యని (ఉచ్యతే = చెప్పబడు చున్నది) అధ = ఇప్పుడు, యయా = ఏ బ్రహ్మవిద్యచేత, తత్ = ఆ ప్రసిద్ధమైన (ముందు జెప్పబోయెడు విశేషణములుగల), అక్షరం = నాశరహితమగు పరబ్రహ్మము, అధిగమ్యతే = పొందబడుచున్నదో, (సా= ఆపరబ్రహ్మ విద్య) పరా = శ్రేష్ఠమైన బ్రహ్మవిద్య యని (ఉచ్యతే = చెప్పబడుచున్నది)

తా ॥ ఓ శౌనకా ! ఆ పరాపరవిద్యలలో ఋగ్యజుస్సామాధర్వణము లనెడి నాలుగు వేదములున్ను, ఆ వేదార్థమును తెలియజేసెడి శిక్షాకల్పవ్యాకరణాది ఆరు శాస్త్రములున్ను ఇవి యన్నియు జేరి అపరవిద్యయని చెప్పబడుచున్నది ఏ విద్యచేత నాశరహితమైన యీముందు జెప్పబోయెడి లక్షణములుగల పరబ్రహ్మస్వరూపమును పొందబడునో అట్టి పరబ్రహ్మ ప్రతిపాదకమైన బ్రహ్మవిద్య పరవిద్యయని చెప్పబడుచున్నదని ఈ ప్రకారము అంగిరసు డాపరా పర విద్యలను గురించి వాని విభాగము శౌనకునితో జెప్పెను

అను ॥ **షడంగసహితా వేదా విజ్ఞాయన్తే యయా ధియా ।**
**సా ధీరపరవిద్యా స్యాద్బ్రహ్మధీస్తు పరా మతా ॥** 5

ఆరు అంగములతో గూడిన నాలుగు వేదములు దేనిచే దెలియబడునో యది యపరవిద్య యగును బ్రహ్మజ్ఞానమగుచో పరవిద్య యనబడును

మూ ॥ **యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం**
**నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం**
**యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః ॥** ౬

పద ॥ యత్ - తత్ - అద్రేశ్యం - అగ్రాహ్యం - అగోత్రం - అవర్ణం - అచక్షుశ్శ్రోత్రం- తత్ - అపాణిపాదం - నిత్యం - విభుం - సర్వగతం - సుసూక్ష్మం - తత్ - అవ్యయం - యత్ - భూతయోనిం - పరి - పశ్యంతి ధీరాః

టీక ॥ యత్ = ఏ బ్రహ్మతత్వము ముందు జెప్పబడగలదో, తత్ = ఆ బ్రహ్మతత్త్వము, అద్రేశ్యం = బుద్ధీంద్రియములచేత గ్రహించుట కలవి గానిది, అగ్రాహ్యం = కర్మేంద్రియములచేత గ్రహించుటకు శక్యముగానిది, అగోత్రం = కాశ్యపాది గోత్రములు లేనిది, అవర్ణం= వర్ణములేనిది, అచక్షుశ్శ్రోత్రం = నేత్రములు చెవులు లేనిది తత్ = ఆ అక్షరస్వరూపము, అపాణిపాదం = హ స్తపాదము లేనిది, నిత్యం = శాశ్వతమైనది, విభుం = అంతటవ్యాపించినది, సర్వగతం = అంతట పొందియుండెడిది, సుసూక్ష్మం= మిక్కిలి సూక్ష్మమైనది, తత్ = ఆ అక్షరస్వరూపము, అవ్యయం = నాశరహితమై నది, ధీరాః = జ్ఞానులు, యత్ = ఏ యీ లక్షణమగు, భూతయోనిం = సకలభూతములకు కారణభూతమైన, పరిః= సర్వమునకు అంతటను ఆత్మ రూపమైన, (అక్షరం = నాశనరహితమైన పరమాత్మ స్వరూపమును) పశ్యంతి = చూచుచున్నారు

తా ॥ శౌనకా ! ఆ అక్షరస్వరూపము జ్ఞానేంద్రియములచేత తెలుసుకొనుటకున్ను, కర్మేంద్రియములచే గ్రహించుకొనుటకున్ను శక్యముగానిదై సర్వమునకు తానే ఆధారమైనదై తనకేదియు నాధారములేనిదై సర్వవస్తువులయొక్క స్థూలత్వాది ధర్మములున్నూ లేనిదై జ్ఞానేంద్రియములగు చక్షురాదీంద్రియ ములున్ను, కర్మేంద్రియములగు వాగాదీంద్రియములున్ను, ఆ యింద్రియ గోచరములగు శబ్దాదివిషయములున్నూ లేనిది గనుకనే శాశ్వతస్వరూపమై బ్రహ్మమొదలు స్తంబమువరకు నుండెడి అనేకవిధములైన జీవులయొక్క భేదములలో అభేదమై అతిసూక్ష్మమై అంతట నిండియున్నది ఇట్టి యక్షరమగు ఆత్మతత్త్వము దేనిచేత పొందబడుచున్నదో అదియే పరావిద్య యని తాత్పర్యము

అను ॥ జ్ఞానేంద్రియైర్న విజ్ఞేయం గ్రాహ్యం కర్మేంద్రియైర్న వా ।
న గోత్రం కాశ్యపాద్యస్తి వర్ణశ్శుక్లాదికశ్చన ॥
న జ్ఞానేంద్రియమస్త్యస్య నాపి కర్మేంద్రియం తథా ।
నిత్యాఽక్షరపదార్థోఽయం తద్వినాశానిరూపణాత్ ।
విభుర్వివిధభావిత్వాత్తచ్చ సర్వాత్మకత్వతః ॥
అకాశవత్సర్వగోఽతః పరిచ్ఛేదో న దేశతః ।
న కాలతోఽపి నిత్యత్వాద్విభుత్వాన్నాపి వస్తుతః ॥ 6

ఆ అక్షరపరబ్రహ్మము జ్ఞానేంద్రియములచేతగాని, కర్మేంద్రియ ములచేతగాని తెలియబడదని చెప్పబడుచున్నది కాశ్యపాది గోత్రములావస్తువు నకు లేవు శుక్లాది వర్ణములు లేవు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు లేవు దానికి నాశము చెప్పబడనందున అక్షరవస్తువు, నిత్యము అది సర్వవస్తు రూపమయినందున సర్వవ్యాపి కనుక విభువు అకాశమువలె సర్వవ్యాపి ఇంతమేర నున్నదని దేశముతో గొలువబడదు ఇన్ని రోజులుండునని కాలముతో గొలువబడదు సర్వవ్యాపి గనుక ఇంత యున్నదని వస్తువుతోను కొలుచుటకు వీలు లేదు

మూ ॥ *యస్మాత్పరం నాపరమస్తి కించి*
*ద్యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్।*
*వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక*
*స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ॥* ౭

పద ॥ యస్మాత్ - పరం - న - ఆపరం - అస్తి - కించిత్ - యస్మాత్ - న- అణీయః- న - జ్యాయః - అస్తి - కః - చిత్ - వృక్షః - ఇవ - స్తబ్ధః - దివి - తిష్ఠతి - ఏకః - తేన - ఇదం - పూర్ణం - పురుషేణ- - సర్వం

టీక ॥ యస్మాత్ = ఏ అక్షరస్వరూపుడగు పరమాత్మకంటె, పరం = శ్రేష్ఠమైనదిన్నీ, ఆపరం = ఇతరమైనదిన్నీ, కించిత్ = కొంచమైనను, నాస్తి = లేదో, యస్మాత్= ఏ అక్షరస్వరూపుడగు పరమాత్మకంటె కశ్చిత్ = ఒకానొకటియగు, అణీయః= సూక్ష్మమున్ను, జ్యాయః= స్థూలమున్ను, నాస్తి = లేదో ఏకః = అద్వితీయుడగు ఆ పరమాత్మ, దివి = పరమపదమునందు, వృక్ష ఇవ = వృక్షమువలెనే, స్తబ్ధః = తటస్థుడై, తిష్ఠతి = ఉంటున్నది, తేన = అటువంటి, పురుషేణ = పరిపూర్ణుడగు పరమాత్మచేత, ఇదం = ఈ, సర్వం = సమస్తమున్ను, పూర్ణం = వ్యాప్తమై నిండియున్నది

తా ॥ ఓ శౌనకా ! నాశరహితుడగు ఏపరమాత్మ తనకంటె కొంచెమైనను శ్రేష్ఠమైనదియు, అన్యమైనదియు లేనివాడై తనకంటె మిక్కిలి సూక్ష్మమైనదియు, మహత్తైనదియు, ఒకటియు లేనివాడై పరమపదమందు వృక్షమువలెనే సర్వసముడై తటస్థుడుగా నున్నాడో, అన్నిటియందు ప్రవేశించి పూర్ణుడైన ఆ పరమపురుషునిచేత ఈ చూడబడెడి ఆకాశాది సర్వమున్నూ నిండి వ్యాప్తమై యున్నదని అంగిరసుడు చెప్పెను

అను ॥ సర్వగస్యాపి సూక్ష్మత్వాదక్షాగోచరతోదితా ।
పరిమాణాల్పతా నాత్ర సౌక్ష్మ్యం దుర్లక్ష్యతా తు తత్ ॥ 7

సర్వత్ర ఉండినను సూక్ష్మరూపము గనుక కనులకు గనపడదని చెప్పబడెను పరిమాణమల్పమగుటయే సూక్ష్మత్వము కాదు చూడశక్యము గానిదని తాత్పర్యము

మూ ॥ యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యామోషధయః సంభవంతి ।
యథా సతః పురుషాత్కేశలోమాని
తథాఽక్షరాత్ సంభవతీహ విశ్వమ్ ॥ ౮

పద ॥ యథా - ఊర్ణనాభిః - సృజతే - గృహ్ణతే - చ - యథా - పృథివ్యాం- ఓషధయః - సంభవంతి - యథా- సతః - పురుషాత్ - కేశలోమాని- తథా- అక్షరాత్ - సంభవతి - ఇహ -విశ్వం

టీక ॥ ఊర్ణనాభిః = సాలెపురుగు, యథా = ఏ ప్రకారము, తంతూన్ = దారములను, సృజతే = సృష్టించుచున్నదో, గృహ్ణతే చ = గ్రహించుచున్నదో, పృథివ్యాం = భూమియందు, ఓషధయః = తరుగుల్మలతాదులు, యథా = ఏ ప్రకారము సంభవంతి = పుట్టుచున్నవో, సతః = ఉన్నటువంటి (జీవించియున్న), పురుషాత్= పురుషునివలన, కేశలోమాని = కేశలోమములు, యథా = ఏ ప్రకారము (పుట్టుచున్నవో), తథా = ఆ ప్రకారము, అక్షరాత్ = ఆపూర్వోక్తమైన నాశనరహితమగు పరమాత్మనుండి, ఇహ = ఈ సంసారమండలమందు, విశ్వం = సమస్త జగత్తు, సంభవతి = పుట్టుచున్నది

తా ॥ ఓ శౌనకుడా ! సాలెపురుగు తనయందు వేరొక సహాయము లేకయే దారములను సృజించి తిరిగి ఎట్లు తనలోనికి తీసికొని తనరూపముగా జేయుచున్నదో, వృక్షలతాదులు భూమినుండి పుట్టుచున్నవో, పురుషునివలన వానికి విలక్షణములైన వెంద్రుక లెట్లు పుట్టుచున్నవో, ఆ ప్రకారము సమస్త జగుత్తు నాశరహితమైన ఆ పరమాత్మనుండి అసహాయమై, అభిన్నమై , విలక్షణమై ఈ సంసార సమూహమునందు పుట్టుచున్నది

అను ॥ బహ్వ్యోషధ్యో యథైకస్యా భూమేర్జాతా యథా జడాః ।
కేశాశ్చేతనతో జాతాస్తథా త్వక్షరతో జగత్ ॥ 8

ఊర్ణనాభిర్యథా తంతూన్ సృజతే సంహరత్యపి ।
అన్యానపేక్షస్తద్వత్స్యాదక్షరస్యాపి హేతుతా ॥ 9

అనేక ఓషధులు ఒకేభూమినుండి యెట్లు పుట్టుచున్నవో, చేతనునినుండి వెంట్రుకలు పుట్టుచున్నవో, అక్షరునినుండి జగత్తట్లే పుట్టుచున్నది సాలెపురుగు తనలోనుండి దారముల నెట్లు సృజించు చున్నదో ,ఎట్లు వాటిని తనలో లయ మొనరించుచున్నదో అట్లు అక్షరునిలోనుండి జగత్తుయొక్క సృష్టిలయములు జరుగును సాలెపురుగునకు గూడ ఇతరసాధనములు లేవు అట్లే ఇతరసాధనములు అక్షరునికి లేవు

మూ ॥ *తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమభిజాయతే ।*
*అన్నాత్ప్రాణో మనస్సత్యం లోకాః కర్మసు చామృతమ్ ॥* ౮

పద ॥ తపసా - చీయతే - బ్రహ్మ - తతః - అన్నం - అభిజాయతే - అన్నాత్ - ప్రాణః - మనః - సత్యం - లోకాః - కర్మసు - చ - అమృతం

టీక ॥ బ్రహ్మ = భూతయోనియు అక్షరమునగు బ్రహ్మము, తపసా = జ్ఞానతపస్సుతో, చీయతే = వృద్ధిపొందింపబడుచున్నది, తతః = ఆ బ్రహ్మమునుండి, అన్నం = అవ్యాకృతము, అభిజాయతే = పుట్టుచున్నది, అన్నాత్ = అవ్యాకృతమునుండి, ప్రాణః = హిరణ్యగర్భుడున్ను ( తస్మాత్ = ఆ ప్రాణమునుండి), మనః = మనస్సున్ను, ( తస్మాత్ = సంకల్పాదిరూపమైన మనస్సువలన), సత్యం = సత్యమను పేరుగల ఆకాశాది భూతపంచకమున్ను ఆ భూతపంచకమునుండి), లోకాః = భూమి మొదలగు ఏడులోకములున్ను, కర్మసు చ = కర్మల యందున్ను, అమృతం = ఆ కర్మఫలమున్ను, ( అభిజాయతే = పుట్టుచున్నది)

తా ॥ ఓ శౌనకుడా ! ఈ పూర్వము జెప్పిన ప్రకారము అసహాయాభిన్న విలక్షణరూపముగా భూతకారణమైనటువంటిన్నీ, నాశన రహితమైనటువంటిన్నీ, సృష్టిస్థితి సంహారజ్ఞాన తపస్సులచేత వృద్ధి బొందిన ఆ పరబ్రహ్మమునుండి జగత్తును పలుతెరంగుల జేయవలయు ననెడి యిచ్ఛావిషయ మైన అవస్థారూపమగు అవ్యాకృతమున్ను, అట్టి అవస్థవలన బ్రహ్మయొక్క జ్ఞానక్రియాశక్తులచేత

నధిష్ఠింపబడినటువంటివన్నీ, జగత్తునకు సాధారణమైన అవిద్యాకామ కర్మ భూతసముదాయ బీజాంకురమై నటువంటివన్నీ, జగదాత్మయైనటువంటి ప్రాణాఖ్యమగు హిరణ్యగర్భుడున్ను, ఆ హిరణ్యగర్భునివలన సంకల్పవికల్పాది రూపమగు మనస్సున్ను, ఆ మనస్సువలన సత్యమనుపేరుగల పృధివ్యాది భూతపంచకమున్ను, ఆ భూతపంచకమునుండి భూలోకాది ఏడులోకములున్ను, ఆ లోకముల యందలి సమస్త జీవులయొక్క కర్మలున్ను, అమృతరూపమైన ఆ కర్మఫలమున్ను క్రమముగా అవ్యాకృతాది సమస్తమును సృష్టి యయ్యెను

అను ॥ వక్ష్యమాణేన తపసా బ్రహ్మోదాపుపచీయతే ।
భోగ్యవర్గాంకురాఖ్యం యదన్నం తజ్జాయతే తతః ।
అవ్యాకృతం వ్యాచికీర్షావస్థమన్నమిహోచ్యతే ॥ 10

తస్మాదన్నాత్క్రియాశక్తిః ప్రాణో జ్ఞానస్య సాధనమ్ ।
మనశ్చాజాయత స్థూలం సత్యాఖ్యం భూతపంచకమ్ ॥ 11

తతో భూమ్యాదయో లోకా జ్యోతిష్టోమాదికర్మసు ।
అమృతాఖ్యం స్వర్గఫలం ఇత్థం సర్వమజాయత ॥ 12

తపస్సుచేత మొదట బ్రహ్మము వృద్ధినొందుచున్నది అనుభవింపవలసిన వస్తువులయొక్క అంకురమనెడి వస్తువేయన్నము గలదో అదే దానినుండి పుట్టుచున్నది సృష్టిచేయు నిచ్ఛతోగూడిన యవస్థను బొందియున్న అవ్యాకృతము అన్న మనబడును దానినుండి యన్నమును కలిగించు శక్తియు జ్ఞానసాధనమగునట్టి ప్రాణము బుట్టెను మనస్సును , స్థూలములును, సత్యమనంబడు పంచభూతములును పుట్టెను పిమ్మట భూమ్యాదిలోకములు జ్యోతిష్టోమాది కర్మలందు అమృతమను పేరు గల స్వర్గఫలమున్ను ఇట్లు సర్వమున్ను పుట్టెను

మూ ॥ యస్సర్వజ్ఞ స్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః ।
తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే ॥ ౧౦

ఇతి ప్రధమముండకే ప్రధమః ఖండః

పద ॥ యః - సర్వజ్ఞః - సర్వవిత్ - యస్య - జ్ఞానమయం - తపః - తస్మాత్ - ఏతత్ - బ్రహ్మ - నామ - రూపం - అన్నం - చ - జాయతే

టీక ॥ సర్వజ్ఞః = సర్వమును తెలిసినవాడు, సర్వవిత్ = విశేషముగా సమస్తము నెరింగినవాడును, యః = అక్షరస్వరూపుడగు పరమాత్మ ఎవడో, యస్య = ఏ పరమాత్మకు, జ్ఞానమయం = జ్ఞానమే, తపః = తపస్సో, తస్మాత్ = అట్టి అక్షరస్వరూపుడగు పరమాత్మనుండి, ఏతత్ = ఈ పూర్వోక్తమైన, బ్రహ్మ= హిరణ్యగర్భుడున్నూ, నామ = దేవదత్త యజ్ఞదత్త ఇత్యాది లక్షణమైన పేరున్ను, రూపం = శుక్లకృష్ణాదిరూపమున్ను, అన్నం చ = వ్రీహియవాది రూపమైన అన్నమున్ను, జాయతే = పుట్టుచున్నది

తా ॥ ఓ శౌనకుడా ! సమష్టిరూపమైన మాయ యనుపేరుగల ఉపాధితో గూడుకొని సామాన్యముగా సర్వమును తెలుసుకొనుచున్నటువంటినీ్న, వ్యష్టిరూపమైన అవిద్య యను ఉపాధితో గూడుకొని అనంతమైన జీవభావముపొంది సృజింపబడిన సర్వమును విశేషముగా తెలుసుకొనుచున్న టువంటినీ్న, జ్ఞానమనుపేరు గల తపస్సు గల ఆయక్షర పరబ్రహ్మనుండి హిరణ్యగర్భుడగు బ్రహ్మయున్ను, దేవదత్తాది నామములున్ను, శుక్ల పీతాదిరూపములున్ను, యవాదిరూపమగు అన్నమున్ను ఈ సమస్తమును పుట్టుచున్నది

అను ॥ **సామాన్యవృత్త్యా సర్వజ్ఞో విశేషేణ చ సర్వవిత్ ।**
**జ్ఞానమేవ తపోఽస్యాస్మాజ్జగద్వేదాద్యజాయత ॥** **13**

సామాన్య వ్యాపారముతో సర్వజ్ఞుడు, విశేషజ్ఞానముతో సర్వవేత్త, ఈతనికి జ్ఞానమే తపస్సు, అందుండి జగత్తు వేదము మొదలగునవి పుట్టెను

ఇతి ప్రథమముండకే ప్రథమఖండః సమాప్తః

ప్రథమ ముండకమునందు ప్రథమఖండము సమాప్తము



ఓమ్

# ప్రథమ ముణ్డకే ద్వితీయః ఖండః

మూ ॥ ఓం తదేతత్సత్యం మంత్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యం
స్తాని త్రేతాయాం బహుధా సంతతాని ।
తాన్యాచరథ నియతం సత్యకామా
ఏష వః పన్థాస్సుకృతస్య లోకే ॥ ౧

పద ॥ తత్ - ఏతత్ - సత్యం - మంత్రేషు - కర్మాణి - కవయః - యాని- అపశ్యన్- తాని - త్రేతాయాం - బహుధా - సంతతాని - తాని - అచరథ - నియతం- సత్యకామాః - ఏషః - వః - పన్థాః - సుకృతస్య - లోకే

టీక ॥ తదేతత్ = ఆ యిది (ప్రసిద్ధమైన ఈ ముందు చెప్పబోయెడి కర్మమార్గము) సత్యం = వ్యర్థము కానిది, కవయః = జ్ఞానులగు వసిష్ఠాది మహర్షులు, మంత్రేషు = ఋగ్యజుస్సామాది మంత్రములయందు, యాం = ఏ, కర్మాణి= అగ్నిహోత్రాది కర్మలను, అపశ్యన్ = చూచిరో, తాని = ఆ కర్మలు, త్రేతాయాం= యజ్ఞకర్మ యందు, బహుధా = అనేక విధములుగా, సంతతాని= ఆచరింపబడినవి, (యూయం = మీరు), తాని = అకర్మలను, సత్యకామాః = సత్యమైనకోర్కె గలవారలై, నియతం = నిత్యము, ఆచరథ = చేయుడీ!, వః = మీయొక్క, సుకృతస్య = స్వయముగా జేయబడిన కర్మకు, లోకే = ఫలమందు, ఏషః = ఇది, పంథాః = మార్గము

తా ॥ ఓ శౌనకుడా ! ఆ ప్రసిద్ధమైన కర్మమార్గము వ్యర్థము కానిది మహాజ్ఞానసంపత్తుగల వసిష్ఠాది బ్రహ్మర్షులు ఋగాదివేదములయందు ఏ కర్మలను బాగుగా చూచియుండిరో అట్టి కర్మలు (త్రేతాయుగమునందు) యజ్ఞకర్మయందు కర్మపరులచే బాగు ననుష్ఠింపబడినవి కనుక మీరున్ను కర్మఫలము నతిక్రమించని సత్యమైన కోర్కెలు గలవారలై యెల్లప్పుడు ఆ కర్మలను ఆచరించుడు ఇదియే మీచేత చేయబడిన ఆ కర్మఫలము బొందుటకు ముఖ్యమైన మార్గము

అను ॥ హే సత్యకామాః కర్మాణి మన్త్రబ్రాహ్మణదర్శినః ।
కురుధ్వమేష వః పన్థా భోగమోక్షప్రసిద్ధయే ॥

ఓ సత్యమును కోరినవారలారా ! వేదమంత్రములు బ్రాహ్మణములు తెలిసినవారలారా ! కర్మలను జేయుడు, భోగమోక్షములు సిద్ధించుటకు మీకిది మార్గము

మూ ॥ *యదా లేలాయతే హ్యర్చిస్సమిద్ధే హవ్యవాహనే । తదాఽఽజ్య భాగావంతరేణాఽఽహుతీః ప్రతిపాదయేచ్ఛ్రద్ధయాహుతమ్ ॥ 2*

పద ॥ యదా - లేలాయతే - హి - అర్చిః - సమిద్ధే - హవ్యవాహనే - తదా - ఆజ్యభాగౌ - అంతరేణ - ఆహుతీః - ప్రతిపాదయేత్ - శ్రద్ధయా - హుతమ్

టీక ॥ యదా = ఎప్పుడు, అర్చిః = జ్వాల, సమిద్ధే = ఇంధనవములచేత ప్రజ్వలింపబడిన, హవ్యవాహనే = అగ్నియందు, లేలాయతే హి = చలించుచున్నదియో, తదా = అప్పుడు, అజ్యభాగావన్తరేణ = ఆ జ్యభాగముల యొక్క మధ్య యందు, ఆహుతీః = హోమములను, ప్రతిపాదయేత్ = చేయవలయును, శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధితో, హుతం = హోమము చేయబడినది ( సమ్యక్చరణం = బాగుగా నాచరింపబడినది, భవేత్ = అగును)

తా ॥ ఓ శౌనకుడా, కట్టెలచేత జ్వలింపజేయబడిన అగ్నియం దెప్పుడు జ్వాల చలించునో, అప్పుడు ఆహుతులను వేల్చవలయును అట్లు చేసినయెడల ఆహుతి ప్రక్షేపణ రూపమైన ఈకర్మమార్గము ఉత్తమలోక ప్రాప్తికొరకై నవమార్గము ఇట్లు శ్రద్ధతో హోమము నొనర్చుటచేత కర్మ బాగుగా నాచరింపబడినదగును

అను ॥ అగ్నిహోత్రం జుహోత్యాదౌ కుర్యాద్దర్శాదికానథ ।
తదభావే జన్మసు స్యాత్సప్తస్వేతస్య దుర్గతిః ॥ 15

ముందుగా అగ్నిహోత్రము జేయవలెను తర్వాత దర్శాది శ్రాద్ధములను జేయవలెను అట్లు చేయనపుడు ఏడులోకములను నశింపజేసినవాడగును

మూ ॥ *యస్యాగ్నిహోత్రమదర్శమపౌర్ణమాస*
*మచాతుర్మాస్యమనాగ్రయణమతిథివర్జితం చ ।*
*అహుతమవైశ్వదేవమవిధినాహుత*
*మా సప్తమాం స్తస్య లోకాన్ హినస్తి ॥ 3*

జిహ్వాలయందు కాలమతిక్రమించకుండ అగ్నిహోత్రాది కర్మను చేయుచున్నాడో, ఆ యజమానుని ఆ ఆహుతులు సూర్యకిరణములై గ్రహించి ఏ స్వర్గమునందు ఇంద్రుడు ఒక్కడై అందరికిని మీదుగానుండునో అట్టి స్వర్గపదవును పొందించుచున్నవి

అను ॥ కాళ్యాదివహ్నిజిహ్వాసు హోతారం తం యథావిధి ।
ఆహుత్యాఖ్యా దేవతాస్తా ఇంద్రలోకే నయన్తి హి ॥ **16**

కాళి మొదలైన యగ్ని జిహ్వాదులయందు యథావిధిగా హోమము జేసిన వానిని ఆహుతులనెడు దేవతలు ఇంద్రలోకమునకు జేర్చుదురు

మూ ॥ ఏహ్యేహీతి తమాహుతయస్సువర్చసః
సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి ।
ప్రియాం వాచమభివదన్త్యోఽర్చయన్త్య
ఏష వః పుణ్యస్సుకృతో బ్రహ్మలోకః ॥ ౬

పద ॥ ఏహి - ఏహి - ఇతి - తం - ఆహుతయః - సువర్చసః - సూర్యస్య - రశ్మిభిః - యజమానం - వహన్తి - ప్రియాం - వాచం - అభివదన్త్యః - అర్చయన్త్యః - ఏషః - వః - పుణ్యః - సుకృతః - బ్రహ్మలోకః

టీక ॥ సువర్చసః = ప్రకాశించుచున్న, ఆహుతయః = ఆహుతులు, తం = ఆ, యజమానం = యజమానుని, ఏహ్యేహీతి = రమ్ము రమ్మని పిలుచుచు, అర్చయన్త్యః =పూజించుచు, ఏషః = ఈ, బ్రహ్మలోకః= బ్రహ్మలోకము (స్వర్గము), వః = మీయొక్క, పుణ్యః = పవిత్రమగు, సుకృతః = సుకృత రూపమైనదని, ప్రియాం = ఇష్టమైన, వాచం = వాక్కును, అభివదన్త్యః = పలుకుచు, సూర్యస్య = సూర్యుని యొక్క, రశ్మిభిః = కిరణములచేత, వహన్తి= పొందించుచున్నవి

తా॥ ఓ శౌనకుడా ! ఏవిధవముగా ఆహుతులు ఆ స్వర్గమును పొందించుచున్న వంటివేని ఆ ఆహుతులు సూర్యకిరణరూపములై ప్రకాశించుచు, అగ్నిహోత్రమును చేసెడి ఆ యజమానుని పూజించుచు మీరు చేసిన పుణ్యరూపమగు స్వర్గలోకము ఇదిగో యని స్తోత్రము చేసి వానికి చూపించుచు వానిని ఆ స్వర్గలోకమును పొందించుచున్నవి

అను ॥ ప్రియం వదన్త్య ఏహీతి వహన్త్యః సూర్యరశ్మిభిః ।
పుణ్యార్జితో లోక ఏష ఇత్యుక్త్వా ప్రాపయన్తి తమ్ ॥ 17

ఆ దేవతలు రారమ్మని ప్రియమును బలుకుచు సూర్యకిరణ ములద్వారా మోసికొనిపోవుచు, నీకు పుణ్యముచేత నార్జింపబడిన దీలోకమని అచటికి జేర్తురు

మూ ॥ ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్తమవరం యేషు కర్మ ।
ఏత చ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యన్తి ॥ 8

పద ॥ ప్లవాః - హి - ఏతే - అదృఢాః - యజ్ఞరూపాః - అష్టాదశ - ఉక్తం- అవరం- యేషు - కర్మ - ఏతత్ - శ్రేయః - యే - అభినన్దన్తి - మూఢాః - జరామృత్యుం - తే - పునః - ఏవ - అపి - యంతి

టీక ॥ అదృఢాః = అస్థిరులైనటువంటివిన్నీ, యజ్ఞరూపాః = యజ్ఞ స్వరూపము లైన, ఏతే అష్టాదశ = ఈ పదునెనిమిది మందియున్ను, )పదియారుమంది ఋత్విక్కులున్ను పత్నీ యజమానులున్నూ వీరందరూ చేరి పదునెనిమిది మంది యగుచున్నారు) ప్లవా హి = నశించువారలేకదా, యేషు = ఏ అష్టాదశ స్మృతుల యందు, ఉక్తం = చెప్పబడిన, కర్మ = శ్రౌత స్మార్తరూపమయిన కర్మ, అవరం = శ్రేష్ఠమయినదికాదు, యే = ఎవరు, ఏతత్ = ఈ జ్ఞానరహితమయిన శ్రౌత స్మార్తాది కర్మనుగూర్చి, శ్రేయః = మోక్షమునుగా, అభినన్దన్తి = సంతోషించుచున్నారో, మూఢాః = అజ్ఞానులైన, తే = వారు, పునరేవాపి = తిరిగిన్నీ, జరామృత్యుం = జరామరణములను, యంతి = పొందుచున్నారు

తా ॥ ఓ శౌనకుడా ! అశాశ్వతములై నట్టి, ఋత్విక్పత్నీ యజమానులను ఆశ్రయించుచున్నటువంటి, అష్టాదశ స్మృతులయందు జెప్పబడియుండెడి శ్రౌతస్మార్త రూపమయిన కర్మయున్ను లోకమునందు క్షీర దధ్యాదులు తమ కాశ్రయమయిన కుండలు నశించుటతోనే స్థాననాశముగలవై ఎట్లు నాశమగునో, ఆ ప్రకారముగానే ఋత్విగ్యజమానాది నాశనమునుండియే నాశమగుచున్నది

ఇటువంటి కర్మచేత శోకరూపమయిన సంసారసముద్రమును శిథిలమైన ఓడ చేత సముద్రమును వలెనే దాటుట కలవిగాదు కనుక ఈ కర్మ మిక్కిలి శ్రేష్ఠమైనది కాదు ఇటువంటి కర్మను అజ్ఞానులగు ఎవరు మోక్షమునుగా దలంచి సంతోషించెదరో వారు తిరిగి జరామరణరూపమయిన సంసారమునే పొందుచున్నారు

అను ॥ క్షుద్రాయా స్తరణం నద్యాః ప్రసిద్ధ్యత్యదృఢైః ప్లవైః ।
న సముద్రస్య యజ్ఞశ్చ తద్వచ్ఛిధిల సాధనమ్ ॥ 18

తేనాప్నోతి స్వర్గమాత్రం న తు మోక్షం తథా సతి ।
కర్మనిష్ఠా జరామృత్యూ ప్రాప్నువన్తి పునఃపునః ॥ 19

చిన్న నదిని దాటుటకు దృఢములుకానట్టి పడవలను ఉపయోగించ వచ్చును, కానీ సముద్రమును దాటుట కవి పనికిరావు యజ్ఞముగూడ పడవవంటిదే సంసారమును దాటుటకు యాగాదిక్రతువులు పనికిరావు యాగముతో స్వర్గఫలమును మాత్రమే పొందును మోక్షమును మాత్రము పొందడు కర్మనిష్ఠులు ముదిమిని, మృత్యువును మాటిమాటికి పొందుచుందురు

మూ ॥ *అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పండితమ్మన్యమానాః ।*
*జఙ్ఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః ॥ ౮*

పద ॥ అవిద్యాయాం - అన్తరే - వర్తమానాః - స్వయం - ధీరాః - పండితమ్మన్యమానాః - జఙ్ఘన్యమానాః - పరియన్తి - మూఢాః - అన్ధేన - ఏవ - నీయమానాః - యథా - అన్ధాః

టీక ॥ అవిద్యయామన్తరే = అజ్ఞానమధ్యమునందు, వర్తమానాః = ఉన్నటువంటివిన్ని, స్వయం = తాము, ధీరాః = బుద్ధిమంతులమని, పండితమ్మన్యమానాః = పండితులమని తలంచెడి, మూఢాః = అజ్ఞానులు, జఙ్ఘన్యమానాః = జరారోగాదులచే కొట్టబడినవారలై, అంధేనైవ = గ్రుడ్డివానిచేతనే, నీయమానాః= మార్గమునందు తీసికొనిపోబడుచుండెడి, అంధాః యథా= గ్రుడ్డివాండ్రవలెనే, పరియన్తి = తిరుగుచున్నారు.

తా ॥ ఓ శౌనకుడా ! అజ్ఞానప్రాయులైన జనులు మేమే బుద్ధిమంతులము, మేమే పండితులమని తలంచుచు, జరారోగాదులచేత పీడింపబడిన వారలగుచు లోకమునందు గ్రుడ్డివానిచేత మార్గమును చూపింపబడి తీసుకొనిపోబడు చుండెడి గ్రుడ్డివాండ్రవలె అట్లు జననమరణరూపమైన సంసారమందు పుట్టుచు చచ్చుచు తిరుగుచుందురు

అను ॥ పండితంమన్యతాం ప్రాప్తాః కర్మకాండార్థ వేదనాత్ ॥
గురుశ్చ తాదృగేవాతో హ్యంధనీతాంధవత్స్థితాః ॥ 20

వారు కర్మకాండము మాత్రము దెలిసి మేమే పండితులమని గర్వము కలవారై యున్నారు వారి గురువును అట్టివాడే కానవీరు గ్రుడ్డివాని చేయి పట్టుకొనిపోవు గ్రుడ్డివాని వంటివారు

మూ ॥ *అవిద్యాయాం బహుధా వర్తమానా*
*వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః ।*
*యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగా*
*త్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే ॥* ౯

పద ॥ అవిద్యాయాం - బహుధా - వర్తమానాః - వయం - కృతార్థాః - ఇతి - అభిమన్యన్తి - బాలాః - యత్ - కర్మిణః - న - ప్రవేదయంతి - రాగాత్ - తేన - ఆతురాః - క్షీణలోకాః - చ్యవన్తే

టీక ॥ అవిద్యాయాం = ప్రకృతిమండలమందు, బహుధా = అనేకవిధము లుగా, వర్తమానాః = ప్రవర్తించుచున్న, బాలాః = అజ్ఞానులు, వయం= మేము, కృతార్థాః ఇతి = చేయబడిన ప్రయోజనము గలవారలమని, అభిమన్యన్తి = తలంచుచున్నారు, యత్ = ఏ కారణమువలన, కర్మిణః = కేవల కర్మకులు, రాగాత్ = అనురాగమునుండి, (తత్త్వం = జ్ఞానమును) న ప్రవేదయన్తి = తెలిసికొనలేదో, తేన = ఆ కారణముచేత, ఆతురాః = దుఃఖముచేత పీడింప బడినవారలై, క్షీణలోకాః = నశించిన స్వర్గాదిలోకములు గలవారలై, చ్యవన్తే= జారిపడుచున్నారు

తా ॥ ఓ శౌనకుడా ! అజ్ఞానరూపమైన ప్రపంచసముదాయమందు దేవమనుష్యాది రూపములతో అనేక ప్రకారముల సంచరించుచున్న అజ్ఞానులు మేము కృతార్థులమని తలంచినవారలయి కర్మలను జేయుచు ఆ కర్మ ఫలములయందలి అనురాగమువలన తత్త్వమును తెలిసికొనక వానిచేతనే దుఃఖార్తులయి స్వర్గాదిలోకములు లేనివారగుచు ఆ లోకములనుండి జారి భూమియందుపడి జననమరణములను పొందుచున్నారు

అను ॥ అహం యజ్వా వాజపేయరాజసూయాదిభిర్మఖైః ।
కృతార్థ ఇతి రాగేణ మత్వా భోగేక్షయే పతేత్ ॥ 21

వరిష్ఠం కర్మ మత్వాఽస్మాచ్ఛ్రేయోఽన్యన్నైవ వేత్త్యసౌ ।
స్వర్గాదాగత్య విప్రత్వం ప్రాప్నోతి శ్వాదిజన్మ వా ॥ 22

నేను యాగకర్తను, వాజపేయ రాజసూయాదులజేసి కృతార్థుడన యితిని అని రాగముతో తలచి కర్మఫలభోగము క్షీణించిన తర్వాత మరల జన్మించును కర్మయే శ్రేష్ఠమని తలచి యంతకంటె శ్రేయస్సు మరి లేదనుకొనును స్వర్గమునుండి వచ్చి బ్రాహ్మణుడు కావచ్చును కుక్క మున్నగు నీచజన్మములనైనా బొందును

మూ ॥ ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః ।
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం చావిశన్తి ॥ ౧౦

పద ॥ ఇష్టాపూర్తం - మన్యమానాః - వరిష్ఠం - న - అన్యత్ - శ్రేయః - వేదయన్తే- ప్రమూఢాః - నాకస్య - పృష్ఠే - తే - సుకృతే - అనుభూత్వా - ఇమం - లోకం - హీనతరం - చ - ఆవిశన్తి

టీక ॥ ఇష్టాపూర్తం = ఇష్టం = యాగాది శ్రౌతకర్మనున్ను, పూర్తం = వాపీకూపతటాకాది స్మార్తకర్మనున్ను, వరిష్ఠం = శ్రేష్ఠమైనదానినిగా, మన్యమానాః = తలంచుచున్నటువంటి, ప్రమూఢాః = మిక్కిలి అజ్ఞానులగువారు, అన్యత్ = దీనికంటె నితరమైన, శ్రేయః = మోక్షసాధనమగు ఆత్మజ్ఞానమును, న వేదయన్తే = తెలుసుకొనరు, తేచ = వారున్నూ, నాకస్య=

స్వర్గమునకు, పృష్ఠే = ఉపరిభాగమందుండెడి, సుకృతే = పుణ్యరూపమైన, (కర్మఫలం= కర్మఫలమును,) అనుభూత్వా = అనుభవించి, (పునః = తిరిగి), ఇమం = ఈ, లోకం = మనుష్యలోకమును, హీనతరం చ = దీనికంటె నీచమైన పశుపక్ష్యాది లోకమునున్ను, ఆవిశంతి = ప్రవేశించుచున్నారు

తా ॥ ఓ శౌనకుడా ! దార, పుత్ర, పశు, క్షేత్రాదులయందలి మోహముచేత మత్తులయిన అజ్ఞానులగు జనులు ఈ శ్రౌతస్మార్తాది కర్మమునే శ్రేష్ఠముగా దలంచి యింతకంటె అన్యమగు మోక్షసాధనమైన మంగళకరమగు ఆత్మజ్ఞానమును తెలిసికొనకయే తాము చేయునట్టి శ్రౌతాది కర్మచేతనే స్వర్గముయొక్క యుపరిభాగమునందలి భోగస్థానమునందు ఆ కర్మఫలమును అనుభవించి తర్వాత తమ తమ మిగిలిన కర్మఫల ప్రకారము మనుష్యాది జన్మమునున్ను, దీనికంటె నీచమగు నరకరూపమయిన పశు పక్ష్యాది జన్మమునున్ను పొందుచున్నారు

అను ॥ కర్మాంతరం చేద్రమ్యం స్యాద్విప్రత్వం శ్వాదితాన్యథా ।
అసారతామిమాం వేత్తి శుద్ధధీర్నిత్యకర్మభిః ॥ 23

శుభమైన ఇతరకర్మ వానికుండెనేని విప్రుడగును లేనిచో కుక్క మొదలగు జన్మకల్గును నిత్యకర్మలతో పవిత్రమగు బుద్ధికలవాడీ కామ్యకర్మలో సారము లేదని తెలిసికొనును

మూ ॥ *తపశ్శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే*
*శాన్తా విద్వాంసో భైక్షచర్యాం చరన్తః ।*
*సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి*
*యత్రామృతస్స పురుషో హ్యవ్యయాత్మా ॥* ౧౧

పద ॥ తపశ్శ్రద్ధే - యే - హి - ఉపవసన్తి - అరణ్యే - శాన్తాః - విద్వాంసః- భైక్షచర్యాం- చరన్తః - సూర్యద్వారేణ - తే - విరజాః - ప్రయాన్తి- యత్ర- అమృతః - సః - పురుషః - హి - అవ్యయాత్మా

టీక ॥ శాన్తాః = శమించిన యింద్రియ సముదాయముగల్గిన, విద్వాంసః = జ్ఞానులగు, యే = ఎవరు, అరణ్యే = అడవియందు, భైక్షచర్యాం =

భిక్షాటనమును, చరన్తః = చేయుచు, తపశ్శ్రద్ధేహి = తపః = స్వాశ్రమవిహితమైన కర్మనున్ను, శ్రద్ధేహి = బ్రహ్మ సంబంధమైన విద్యను, ఉపవసంతి = సేవించుచున్నారో, తే = వారు, విరజాస్సన్తః= నశించిన రజోగుణ తమోగుణములు గలవారై, యత్ర = ఏసత్యలోకాదికమునందు, అమృతః = ముక్తుడైన, అవ్యయాత్మా= నాశనరహితమగు స్వరూపముగల, సః = ఆ, పురుషః = పురుషుడు, ( అస్తి = కలడో, తత్ర = ఆ సత్యలోకాదికమునకు,) సూర్యద్వారేణ = సూర్యమండలముద్వారా, ప్రయాన్తి = పోవుచున్నారు

తా ॥ ఓ శౌనకుడా ! పూర్వము జెప్పిన కర్మపరులకంటె నితరులగు వానప్రస్థులును, సన్న్యాసులును, జ్ఞానమే ప్రధానముగా గల గృహస్థులును అగు ఏ జనులు యింద్రియ సముదాయమువలన కలిగెడి చాంచల్యము లేనివారగుచు గృహస్థారణ్య భిక్షాటనములను క్రమముగా పొందినవారలయి స్వాశ్రమ విహితమైన తమ కర్మలను జేయుచు సగుణరూపమైన హిరణ్యగర్భాద్యుపాసన జేయుచున్నారో వారు నాశరహితుడై న అవ్యయస్వరూపుడగు ఆ హిరణ్యగర్భుడు నివసించియుండెడి సత్యాదిలోకములను సూర్యమండలమును భేదించుకొని ఉత్తరాయణ మార్గముచేత పొందుచున్నారు

అను ॥ **ఉపాసకో బ్రహ్మలోకం ప్రాప్నోత్యావృత్తి వర్జితమ్ ।**
**తథాఽపి భూయానాయాసో ముక్తిశ్చాస్య విలంబతే ॥** **24**

ఉపాసనలు జేయువాడు బ్రహ్మలోకమును జెందును అక్కడనుండి మరల జన్మమునకు రాడు అతనికి ముక్తి ఆలస్యమగుటచే మిగుల ఆయాసము గలదు

మూ ॥ *పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో*
*నిర్వేదమాయా న్నాస్త్యకృతః కృతేన ।*
*తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛే*
*త్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥* ౧౨

పద ॥ పరీక్ష్య - లోకాన్ - కర్మచితాన్ - బ్రాహ్మణః - నిర్వేదం - ఆయాత్- న - అస్తి - అకృతః - కృతేన - తత్ విజ్ఞానార్థం - సః - గురుం - ఏవ - అభిగచ్ఛేత్- సమిత్పాణిః - శ్రోత్రియం - బ్రహ్మనిష్ఠమ్

టీక ॥ బ్రాహ్మణః = బ్రాహ్మణుడు ( బ్రహ్మనిష్ఠ గలవాడు), కర్మచితాన్= కర్మచేత వృద్ధిపొందింపబడిన, లోకాన్ = లోకములను, పరీక్ష్య = పరీక్షించి, అకృతః= నిత్యమగు పదార్థము, నాస్తి = లేదు, కృతేన = కర్మతో, నిర్వేదం = వైరాగ్యమును, ఆయాత్ = పొందవలెను, సః= ఆ బ్రాహ్మణుడు ( బ్రహ్మనిష్ఠుడు) తత్ = ఆ అక్షర స్వరూపమును, విజ్ఞానార్థం = బాగుగా తెలిసికొనుటకొరకు, సమిత్పాణిస్సన్= సమిధలు హస్తమందుగలవాడై, శ్రోత్రియం = వేదాధ్యయన సంపదగలిగినట్టియు, బ్రహ్మనిష్ఠం = బ్రహ్మమునందే నిష్ఠగలవాడునగు, గురుమేవ = గురువును గూర్చియే, అభిగచ్ఛేత్ = పోవలయును

తా॥ ఓ శౌనకుడా ! బ్రాహ్మణుడు తా నాచరించునట్టి కర్మఫలములచేత పొందతగిన స్వర్గాదిరూపమయిన దేవమనుష్యాది లోకములనున్ను, తనకు విహితమైన కర్మను చేయకపోవుట చేతనున్ను, నిషేధింపబడినవాటిని ఆచరించుటచేతనున్ను పొందదగిన నరకరూపమయిన లోకములను పరీక్షించి నిత్యమగు పదార్థము లేదని కర్మతో వైరాగ్యమును పొందవలెను ఆ బ్రాహ్మణుడు ఆ అక్షరస్వరూపమును బాగుగా తెలిసికొనుటకొరకు సమిత్తులు హస్తమునందు గలవాడై వేదార్థ మెరింగినట్టియు, బ్రహ్మనిష్ఠయు గలవాడగు గురువును గురించి పోవలయును

వి ॥ సమిత్పాణి యనగా హోమమునకు సంబంధించిన మోదుగపుల్ల, దర్భ, ఫలాదులను స్వయముగా చేతితో ఎత్తుకొని గురుసన్నిధానమునకు వెళ్ళవలెను

అను ॥ **పరీక్ష్య కర్మజాన్ లోకాన్ కర్మణా ముక్త్యసంభవాత్ ।**
**విరక్తో బ్రహ్మబోధార్థం గురుమేతి యథావిధి ॥** **25**

కర్మవలన తనకు గలిగిన లోకములను పరీక్షించి కర్మల వలన ముక్తికలుగదని విరక్తినొంది జ్ఞానమునకై గురువును యథావిధిగా ఆశ్రయించవలయును

మూ ॥ *తస్మై స విద్వానుపసన్నాయ సమ్య*
*క్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ ।*
*యేనాక్షరం పురుషం వేద సత్యం*
*ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ ॥* ౧౩

పద ॥ తస్మై - సః - విద్వాన్ - ఉపపన్నాయ - సమ్యక్ - ప్రశాన్తచిత్తాయ- శమాన్వితాయ - యేన - అక్షరం - పురుషం - వేద - సత్యం - ప్రోవాచ - తాం - తత్త్వతః - బ్రహ్మవిద్యాం

టీక ॥ విద్వాన్ = బ్రహ్మవేత్తయగు, సః = ఆ గురువు, ఉపపన్నాయ = వచ్చినట్టిన్ని, సమ్యక్ = బాగుగా, ప్రశాన్తచిత్తాయ = శమించిన చిత్తదోషము కలిగినట్టిన్ని, శమాన్వితాయ = బాహ్యేంద్రియముల యొక్క శమముతో గూడుకొనిన, తస్మై= ఆ శిష్యునికొరకు, యేన = ఏ జ్ఞానవముచేత, సత్యం = సత్యస్వరూపమయిన, అక్షరం = నాశరహితమైన, పురుషం = పూర్ణుడగు పరమాత్మను, వేద = తెలిసికొనునో, తాం = అట్టి, బ్రహ్మవిద్యాం = బ్రహ్మవిద్యను, తత్త్వతః = యధార్థముగా, ప్రోవాచ = చెప్పవలెను

తా ॥ ఓ శౌనకుడా ! బ్రహ్మజ్ఞానియగు గురువు బాహ్యేంద్రియాంతరింద్రియోపరమము కలిగి తన సమీపమునకు వచ్చియుండెడి శిష్యునికొరకు పరిపూర్ణమైన అక్షరపరబ్రహ్మస్వరూపమును తెలిసికొనుటకు సాధనమైన బ్రహ్మవిద్యను ఉపదేశించవలెనని ఆఙ్గీరసుడు శౌనకునితో చెప్పెను

ఇతి ప్రథమముండకే ద్వితీయ ఖణ్డః, ఇతి ప్రథమ ముండకమ్
ఇది ప్రథమముండకమునందు ద్వితీయ ఖండము
ప్రథమ ముండకము సమాప్తము



ఓమ్

# ద్వితీయముణ్డకే ప్రధమః ఖండః

అను ॥ గురుశ్చ యోగ్యశిష్యాయ విద్యామక్షరబోధినీమ్ ।
బ్రూయాత్స్వకీయవిద్యాయా స్సంప్రదాయ ప్రవృత్తయే ॥ 26

గురువుగూడ యోగ్యశిష్యునకు అక్షరబ్రహ్మమును బోధించునట్లు విద్యను తన సంప్రదాయము చెడకుండా నడచుటకు బోధించును

మూ ॥ *తదేతత్సత్యం యధా సుదీప్తాత్ పావకాద్విస్ఫులిఙ్గాః*
*సహస్రశః ప్రభవన్తే సరూపాః ।*
*తధాక్షరాద్వివిధాస్సోమ్య భావాః*
*ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి ॥* ౧

పద ॥ తత్ - ఏతత్ - సత్యం - యధా - సుదీప్తాత్ - పావకాత్ - విస్ఫులిఙ్గాః- సహస్రశః - ప్రభవన్తే - సరూపాః - తధా - అక్షరాత్ - వివిధాః - సోమ్య - భావాః - ప్రజాయన్తే - తత్ర - చ - ఏవ - అపి - యంతి

టీక ॥ తదేతత్ = ఆయిది (ఈ ముందు చెప్పబోయెడి అక్షర స్వరూపము), సత్యం = సత్యమైనది, సుదీప్తాత్ = మిక్కిలి ప్రకాశించుచుండెడి పావకాత్= అగ్ని వలన, విస్ఫులింగాః = అగ్నికణములు, యధా = ఏ ప్రకారము, సహస్రశః= అనేకవిధములుగా, సరూపాః = సమానరూపములుగలవయి, ప్రభవన్తే = పుట్టుచున్నవో, తధా = ఆ ప్రకారము, అక్షరాత్ = నాశరహితమగు పరబ్రహ్మవలన, హేసోమ్య = సాధువగునో శౌనకుడా, వివిధాః = నానావిధములగు, భావాః = జీవులు, ప్రజాయన్తే = పుట్టుచున్నారు, తత్ర చైవ= ఆ అక్షర పరబ్రహ్మమునందే, అపియంతి = లీనమగుచున్నారు

తా ॥ ఓ శౌనకుడా ! ప్రకాశించి మండుచుండెడి అగ్నివలన మిణుగురులు ఆ అగ్నికి సమానరూపముకలవై ఎట్లు జన్మించునో ఆ ప్రకారము ఆ అక్షరపరబ్రహ్మమునుండి అనేకవిధములగు జీవములు ఆ పరబ్రహ్మకు సమానమయి పుట్టి దానియందే లీనమగుచున్నవి ఆ అక్షరపరబ్రహ్మము సత్యమైనది దానికి వేరగు సమస్తము అసత్యమయినది

అను ॥ తదేతదక్షరం సత్యం మాయాశక్తి సమన్వితమ్ ।
తస్మాత్పర్వే సముత్పన్నాః విస్ఫులింగా యథాఽగ్నితః ॥ 27

ఆ యక్షరము సత్యమైనది మాయాశక్తితో గూడినది దానివల్లనే సర్వజగత్తు అగ్నినుండి మిణుగురులు పుట్టినట్లు పుట్టినది

మూ ॥ దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యన్తరో హ్యజః ।
అప్రాణోహ్యమనా శ్శుభ్రో హ్యక్షరాత్పరతః పరః ॥ ౨

పద ॥ దివ్యః - హి - అమూర్తః - పురుషః - సబాహ్యాభ్యన్తరః - హి - అజః - అప్రాణః - హి - అమనాః - శుభ్రః - హి - అక్షరాత్ - పరతః - పరః

టీక ॥ హి = ఏ కారణమువలన, దివ్యః = ప్రకాశమానుడగు, పురుషః = పూర్ణుడగు పురుషుడు, అమూర్తః = సమస్త అకారములు లేనివాడో ,( తస్మాత్ = ఆ కారణమువలన) సబాహ్యాభ్యన్తరః = బాహ్యాభ్యన్తరములతో కూడుకొను వాడును, అజో హి = పుట్టుక లేనివాడును, (అసౌ = ఈ పురుషుడు), అప్రాణోహి = ప్రాణములేనివాడును, అమనాః = మనస్సు లేనివాడును, శుభ్రో హి = పరిశుద్ధుడును, పరతః = అన్యమగు, అక్షరాత్ = అక్షరునికంటె, పరః= వేరైనవాడు

తా ॥ శౌనకుడా ! ఆ అక్షరస్వరూపము పుట్టుకలేనిదై బాహ్యాభ్యన్తర ములతో గూడుకొని, సమస్త ఆకారములను విడచి పరిపూర్ణమయి ప్రకాశించుచున్నది కనుకనే ప్రాణములేనిదిన్ని, మనస్సులేనిదిన్ని, అవ్యాకృతాది సర్వవికారములకంటె వేరై నామరూప సర్వస్వరూపమునకంటె విలక్షణమయి నిరూపాధికమయి పరిపూర్ణముగా నున్నది

అను ॥ అక్షరాత్మా స్వయంజ్యోతి ర్మాయారూపాక్షరాత్పరః ।
అచిన్త్యశక్తిరన్వృతా మాయాఽస్మిన్కల్పయేజ్జగత్ ॥ 28

స్వయంజ్యోతి స్స్వరూపమైన ఈ యక్షరము మాయా రూపమైన అక్షరము కంటె పరమైనది ఈ అక్షరమందు అచింత్య శక్తి గలదు అనృతమైన మాయ జగత్తును కల్పించుచున్నది

మూ ॥ ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణి చ ।
ఖంవాయు ర్జ్యోతి రాపః పృధ్వీ విశ్వస్య ధారిణీ ॥ 3

పద ॥ ఏతస్మాత్ - జాయతే - ప్రాణః - మనః - సర్వేంద్రియాణి - చ - ఖం - వాయుః - జ్యోతిః - ఆపః - వృధ్వీ - విశ్వస్య - ధారిణీ

టీక ॥ ప్రాణః = ప్రాణము, ఏతస్మాత్ = ఈ పరబ్రహ్మమునుండి, జాయతేః పుట్టుచున్నది, మనః = మనస్సును, సర్వేంద్రియాణి చ = సమస్త ఇంద్రియములున్ను, ఖం = ఆ కాశమున్ను, వాయుః = వాయువున్ను, జ్యోతిః= తేజస్సున్ను, ఆపః = ఉదకమున్ను, విశ్వస్య= సమస్తమును, ధారిణీ = ధరించియుండెడి, పృధ్వీ = భూమియున్ను, ఏతస్మాదేవ = పరబ్రహ్మము నుండియే, జాయంతేః పుట్టుచున్నవి

తా ॥ ఓ శౌనకుడా ! ఈ పూర్వము చెప్పియుండెడి నిరుపాధిక పరబ్రహ్మము నుండియే ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములున్ను, ఆకాశాది పంచభూతములున్ను పుట్టుచున్నవి కనుకనే సర్వకారణమయిన పరబ్రహ్మమును తెలిసికొనుటచేతనే సర్వము తెలియబడినదగుచున్నది

అను ॥ మాయావినోఽస్మాత్ప్రాణాది వియదాది చ జాయతే ।
తతో విరాడభూత్తస్మి న్నవశిష్ట మభూజ్జగత్ ॥ 29

తా ॥ మాయగల ఈ అక్షరమునుండి ప్రాణాదులు, ఆకాశాదులును పుట్టినవి తరువాత విరాట్టు అందే పుట్టినది, తక్కిన జగత్తంతయు దానియందే పుట్టినది

మూ ॥ అగ్ని ర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ
దిశ శ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః ।
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హ్యేష స్సర్వభూతా న్తరాత్మా ॥ 4

పద ॥ అగ్నిః - మూర్ధా - చక్షుషీ - చన్ద్రసూర్యౌ - దిశః - శ్రోత్రే - వాగ్వి వృతాః - చ - వేదాః - వాయుః - ప్రాణః - హృదయం - విశ్వం - అస్య - పద్భ్యాం - పృధివీ - హి - ఏషః - సర్వభూతాన్తరాత్మా

టీక ॥ యస్య = ఎవనికి, మూర్ధా = శిరస్సు, అగ్నిః = ద్యులోకమో, చక్షుషీ = నేత్రములు, చన్ద్రసూర్యౌ = చంద్రసూర్యులో, శ్రోత్రే = శ్రోత్రములు, దిశః = దిక్కులో, వాగ్వివృతాశ్చ = వాగ్వ్యాపారములున్ను, వేదాః = వేదములో, ప్రాణః = ప్రాణము, వాయుః = వాయువో, హృదయం = అంతః కరణము, విశ్వం = సమస్తజగత్తో, పద్భ్యాం = పాదములు, పృధివీ = భూమియో, ఏషః = ఇతడు, సర్వభూతాన్తరాత్మాహి = సర్వ = సమస్తమయిన, భూత = పంచమహాభూతములకు, అన్తరాత్మాహి = లోపలనుండెడి ఆత్మస్వరూపుడు

తా ॥ ఓ శౌనకుడా ? ఈ పూర్వము చెప్పబడియుండెడి పరమాత్మకు ద్యులోకము శిరస్సున్ను, సూర్యచంద్రులు నేత్రములున్ను, దిక్కులు శ్రోత్రములున్ను, వేదములు వాగ్వ్యాపారములున్ను, వాయువు దేహధారకమగు ప్రాణమున్ను, సర్వప్రపంచము అంతఃకరణమున్ను, పాదములు భూమియున్ను ఇట్లు ఈ సర్వము ఆ పరమాత్మ స్వరూపమైయున్నది

మూ ॥ *తస్మాదగ్నిస్సమిధో యస్య సూర్యః*
*సోమాత్పర్జన్య ఓషధయః పృధివ్యామ్ ।*
*పుమాన్ రేత స్సిఞ్చతి యోషితాయాం*
*బహ్వీః ప్రజాః పురుషాత్సంప్రసూతాః ॥* 5

పద ॥ తస్మాత్ - అగ్నిః - సమిధః - యస్య - సూర్యః - సోమాత్ - పర్జన్యః - ఓషధయః - పృధివ్యాం - పుమాన్ - రేతః - సిఞ్చతి- యోషితాయాం - బహ్వీః - ప్రజాః - పురుషాత్ - సంప్రసూతాః

టీక ॥ యస్య = ఏ ద్యులోకాగ్నికి, సూర్యః = సూర్యుడు, సమిధః = కట్టెవంటి వాడో, అగ్నిః = ద్యులోకాగ్ని, తస్మాత్ = ఆ అక్షరపరబ్రహ్మమువలన, సంభవతి = కలుగుచున్నది, తతః = ఆ ద్యులోకాగ్నినుండి పుట్టిన, సోమాత్= చంద్రునివలన, పర్జన్యః = రెండవ అగ్నియగు వర్షాధిష్ఠాన దేవుడున్ను, (తస్మాత్= ఆ పర్జన్యునివలన), పృధివ్యాం = పృధివీ రూపమయిన మూడవ అగ్ని యందు, ఓషధయః = వ్రీహ్యాది సస్యములున్ను, (సంభవన్తి = కలుగుచున్నవి, ఓషధిభ్యః = వ్రీహ్యాది సస్యములవలన,) పుమాన్= పురుషరూపమగు నాల్గవయిగ్ని, రేతః = శుక్లమును, యోషితాయాం =

స్త్రీరూపమయిన అయిదవ అగ్నియందు, సిఞ్చతి = తడువుచున్నది, పురుషాత్ = అక్షరుడగు పురుషునివలన, బహ్వీః = అనేకులగు, ప్రజాః = ప్రజలు, సంప్రసూతాః = పుట్టిరి

తా ॥ ఓ శౌనకుడా ! ఈ లోకమునందు పంచాగ్నులద్వారా ఏ ప్రజలు పుట్టుచున్నారో వారున్ను, ఆ అక్షరునివలననే పుట్టుచున్నారు అది ఎట్లంటివేని పూర్వము చెప్పియుండెడి అక్షరస్వరూపునివలన సూర్యుడు సమిధగా గల ప్రథమాగ్నియగు ద్యులోకమున్ను, ఆ ద్యులోకాగ్నివలన పుట్టిన చంద్రునివలె రెండవయగ్నియైన వర్షాధిష్ఠాన దేవతయగు పర్జన్యుడున్ను, ఆ పర్జన్యునివలన మూడవ యగ్నియగు భూమియందు వ్రీహ్యాది సస్యములున్ను పుట్టుచున్నవి నాల్గవయగ్నియగు పురుషాగ్నియందు హోమము చేయబడిన వ్రీహ్యాది సస్యములవలన ఈ పురుషాగ్ని, అయిదవ అగ్ని యగు స్త్రీయందు రేతస్సును ఉంచుచున్నది, ఇందువలన ప్రజాసృష్టి యగుచున్నది ఈ ప్రకారముగా ఆ అక్షరునివలననే అనేకులగు ప్రజలు పుట్టుచున్నారు

మూ ॥ *తస్మాదృచస్సామయజూంషి దీక్షా*
*యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ ।*
*సంవత్సరశ్చయజమానశ్చ లోకాః*
*సోమో యత్ర పవతే యత్ర సూర్యః ॥* ౬

పద ॥ తస్మాత్ - ఋచః - సామ - యజూంషి - దీక్షాః - చ - సర్వే - క్రతవః - దక్షిణాః - చ - సంవత్సరః - చ - యజమానః - చ - లోకాః - సోమః - యత్ర - పవతే - యత్ర - సూర్యః

టీక ॥ ఋచః = ఋగ్వేదమంత్రములున్ను, సామ = సామవేదమున్ను, యజూంషి= యజుర్వేదమంత్రములున్ను, దీక్షాః = మౌంజిమున్నగు చిహ్నములుగల కర్తయొక్క నియమములున్ను, సర్వే = సమస్తములయిన, యజ్ఞాశ్చ = అగ్ని హోత్రాదులున్ను, క్రతవః = యూపస్తంభవములతో గూడికొనిన యాగములున్ను, దక్షిణాశ్చ = దక్షిణలున్ను, సంవత్సరశ్చ = కర్మాంగమగు కాలమున్ను, యజమానశ్చ = కర్తయున్ను, సోమః = చంద్రుడు, యత్ర =

ఏ లోకములయందు, పవతే = పవిత్రము జేయుచున్నాడో, సూర్యః= సూర్యుడు, యత్ర = ఏలోకవములయందు, (తపతి = తాపను జేయుచున్నాడో, తే = ఆ కర్మఫల భూతవములయిన), లోకాశ్చ= స్వర్గాదిలోకములున్ను, తస్మాత్ = ఆ అక్షరునివలననే, (సంభవంతి = కలుగుచున్నవి)

తా ॥ ఓ శౌనకుడా ! ఋగ్వేద, యజుర్వేద, సామవేదములున్ను, దీక్షలున్ను, అగ్ని హోత్రాదులున్ను, యూపస్తంభవములతో గూడుకొన్న క్రతువులున్ను, ఆయాక్రతువులయొక్క దక్షిణలున్ను, కర్మాంగమగు కాలమున్ను, యజమానియున్ను, చంద్రుడు ఏ లోకములయందు పవిత్రము జేయుచున్నాడో, సూర్యుడు ఏ లోకవములయందు తాపవు జేయుచున్నాడో, ఆ కర్మ ఫలభూతములయిన స్వర్గాదిలోకములున్ను ఆ అక్షరునివలననే కలుగుచున్నవి

మూ ॥ తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః
సాధ్యా మనుష్యాః పశవో వయాంసి ।
ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ
శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ ॥ 7

పద ॥ తస్మాత్ - చ - దేవాః - బహుధా - సంప్రసూతాః - సాధ్యాః - మను ష్యాః - పశవః - వయాంసి - ప్రాణాపానౌ - వ్రీహియవౌ - తపః - చ - శ్రద్ధా - సత్యం - బ్రహ్మచర్యం - విధిః - చ

టీక ॥ తస్తాత్ = ఆ అక్షరునివలన, బహుధా = అనేకవిధములుగా, దేవాశ్చ = దేవతలున్ను, సాధ్యాః = సాధ్యులున్ను, మనుష్యాః = మానవులున్ను, పశవః= పశువులున్ను, వయాంసి = పక్షులున్ను, ప్రాణాపానౌ = ప్రాణాపాన ములున్ను వ్రీహియవౌ = వడ్లుగోధుమలున్ను, తపశ్చ = తపస్సున్ను, శ్రద్ధా= శ్రద్ధయున్ను, సత్యం= నిజమున్ను, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యవ్రతమున్ను, విధిశ్చ = వేదశాస్త్రవములయందలి విధిన్ని, (ఏతే = ఇవి యన్నియున్ను) సంప్రసూతాః= పుట్టినవి

తా ॥ ఓ శౌనకుడా ! దేవతలున్ను, సాధ్యులున్ను, మనుష్యులున్ను,

పశువులును, పక్షులును, ప్రాణాపానములును, శాల్యాది ధాన్యములును, తపస్సును, శ్రద్ధయున్ను, సత్యమును, బ్రహ్మచర్యమును, విధియును ఇవియన్నియును అనేకవిధములుగా ఆ అక్షరునివలన నే పుట్టినవి

మూ ॥ సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్సప్తార్చిషస్సమిధస్సప్తహోమాః ।
సప్త ఇమే లోకా యేషు చరన్తి ప్రాణా గుహాశయానిహితాస్సప్తసప్త ॥8

పద ॥ సప్త - ప్రాణాః - ప్రభవన్తి - తస్మాత్ - సప్తార్చిషః - సమిధః - సప్త - హోమాః - సప్త - ఇమే - లోకాః - యేషు - చరన్తి - ప్రాణాః - గుహాశయాః - నిహితాః - సప్త - సప్త

టీక ॥ సప్తప్రాణాః = సప్త = ఏడైన, ప్రాణాః = ప్రాణములున్ను, సప్తార్చిషః = సప్త = ఏడైన, అర్చిషః = జ్వాలలున్ను, సమిధః = సమిధలున్ను, సప్త = ఏడైన రూపాదులున్ను, (విజ్ఞానాని = విషయుజ్ఞానములు), హోమాః = హోమములున్ను, గుహాశయాః = గుహ = హృదయ గుహాలయందు, శయాః= శయనించియుండెడి, ప్రాణాః = ప్రాణాపానాదులు, ఏషు = ఏ చక్షురాది గోళకములయందు, నిహితాః = స్థాపింపబడినవై, చరన్తి = తిరుగుచున్నవో, సప్త = ఏడైన, ఇమే = ఈ లోకాః = ఇంద్రియస్థానములున్ను, సప్తసప్త = ఏడు ఏడుగా, తస్మాత్ = ఆ అక్షరునివలన, ప్రభవన్తి = పుట్టుచున్నవి

తా ॥ ఓ శౌనకుడా ! చక్షుః శ్రోత్ర నాసికాముఖములనెడి యా ఏడు ప్రాణములున్ను, దేహమందుండెడి ప్రాణాపాన వ్యానములనెడి ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులున్ను, ఆ అగ్నులయొక్క ఈ చక్షురాది ప్రాణముల సంబంధములయిన విషయప్రకాశములనెడి పూర్వము చెప్పియున్న కాళీ, కరాళీ మున్నగు సప్తజ్వాలలున్ను, ఆ అగ్నిని ప్రజ్వలింపజేయునట్టి ఆ చక్షురాదుల విషయములనే కట్టెలున్ను, ఆ అగ్నియందు వ్రేల్చునట్టి చక్షురాది విషయ ప్రజ్ఞానములనెడి హోమములున్ను, హృదయ గుహయందు శయనించుచుండెడి ప్రాణాపానాదులు బ్రహ్మచేత ఈ దేహమందు స్థాపింపబడినవై ఏ చక్షురాది గోళకములయందు సంచరించుచున్నవో ఈ చక్షురాది గోళకములనెడి యింద్రియ స్థానకము లేడున్నూ ప్రతిజీవునిగూర్చి ఏడు ఏడు విధములుగా ఆ అక్షరునివలననే పుట్టుచున్నవి

మూ ॥ అతస్సముద్రా గిరయశ్చ సర్వే అస్మాత్స్యన్దన్తే సిన్ధవస్సర్వరూపాః ।
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ యేనైష భూతైస్తిష్ఠతే హ్యన్తరాత్మా॥౯

పద ॥ అతః - సముద్రాః - గిరయః - చ - సర్వే - అస్మాత్ - స్యన్దన్తే - సిన్ధవః - సర్వరూపాః - అతః - సర్వాః - ఓషధయః - రసః - చ - యేన - ఏషః - భూతైః - తిష్ఠతే - హి - అన్తరాత్మా

టీక ॥ అతః = ఈ పురుషునివలన, సర్వే = సమస్తములయిన, సముద్రాః = సముద్రములును్ను, గిరయశ్చ = పర్వతములును్ను, ( భవంతి = అగుచున్నవి), తస్మాత్ = ఈ పురుషునివలననే, సర్వరూపాః = నానారూపములగు, సిన్ధవః= నదులును్ను, స్యన్దన్తే = ప్రవహించుచున్నవి, అతః = ఈ పురుషునివలననే, సర్వాః = సమస్తములయిన, ఓషధయశ్చ = వ్రీహియవాదులును్ను, రసశ్చ = మధురాది రసమును్ను, యేన = ఏ రసముచేత, ఏషః = ఈ, అన్తరాత్మా = జీవాత్మ, భూతైః = పృధివ్యాది పంచభూతములచేత, పరివృతస్సన్ = ఆవరింపబడినదై, తిష్ఠతే = ఉంటున్నదో, ( తద్ధి = అదియును్ను, భవతి = అగుచున్నది)

తా ॥ ఓ శౌనకుడా ! సమస్తములయిన సముద్రములును్ను, పర్వతములును్ను, నానావిధములగు నదులును్ను, సమస్త వ్రీహియవాదులును్ను, ఆరు విధములయిన రసములును్ను, ఈ యంతరాత్మ ఏ రసముచేత స్థూలమగు పృధివ్యాది భూతవములతో నావరింపబడినదై యున్నదో అదియును్ను, సమస్తమును్ను ఆ పురుషునివలననే పుట్టుచున్నది

మూ ॥ పురుష ఏవేదం విశ్వం కర్మ
తపోబ్రహ్మ పరామృతమ్ ।
ఏతద్యో వేద నిహితం గుహాయాం
సోఽవిద్యాగ్రన్థిం వికిరతీహ సోమ్య ॥ ౧౦

పద ॥ పురుషః - ఏవ - ఇదం - విశ్వం - కర్మ - తపః - బ్రహ్మ - పరామృతం - ఏతత్ - యః - వేద - నిహితం - గుహాయాం - సః - అవిద్యాగ్రన్థిం - వికిరతి - ఇహ - సోమ్య

టీక ॥ ఇదం = ఈ, విశ్వం = సమస్తమున్ను, పురుష ఏవ = పురుషుడే, కర్మ = అగ్నిహోత్రాది లక్షణమగు, తపః = జ్ఞానమున్ను, (ఇదంసర్వం = ఈ సమస్తమున్ను, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, కార్యం = కార్యము), హేసోమ్య= ఓ ప్రియ దర్శనుడా ! యః = ఎవడు, (ప్రాణినాం = ప్రాణులయొక్క) గుహాయాం = హృదయమందు, నిహితం = ఉంటున్నట్టిన్ని, ఏతత్ = ఈ జీవాత్మను, పరామృతం = శ్రేష్ఠమయిన అమృత స్వరూపమగు, బ్రహ్మ = పరబ్రహ్మ స్వరూపమునుగా, వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, (ఏవం విజ్ఞానాత్ = ఇట్లు తెలిసికొనుటవలన), ఇహ = ఇక్కడ అనగా జీవించియుండగానే), అవిద్యాగ్రన్థిం = బన్ధమువంటి అజ్ఞానమును (అనగా ముడివలెనే దృఢమైయుండెడి అజ్ఞానవాసనను), వికిరతి = నశింపజేయు చున్నాడు

తా ॥ ఓ శౌనకుడా ! ఈ సర్వము పరబ్రహ్మముయొక్క కార్యమే గనుక సర్వము పరిపూర్ణుడగు ఆ పురుషుడే యైయున్నది ఎవడు బుద్ధిగుహయం దున్న ఈ ఆత్మను శ్రేష్ఠమగు అమృతస్వరూపమయిన ఆ పరబ్రహ్మమునుగా తెలిసికొనుచున్నాడో వాడు తనకు ఈ దేహమందు కలిగియుండెడి అజ్ఞానరూపమగు ఈ ప్రాపంచిక వాసనలను జీవించియుండగానే నశింపజేసి సర్వము తెలిసినవాడై తాను బ్రహ్మస్వరూపి యగుచున్నాడని చెప్పెను

అను ॥ **పురుషో మాయయా సర్వజగద్రూపేణ భాసతే ।**
**సర్వం పురుష ఏవాతో వస్తుతత్త్వావలోకనే ॥ 30**
**అజ్ఞోఽహమితి తాదాత్మ్యమజ్ఞానస్యాత్మతాఽస్తి యత్ ।**
**అవిద్యాగ్రన్థిరేవ స్యాత్స చ బోధాద్వికీర్యతే ॥ 31**

పురుషుడు మాయచేత జగద్రూపమున ప్రకాశించుచున్నాడు వస్తుతత్వము నెఱింగినవానికి ఈ సర్వము పురుషుడే యగును

నేను జ్ఞానము లేనివాడను అనెడు తాదాత్మ్య మేది గలదో దానివలన అజ్ఞానమునకు ఆత్మత్వమున్నదనుకొందురేమో అది అవిద్యయొక్క బంధమే యగును ఆ బంధము ఆత్మబోధవలన విడిపోవును

ఇతి ద్వితీయముండకే ప్రథమః ఖండః సమాప్తః

ద్వితీయ ముండకమునందు ప్రథమఖండము సమాప్తము



ఓమ్

# ద్వితీయముణ్డకే ద్వితీయః ఖండః

మూ ॥ ఆవి స్సన్నిహితం గుహాచరం నామ మహత్పద మత్రైతత్సమర్పితం, ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానా ద్యద్వరిష్ఠం ప్రజానామ్ ॥ ౧

పద ॥ ఆవిః - సన్నిహితం - గుహాచరం - నామ - మహత్ - పదం - అత్ర - ఏతత్- సమర్పితం - ఏజత్ - ప్రాణత్ - నిమిషత్ - చ - యత్ - ఏతత్ - జానథ - సదసత్ - వరేణ్యం - పరం - విజ్ఞానాత్- యత్ - వరిష్ఠం - ప్రజానాం

టీక ॥ ఆవిః = ప్రకాశమగు, యత్ = ఏ బ్రహ్మము, ( ప్రాణినాం = జీవులయొక్క, హృది = హృదయమందు, ) సన్నిహితం = బాగుగా నుంటున్నదియో, (తత్= ఆ బ్రహ్మము), మహత్ = అన్నిటికంటె శ్రేష్ఠమగునదిన్నీ, పదం = సర్వమునకు స్థానమైనదిన్నీ, గుహాచరం నామ = బుద్ధి గుహయందుండునదిగా ప్రసిద్ధమైన దిన్నీ, ఏజత్ = చలించుచున్న పక్షులు మొదలయినవిన్నీ, ప్రాణాత్= ప్రాణాపానములు గల మనుష్యపశ్వాదులున్ను, నిమిషచ్చ = రెప్పపాటుగలదిన్నీ, ఏతత్ = ఈ సమస్తమున్ను, అత్ర = ఈ బ్రహ్మమునందు, సమర్పితం = ఉంచబడినది, సదసత్ = సదసత్స్వరూప మయినటువంటిన్ని (మూర్తామూర్తస్వరూప మయినట్టియున్ను), వరేణ్యం = ప్రార్థించ దగినట్టిన్ని, ప్రజానాం = ప్రజలయొక్క, విజ్ఞానాత్ = జ్ఞానముకంటె, పరం=వేరైనటువంటిన్నీ, వరిష్ఠం = శ్రేష్ఠమయినదిన్ని, యత్ = ఏదియో, ఏతత్ = దీనిని, జానథ = తెలుసుకొనుడు!

తా ॥ ఓ శిష్యులారా ! ప్రకాశమగు ఏ పరబ్రహ్మము జీవులయొక్క హృదయ గుహయందున్నటువంటిన్ని, సమస్తముకంటె మహత్తరమైనట్టిన్ని, సర్వమునకు స్థానమెనదిన్నిఅయి ప్రసిద్ధమయినదియో, మనుష్య, పశు, పక్షి, దేహాత్మకముగా నుండెడి ఈ సమస్తమున్ను ఏ పరబ్రహ్మమునందున్నదియో, అటువంటి సదసత్స్వరూపమైనటువంటిన్ని, జనులయొక్క విజ్ఞానస్వరూపము

కంటె వేరైనటువంటిన్ని, ప్రార్థించదగినట్టిన్ని ఆత్మస్వరూపమయిన ఈ పరబ్రహ్మమును తెలిసికొనుడు

మూ ॥ యదర్చిమద్యదణుభ్యోఽణు చ
యస్మిన్ లోకా నిహితా లోకినశ్చ ।
తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః తదేతత్సత్యం తదమృతం
తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి ॥ 2

పద ॥ యత్ - అర్చిమత్ - యత్ - అణుభ్యః - అణు - చ - యస్మిన్ - లోకాః - నిహితాః - లోకినః - చ - తత్ - ఏతత్ - అక్షరం - బ్రహ్మ - సః - ప్రాణః- తత్ - ఉ - వాక్ - మనః - తత్ - ఏతత్ - సత్యం - తత్ - అమృతం - తద్ధవ్యం - సోమ్య - విద్ధి

టీక ॥ యత్ = ఏది, ఆర్చిమత్ = కాంతిగలదియో, యత్ = ఏది, అణుభ్యః= అతిసూక్ష్మములగు అణువులకంటె , అణు = సూక్ష్మమైనదియో, యస్మిన్= దేనియందు, లోకాః = లోకములున్ను, లోకినశ్చ = ఆ లోకములయందుండెడి మనుష్యులు మొదలగు వారున్ను, నిహితాః= ఉన్నవియో, తదేతత్ = ఆ ఈ సర్వాశ్రయ మగునది, అక్షరం = నాశన రహితమగు, బ్రహ్మ = పరబ్రహ్మము, సః = అది, ప్రాణః= ప్రాణమో, తత్ = అదే, వాఙ్మనః = వాక్కును, మనస్సును, తదేతత్= ఆయిది, సత్యం = వ్యర్థముకానట్టిదిన్ని, హేసోమ్య = ఓ ప్రియదర్శనుడా !, తద్వేద్ధవ్యం - తత్ = ఆ అక్షరునియందు, వేద్ధవ్యం = మనస్సుచేత కొట్టదగిన ( ఆపరమాత్మ యందు మనస్సమాధనము చేయదగినది, ) తత్ = ఆ అక్షర స్వరూపమును, విద్ధి = తెలుసుకొనుము

తా ॥ ఓ శౌనకుడా ! తేజస్సు గలిగినటువంటిన్ని, మిక్కిలి సూక్ష్మ స్వరూపమగు ఏపరబ్రహ్మమునందు సమస్త లోకములున్ను ఈ లోకముల యందుండెడి సర్వమున్ను ఉన్నవో, ప్రాణేంద్రియాది సముదాయయంతయు ఆనాశన రహితమగు పరబ్రహ్మమే ఏది ప్రాణాదులయొక్క లోపలనుండెడి ప్రకాశమగు అక్షర స్వరూపమో ఆ ఈసత్యస్వరూపమై నటువంటిన్ని, నాశములేనట్టిన్ని, మనస్సమాధానము పొందింపదగిన ఆ అక్షర స్వరూపమును తెలిసికొనుమూ ।

అను ॥ ఆవిర్భూతం స్వయం భాసాత్సత్త్వాత్సన్ని హితం చ తత్ ।
బ్రహ్మాస్మిన్ కల్పితం సర్వమితి ధీర్బోధ ఉచ్యతే ॥ 32

బ్రహ్మ స్వయముగ భాసించుటచేత ప్రత్యక్షము, తానే గనుక దగ్గరనే యున్నది ఈ బ్రహ్మమందు సర్వము కల్పించబడిన దనునది బోధ యనబడును

మూ ॥ ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపాసానిశితం సన్దయీత
ఆయమ్య తద్భావగతేన చేతసా లక్ష్యం తదేవాక్షరం సౌమ్య విద్ధి ॥ 3

పద ॥ ధనుః - గృహీత్వా - ఔపనిషదం- మహాస్త్రం - శరం - హి - ఉపాసానిశితం- సన్దయీత - ఆయమ్య - తద్భావగతేన - చేతసా - లక్ష్యం - తత్ - ఏవ - అక్షరం - సౌమ్య - విద్ధి

టీక ॥ హే సౌమ్య = ఓ ప్రియదర్శనుడా !, ఔపనిషదం = ఉపనిషత్తుల యందు ప్రసిద్ధమయిన, మహాస్త్రం = గొప్పఅస్త్రమగు, ధనుః = ధనుస్సును, గృహీత్వా= గ్రహించి, ఉపాసానిశితం - ఉపాసా= ఎడతెగని ధ్యానముచేత, నిశితం = వాడిగలదిగా జేయబడిన, శరం హి = బాణమును, సన్దయీత = ఎక్కుపెట్టవలయును, తద్భావగతేన= తత్ = ఆఅక్షర పరబ్రహ్మమునందు, భావ = ధ్యానమును, గతేన= పొందిన, చేతసా = చిత్తముచేత, ఆయమ్య = లాగి, తత్ = ఆ పూర్వము చెప్పియుండెడి, అక్షరమేవ = ఆ అక్షరస్వరూపమునే, లక్ష్యం = గుఱిగా, విద్ధి = తెలిసికొనుము

తా ॥ ఓ శౌనకుడా ! నీవు ఉపనిషత్ప్రసిద్ధమైన ఓంకారమనెడి ధనస్సును గ్రహించి ఆ ధనుస్సునందు ఉపాసనచేత వాడిగలదియగు బాణమును ఎక్కు పెట్టి ఆ ఎక్కు పెట్టిన బాణమును ఇంద్రియ సముదాయములయొక్క విషయములనుండి మరలించి లక్ష్యమునందే ఉంచి బ్రహ్మధ్యానమును పొందియుండెడి మనస్సుచేత పూర్వోక్తమగు అక్షరస్వరూపమునే లక్ష్యమునుగా తెలిసికొనుమా !

అను ॥ సా ధీశ్చే న్న స్థిరా త్వర్హి ప్రణవేన విచింతయేత్ ।
బాణేన విధ్యతే లక్ష్యం విధ్యే ద్బ్రహ్మ తథా ధియా ॥ 33

ఆ సర్వాత్మబుద్ధి స్థిరముగానుండకపోయినపుడు ఓంకారముతో ధ్యానించవలెను బాణముతో లక్ష్యమును భేదింతురు గదా! అట్లు బుద్ధితో బ్రహ్మమును వేధించవలెను

మూ ॥ ప్రణవో ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥ ४

పద ॥ ప్రణవః - ధనుః - శరః - హి - ఆత్మా - బ్రహ్మ - తత్ - లక్ష్యం - ఉచ్యతే- అప్రమత్తేన - వేద్ధవ్యం - శరవత్ - తన్మయః - భవేత్

టీక ॥ ప్రణవః = ఓంకారము, ధనుః = ధనస్సువంటిది, ఆత్మా = జీవుడు, శరో హి= బాణమువంటివాడు, బ్రహ్మ = పరబ్రహ్మము, లక్ష్యం = గుఱివంటిది అని, తత్ = ఆ పూర్వము జెప్పియుండెడి ధనస్సు మొదలయినది, ఉచ్యతే= చెప్పబడుచున్నది, అప్రమత్తేన = ప్రమాదము లేని చిత్తముచేత, వేద్ధవ్యం = కొట్ట దగినది, శరవత్ = బాణమువలెనే, తన్మయః = ఆ లక్ష్యమగు పరబ్రహ్మ స్వరూపముగా, భవేత్ = అగును

తా ॥ ఓ శౌనకుడా ! పూర్వము జెప్పియుండెడి ధనురాదికములలో ధనుస్సు ఓంకారమనిన్ని, బాణము జీవుడనిన్ని, లక్ష్యము నాశరహితమగు పరబ్రహ్మయనిన్ని చెప్పబడుచున్నది గనుక ఇట్లు ఓంకార మనెడి ధనస్సునందు ఎక్కు పెట్టబడిన జీవుడనెడి బాణము లక్ష్యభూతమైన పరబ్రహ్మమునందు ఏకాగ్రచిత్తముచేత పొందింపబడెనేని లోకమునందలి బాణము లక్ష్యమునందు జేరి ఎట్లు తన్మయమగుచున్నదో ఆ ప్రకారముగానే జీవుడున్ను పరబ్రహ్మమును చేరి ఆ పరబ్రహ్మమే యగుచున్నాడు

అను ॥ ధీ ర్బాణో ధను రోంకారో బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।
అప్రమ త్తేన వేద్ధవ్యం లగ్నా బ్రహ్మణి ధీ ర్భవేత్ ॥ 34

బుద్ధి బాణము, ధనస్సు ఓంకారము, దాని లక్ష్యము బ్రహ్మమగు చున్నది జాగ్రత్తగా గురిజూచి కొట్టవలెను అప్పుడు బుద్ధి బ్రహ్మము నంటుకొనును

మూ ॥ యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్ష మోతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైః ।
తమేవైకం జానథాత్మాన మన్యా వాచో విముఞ్చథ అమృతస్యైష సేతుః ॥ ౫

పద ॥ యస్మిన్ - ద్యౌః - పృథివీ - చ - అన్తరిక్షం - ఓతం మనః - సహ - ప్రాణైః- చ - సర్వైః - తం - ఏవ - ఏకం - జానథ - ఆత్మానం - అన్యాః - వాచః - విముఞ్చథ - అమృతస్య - ఏషః - సేతుః

టీక ॥ ద్యౌః = ద్యులోకమున్ను, పృథివీ చ = భూమియున్ను, అన్తరిక్షం = ఆకాశమున్ను, సర్వైశ్చ = సమస్తములయిన, ప్రాణైస్సహ = ఇంద్రియములతో గూడ, మనః = మనస్సున్ను, యస్మిన్ = ఏ అక్షరపురుషునియందు, ఓతం= కూడుకొనియున్నదియెూ, ఏకం= అద్వితీయమైన, తమేవ = ఆ అక్షరస్వరూపునే, ఆత్మానం = జీవునిగా, జానథ = తెలిసికొనుడు, అన్యాః= ఇతరములగు, వాచః = వాక్కులను, విముఞ్చథ = విడిచిపెట్టుడు, ఏషః = ఈ ఆత్మజ్ఞానము, అమృతస్య = మోక్షమునకు, సేతుః = సేతువువంటిదిగా, భవతి = అగుచున్నది

తా ॥ ఓ శిష్యులారా ! మీరు ఇతరములగు మాటలను విడిచి భూమ్యంతరిక్షాదులున్ను సర్వేంద్రియములతో ఈ మనస్సున్ను, ఈ సమస్తమున్ను ఏ అక్షరస్వరూపునియందున్నదియో, అద్వితీయమగు ఆ అక్షరస్వరూపునే మీ ఆత్మనుగా తెలుసుకొనుడు ! ఇట్లు తెలిసికొనిన ఈ ఆత్మజ్ఞానమే ఈ సంసారసముద్రమును దాటించి మోక్షమును పొందించే కొరకు సాధనమైన వంతెనగా నుంటున్నది

అను ॥ లౌకికీ ర్వైదికీ శ్చాన్యాః సర్వా వాచః పరిత్యజేత్ ।
ధ్యాయేచ్చే ద్బ్రహ్మ తస్యాత్ర ధీగ్రంధ్యాది వినశ్యతి ॥ 35

లౌకికములు వైదికములయిన అన్ని వాక్యములను వదలి వేయవలెను బ్రహ్మమును ధ్యానించినట్లైన వానికందు గల బుద్ధియొక్క బంధము నశించిపోవును

మూ ॥ అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః
స ఏషోఽన్త శ్చరతే బహుధా జాయమానః ।
ఓమిత్యేవం ధ్యాయథాత్మానం
స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్ ॥ ౬

పద ॥ అరాః - ఇవ - రథనాభౌ - సంహతాః - యత్ర - నాడ్యః - సః - ఏషః -

అన్తః- చరతే - బహుధా - జాయమానః - ఓం - ఇతి - ఏవం - ధ్యాయథ- ఆత్మానం - స్వస్తి - వః - పారాయ - తమసః - పరస్తాత్

టీక ॥ నాడ్యః = నాడులు, రథనాభౌ = తేరు (బండి) యొక్క బొడ్డునందు, అరా ఇవ = బండియాకులవలెనే, యత్ర = ఏ హృదయమందు, సంహతాః = కూడుకొని వ్యాపించియున్నవో, సః = ఆ ప్రసిద్ధుడగు, ఏషః = ఈ జీవుడు, బహుధా = అనేకవిధములుగా, అన్తః = ఆ హృదయమధ్యమందు, జాయమానః = అగుచు, చరతే = ఉంటున్నాడు, (తం = అటువంటి), ఆత్మానం = జీవుని, ఓమితి = ఓంకారమని, ఏవం = ఈ ప్రకారము, ధ్యాయథ= ధ్యానించుడు, పరస్తాత్ = నా ఉపదేశానన్తరము, తమసః = అజ్ఞానముయొక్క, పారాయ = అవతలి గట్టుకొరకు, వః = మీకు, స్వస్తి = శుభము, అస్తు = అగుగాక!

తా ॥ ఓ శిష్యులారా ! ఈ దేహమునందలి నాడులన్నియు బండి చక్రమునందు బండియాకులవలెనే ఏ హృదయమందుంటున్నవో, అట్టి హృదయమందు సాక్షియగు ఈ జీవుడు ఈ హృదయమధ్యముననే ఇట్లుండెడి ఆ జీవాత్మను ఓంకారస్వరూపముగానే ధ్యానించుడు ! ఈ నా ఉపదేశానన్తరము అజ్ఞాననాశనమగు బ్రహ్మ ప్రాప్తికొరకు మీకు నిర్విఘ్నమయి మంగళమగు గాక!

అను ॥ **పంచీకృతోక్తమార్గేణ ప్రణవధ్యాన మాచరేత్।**
**తతో జగదధిష్ఠాన మేకమేవ సదేక్ష్యతే ॥** **36**

పంచీకరణమున చెప్పబడిన రీతిని ప్రణవధ్యానము జేయవలెను పిమ్మట జగత్తున కాధారమయిన ఒక్కవస్తువునే ఎల్లప్పుడు చూచును

మూ ॥ *యస్సర్వజ్ఞ సర్వవిద్యస్యైష మహిమా భువి ।*
*దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమన్యాత్మా ప్రతిష్ఠితః ॥* ౭

పద ॥ యః - సర్వజ్ఞః - సర్వవిత్ - యస్య - ఏషః - మహిమా - భువి - దివ్యే - బ్రహ్మపురే - హి - ఏషః - వ్యోమని - ఆత్మా - ప్రతిష్ఠితః

టీక ॥ యః = ఎవడు, సర్వజ్ఞః = సామాన్యముగా సర్వమును తెలిసినవాడును, సర్వవిత్= విశేషముగా సర్వము నెఱింగినవాడును, (భవతి = అగుచున్నాడో),

యస్య = ఎవనికి, భువి = భూమియందు, ఏషః = ఈ ప్రసిద్ధమగు, మహిమా= విభూతి, (భవతి = అగుచున్నదో), ఏషః = ఈ, ఆత్మా = సర్వజ్ఞుడగు పరమాత్మ, దివ్యే = ప్రకాశాత్మకమగు, బ్రహ్మపురే = హృదయపుండరీకము నందుగల, వ్యోమని = ఆకాశమందు, ప్రతిష్ఠితః = ఉన్నవాడు వలెనే, (లభ్యతే= పొందబడుచున్నాడు)

తా ॥ ఓ శౌనకుడా ! ఏ పరమాత్మ మాయయను ఉపాధితో గూడుకొని సర్వమును సామాన్యముగా దెలిసికొనుచున్నాడనిన్ని, అవిద్యయను ఉపాధితో గూడుకొని సర్వమును విశేషముగా దెలిసి కొనుచున్నాడనిన్నీ, చెప్పబడి యుండెనో, ఏ పరమాత్మ యొక్క ఈ ప్రసిద్ధమగు మహిమ చంద్రసూర్యులు మొదలగు ఈ సమస్తమునకు నతిక్రమించ నలవి గాకున్నదియో, అట్టి సర్వజ్ఞుడగు ఈ పరమాత్మ ప్రకాశరూపమగు హృదయకమలమందున్న వాడువలెనే పొందబడుచున్నాడు

మూ ॥ *మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితో౽న్నే హృదయం సన్నిధాయ। తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా ఆనందరూప మమృతం యద్విభాతి ॥౭*

పద ॥ మనోమయః - ప్రాణశరీరనేతా - ప్రతిష్ఠితః - అన్నే - హృదయం- సన్నిధాయ- తత్ - విజ్ఞానేన - పరిపశ్యంతి - ధీరాః - ఆనందరూపం - అమృతం - యత్ - విభాతి

టీక ॥ మనోమయః = మనస్స్వరూపు డయినటువంటిన్ని, ప్రాణ శరీర నేతా = ప్రాణదేహములకు ప్రభువైన, అన్నే = దేహమందు, ప్రతిష్ఠితః= ఉంచబడియున్నదై, యత్= ఏది, విభాతి = ప్రకాశించుచున్నదియో, ధీరాః= జ్ఞానులు, హృదయం = మనస్సును, సన్నిధాయ = బాగుగా స్థాపించి, అమృతం= నాశరహితమగు, అనందరూపం = ఆనందస్వరూపమగు, తత్= ఆ ఆత్మతత్త్వమును, విజ్ఞానేన = విశేషజ్ఞానముచేత, పరిపశ్యంతి= అంతటపూర్ణముగా జూచుచున్నారు,

తా ॥ ఓ శౌనకుడా ! ఆ సర్వజ్ఞుడగు పరమాత్మ ప్రకాశమగు మనస్సునం దుండుటవలన మనోమయుడై ప్రాణదేహములకు నాయకుడుగా

ఈదేహమందుంటున్నాడు ఇట్లీ దేహమందు ప్రకాశించుచున్నట్టిన్ని, పరమానందరూపమగు ఆ ఆత్మతత్త్వమును జ్ఞానులు తమ మనస్సుతో అంతట పరిపూర్ణముగా జూచుచున్నారు

మూ ॥ *భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।*
*క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥* ౯

పద ॥ భిద్యతే - హృదయగ్రన్థిః - ఛిద్యన్తే - సర్వసంశయాః - క్షీయన్తే - చ - అస్య- కర్మాణి - తస్మిన్ - దృష్టే - పరావరే

టీక ॥ పరావరే = కార్యకారణ స్వరూపముచేత అవరుడనియు పరుడనియు వ్యవహరింపబడుచున్న, తస్మిన్ = సర్వజ్ఞుడగు ఆ పరమాత్మ, దృష్టేసతి = చూడబడుచుండగా, హృదయగ్రన్థిః = హృదయము యొక్క బంధము, భిద్యతే = విడిపోవుచున్నది, సర్వసంశయాః = సమస్తసంశయములు, ఛిద్యంతే= నాశనమును పొందుచున్నవి, అస్య = ఈ సంశయరహితుడగు బ్రహ్మజ్ఞానియొక్క, కర్మాణి చ = జన్మ కారణములగు సర్వకర్మములున్ను, క్షీయన్తే = నశించుచున్నవి

తా ॥ ఓ శౌనకుడా ! కార్యకారణ స్వరూపముచేత అవరుడనియు, పరుడనియు వ్యవహరింపబడుచున్న సర్వజ్ఞుడగు ఆ పరమాత్మ చూడబడుచుండగా హృదయముయొక్క బంధము విడిపోవుచున్నది సమస్త సందేహములు నాశనమును బొందుచున్నవి ఈ సంశయరహితుడగు బ్రహ్మజ్ఞానియొక్క జన్మకారణములగు సర్వకర్మముల్ను నశించుచున్నవి అతడు జీవన్ముక్తుడగుచున్నాడు

అను ॥ భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥ 37

హృదయబంధము విడిపోవును, సర్వసంశయములు తెగిపోవును వాని కర్మలు నశించును ఎవడు పరాత్పరుని జూచునో వానికి వన్నియు సిద్ధించును

మూ ॥ *హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్ ।*
*తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మవిదో విదుః ॥* ౧౦

పద ॥ హిరణ్మయే - పరే - కోశే - విరజం - బ్రహ్మ - నిష్కలం - తత్- శుభ్రం - జ్యోతిషాం - జ్యోతిః - తత్ - యత్ - ఆత్మవిదః - విదుః

టీక ॥ హిరణ్మయే = ప్రకాశస్వరూపమగు, పరే = శ్రేష్ఠమయిన, కోశే = హృదయకోశమునందు, బ్రహ్మ = పరబ్రహ్మము, యత్ = ఏ కారణమువలన, విరజం = దోషరహితమైనదిన్ని, నిష్కలం = నిరవయవమైనదిన్ని, ( భవతి= అగుచున్నదో,) తత్ = ఆ కారణమువలన, శుభ్రం = పరిశుద్ధమైన, జ్యోతిషాం= తేజస్సులకు, జ్యోతిః = ప్రకాశస్వరూపమగు, తత్ = పరంజ్యోతిరూపమగు ఆ పరబ్రహ్మమును, ఆత్మవిదః = ఆత్మజ్ఞానులు, విదుః = తెలిసికొను చున్నారు

తా॥ ఓ శౌనకుడా ! ప్రకాశస్వరూపమగు శ్రేష్ఠమయిన హృదయ కోశమునందు పరబ్రహ్మము ఏ కారణమువలన దోషరహితమైనదిన్ని, నిరవయవమైనదిన్ని అగుచున్నదో ఆ కారణమువలన పరిశుద్ధమైన సూర్యాగ్నులు మున్నగు సమస్త తేజస్సులకు ప్రకాశస్వరూపమగు పరంజ్యోతి రూపమగు ఆ పరబ్రహ్మమును ఆత్మజ్ఞానులు తెలిసికొనుచున్నారు

అను ॥ **ఆనన్దరూపం హృత్కోశే యద్భాతి ప్రాణినాం సదా ।**
**తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి ద్రష్టవ్యం తన్ముముక్షుభిః ॥ 38**

హృదయకోశపద్మమందు ప్రాణులకెల్లప్పుడు ఏది ప్రకాశించునో ఆ స్వచ్ఛమైన తేజస్సులకు తేజమిచ్చునట్టి యా తేజస్సును ముముక్షువులు జూడదగును

మూ ॥ *న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం*
*నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః ।*
*తమేవ భాన్త మనుభాతి సర్వం*
*తస్య భాసా సర్వమిదం విభాతి ॥ ౧౧*

పద ॥ న - తత్ర - సూర్యః - భాతి - న - చన్ద్రతారకం - న - ఇమాః - విద్యుతః- భాన్తి - కుతః - అయం - అగ్నిః - తం - ఏవ - భాన్తం - అనుభాతి - సర్వం - తస్య - భాసా - సర్వం - ఇదం - విభాతి

టీక ॥ సూర్యః = సూర్యుడు, తత్ర = ఆ పరబ్రహ్మమునందు, న భాతి = ప్రకాశించడము లేదు, చన్ద్రతారకం = చంద్రనక్షత్రములును, న భాతి = ప్రకాశించడము లేదు, ఇమాః = ఈ, విద్యుతః = మెరుపులును, నభాన్తి = ప్రకాశించడము లేదు, అయమగ్నిః = మనకు కనబడుచుండెడి ఈ యగ్ని, కుతః = ఎట్లు, భాతి = ప్రకాశించును, సర్వం = సమస్తము, భాన్తం = ప్రకాశించుచున్న, తమేవ = ఆ పరమేశ్వరునే, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నది, తస్య = ఆ పరమేశ్వరునియొక్క, భాసా = ప్రకాశముచేతనే, ఇదం సర్వం = ఈ సమస్త జగత్తు, విభాతి = మిక్కిలి ప్రకాశించుచున్నది

తా ॥ ఓ శౌనకుడా ! సర్వమును ప్రకాశింపజేసెడి సూర్యుడును, చంద్రుడును, నక్షత్రములును, మెఱుపులును, అగ్నియును యివి యన్నియున్ను ఆ పరబ్రహ్మమును ప్రకాశింపజేయలేవు, ప్రకాశించుచున్న ఆ పరమాత్మ ననుసరించియే ఈ సూర్యుడు మొదలైన సర్వమున్ను ప్రకాశించుచున్నది ఆ పరమాత్మ ప్రకాశముచేతనే ఈ కనబడెడు సమస్త జగత్తు ప్రకాశించుచున్నది

అను ॥ **భాసకా అపి సూర్యాద్యా స్తద్భాసయితు మక్షమాః ।**
**తస్మిన్నాదౌ భాసమానే తద్భాసా భాసతేఽఖిలాః ॥** 39

సూర్యుడు మొదలైన తేజస్సులు దానిని (పరమాత్మను) ప్రకాశింప జేయలేవు మొదట నది భాసించుటంజేసి అద్దాని ప్రకాశమువలన సూర్యాది తేజస్సులన్నియు భాసించును

మూ ॥ *బ్రహ్మైవేద మమృతం పురస్తా*
*ద్బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ దక్షిణతశ్చో త్తరేణ ।*
*అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం*
*విశ్వమిదం వరిష్ఠమ్ ॥* ౧౨

పద ॥ బ్రహ్మ - ఏవ - ఇదం - అమృతం - పురస్తాత్ - బ్రహ్మ - పశ్చాత్- బ్రహ్మ- దక్షిణతః - చ - ఉత్తరేణ - అధః - చ - ఊర్ధ్వం - చ - ప్రసృతం - బ్రహ్మ- ఏవ - ఇదం - విశ్వం - ఇదం - వరిష్ఠమ్

టీక ॥ ఇదం = ఈ సమస్తము, అమృతం = నాశరహితమగు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే, పురస్తాత్ = ముందరను, బ్రహ్మ = పరబ్రహ్మము, పశ్చాత్ = వెనుకను, బ్రహ్మ= పరబ్రహ్మము, దక్షిణతశ్చ = దక్షిణ భాగమునందును, ఉత్తరేణ = ఉత్తరభాగమునందును, అధశ్చ= క్రిందిభాగమందును, ఊర్ధ్వంచ = మీదిభాగమునందును, (సర్వతః = అంతట), ప్రసృతం = వ్యాపించి యున్నది బ్రహ్మైవ = పరబ్రహ్మమే, ఇదం = ఈ, విశ్వం = సమస్త జగత్తును, వరిష్ఠం = శ్రేష్ఠమగు, ఇదం = ఈ బ్రహ్మైవ = పరబ్రహ్మమే

తా ॥ ఓ శౌనకుడా ! ఈ పూర్వము జెప్పియుండెడి నాశరహితమగు పరబ్రహ్మమే ముందు భాగమునను, వెనుక భాగమునను, దక్షిణభాగమునను, ఉత్తర భాగమునను, ఊర్ధ్వభాగమునను, క్రిందిభాగమునను అంతట వ్యాపించియున్నది ఈ సమస్త జగత్తును శ్రేష్ఠమగు ఈ పరబ్రహ్మమే

**అను ॥ సర్వాసు దిక్షు తద్భాతి తస్మిన్నంతర్భవత్యదః ।**
**జగత్తతః పృథఙ్నాస్తి తరంగాది జలాద్యథా ॥ 40**

అన్నిదిక్కులయందును అది ప్రకాశించుచున్నది ఈ జగమంతయు దానియందు అణగియున్నది జలముకంటె వేరుగా తరంగములు లేనట్లు జగత్తు దానిని విడిచి లేదు

ఇతి ద్వితీయముండకే - ద్వితీయః ఖండః

ఇతి ద్వితీయ ముండకం సమాప్తం

ఇది ద్వితీయముండకమున ద్వితీయ ఖండము సమాప్తము

ద్వితీయ ముండకము సమాప్తము



ఓమ్

# తృతీయముణ్డకే ప్రథమః ఖణ్డః

మూ ॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ॥ ౧

పద ॥ ద్వౌ - సుపర్ణౌ - సయుజౌ - సఖాయౌ - సమానం - వృక్షం - పరిషస్వజాతే- తయోః - అన్యః - పిప్పలం - స్వాదు - అత్తి - అనశ్నన్ - అన్యః - అభిచాకశీతి

టీక ॥ సుపర్ణౌ = మంచిగమనముగల, సయుజౌ = కూడుకొనియుండెడి, సఖాయౌ= పరస్పరమున్ను పొందియున్న, ద్వౌ = జీవపరమాత్మ లిద్దరున్ను, సమానం = ఒకటియగు, వృక్షం = శరీరమును, పరిషస్వజాతే = ఆలింగనము జేసికొనియుండిరి, తయోః = ఆ జీవపరమాత్మలు ఇద్దరిలోపల, అన్యః = ఒకడగుజీవుడు, స్వాదు = రుచియైన, పిప్పలం = సుఖదుఃఖరూపమగు కర్మఫలమును, అత్తి = అనుభవించుచున్నాడు, అన్యః = ఇతరుడగు పరమాత్మ, అనశ్నన్ = ఆకర్మఫలముననుభవించనివాడై, అభిచాకశీతి = కేవలము సాక్షియై చూచుచున్నాడు

తా ॥ ఓ శౌనకుడా ! ఎల్లప్పుడున్ను ఒకటిగా గూడుకొని పరస్పర మున్ను అనుసరించి పొందుచుండెడి జీవపరమాత్మ లిద్దరును ఆ పరబ్రహ్మ స్వరూపమే కారణముగా గల నాశనమగుచుండెడి ఒక్కటియగు ఈ శరీరమును ఫలానుభూతికొరకు పక్షులు చెట్టునువలెనే పొందియున్నారు ఆ యిద్దరిలో జీవుడు విచిత్రములగు కర్మలవలన గలిగెడి సుఖదుఃఖరూప ఫలమును అజ్ఞానముచేత అనుభవించుచున్నాడు సర్వజ్ఞుడగు ఈశ్వరుడు నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావుడై భోక్తృభోజ్య రూపములుగా నుండెడి జీవకర్మ ఫలములకు రెంటికిని ప్రేరకుడై ఆ కర్మఫలమును తాననుభవించకనే కేవలమున్ను నిత్యసాక్షియై చూచుచున్నాడు

అను ॥ వృక్షే పక్షీ ఫలం భుఙ్క్తే క్షుధితోఽన్యస్తు వీక్షతే ।
చిచ్ఛాయావా నహంకారో భుంక్తే చిద్వీక్షతే తథా ॥ 41

ఆకలిగల పక్షి ఆ చెట్టుపండును దినును ఆకలిలేని పక్షి ఊరక చూచుచుండును అట్లే చిచ్ఛాయగల యహంకారము (జీవుడు) అనుభవించును చిదాత్మ సాక్షియై చూచుచుండును

మూ ॥ సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః ।
జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య మహిమానమితి వీతశోకః ॥ ౨

పద ॥ సమానే - వృక్షే - పురుషః - నిమగ్నః - అనీశయా - శోచతి - ముహ్యమానః జుష్టం - యదా - పశ్యతి - అన్యం - ఈశం - అస్య - మహిమానం - ఇతి- వీతశోకః

టీక ॥ సమానే = ఒకటియగు, వృక్షే = నశించెడి ఈశరీరమందు, పురుషః = జీవుడు, నిమగ్నః = మునిగినవాడయి, అనీశయా = దీనభావముచేత, ముహ్యమానః= మోహమును బొందినవాడయి, శోచతి = దుఃఖించుచున్నాడు, జుష్టం = సేవింపబడు చున్నటువంటిన్ని, అన్యం = ఇతరుడగు, ఈశం = విలక్షణుడగు పరమాత్మను, యదా = ఎప్పుడు, అస్య = పరమేశ్వరుడును అగు నాయొక్క, మహిమానమితి = సామర్థ్యమనిన్ని, పశ్యతి = చూచుచున్నాడో, తదా = అప్పుడు, వీతశోకః = పోయిన దుఃఖముగలవాడు ( భవతి = అగుచున్నాడు)

తా॥ ఓ శౌనకుడా ! ఇట్లు జీవేశ్వరులకు సమానాధికరణమయిన ఒక శరీరమునందు నివసించియుండెడి జీవుడు అజ్ఞానముచేత దేహమే తాననెడి అభిప్రాయమును పొంది దీనభావముతో దుఃఖించుచున్నాడు ఇట్లు అజ్ఞానముచేత దుఃఖమును బొందియుండెడి జీవుడు తిర్యఙ్మానుషాది యోనులయందు జన్మించుచు, ఒకానొకప్పుడు అనేక జన్మములయందు పరిశుద్ధమయిన పుణ్యాతిశయమనెడి నిమిత్తమువలన పరమదయాళుడగు ఒకానొక మహాపురుషునిచేత చూపింపబడిన యోగమార్గము గలవాడై , అహింసా, సత్య, బ్రహ్మచర్య, సర్వత్యాగ శమదమాది సంపన్నుడై , ఏకాగ్రచిత్తము గలవాడయి పరిపూర్ణ జ్ఞానముచేతను సేవింపబడుచున్న జీవవిలక్షణమయిన అసంసారియగు

పరమాత్మను ఆత్మస్వరూపమనిన్ని ఎప్పుడు చూచుచున్నాడో అప్పుడే సమస్త దుఃఖము నశించినవాడగుచున్నాడు

అను ॥ బోధా త్పురా తు చిద్భ్రాన్త్యా మగ్నా భోక్తరి శోచతి ।
సా భ్రాంతి ర్భోక్తృనిష్ఠైవ తద్వివేకోఽపి భోక్తృగః ॥ 42

జ్ఞానమునకుముందు భ్రాంతిలోమునిగిన భోక్తయందలి చిదాత్మ శోకించును ఆ భ్రాంతి భోక్తయందే గలిగినది ఆ భ్రాంతియొక్క వివేకము గూడ భోక్తయందే గలుగును

మూ ॥ *యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం*
*కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ ।*
*తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ*
*నిరంజనః పరమం సామ్య ముపైతి ॥* 3

పద ॥ యదా - పశ్యః - పశ్యతే - రుక్మవర్ణం - కర్తారం - ఈశం - పురుషం- బ్రహ్మయోనిమ్ - తదా - విద్వాన్ - పుణ్యపాపే - విధూయ - నిరఞ్జనః - పరమం - సామ్యం - ఉపైతి

టీక ॥ పశ్యః = విద్వాంసుడు, కర్తారం =సృష్టికర్తయైనటువంటిన్ని, ఈశం= సర్వమునకు నియామకుడైనటువంటిన్ని, పురుషం = పురుషస్వరూపుడై నట్టిన్ని, బ్రహ్మయోనిం = అపరస్వరూపుడగు బ్రహ్మకు కారణుడైనటు వంటిన్నీ, రుక్మవర్ణం = స్వయంజ్యోతి స్స్వరూపమైన పరమాత్మను, యదా= ఎప్పుడు, పశ్యతే = చూచుచున్నాడో, తదా = అప్పుడు, విద్వాన్ = విద్వాంసుడు ,( ఆత్మజ్ఞాని) పుణ్యపాపే = పుణ్యపాపములను, విధూయ= నిరసించి, నిరంజనః = ఎట్టిప్రకృతి సంపర్కము లేనివాడై, పరమం= శ్రేష్ఠమయిన, సామ్యం = సమత్వమును, ఉపైతి = పొందుచున్నాడు

తా ॥ ఓ శౌనకుడా ! బ్రహ్మస్వరూపమును దర్శించుచుండెడు ఆత్మజ్ఞాని సృష్టికర్తయగు హిరణ్యగర్భునకు కారణుడయినట్టిన్ని, జగత్కర్త అయినట్టిన్ని, పరంజ్యోతి రూపుడై నట్టిన్ని పరిపూర్ణుడగు పరమాత్మను పూర్వము జెప్పిన ప్రకారము ఎప్పుడు జూచునో అప్పుడా విద్వాంసుడు పుణ్యపాపములను విడిచి దుఃఖరహితుడై పరమాత్మను పొందుచున్నాడు

అను ॥ వివిసక్తి యదా భోక్తా పుణ్యపాపే తదాఽన్య నో ।
క్రీడత్యాత్మన్యసౌ ధ్యానాద్ద్యూతాదౌ మూఢవత్సదా ॥ 43

ఎపుడు భోక్త వివేకము గలవాడగునో అపుడతనికి పుణ్యపాపము లుండవు ఆత్మధ్యానమెల్లప్పుడు గలిగి యతడు జూదము మొదలైన వానియందు మూఢునింబోలి ఆత్మయందు క్రీడించును

మూ ॥ *ప్రాణో హ్యేష యస్సర్వభూతై ర్విభాతి*
*విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ ।*
*ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావా*
*నేష బ్రహ్మవిదాం వరిష్ఠః ॥* ౪

పద ॥ ప్రాణః - హి - ఏషః - యః - సర్వభూతైః - విభాతి - విజానన్ - విద్వాన్- భవతే - న - అతివాదీ - ఆత్మక్రీడః - ఆత్మరతిః - క్రియావాన్ - ఏషః - బ్రహ్మవిదాం - వరిష్ఠః

టీక ॥ యః ఏషః = ఏ ఈ, ప్రాణో హి = ప్రాణస్వరూపుడగు పరమాత్మ, సర్వభూతైః= సమస్త భూతములతోను, విభాతి = నానావిధములుగా ప్రకాశించుచున్నాడు, (ఏవం = ఈ ప్రకారముగా, సర్వభూతస్థం= సర్వభూతముల యందున్న పరమాత్మను), విజానన్ = తెలిసికొనిన, విద్వాన్ = విద్వాంసుడు, అతివాదీ = అతిక్రమించి పలికెడివాడు, న భవతే = కాడు, ఆత్మక్రీడః = ఆత్మయందే క్రీడగలిగినట్టివిన్ని, ఆత్మరతిః = ఆత్మయందే రమించునట్టివిన్ని, క్రియావాన్ = జ్ఞాన, ధ్యానవైరాగ్యాది క్రియలుగల, ఏషః= ఈ ఆత్మజ్ఞాని, బ్రహ్మవిదాం = బ్రహ్మవేత్తలలో, వరిష్ఠః = శ్రేష్ఠుడు, (భవతి= అగుచున్నాడు)

తా ॥ ఓ శౌనకుడా ! ప్రాణమునకు ప్రాణస్వరూపుడై నట్టి సర్వస్వరూపియగు ఏ పరమాత్మ బ్రహ్మాదిస్తంబ పర్యంతముండెడి సమస్త భూతములతో చేరియున్నవాడై అనేకవిధముల ప్రకాశించుచున్నాడో అట్టి పరమాత్మను ఆత్మస్వరూపముగా తెలిసికొనిన బ్రహ్మజ్ఞాని ఆత్మనతిక్రమించి ఆత్మకంటె అన్యములైనవి యున్నవని చెప్పడు ఎప్పుడున్ను ఆత్మయందే

క్రీడించుచున్నట్టిన్ని, ఆత్మయందే ప్రేమకలిగినట్టిన్ని జ్ఞాన, ధ్యాన వైరాగ్యాదులు గల ఈ బ్రహ్మజ్ఞాని బ్రహ్మవేత్తలందరిలో శ్రేష్ఠుడగుచున్నాడు

అను ॥ ఆత్మన్యేవ రతిం కుర్యాత్సర్వదా నిత్యకర్మవత్ ।
వరిష్ఠో బ్రహ్మ విత్స్వేష వ్యర్థక్షణ వివర్జనాత్ ॥ 44

నిత్యకర్మనువలె ఆత్మధ్యానమునే ఎల్లప్పుడు చేయును బ్రహ్మవేత్తలలో నితడు శ్రేష్ఠుడు వ్యర్థముగా నొక్క-క్షణమైనను గడుపక స్వాత్మయందే విహరించును

మూ ॥ సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।
అన్తశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥ 5

పద ॥ సత్యేన - లభ్యః - తపసా - హి - ఏషః - ఆత్మా - సమ్యజ్జ్ఞానేన - బ్రహ్మచర్యేణ - నిత్యం - అన్తః - శరీరే - జ్యోతిర్మయః - హి - శుభ్రః - యం - పశ్యన్తి - యతయః - క్షీణదోషాః

టీక ॥ క్షీణదోషాః - క్షీణ = నశించిన, దోషాః = ప్రకృతి దోషములు గల, యతయః= సన్న్యాసులు (పరమాత్మ స్వరూపముకొరకు యత్నము జేయుచున్న సన్న్యాసులు,) యం = ఏ ఆత్మ స్వరూపమును, పశ్యన్తి = చూచుచున్నారో, ఏషః = ఈ, జ్యోతిర్మయః = తేజోరూపమైన, శుభ్రః = పరిశుద్ధమగు, ఆత్మా= ఆత్మ స్వరూపము, నిత్యం = ఎల్లప్పుడు, సత్యేన = సత్యము చేతనున్ను, నిత్యం = ఎల్లప్పుడున్ను, తపసా = ఆత్మ దర్శనానుకూలమైన తపస్సుచేతనున్ను, నిత్యం = ఎల్లప్పుడున్ను, సమ్యజ్జ్ఞానేన = గొప్ప తెలివిచేతనున్ను, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్య నియమములచేతనున్ను, అన్తశ్శరీరే = శరీర మధ్యమునందు, లభ్యః = పొందదగినది

తా ॥ ఓ శౌనకుడా ! ఆత్మస్వరూపమును బొందుటకు మిక్కిలి ప్రయత్నము జేయుచుండెడి ప్రకృతిదోషరహితులగు సన్న్యాసులు ఏ పరమాత్మ స్వరూపమును జూచుచున్నారో, ఆ తేజోమయమగు పరిశుద్ధమైన పరమాత్మ స్వరూపము ఎడతెగని బ్రహ్మచర్య, సత్య, తప, స్సాక్షాత్కారజ్ఞానములచేత ఈ

దేహములోపలనుండెడి హృదయ కమలముయొక్క చిదాకాశమునందు పొందదగియున్నది

అను ॥ సత్యం తపో బ్రహ్మచర్యం విద్యాధికృతికారణమ్ ।
ముఖ్యాధికారీ విద్యాయాం వరిష్ఠో బ్రహ్మవిద్భవేత్ ॥ 45

సత్యము, తపస్సు, బ్రహ్మచర్యము విద్యయందధికారము (జ్ఞానాధికారమును) కలిగించును విద్యయందు బ్రహ్మవిద్వరిష్ఠుడు ముఖ్యాధికారి యగును

మూ ॥ సత్యమేవ జయతే నానృతం
సత్యేన పన్థా వితతో దేవయానః ।
యేనాక్రమన్త్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥ ౬

పద ॥ సత్యం - ఏవ - జయతే - న - అనృతం - సత్యేన - పన్థాః - వితతః - దేవయానః - యేన ఆక్రమన్తి - ఋషయః - హి - ఆప్తకామాః - యత్ర - తత్ - సత్యస్య - పరమం - నిధానమ్

టీక ॥ సత్యమేవ = నిజమే, జయతే = జయించుచున్నది, అనృతం = అసత్యము, న= జయించదు, సత్యేన = సత్యముచేతను, దేవయానః= దేవయానమను పేరుగల, పన్థాః = మార్గము, వితతః = విస్తారమైనది, ( భవతి = అగుచున్నది,) యేన హి = ఏ మార్గముచేతనే, ఆప్తకామాః = పొందబడిన కోరికలుగల, ఋషయః= మునులు, యత్ర = ఏ పరబ్రహ్మమునందు, తత్ = ఆ ఆత్మతత్త్వమును, ఆక్రమన్తి = ఆక్రమించుకొనుచున్నారో, (తత్ = అది,) సత్యస్య = సత్యమునకు, పరమం = శ్రేష్ఠమైన, నిధానం = స్థానము ( భవతి = అగుచున్నది)

తా ॥ ఓ శౌనకుడా ! సత్యమును పలికెడివాడు సర్వోత్కృష్టుడగుచున్నాడు అసత్యమును పలికెడివాడు మిక్కిలి నీచుడగుచున్నాడు సత్యమే జయించును, అసత్యమునకు జయము లభించదు సత్యమును పలుకుటచేతనే దేవయానమను పేరుగల మార్గము వృద్ధిపొందినది ఈ దేవయానమగు మార్గముచేత ఆ ప్తకాములగు ఋషులు ఏ పరబ్రహ్మమునందు ఆత్మతత్త్వమును బొందుచుందురో అదియే సత్యమునకు శ్రేష్ఠమగు స్థానము

మూ ॥ బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం
సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి ।
దూరాత్సుదూరే తదిహాంతికే చ
పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్ ॥ ౭

పద ॥ బృహ్మత్ - చ - తత్ - దివ్యం - అచిన్త్యరూపం - సూక్ష్మాత్ - చ- తత్ - సూక్ష్మతరం - విభాతి - దూరాత్ - సుదూరే - తత్ - ఇహ - అన్తికే - చ- పశ్యత్సు - ఇహ - ఏవ - నిహితం - గుహాయాం

టీక ॥ తత్= ఆ పరబ్రహ్మము, బృహచ్చ = మిక్కిలి విస్తారమైనది, దివ్యం= స్వయం ప్రకాశమైనట్టిన్ని, అచిన్త్యరూపం = చింతించ శక్యము గాని స్వరూపముగలిగి నట్టిన్ని, సూక్ష్మాత్ = సూక్ష్మమగు ఆకాశాదికముకంటె, సూక్ష్మతరం = మిక్కిలి సూక్ష్మమైన, తత్= ఆ పరబ్రహ్మము, విభాతి = నానావిధములుగా ప్రకాశించుచున్నది తత్ = ఆ పరబ్రహ్మము, దూరాత్ = మిక్కిలి దూరదేశముకంటె, సుదూరే = మిక్కిలి విదూరమగు ప్రదేశమునందు, ఇహ = ఈ దేహమునందే, అన్తికే చ = సమీపమునందును, ఇహైవ = ఈ దేహమునందే, పశ్యత్సు = చూచుచున్న యోగుల విషయమై, గుహాయాం= బుద్ధి గుహయందును, నిహితం = ఉన్నయది

తా ॥ ఓ శౌనకుడా ! సత్యమునకు స్థానమగు ఆ పరబ్రహ్మము సర్వత్ర వ్యాప్తమై నిండియున్నది, అది అతి సూక్ష్మమగు ఆకాశము కంటెను, మిక్కిలి సూక్ష్మమైనదై, ఇంద్రియాతీతమై స్వయంప్రకాశమైయున్నది ఆ పరబ్రహ్మము హృదయశుద్ధి లేనివారికి అతి దూరముగా నున్ను, ఆత్మశుద్ధి గలవారికి మిక్కిలి సమీపముగాను ఈ దేహమందలి బుద్ధి గుహయందే ఉన్నయది

మూ ॥ న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా ।।
జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వస్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః ।౮

పద ॥ న - చక్షుషా - గృహ్యతే - న - అపి - వాచా - న - అన్యైః - దేవైః - తపసా - కర్మణా - వా - జ్ఞానప్రసాదేన - విశుద్ధసత్త్వః - తతః - తు - తం - పశ్యతే- నిష్కలం - ధ్యాయమానః

టీక ॥ (పరమాత్మ,) చక్షుషా = నేత్రముచేతను, న గృహ్యతే = తెలిసికొనబడడు, వాచాఽపి = వాక్కుచేతనున్ను, న = గ్రహింపబడడు, అన్యైః = ఇతరములైన, దేవైః = ఇంద్రియముల చేతనున్ను, తపసా = తపస్సుచేతనున్ను, కర్మణావా= కర్మచేతనున్ను, న = తెలిసికొనబడడు, జ్ఞానప్రసాదేన = ఆత్మజ్ఞానముయొక్క అనుగ్రహముచేతను (ఆత్మబోధసామర్థ్యముచేతను,) విశుద్ధసత్వః = పరిశుద్ధాంతః కరణముగలవాడై, తతస్తు = అనంతరమునందైతే, నిష్కలం= అవయవములులేనట్టి, తం = ఆ ప్రసిద్ధమగు పరమాత్మను, ధ్యాయమానః= ధ్యానించుచున్నవాడై, పశ్యతే = చూచుచున్నాడు

తా ॥ ఓ శౌనకుడా ! జనుడు ఆ పరమాత్మను చక్షురాదిజ్ఞానేంద్రియములచేతనున్ను, వాగాది కర్మేంద్రియములచేతనున్ను, కామ్యప్రాప్త తపస్సుచేతనున్ను, యజ్ఞాది కర్మలచేతనున్ను పొందలేడు నిర్మలమగు ఆత్మజ్ఞానముచేతనైతే పరిశుద్ధాంతరంగుడై నిరవయవుడగు ఆ పరమాత్మను ఏకాగ్రచిత్తముతో ధ్యానించువాడయి పరిపూర్ణమగు ఆ పరమాత్మను పొందుచున్నాడు

అను ॥ న చక్షుషా నాపి వాచా నాన్యైరక్షైశ్చ గృహ్యతే ।
న కర్మణా న తపసా వినాంతర్ముఖతాం క్వచిత్ ॥ 46

కన్ను, వాక్కులతోగాని, ఇతరేంద్రియములతో గాని ఆ పరబ్రహ్మము గ్రహింపబడదు అటులనే కామ్యకర్మతోను, కామ్యతపస్సుతోను ఆ పరమాత్మ గ్రహింప శక్యముగాదు కేవల అంతర్ముఖ దృష్టితో గ్రహింప శక్యమగును

మూ ॥ ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యో
యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ ।
ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం
యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా ॥ ౯

పద ॥ ఏషః - అణుః - ఆత్మా - చేతసా - వేదితవ్యః - యస్మిన్ - ప్రాణః - పంచధా- సంవివేశ - ప్రాణైః - చిత్తం - సర్వం - ఓతం ప్రజానాం- యస్మిన్ - విశుద్ధే - విభవతి - ఏషః - ఆత్మా

టీక ॥ యస్మిౝ = ఏ దేహమునందు, ప్రాణః = ప్రాణవాయువు, పంచధా = అయిదు విధములుగా, సంవివేశ = ప్రవేశించునో, ఏషః = ఈ, అణుః = సూక్ష్మమైన, ఆత్మా = ఆత్మస్వరూపము, చేతసా = విశుద్ధజ్ఞానముచేతను, వేదితవ్యః = తెలిసికొనదగినది, విశుద్ధే = పరిశుద్ధమగు, యస్మిౝ = ఏ చిత్తమునందు, ఏషః = ఈ చెప్పబడిన, ఆత్మా = ఆత్మస్వరూపము, విభవతి = విశేషముగా నగుచున్నదియో, (తత్= అటువంటి,) ప్రజానాం = ప్రజల యొక్క, చిత్తం సర్వం = అంతఃకరణమంతయు, ప్రాణైః = ఇంద్రియము లచేతను, ఓతం= వ్యాప్తమైయున్నది

తా ॥ ఓ శౌనకుడా ! ముఖ్య ప్రాణవాయువు, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన రూపములతో ఐదు విధములుగా ప్రవేశించియున్న ఈ దేహమందే సూక్ష్మస్వరూపమైన ఈ ఆత్మస్వరూపము విశుద్ధజ్ఞానము చేత తెలిసికొనదగినది ఇట్లు ఈ ఆత్మస్వరూపమను, స్వకీయముగా పొందుటకు సాధనమైన ప్రజలయొక్క అంతఃకరణము ఇంద్రియములచేత వ్యాప్తమై యున్నది

అను ॥ ధ్యానేనాన్తర్ముఖో వాక్యాద్బ్రహ్మాత్మాన మవేక్షతే ।
విశుద్ధబుద్ధిరాత్మజ్ఞో యధా వక్తి తధా భవేత్ ॥ 47

ధ్యానముతో నంతర్ముఖుడగుచు వేదాంతవాక్యమువలన పరబ్రహ్మ స్వరూపము తానని చూచుచున్నాడు శుద్ధమైన బుద్ధిగలిగి యాత్మజ్ఞానము గలిగినవాడెట్లు చెప్పునో అట్లగును

మూ ॥ ***యం యం లోకం మనసా సంవిభాతి***
***విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాౝ ।***
***తంతం లోకం జయతే తాంశ్చ కామాన్***
***తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః ॥ ౧౦***

పద ॥ యం - యం - లోకం - మనసా - సంవిభాతి - విశుద్ధసత్త్వః - కామయతే- యాౝ - చ - కామాౝ - తం - తం - లోకం - జయతే - తాౝ - చ కామాౝ - తస్మాత్ - ఆత్మజ్ఞం - హి - అర్చయేత్ - భూతికామః

టీక ॥ విశుద్ధసత్త్వః - విశుద్ధ = పరిశుద్ధమగు, సత్త్వం = అంతఃకరణముగల జ్ఞాని, మనసా = మనస్సుచేతను, యం యం లోకం = ఏ ఏ లోకమునున్ను, యాన్=

ఏ, కామాంశ్చ = కోరికలనున్ను, సంవిభాతి = సంకల్పించు చున్నాడో, తం తం లోకం = ఆ ఆ లోకమునున్ను, తాం కామాశ్చ = ఆ కోరికలనున్ను, జయతే = పొందుచున్నాడు, తస్మాత్ = అటువంటి విశుద్ధాంతః కరణముగల వాడగుటవలన, భూతికామః = ఐశ్వర్యమును గోరువాడు, ఆత్మజ్ఞం= ఆత్మస్వరూపము తెలిసినవానిని, అర్చయేద్ధి = పూజించ వలయును

తా ॥ ఓ శౌనకుడా ! పరిశుద్ధాంతఃకరణము గలవాడు ఇహలోక మందుగాని, స్వర్గము మున్నగు ఏ ఏ లోకములనున్ను, ఏ ఏ భోగములనున్ను, తనకుగాని, ఇతరులకుగాని కావలయునని మనస్సుతో సంకల్పించునో, ఆయాలోకములనున్ను, ఆయా భోగములనున్ను తప్పక పొందుచున్నాడు కనుక భక్తి, జ్ఞాన, వైరాగ్యైశ్వర్యాదికమును కోరు జనుడు అటువంటి విశుద్ధాంతఃకరణము గల ఆత్మజ్ఞానిని పూజింపవలయును

అను ॥ భూతికామో విభూత్యర్థమాత్మజ్ఞం సర్వదాఽర్చయేత్ ।
నిష్కామస్తముపాసీనో వేత్తి బ్రహ్మత్వమాత్మనః ॥ 48

ఐశ్వర్యమును గోరినవాడు ఐశ్వర్యముకొరకు ఆత్మవేత్తను ఎల్లప్పుడు పూజింపవలయును అటులనే నిష్కాముడై అతని సేవించువాడు తన బ్రహ్మత్వమును తెలిసికొనును

ఇతి తృతీయముండకే - ప్రథమః ఖండః సమాప్తః

తృతీయముండకమునందు ప్రథమఖండము సమాప్తము



ఓమ్

# తృతీయముణ్డకే ద్వితీయః ఖండః

మూ ॥ ఓం స వేదైతత్పరమం బ్రహ్మ ధామ
యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్ ।
ఉపాసతే పురుషం యే హ్యకామా
స్తే శుక్రమేతదతివర్తన్తి ధీరాః ॥ ౧

పద ॥ సః - వేద - ఏతత్ - పరమం - బ్రహ్మ - ధామ - యత్ర - విశ్వం- నిహితం- భాతి - శుభ్రం - ఉపాసతే - పురుషం - యే - హి - అకామాః - తే - శుక్రం - ఏతత్ - అతివర్తన్తి - ధీరాః

టీక ॥ సః = వాడు ( ఆత్మస్వరూపమును తెలిసినవానిని పూజించువాడు, సర్వకామానాం = సమస్తకోరికలకు,) ధామ = ఆస్పదమగు, ఏతత్ = ఈ, పరమం = శ్రేష్ఠమగు, బ్రహ్మ = పరబ్రహ్మమును, వేద = తెలిసికొనుచున్నాడు, యత్ర = ఏ పరబ్రహ్మమునందు, విశ్వం = ప్రపంచము, నిహితం = ఉంచబడినదై, భాతి = ప్రకాశించు చున్నదియో, యే = ఎవరు, అకామాః= కోరిక లేనివారలయి, శుభ్రం = పరిశుద్ధుడగు, పురుషం = పురుషుని, ( ఏవం= ఈ ప్రకారము, పరం = శ్రేష్ఠుడగు, దేవమివ = పరమాత్మను వలెనే,) ఉపాసతే= ఉపాసన జేయుచున్నారో, తే = అటువంటి, ధీరాః = జ్ఞానులు, ఏతత్ = ఈ, శుక్రం = మనుష్యులకు కారణమగు పరబ్రహ్మమును, అతివర్తన్తి = మిక్కిలి పొందుచున్నారు

తా ॥ ఓశౌనకుడా ! ఏపరబ్రహ్మమునందు సమస్త ప్రపంచము ఉండి ప్రకాశించుచున్నదో, అట్టి పరబ్రహ్మమును తెలిసికొనిన వానిని, ఎవరు అన్ని కోరికలను విడిచి మోక్షేచ్ఛగలవారలయి ఈచెప్పిన ప్రకారము దేవుని వలెనే ఉపాసన జేయుచున్నారో అట్టి శుద్ధాత్ములు సమస్త ప్రపంచమునకును ఆధారమైన ఆ పరబ్రహ్మమును పొందుచున్నారు

మూ ॥ *కామాన్ యః కామయతే మన్యమానః స కామభి ర్జాయతే తత్ర తత్ర !*
*పర్యాప్తకామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః ॥ ౨*

పద ॥ కామాన్ - యః - కామయతే - మన్యమానః - సః - కామభిః - జాయతే - తత్ర - తత్ర - పర్యాప్తకామస్య - కృతాత్మనః - తు - ఇహ - ఏవ - సర్వే - ప్రవిలీయన్తి - కామాః

టీక ॥ యః = ఎవడు, కామాన్ = కోరికలను, మన్యమానః = తలంచువాడై, కామయతే = కోరుచున్నాడో, సః = వాడు, కామభిః = ఆకోరికలతో, తత్ర తత్ర = అక్కడక్కడ, జాయతే = పుట్టుచున్నాడు, పర్యాప్త కామస్య = అంతట పొందబడిన కోరికలుగల, కృతాత్మనస్తు = తెలియబడిన ఆత్మతత్త్వము గలవానికైతే, సర్వే = సమస్తమైన, కామాః = కోరికలు, ఇహైవ = ఈ శరీరమునందే, ప్రవిలీయన్తి = నాశమును పొందుచున్నవి

తా॥ ఓ శౌనకుడా ! ఎవడు దృష్టాదృష్ట విషయములైన కోరికలను వాటి వాటి గుణముల చింతించుచు కోరునో, వాడు ఆయా విషయములయందు, ఆయా కోరికలతో చుట్టుకొనబడి పుట్టుచున్నాడు ఎవడు పరమార్థ స్వరూపమైన ఆత్మజ్ఞానమువలన ఆప్తకాముడగునో అట్టి ఆత్మజ్ఞుని యొక్క సమస్తములగు కోరికలు ఈ దేహమునందే నాశమును పొందుచున్నవి

అను ॥ **కామశ్శ్రేష్ఠ్యపరః కామైస్తత్ర తత్ర ప్రజాయతే ।**
**జీవన్నేవాత్మవిత్సర్వకామానాం లయ మాప్నుయాత్ ॥** **49**

కామములే శ్రేష్ఠములని తలంచువాడు అచ్చటచ్చట కామములతో జన్మించును జీవించుచునే బ్రహ్మవేత్త అన్ని కామముల లయమును బొందును

మూ ॥ *నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన*
*యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥*

పద ॥ న - అయం - ఆత్మా - ప్రవచనేన - లభ్యః - న - మేధయా - న - బహునా - శ్రుతేన - యం - ఏవ - ఏషః - వృణుతే - తేన - లభ్యః - తస్య - ఏషః - ఆత్మా - వివృణుతే - తనూం - స్వామ్

టీక ॥ అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, ప్రవచనేన = విశేషముగా వేదశాస్త్రాధ్యయనాధ్యాపనములచేత, నలభ్యః = పొందశక్యమైనది కాదు, మేధయా = గ్రంధార్థధారణా రూపశక్తి చేతనున్ను, న = పొందశక్యమైనదిగాదు, బహునా = విశేషమైన, శ్రుతేన = శాస్త్రశ్రవణముచేతనున్ను, న = పొందశక్యమైనది గాదు, ఏషః = ఈ విద్వాంసుడు, యమేవ = ఏ ఆత్మ స్వరూపమునే, వృణుతే = పొందుటకు ఇచ్ఛగించుచున్నాడో, తేన = ఆ యిచ్ఛచేత, ( ఏషః = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, లభ్యః = పొందదగినది, తస్య = వానికి, ఏషః = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, స్వాం = స్వకీయమైన, తనూం = స్వరూపమును, వివృణుతే = ప్రకాశింపజేయుచున్నది

తా॥ ఓ శౌనకుడా ! ఈ పూర్వము జెప్పబడిన ఆత్మస్వరూపము వేదశాస్త్రాధ్యయనమువలన కలిగెడి విశేషవక్తృత్వముచేతనున్ను, గ్రంధార్థధారణా శక్తిచేతనున్ను, మిక్కిలి శ్రవణముచేతనున్ను పొంద శక్యము గానిది ఈ ఆత్మస్వరూపమును పొందవలెననెడు ఇచ్ఛ చేత విద్వాంసుడు ఆత్మను పొందుచున్నాడు ఇంతకు వినా వేరొక యుపాయము లేదు అటువంటి ఇచ్ఛ గలవానికే ఈ ఆత్మ స్వకీయమగు ఆత్మ తత్త్వ స్వరూపమును ప్రకాశింపజేయు చున్నది

అను ॥ **న వేదపార బాహుల్యా న్న బహుశ్రుతిత స్తథా ।**
**ఆత్మా లభ్యోఽథ దేవోఽయం వృణుతే తేన లభ్యతే ॥ 50**

మిక్కిలి వేదము చదివినను, శాస్త్రములనేకములు నేర్చినను, ఆత్మజ్ఞానము కలుగదు ఏ జిజ్ఞాసువు పరమాత్మను పొందుట కిచ్ఛగించునో దేవుడతనియంద నుగ్రహించును అందుచేత ఆత్మజ్ఞానము లభించును

మూ ॥ *నాయమాత్మా బలహీనేన లభ్యో*
*న చ ప్రమాదాత్తపసో వాప్యలిఙ్గాత్ ।*
*ఏతైరుపాయై ర్యతతే యస్తు విద్వాం*
*స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥ ४*

పద ॥ న - అయం - ఆత్మా - బలహీనేన - లభ్యః - న - చ - ప్రమాదాత్- తపసః-

వా - అపి - అలిఙ్గాత్ - ఏతైః - ఉపాయైః - యతతే - యః - తు - విద్వాన్-
తస్య - ఏషః - ఆత్మా - విశతే - బ్రహ్మధామ

టీక ॥ అయం = ఈ, ఆత్మా = ఆత్మస్వరూపము, బలహీనేన = ఆత్మ నిష్ఠచేత పుట్టిన పరాక్రమము లేకపోవుట చేతను, న లభ్యః = పొందనలవి కాదు, ప్రమాదాత్ = జాగ్రత్త తప్పుటవలనను, అలిఙ్గాత్ = సన్న్యాసరహితమగు (సర్వసంగ సన్న్యాసరూపమగు గుఱుతు లేనట్టిన్ని,) తపసోవాపి = జ్ఞానము లేని తపస్సువలనను, న = పొందదగినది కాదు, యః = ఏ, విద్వాంస్తు = విద్వాంసుడైతే, ఏతైః = ఈ, ఉపాయైః = ఉపాయములచేతను, యతతే = ప్రయత్నము జేయుచున్నాడో, తస్య = ఆ విద్వాంసునియొక్క, ఏషః = ఈ, ఆత్మా = ఆత్మ, బ్రహ్మధామ = బ్రహ్మస్వరూపమును, విశతే = పొందుచున్నది

తా ॥ ఓ శౌనకుడా ! ఈ యాత్మస్వరూపము ఆత్మ జ్ఞానమువలన నుద్భవించిన సామర్థ్యము లేకపోవుటచేతనున్ను పొందుటకశక్యమైనది ప్రమాదస్వభావముగలవాని చేతనున్ను, సర్వసంగపరిత్యాగచిహ్నము లేనివానిచేతను ఆత్మ పొంద నలవికానిది ఆత్మ నిష్ఠవలన పుట్టిన పరాక్రమము లేకపోవుటచేతనున్ను పొందశక్యము గాదు ఏ విద్వాంసుడైతే ఈ ఉపాయములచేత ప్రయత్నము జేయుచున్నాడో ఆవిద్వాంసునియొక్క ఈ ఆత్మ బ్రహ్మ స్వరూపమును పొందుచున్నది

అను ॥ **శ్రవణం మననం ధ్యానం యస్య న ప్రబలం భవేత్ ।**
**ప్రమాదో వాఽస్తి విషయాసక్త్యాఽఽత్మా న స బుధ్యతే ॥ 51**

శ్రవణము, విచారణము, ధ్యానమును ఎవనికి ప్రబలముగా గలుగవో, ప్రమాదము గాని యుండునో, విషయాసక్తియు గలదో వానికి పరమాత్మ తెలియదు

మూ ॥ ***సంప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః ।***
***తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మాన స్సర్వ మేవావిశన్తి ॥5॥***

పద ॥ సంప్రాప్య - ఏనం - ఋషయః - జ్ఞానతృప్తాః - కృతాత్మానః - వీత రాగాః - ప్రశాన్తాః - తే - సర్వగం - సర్వతః - ప్రాప్య - ధీరాః - యుక్తాత్మానః - సర్వం - ఏవ - ఆవిశన్తి

టీక ॥ ఋషయః = ఆత్మదర్శనముగల మునులు, ఏనం = ఈ ఆత్మస్వరూపమును, సంప్రాప్య = పొంది, జ్ఞానతృప్తాః - జ్ఞాన = ఆత్మజ్ఞానముచేత, తృప్తాః = తృప్తిపొందినవారలును, కృతాత్మానః = కృత = చేయబడిన, ఆత్మానః = ఆత్మస్వరూపముగలవారున్ను, వీతరాగాః - వీత = పోయినట్టి, రాగాః = అనురాగాది దోషములు కలవారున్ను, ప్రశాన్తాః = మిక్కిలి శాంతిని పొందిన ఇంద్రియములు గలవారున్ను, ( భవంతి = అగుచున్నారో, ) తే = వారు, సర్వగం = అంతటను వ్యాపించియుండెడి ఆత్మను, సర్వతః = అంతట, ప్రాప్య= పొంది, ధీరాః = మిక్కిలి జ్ఞానము గలవారలై, యుక్తాత్మానః = కూర్చబడిన అంతఃకరణములు గలవారలై, సర్వమేవ = సమస్తమున్ను, ఆవిశంతి = ప్రవేశించుచున్నారు

తా॥ ఓ శౌనకుడా ! పరబ్రహ్మ స్వరూపమును తెలిసికొని ఆత్మస్వరూపులైనట్టిన్ని, శబ్దాది విషయములయందు అనురాగము లేనట్టిన్ని బ్రహ్మ జ్ఞానముచేతనే తృప్తినిబొంది ఇంద్రియ నిగ్రహముగల మహాఋషులు అంతట ఆకాశమువలెనే నిండి వ్యాపించియుండెడి అద్వయమగు పరబ్రహ్మ స్వరూపమును అంతటపొంది అత్యంత జ్ఞానము చేత నిశ్చలచిత్తులై నిరుపాధికమైన అద్వయ పరబ్రహ్మమును బొందుచున్నారు

మూ ॥ *వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః ।*
*తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే ॥ ౬*

పద ॥ వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థాః - సన్యాసయోగాత్ - యతయః - శుద్ధసత్వాః- తే - బ్రహ్మలోకేషు - పరాన్తకాలే - పరామృతాః - పరిముచ్యన్తి - సర్వే

టీక ॥ వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థాః - వేదాన్త = ఉపనిషత్తులవలన పుట్టిన, విజ్ఞాన = విశేషజ్ఞానము యొక్క, సునిశ్చిత = నిశ్చయింపబడిన, అర్థాః = అర్థములు గలిగిన, యతయః = పరబ్రహ్మమును పొందుటయందు ప్రయత్నము జేయునట్టి స్వభావములు గల సన్న్యాసులు, సన్న్యాసయోగాత్ - సన్న్యాసః= సర్వసంగ పరిత్యాగరూపమయిన, యోగాత్= యోగమువలన, శుద్ధసత్త్వాః= శుద్ధ = నిర్మలమగు, సత్త్వాః = అంతఃకరణములుగలవారుగా, ( భవన్తి = అగుచున్నారు, ) తే సర్వే = వారందరు, పరాన్తకాలే = దేహమును విడిచెడి

సమయమందు, బ్రహ్మలోకేషు = బ్రహ్మస్వరూపమే అయిన లోకములందు, పరామృతాస్సన్తః = పరబ్రహ్మ స్వరూపులై, పరిముచ్యన్తి = అంతట ముక్తిని పొందుచున్నారు

తా ॥ ఓ శౌనకుడా ! ఉపనిషత్తులవలన పుట్టిన విశేషజ్ఞానము చేత నిశ్చయింపబడిన అర్థములు గలిగిన పరిశ్రమశీలురగు సన్న్యాసులు సర్వసంగపరిత్యాగరూపమయిన యోగమువలన నిర్మలమగు అంతఃకరణములు గలవారుగా అగుచున్నారు వారందరు దేహమును విడిచెడి సమయమందు బ్రహ్మలోకములయందు పరబ్రహ్మ స్వరూపులై అంతట ముక్తిని బొందుచున్నారు

అను ॥ వేదాన్తధీనిశ్చితార్థాః సన్న్యాసాచ్ఛుద్ధబుద్ధయః ।
బ్రహ్మదృష్టౌ స్థిరాశ్చాన్తే ముచ్యంతే మూలకారణాత్ ॥ 52

ఉపనిషదర్థజ్ఞానమువలన నిశ్చితమైన తాత్పర్యము గలవారు శుద్ధమైన బుద్ధిగలవారును, బ్రహ్మమందు స్థిరబుద్ధిగలవారును అంతమందు అజ్ఞానమునుండి విముక్తు లగుదురు

మూ ॥ *గతాః కలాః పఞ్చదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు ।*
*కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి ॥ ౭*

పద ॥ గతాః - కలాః - పఞ్చదశ - ప్రతిష్ఠాః - దేవాః - చ - సర్వే - ప్రతి దేవతాసు - కర్మాణి - విజ్ఞానమయః - చ - ఆత్మా - పరే - అవ్యయే- సర్వే - ఏకీభవన్తి

టీక ॥ పఞ్చదశ = పదునైదు, కలాః = ప్రాణము మున్నగు కళలు, ప్రతిష్ఠాః= స్థితులను, గతాః = పొందినవిగా, ( భవన్తి = అగుచున్నవి, ) సర్వే = సమస్తమైన, దేవాశ్చ= ఇంద్రియములున్ను, ప్రతిదేవతాసు = ఇంద్రియాధిష్ఠాన సూర్యుడు మొదలైన ప్రతిదేవతలయందును, కర్మాణి = కర్మలు, విజ్ఞాన మయః = విజ్ఞాన స్వరూపమగు, ఆత్మా చ = జీవాత్మయున్ను, సర్వే = అన్నియును, ఉపాధ్య పనయే సతి = దేహముపోవుచుండగా, పరే = శ్రేష్ఠమగు, అవ్యయే = నాశరహితమగు పరబ్రహ్మమునందే, ఏకీభవన్తి = ఒకటిగా యగుచున్నవి

తా ॥ ఓ శౌనకుడా ! ప్రాణము మొదలగు పదునైదు కళలు స్థితులను పొందినవిగా నగుచున్నవి సమస్తమైన ఇంద్రియములున్ను ఇంద్రియాధిష్ఠాన సూర్యుడు మొదలైన ప్రతిదేవతలయందున్ను పొందుచున్నవి కర్మలు, విజ్ఞాన స్వరూపమగు జీవాత్మయున్ను అన్నియును దేహము పోవుచుండగా శ్రేష్ఠమగు నాశరహితమగు పరబ్రహ్మమునందే ఏకమగుచున్నవి

అను ॥ **పరాన్తకాలే ముక్తా యే బ్రహ్మాత్మత్వాత్పరామృతాః ।**
**కలాః పంచదశై తేషాం లీయన్తే స్వస్వకారణే ॥** 53

తా॥ పరాంతకాలమందు ముక్తులైనవారు ఎవరో వారికి బ్రహ్మాత్వ ప్రాప్తిచేత ప్రాణాదులగు పదిహేను కళలు తమ తమ కారణము లందు లయమొందును

మూ ॥ *యధా నద్యస్స్యన్దమానా స్సముద్రే అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ ।*
*తధా విద్వాన్నామరూపద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥8*

పద ॥ యధా - నద్యః - స్యన్దమానాః - సముద్రే - అస్తం - గచ్ఛన్తి - నామరూపే - విహాయ - తధా - విద్వాన్ - నామరూపాత్ - విముక్తః- పరాత్ - పరం - పురుషం - ఉపైతి - దివ్యం

టీక ॥ స్యన్దమానాః = ప్రవహించుచున్న, నద్యః = నదులు, నామరూపే = నామ రూపములను, విహాయ = విడచి, సముద్రే = సముద్రము నందు, యధా = ఏ ప్రకారము, అస్తం = లయమును, గచ్ఛన్తి = పొందుచున్నవో, తధా = ఆప్రకారముగానే, విద్వాన్ = విద్వాంసుడు ( ఆత్మస్వరూపమును తెలిసికొనిన జ్ఞాని, ) నామరూపాత్ = నిర్మితములగు నామరూపములనుండి, విముక్తః= విడువబడినవాడై, పరాత్ = అక్షరుడగు వానికంటె, పరం = శ్రేష్ఠుడైనటువంటివాన్ని, దివ్యం = ప్రకాశస్వరూపుడైనటువంటివాన్ని, పురుషం= పరిపూర్ణుడగు పురుషుని, ఉపైతి = పొందుచున్నాడు

తా॥ ఓ శౌనకుడా ! లోకమునందు నామరూపములను ధరించి ప్రవహించుచున్న గంగ, గోదావరి మున్నగు నదులన్నియు సముద్రమునందు జేరి వాటి వాటి నామరూపములను విడచి యెట్లు మహాసముద్రమై పోవుచున్నవో, ఆప్రకారముగానే ఆత్మస్వరూపమును తెలిసికొనిన జ్ఞాని అవిద్యానిర్మితములగు

నామరూపములవలన విముక్తుడై స్వయం ప్రకాశమైనటువంటిన్ని, పరాత్పరమైనటువంటిన్ని, అద్వితీయమైనటువంటిన్ని పరిపూర్ణమగు పరబ్రహ్మమును పొందుచున్నాడు

అను ॥ అబ్ధావ స్తం యాన్తి నద్యో నామరూపే విహాయ హి ।
తథా విద్వా న్నామరూపాన్ముక్తో యాతి పరం పదమ్ ॥ 54

నదులు సముద్రమందు నామ రూపములను విడిచి, అస్తమించిన విధమున జ్ఞానియు నామరూపములను విడిచి పరమాత్మ స్థానమును బొందుచున్నాడు

మూ ॥ *స యో హవై తత్పరమం బ్రహ్మ వేద*
*బ్రహ్మైవ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి ।*
*తరతి శోకం తరతి పాప్మానం*
*గుహాగ్రన్థిభ్యో విముక్తో౽మృతో భవతి ॥*

పద ॥ సః - యః - హవై - తత్ - పరమం - బ్రహ్మ - వేద - బ్రహ్మ- ఏవ - భవతి- న - అస్య - అబ్రహ్మవిత్ - కులే - భవతి - తరతి - శోకం - తరతి- పాప్మానం - గుహాగ్రన్థిభ్యః - విముక్తః - అమృతః - భవతి

టీక ॥ యః = ఎవడు, హవై = ప్రసిద్ధముగా, తత్ = ఆ, పరమం = శ్రేష్ఠమగు, బ్రహ్మ= పరబ్రహ్మమును, వేద = తెలుసుకొనుచున్నాడో, సః = వాడు, బ్రహ్మైవ = పరబ్రహ్మ స్వరూపమే, భవతి = అగుచున్నాడు, అస్య = ఈ బ్రహ్మవేత్తయొక్క, కులే = వంశమునందు, అబ్రహ్మవిత్ = బ్రహ్మవేత్తకానట్టి వాడు, న భవతి = కలుగడు, శోకం = దుఃఖమును, తరతి = అతిక్రమించు చున్నాడు, పాప్మానం = పాపమును, తరతి = అతిక్రమించుచున్నాడు, గుహాగ్రన్థిభ్యః - గుహా= బుద్ధియందుగల, గ్రన్థిభ్యః = బంధములనుండి, విముక్తస్సన్ = విడువబడినవాడై, అమృతః = మరణములేనివాడు ( పరబ్రహ్మ స్వరూపుడు, భవతి = అగుచున్నాడు )

తా ॥ ఓ శౌనకుడా ! ఆ పరబ్రహ్మస్వరూపమును ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు పరబ్రహ్మమే అగుచున్నాడు ఇటువంటి బ్రహ్మవేత్తయొక్క వంశమునందు బ్రహ్మవేత్త కానట్టివారు పుట్టరు ఈ ప్రకారము

పరబ్రహ్మస్వరూపియైన ఆత్మజ్ఞాని సుఖదుఃఖములను, పుణ్య పాపముల నతిక్రమించినవాడై హృదయమందుగల అవిద్యయందు గలిగిన బంధములవలన విముక్తుడై పరబ్రహ్మ స్వరూపి యగుచున్నాడు

అను ॥ యః కోఽపి బ్రహ్మవేత్త్యేష బ్రహ్మైన భవతి స్వయమ్ ।
అబ్రహ్మవిత్తస్య కులే న స్యాదేతద్విబోధత ॥ 55

శోకం తరతి పాప్మానమపి ధీగ్రంధితోఽఖిలాత్ ।
ముక్తో బ్రహ్మాత్మబోధేన భవత్యేవామృతోఽఖిలః ॥ 56

ఎవడో యొకడు బ్రహ్మవేత్తగువాడు బ్రహ్మయే తానగును అట్టి వాని వంశమునందు బ్రహ్మవేత్త కానివాడు పుట్టడు బ్రహ్మజ్ఞానము వలన శోకమును తరించును పాపమును గూడ దాటును బుద్ధి బంధములన్నియు విడిపోవును అందరు అమృతులగుదురు

తదేతదృచాభ్యుక్తం –

మూ ॥ క్రియావన్త శ్శోత్రియా బ్రహ్మనిష్ఠా
స్స్వయం జుహ్వతే ఏకర్షిం శ్రద్ధయన్తః ।
తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత
శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్ ॥ ౧౦

పద ॥ తత్ - ఏతత్ - ఋచా - అభ్యుక్తం - క్రియావన్తః - శ్రోత్రియాః- బ్రహ్మనిష్ఠాః- స్వయం - జుహ్వతే - ఏకఋషిం - శ్రద్ధయన్తః - తేషాం - ఏవ - ఏతాం - బ్రహ్మవిద్యాం - వదేత - శిరోవ్రతం - విధివత్ - యైః - తు- చీర్ణం

టీక ॥ ఋచా = వేదమంత్రముచేత, తదేతత్ = ఆ ఈ బ్రహ్మ విద్యా సంప్రదాయము, అభ్యుక్తం = చెప్పబడినది, క్రియావన్తః = బ్రహ్మచర్యాద్యనుష్ఠానముగలవారు, శ్రోత్రియాః = వేదాధ్యయనము గలిగినట్టివిన్ని, బ్రహ్మనిష్ఠాః = పరబ్రహ్మము నందు నిష్ఠగలిగినటువంటి, ( యే = ఎవరు, ) స్వయం = తాము, శ్రద్ధయన్త స్సన్తః = శ్రద్ధగలవారలై, ఏకర్షిం = ఏకర్షియను పేరుగల అగ్నినిగూర్చి,

జుహ్వతే= హోమము జేయుచున్నారో, తేషామేవ = వారలకే, ఏతాం= ఈ, బ్రహ్మవిద్యాం = బ్రహ్మవిద్యను, వదేత = చెప్పవలెను, యైస్తు = ఎవరి చేతనైతే, శిరోవ్రతం = వేదవ్రతము, విధివత్ = శాస్త్రోక్త ప్రకారముగా, చీర్ణం = ఆచరింపబడునో, (తేషామేవచ = వారికే, ఏతాం బ్రహ్మవిద్యాం = ఈ బ్రహ్మవిద్యను, వదేత= చెప్పవలయును )

తా॥ ఓ శౌనకుడా ! వేదమంత్రము చేత, ఆ ఈ బ్రహ్మవిద్యా సంప్రదాయము చెప్పబడినది బ్రహ్మచర్యాద్యనుష్ఠానము గలిగినటువంటివిన్ని, వేదాధ్యయనము గలిగినట్టివిన్ని, పరబ్రహ్మమునందు నిష్ఠగలిగినటువంటి ఎవరు తాము శ్రద్ధగలవారలై ఏకర్షియను పేరుగల అగ్నిని గూర్చి హోమము జేయుచున్నారో, వారలకే ఈ బ్రహ్మవిద్యను జెప్పవలెను ఎవరిచేతనైతే వేదవ్రతము శాస్త్రోక్తప్రకారముగా ఆచరింపబడునో వారికిన్ని ఈ పరబ్రహ్మ విద్యను జెప్పవలయును

అను ॥ క్రియావన్తః శ్రోత్రియా యే సగుణబ్రహ్మ చింతకాః ।
తేషామేవ చ బ్రహ్మత్వ విద్యామేతాం వదేద్బుధః ॥ 57

శాస్త్రవేత్తలు, కర్మనిష్ఠులై యెవరు సగుణబ్రహ్మము నుపాసించుచున్నారో వారికే ఈ నిర్గుణ బ్రహ్మతత్త్వమును జ్ఞాని (విద్వాంసుడు) బోధించవలయును

మూ ॥ ***తదేతత్సత్య మృషి రఙ్గిరాః పురోవాచనైతదచీర్ణవ్రతోఽధీతే ।***
***నమః పరమఋషిభ్యః నమః పరమఋషిభ్యః ॥ ౧౧***

పద ॥ తత్ - ఏతత్ - సత్యం - ఋషిః - అఙ్గిరాః - పురా - ఉవాచ - న- ఏతత్ - అచీర్ణవ్రతః - అధీతే - నమః - పరమఋషిభ్యః - నమః - పరమఋషిభ్యః

టీక ॥ అఙ్గిరాః = అంగిరసుడను, ఋషిః = ముని, పురా = పూర్వమందు, సత్యం= సత్యమైన, తత్ = ఆ ప్రసిద్ధమైన, ఏతత్ = ఈ బ్రహ్మవిద్యను, (శౌనకాయ= శౌనక మహాఋషికొరకు,) ఉవాచ= చెప్పెను, అచీర్ణవ్రతః = ఆచరింపబడని వ్రతము గలవాడు, ఏతత్= ఈ ఉపనిషత్తును, నాధీతే = అధ్యయనము జేయదగడు, పరమఋషిభ్యః - పరమ = శ్రేష్ఠులగు, ఋషిభ్యః = మహా మునులకొఱకు, నమః = నమస్కారము, పరమఋషిభ్యః- పరమ = పూజ్యులగు, ఋషిభ్యః = ఋషులకొరకు, నమః = నమస్కారము

తా ॥ పూర్వము అఙ్గిరస మహాఋషి ప్రసిద్ధమయిన సత్యమగు ఈ బ్రహ్మవిద్యను శౌనక మహాఋషికొరకు చెప్పెను ఈ పరబ్రహ్మవిద్యను పూర్వము చెప్పిన వేదవ్రతాచరణగలవాడు అధ్యయనము జేయందగినవాడు, వానికే ఇది ఆత్మ సంస్కారముకొరకగుచున్నది అట్టి వ్రతనిష్ఠ లేని వానికి ఉపయోగపడదు ఇట్టి పరబ్రహ్మవిద్యా ప్రవర్తకులగు బ్రహ్మాది పరమఋషులకు నమస్కారము ఇట్టి పరబ్రహ్మ విద్యా ప్రవర్తకులగు బ్రహ్మాది పరమఋషులకు నమస్కారము

అను ॥ అంగిరాః శౌనకాయైతత్సత్యం బ్రహ్మోపదిష్టవాన్ ।
నమస్కృత్య బ్రహ్మవిదో బ్రహ్మవిద్యా మవాప్నుయాత్ ॥ **58**

అంగిరసుడను మహాముని శౌనక మహాఋషికొరకు నీసత్యమైన బ్రహ్మము నుపదేశించెను బ్రహ్మవేత్తలకు నమస్కరించి బ్రహ్మవిద్యను పొందవలయును

ఇతి తృతీయముండకే - ద్వితీయః ఖండః
ముండకోపనిషత్సమాప్తా
తృతీయముండకమునందు ద్వితీయఖండము సమాప్తము
ముండకోపనిషత్తు సమాప్తము
ఓం తత్ సత్



ఓమ్

# మంగళశ్లోకములు

## (శ్రీమచ్ఛంకర భగవత్పూజ్యపాదులు)

ప్రజ్ఞానాంశు ప్రతానైః
స్థిర చర నికర వ్యాపిభిర్వ్యాప్య లోకాన్
భుక్త్వా భోగాన్ స్థవిష్ఠాన్
పునరపి ధిషణోద్భాసితాన్కామజన్యాన్।
పీత్వా సర్వాన్ విశేషాన్
స్వపితి మధురభుఙ్మాయయా భోజయన్నో
మాయాసంఖ్యాతురీయం
పరమమృతమజం బ్రహ్మ యత్తన్నతోఽస్మి ॥

స్థావర జంగమ సమూహమును వ్యాపించు స్వభావము గల ప్రజ్ఞాన కిరణ జాలముచేత (జీవరూపములతో) సర్వలోకములను వ్యాపించి (జాగ్రద్దశ యందు) స్థూలభోగముల ననుభవించి, అనంతరము (స్వప్నావస్థయందు) బుద్ధివలన ప్రకాశించునట్టి అవిద్యాకామకర్మజన్యములగు సూక్ష్మభోగముల ననుభవించి, ఆ పిమ్మట (సుషుప్త్యవస్థయందు) సర్వవిశేషములను దనయందైక్యము చేసికొని యెవడు ఆనందపూర్ణుడై (ఆనందభుక్కై) మాయచే మనల అనుభవింపజేయుచు నిద్రించుచున్నాడో, అట్టి జాగ్రత్స్వప్న సుషుప్తుల కతీతమైనట్టిదియు, తురీయమైనట్టిదియు, సర్వశ్రేష్ఠమైనదియు, అమృతస్వరూపమైనదియు, పుట్టుక లేనిదియు నగు సచ్చిదానన్ద పరబ్రహ్మమునకు నమస్కరించుచున్నాను

యో విశ్వాత్మా విధిజవిషయాన్
ప్రాశ్య భోగాన్ స్థవిష్ఠాన్
పశ్చాచ్చాన్యాన్ స్వమతివిభవాన్
జ్యోతిషా స్వేన సూక్ష్మాన్।

సర్వానేతాన్ పునరపి శనైః
స్వాత్మని స్థాపయిత్వా
హిత్వా సర్వాన్విగళితగుణః
పాత్వసౌ నస్తురీయః ॥

ఏ చిత్స్వరూపుడు విశ్వాత్ముడై ధర్మాధర్మములవలన బుట్టిన విషయములు గలిగినట్టి స్థూలభోగముల ననుభవించి, అనంతరము స్వమనోవాసనాయములైనట్టి సూక్ష్మభోగములను స్వకీయమైన జ్యోతిస్సు (ప్రకాశము) చేతనే యనుభవించి మఱల నీ జాగ్రత్స్వప్న విషయములనన్నింటిని మెల్లగా కారణాత్మయగు అవ్యాకృతమయందుంచి, పిదప సకల విశేషములను వదలి విగతగుణుడగుచున్నాడో, అట్టి తురీయుడు మమ్ము రక్షించుగాక!



# ప్రకాశకుల వక్తవ్యము *

పరిశుద్ధ జ్ఞానస్వరూపులగు ఆత్మ సోదరీ సోదరులారా !

శ్రీ వ్యాసాశ్రమ ఉపనిషత్ప్రచురణలలో ఈ ''మాండూక్యోపనిషత్తు'' ఒకటి ఇయ్యది ఆథర్వ వేదీయము చాల చిన్నది మొత్తము నాలుగు ఖండములలోను కలసి పండ్రెండు మంత్రములు మాత్రమే గలవు అయినను దీనిలో ప్రణవస్వరూపము చక్కగా నిరూపించబడినది నిర్గుణ నిర్వికార పరబ్రహ్మమునకు నాలుగు పాదముల కల్పించి వాటితో ఓంకారముయొక్క మాత్రలను పోల్చుచు ఓంకారముయొక్క సర్వవ్యాపకత్వము, బ్రహ్మ స్వరూపత్వము, వాచ్యవాచకాభేదత్వము వివరింపబడినది చివరకు 'ఓంకార ఆత్మైవ' ఓంకారము ఆత్మయేయని నిర్వచింపబడినది 'తస్య వాచకః ప్రణవః' నిర్గుణ పరమాత్మ స్వరూపమును దెలుపునట్టి సమర్థమైన శబ్దము ఒక్క ఓంకారము మాత్రమే ఓంకారము యొక్క సమగ్ర స్వరూపము ఇందు వర్ణించబడినది దీనిని తెలిసికొన్నచో వాచ్య వాచకములకున్న అభేదము లేక అభిధానాభిధేయముల యొక్క యేకత్వము స్పష్టముగ బోధపడును 'సర్వమోంకార ఏవ' అన్న శ్రుతివాక్యమవగతమగును ప్రణవధ్యానముచేత, నిరంతర ఓంకారానుసంధానము చేత సాధకుడు త్వరలో లక్ష్యసిద్ధిని పొందగలడు మఱియు మహావాక్య చతుష్టయములో నొకటియగు 'అయమాత్మాబ్రహ్మ' అను అధర్వణవేదీయ మహావాక్యమీ ఉపనిషత్తునకు సంబంధించినదే, మాండూక్యోపనిషత్ 2వ మంత్రములో 'సర్వగ్ంహ్యేత ద్బ్రహ్మ', 'అయమాత్మా బ్రహ్మ', 'సోఽయమాత్మా చతుష్పాత్' అని చెప్పబడినది ఈకారణముచే ఈ ఉపనిత్తున కింత ప్రాముఖ్యమునిచ్చి శ్రీసద్గురు స్వాములవారు శ్రీవ్యాసాశ్రమ సంప్రదాయ భక్తులకు, సాధకులకు, విశేషించి బ్రహ్మచారులకు, సన్న్యాసులకు ఈ 'మాండూక్యోపనిషత్తు'ను నిత్యపఠనీయముగ విధించిరి సామాన్య భాషాజ్ఞానముగల జిజ్ఞాసువుల కుపయోగించులాగున శ్రీవారే దీనికి 'దీపిక'ను

---

* ఇది చతుర్థముద్రణకు వ్రాసినది

రచించిరి ఈమాండూక్యోపనిషత్తునకు శ్రీగౌడపాదాచార్యులవారు కారికః వ్రాసిరి అవి చాల కఠినములు వాటికిని శ్రీశంకరాచార్యులవారు భాష్యముః వ్రాసిరి ఇంక వాటిని వివరించు టీకా తాత్పర్య వ్యాఖ్యలకు అంతులేదు ఇటుల ఈ ఉపనిషత్తు అనేక మంది విద్వాంసులచే వ్యాఖ్యాతమ్మైయున్నది కాని శ్రీస్వాములవారు కేవలము స్వల్ప భాషాజ్ఞానము గలిగి ఆత్మతత్త్వమును దెలిసికొన వలయునను తీవ్రజిజ్ఞాసగల స్త్రీ పురుష భక్తకోటిని దృష్టి యందుంచుకొనియే దీనిని ( దీపిక) సంగ్రహముగ రచించిరి తత్త్వగ్రహణమున కింతియే చాలు కాన ప్రణవార్థమును దెలిసికొనదలచిన జిజ్ఞాసుల కందఱికి నియ్యది అత్యంతోపకారి కాగలదని ఆశ

శ్రీగౌడపాదీయ మాండూక్యకారికలే వస్తుతః స్వతంత్ర ప్రకరణ గ్రంధమని చెప్పవచ్చును అయ్యది ఆగమ, వైతధ్య, అద్వైత, అలాతశాంతి యను నాలుగు ప్రకరణములతో గూడుకొని యున్నది ఈనాలుగు ప్రకరణములలో సకలోప నిషత్సిద్ధాంతములు, వివిధవాదములు, తత్ఖండనములు తర్కబలముతో ప్రతిపాదించబడినవి అయ్యవి సామాన్య సాధకులకు దుర్విజ్ఞేయములు అందుచే శ్రీవారు మొదటిదగు ఆగమ ప్రకరణమును మాత్రమిందు సంగ్రహపఱచిరి ఈ ఆగమ ప్రకరణములో 29 కారికలు గలవు ఈకారికల ద్వారా మాండూక్యోపనిషన్మంత్రములయొక్క అర్థము స్పష్టీకరింప బడినది అందుచే మంత్రవ్యాఖ్యాన రూపము లీకారికలని చెప్పవచ్చును కనుకనే యీ కారికలకు మతత్రయము వారు వేఱువేఱు భాష్యముల వ్రాసియున్నారు ఉపనిషన్మంత్రార్థ ప్రకటనమే ధ్యేయమగుటచే ముఖ్యముగా ఈ ' ఆగమ ప్రకరణము' మాత్రమిందు సంగ్రహించబడినది మంత్రార్థము సరళముగ బోధబడుటకు శ్రీవారు ' దీపిక' లను జోడించిరి ఈ ' దీపిక' అజ్ఞానపధమున సంచరించుచు, అమృత మయమ్మైన జ్యోతిర్మార్గము నన్వేషించు శుద్ధసాత్విక జిజ్ఞాస గల సాధకులకు 'కరదీపిక' (చేతిలాంతరు) కాగలదని విశ్వాసము

ఈచతుర్థ సంస్కరణమున యథామతి కొన్ని మార్పులు కూర్పులు జేయబడినవి అయితే మూలాతిక్రమణము మాత్రము జరుగలేదు

అమృతత్వాపాదకమగు ఆత్మతత్త్వమును దెలిసికొనగోరు ముముక్షులోకమునకు జాత్యాది భేదమును పాటింపక సహకరిద్దుటయే శ్రీవారి ఆశయము తదాశయ నిర్వహణలో నిదొక ముందంజ మాత్రమే యని మా యభిప్రాయము

ఈనూతన సంస్కరణము పూర్వమువలెనే భక్తులను, పాఠకులను, సాధకులను ఆకర్షింప గలదని, వారికిది మిక్కిలి ఉపరింపగలదనియు మా గట్టి నమ్మిక

చిరకాల వాంఛితమగు నీచతుర్థ సంస్కరణమును భక్తులకందించు సదవకాశము గల్పించిన శ్రీగురుదేవునకు సభక్తిక నమోవాకములు

కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచేతను, లోక పావన తత్పరులగు మహర్షుల కరుణచేతను లోకములో శాంతియు, కరుణయు, సద్భక్తియు విజ్ఞానబోధయున్నన వర్ధిల్లునుగాక!

ఓం లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఓమ్

ప్రకాశకులు

శ్రీవ్యాసాశ్రమము



ఓమ్

# పీఠిక

కఠోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు ఈ మూడున్ను శ్రీవ్యాసాశ్రమ సంప్రదాయములో గల ముముక్షువులు, జిజ్ఞాసువులు అందరున్ను పఠించవలసినదిగా యేర్పాటుగలదు ఆలాగున కఠోపనిషత్తున్ను, పాతంజలయోగదర్శనమున్ను, శ్రీభగవద్గీతయున్ను కంఠస్థము జేసినవారికి మాత్రమే శ్రీవ్యాసాశ్రమము తరపున సన్న్యాస మివ్వబడునని నియమము గూడ గలదు అంతమాత్రమయిన శాస్త్రవిచారణ లేనిచో, సన్న్యసించియు ఏమి గ్రహింప గలరు ? లోకమునకేమి బోధింపగలరు ? పైజెప్పిన కఠ, ముండక, మాండూక్యములు సంగ్రహముగానుండిన ముముక్షువులు చింతన జేయుటకును, హృదయస్థ మొనరించుటకును అనుకూలపడునని తలంచి, పై జెప్పిన మూడు ఉపనిషత్తులు ఆంధ్రములోను, కొన్ని యితర భాషలలోను గల భాష్య వివరణాదులను చూడగా చాల విస్తారముగా నుండుట వలన, ఎక్కువ పాండిత్యము లేనివారికి కంఠస్థమొనర్చుటకు ప్రయాసమని యెంచి సంక్షిప్తముగా మూలమునకు సరియయిన అర్థముతో 'మాండూక్యదీపిక' యను విశేషార్థముతో నిది వ్రాయబడినది విస్తారముగా తెలిసికొన తలంచువారు ఇతర గ్రంథములను చూచుకొనవచ్చును ఉపనిషత్తులన్నిటిలోను ఇది చాలా చిన్నదయినను, సర్వోపనిషత్తుల సారమంతయు దీనియందు గలదని శ్రీరామచంద్రులు శ్రీ ఆంజనేయులకు ముక్తికోపనిత్తునందు తెలిపియున్నారు

''మాండూక్యమేక మేవాలం ముముక్షూణాం విముక్తయే''

ముముక్షువుల మోక్షము కొఱకు ఈ మాండూక్యోపనిషత్తు ఒక్కటియే చాలును అని శ్రీరామచంద్రులు తెలిపినందుచే దీనియొక్క మహిమాతిశయము ఎట్టిదియో అందఱున్ను తెలిసికొన వచ్చును మఱియు ఈ మాండూక్యోపనిషత్తుచేత సంపూర్ణ బ్రహ్మతత్త్వజ్ఞానము గలుగక పోయినచో

''తథాఽప్యసిద్ధం చే జ్ఞానం దశోపనిషదం పఠ''

దశోపనిషత్తులను చదువుము అని చెప్పబడినది

ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్యతిత్తిరిః ।
ఐతరేయం చ ఛాన్దోగ్యం బృహదారణ్యకం తథా ॥

ఈపదియు దశోపనిషత్తులనబడును

జ్ఞానం లబ్ధ్వాఽచిరాదేవ మామకం ధామ యాస్యసి

ఈ దశోపనిషత్తుల వలన త్వరలోనే ఆత్మజ్ఞానము గలుగును అందుచే బ్రహ్మపదమును పొందుదువు

తథాఽపి దృఢతా నోచేత్ విజ్ఞాన స్యాంజనాసుత ।
ద్వాత్రింశాఖ్యోపనిషదం సమభ్యస్య నివర్తయ ॥

ఓ ఆంజనేయా ! పైజెప్పిన దశోపనిషత్తుల వల్లను విజ్ఞాన దార్ఢ్యము గలుగక పోయెనేని, ముప్పైరెండు ఉపనిషత్తులను పఠించుము

కఠవల్లీ, తైత్తిరీయక బ్రహ్మకైవల్య శ్వేతాశ్వతర గర్భనారాయణ అమృతబిన్దు అమృతనాద కాలాగ్ని రుద్ర, క్షురికా, సర్వసార శుకరహస్య తేజోబిందు ధ్యాన బిందు బ్రహ్మవిద్యా యోగతత్త్వ దక్షిణామూర్తి స్కందశారీరక యోగశిఖా ఏకాక్షర, అక్ష అవధూత కఠ రుద్ర హృదయ, యోగకుండలినీ, పంచబ్రహ్మ, ప్రాణాగ్ని హోత్ర, వరాహ, కలిసంతరణ, సరస్వతీరహస్యోపనిషదః, కృష్ణయజుర్వేద గీతాః ద్వాత్రింశత్ ఇవి 32 ఉపనిషత్తులు ఈ ద్వాత్రింశత్ ఉపనిషత్తుల వలన విఖ్యాత విదేహముక్తి లభింపనిచో, 108 ఉపనిషత్తులను పారాయణము జేయుము

అష్టోత్తర శతోపనిషదః ( అష్టోత్తర శతోపనిషత్తులు)

ఈశకేన కఠ ప్రశ్న ముండ మాండూక్యతిత్తిరిః ।
ఐత రేయఞ్చ ఛాన్దోగ్యం బృహదారణ్యకం తథా ॥ 1

బ్రహ్మకైవల్య జాబాలౌ శ్వేతాశ్వో హంస అరుణిః ।
గర్భో నారాయణో హంసో ( బ్రహ్మ) బిందునాదశిరశ్శిఖా ॥ 2

మైత్రాయణీ కౌషీతకీ బృహజ్జాబాలతాపనీ ।
కాలాగ్ని రుద్రమైత్రీయీ సుబాలక్షురిమన్త్రికా ॥ 3

సర్వసారం నిరాలమ్బం రహస్యం వజ్రసూచికమ్ ।
తేజోనాద ధ్యాన విద్యాయోగ తత్త్వాత్మ బోధకమ్ ॥ 4

పరివ్రాట్ త్రిశిఖీ సీతా చూడానిర్వాణ మండలమ్ ।
దక్షిణాశరభం స్కన్దం మహానారాయణాహ్వాయమ్ ॥ 5

రహస్యం రామతపనం వాసుదేవం చ ముద్గలమ్ ।
శాణ్డిల్యం పైఙ్గలం భిక్షుం మహచ్ఛారీరకం శిఖా ॥ 6

తుర్యాతీతం చ సన్న్యాసం పరివ్రాజాక్షమాలికా ।
అవ్యక్తైకాక్షరం పూర్ణా సూర్యాక్ష్యధ్యాత్మకుండికా ॥ 7

సావిత్ర్యాత్మా పాశుపతం పరబ్రహ్మావధూతకమ్ ।
త్రిపురాతపనం దేవీత్రిపురా కరభావనా ॥ 8

హృదయం కుండలీ భస్మ రుద్రాక్ష గణదర్శనమ్ ।
తారసార మహావాక్య పఞ్చబ్రహ్మాగ్ని హోత్రకమ్ ॥ 9

గోపాలతపనం కృష్ణం యాజ్ఞవల్క్యం వరాహకమ్ ।
శాట్యాయనీ హయగ్రీవం దత్తాత్రేయం చ గారుడమ్ ।
కలిజాబాలి సౌభాగ్య రహస్య ఋచముక్తికాః ॥ 10

ఏవమష్టోత్తరశతం భావనాత్రనాశనమ్ ।
జ్ఞానవైరాగ్యదం పుంసాం వాసనాత్రయనాశనమ్ ॥ 11

ఈనూట యెనిమిది ఉపనిషత్తులనుపఠించినచో, వృత్తిరాహిత్యమై, జ్ఞాన వైరాగ్యములు గలిగి వాసనాత్రయనాశ రూపమైన మోక్షము సంభవించును

ఓమ్

ప్రణవాద్యాస్త్రయో దేవాః ప్రణవే పర్యవస్థితాః ।
వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవమభ్యసేత్ ॥

వేదత్రయంవమున్ను ప్రణవవమునుండియే యేర్పడినది ఆ మూడువేదములు ప్రణవమునందే లయించుచున్నవి వాఙ్మయమంతయు (విద్యలన్నియు) ప్రణవస్వరూపమే అందుచే ప్రణవమునే ధ్యానింపవలయును దీనియందు ''వాఙ్మయం ప్రణవం సర్వం'' అని తెలిపియున్నందుచే వేదములన్నియు, విద్యలన్నియు ఒక ప్రణవమునందే యిమిడియున్నట్లు తెలుపడమైనది ఈవిషయమై యిదివరలోనే అనేక శ్రుతి స్మృతిపురాణములలో తెలిపినవన్నియు సంగ్రహముగా వ్రాయబడెను వ్యాకరణ శాస్త్రములో నేయే స్థానములనుండి యేయే అక్షరములు పుట్టుచున్నవో తెలుపబడుచున్నది అకార, ఉకార, మకారములతో గూడినదే ఓంకారమని విజ్ఞులందఱికిని తెలిసిన విషయమే అర్ధమాత్రము అవ్యవహార్యము ఇది నాలుగవపాదము బ్రహ్మవేత్తలు పొందెడు పరబ్రహ్మస్వరూపము పాణినివ్యాకరణసూత్రమున చెప్పినట్లు ఏ అక్షరము ఎచ్చటినుండి పుట్టుచున్నదో క్రింద నిరూపించబడుచున్నది

1 అకుహవిసర్జనీయానాం కంఠః = అ, క, ఖ, గ, ఘ, ఙ, హ, ః ఈఅక్షరములు కంఠమునుండి పుట్టుచున్నవి శబ్దముయొక్క ఆరంభము కంఠమునుండియే అక్షరములలో అకారము మొదటిది ఇది ప్రణవముయొక్క ప్రథమమాత్రయు, బ్రహ్మయు అగుచున్నది

2 ఉపూపధ్మానీయానామోష్ఠౌ = ఉ, ప, ఫ, బ, భ, మ ౘ, దవడల మధ్యనుండి ఉకారమును, పెదవుల కొసనుండి మకారమున్ను మకారమున్ను ఉద్భవించుచున్నవి ఉకారము ఓంకారముయొక్క ద్వితీయమాత్రయు విష్ణువగుచున్నది మకారము ప్రణవముయొక్క తృతీయమాత్రయు మహేశ్వరుడును అగుచున్నది కంఠమునుండి అకారధ్వని ఆరంభించి ఓష్ఠాన్తమున లయమగుటచే అనగా అన్తమగుటచే అన్ని అక్షరములు (శబ్దములు) ఈమూడింటి ఆదిమధ్యాన్తములలో నుద్భవించుట చేత, వేదములన్నియు ఈ ఓంకారము నుండియే యేర్పడినవని శ్రుతి తెలుపుచున్నది కావుననే యీ ఓంకార మొకదానిని పఠించినచో వేదములన్నిటిని జదివినవాడగునని యిదివరలో తెలుపడమైనది కావుననే శ్రుతి ''యస్తం వేద స వేదవిత్'' అని తెలిపినది ఈసత్యమంతయు

దీనియందు వ్రాయబడిన దీపికయందు చూడగలరు ఇక ఈవిషయమై విస్తారముగా వ్రాసి పీఠికను పెంచ తలంచలేదు ముఖ్యమయిన సూత్రప్రాయమగు కొన్ని వాక్యములను మాత్రము వ్రాసి పూర్తిజేయ తలంచడమైనది శ్రీభగవద్గీత దశమాధ్యాయ విభూతియోగమున ఈరహస్యమును శ్రీకృష్ణభగవానుడు తెలిపెను ''అక్షరాణామకారోస్మి'' అక్షరములలో అకారము నాయొక్క స్వరూపమని వచించెను వైష్ణవ సంప్రదాయములో వడగల తెగవారు కొందఱు, అబ్రాహ్మణులకును, స్త్రీలకున్ను తిరుమన్త్రము (అష్టాక్షరీ) నుపదేశించునప్పుడు ఓంకారమును చెప్పక అకారమునే చెప్పెదరు అష్టాక్షరిలో మొదటిదియగు ఓంకారమునకు బదలు అకారామునే ఉపదేశింతురు విభూతి యోగమున ''గిరామస్మ్యేక మక్షరం''- శబ్దములలో ఏకాక్షరస్వరూపమగు ప్రణవము నాయొక్క స్వరూపము అని శ్రీభగవానుడు బోధించెను మఱియు సప్తమాధ్యాయమున విజ్ఞాన యోగములో ''ప్రణవస్సర్వవేదేషు'' వేదము లన్నిటిలోను ప్రణవస్వరూపము పరబ్రహ్మస్వరూపముగా వర్ణించడమైనది. పతంజలి మహర్షియు యోగదర్శనమందు ''తస్య వాచకః ప్రణవః'' పరమాత్మయొక్క పరబ్రహ్మముయొక్క, పరమేశ్వరునియొక్క పేరు ఓంకార మని తెలిపియున్నారు శ్రీవ్యాసభగవంతుడును బ్రహ్మసూత్రములలో ప్రథమాధ్యాయ తృతీయ పాదములో అక్షరాధికారణమున 10-వ సూత్రమున ఈ ఓంకారమునే అక్షరస్వరూప పరబ్రహ్మముగా వర్ణించెను

**సూ ॥ అక్షరమంబరాన్తధృతేః ॥ (బ్ర.సూ. 1-3-10)**

పృధివి మొదలు ఆకాశమువఱకు గల పంచభూతములను ధరించుటవలన అక్షరశబ్దముచే (ఓంకారముచే) చెప్పబడునది పరబ్రహ్మమే, ఇది ప్రణవమే ఓమ్ తత్ సత్

మీ చరాచర సుఖాభిలాషి,

**శ్రీమలయాళస్వామి.**

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓమ్

# శాన్తిపాఠమన్త్రములు

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరై రఙ్గై స్తుష్టువాగ్ంసస్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః ॥

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

పదవిభాగము ॥ భద్రం - కర్ణేభిః - శృణుయామ - దేవాః - భద్రం - పశ్యేమ- అక్షభిః - యజత్రాః - స్థిరైః - అఙ్గైః - తుష్టువాంసః - తనూభిః - వ్యశేమ- దేవహితం - యత్ - ఆయుః

టీక ॥ దేవాః = ఓ ఇంద్రాది దేవతలారా ! (వయం = మేము), కర్ణేభిః = మా శ్రోత్రేన్ద్రియములచేత, భద్రం = మంగళకర శబ్దజాతమును, శృణుయామ= విందుము గాక, యజత్రాః = పూజనీయులమయిన మేము, అక్షభిః = మా నేత్రములచేత, భద్రం = మంగళప్రదములగు కృత్యములను, పశ్యేమ = చూచెదము గాక, స్థిరైః = చక్కగానున్న, అఙ్గైః = చక్షురాద్యవయవములచేత, తనూభిః = అవికలములగు శరీరములచేత, తుష్టువాంసః = మీసంబన్ధమయిన స్తుతి జేయుచున్నవారమై, దేవహితం = భగవంతునిచేత మాకొసంగబడిన, యత్ = ఏ, ఆయుః = ఆయుస్సుగలదో, (తత్ = ఆ యాయుస్సు నంతయు), వ్యశేమ = చక్కగా పొందెదము గాక!

తా॥ ఓ ఇన్ద్రాది దేవతలారా ! మేము మీ యనుగ్రహమువలన నెల్లప్పుడు మా చెవులతో మంగళకరశబ్దజాతమును విందుము గాక ! పవిత్రులమయిన మేము మా నేత్రములచేత మంగళప్రదములయిన కృత్యములను చూచెదము గాక! భగవంతుడు మాయందనుగ్రహించి మాకిచ్చియున్న కరచరణాద్యఖిలావ-యవములు చక్కగా అయాకర్మలను నిర్వహించుకొనుటకు సమర్థములై యుండి అతడు మాకొసంగిన సంపూర్ణాయుస్సును చక్కగా పొందెదము గాక !

శిష్యాచార్యులమగు మాయొక్క ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆధిదైవిక తాపములు శమించు గాక !

స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమి స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

పద॥ స్వస్తి - నః - ఇన్ద్రః - వృద్ధశ్రవాః - స్వస్తి - నః - పూషా - విశ్వవేదాః- స్వస్తి- నః - తార్క్ష్యః - అరిష్టనేమిః - స్వస్తి - నః - బృహస్పతిః - దధాతు

టీక॥ వృద్ధశ్రవాః = నలుదిశల వ్యాప్తమైన కీర్తిగల, ఇన్ద్రః = ఇంద్రుడు, నః = (శిష్యాచార్యులమైన) మాకు, స్వస్తి దధాతు = క్షేమమును చేకూర్చుగాక ! విశ్వవేదాః = సకల ప్రపంచజ్ఞానవముగల (సర్వజ్ఞుడైన), పూషా = సూర్యభగవానుడు, నః = మాకు, స్వస్తి (దధాతు) = స్వస్తిని (మేలును) గలుగజేయుగాక ! అరిష్టనేమిః= సకలారిష్టములను పోగొట్టుటలో చక్రమువలె శక్తిమంతుడైన తార్క్ష్యః = గరుత్మంతుడు నః = మాకు, స్వస్తి (దధాతు)= శుభమును గలుగజేయుగాక ! బృహస్పతిః = బుద్ధికి అధిష్ఠానదైవమగు బృహస్పతి, నః = మాకు, స్వస్తి(దధాతు) శుభమును ప్రసాదించుగాక !

తా॥ దిగంతవ్యాప్త కీర్తివిరాజితుడగు దేవేంద్రుడు, సర్వజ్ఞుడగు సూర్యభగవానుడు, సర్వారిష్టములను నివారించుటలో సమర్థుడైన గరుత్మంతుడు, బుద్ధ్యధిష్ఠాన దేవతయగు బృహస్పతియు శిష్యాచార్యులమగు మాకు శుభముల చేకూర్చుదురు గాక! శిష్యాచార్యులమగు మాయొక్క ఆధ్యాత్మిక, అధిభౌతిక ఆధిదైవిక తాపత్రయము శాంతించు గాక !



# మాండూక్యదీపిక

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥

త్రివిధములయిన తాపములు, దుఃఖములు, దోషములు ఏవేవి గలవో, అవన్నియు శాంతించుటకొఱకు మూడుసార్లు శాంతిః, శాంతిః, శాంతిః అని పఠించడ మయినది యజ్ఞాది యాగముల జేయునప్పుడు వానియందు మన్త్రలోపము, క్రియాలోపము, ద్రవ్యలోపము ఏదైన గలిగియుండిన అట్టి దోషము శాంతించుటకొఱకును, మనోవాక్కాయములచే నేదైన దోషము సంభవించిన అది శమించుట కొఱకును, పఠన పాఠన తత్సంబంధ క్రియలయందును, ఏదైన లోపము గలిగియుండిన అది శాంతించుట కొఱకు, మూడుసార్లు శాంతిమన్త్రమును పఠించవలయును దీనిని ఓంకారపూర్వకముగా 'దోషమేదైన నుండిన శాంతించుగాక!' యను భావనతో నుచ్చరింపవలయును అట్లైన (ఈలాగున పఠించిన) త్రివిధములగు క్రియలలో నెందైనను దోషము గలిగిన నది తప్పక శాంతించును మఱియు మన అన్ని యింద్రియములలో ఆయా దేవతలు అధిష్ఠితులై యింద్రియములకు ఆయాశక్తిని ప్రేరణను గలుగజేయు చున్నారు కనుక అట్టి దేవతానుగ్రహమున్నచో మాత్రమే యింద్రియములు సన్మార్గప్రవృత్తములు కాగలుగును అందుచే బ్రహ్మ విద్యారంభమున 'ఇంద్రాది దేవతలు మనకు శుభమును చేకూర్చుదురు గాక!' యని ప్రార్థింపబడుచున్నది దేవతానుగ్రహము చేతనే మన యధ్యయనము నిర్విఘ్నముగ కొనసాగ గలదు శ్రుతియందు శాంతి జెప్పిన విధముగానే స్మృతియందు గూడ గలదు ఎట్లన -

మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం సురేశ్వర !
యత్పూజితం మయా దేవ ! పరిపూర్ణం తదస్తు మే ॥

ఓ దేవ దేవా ! మన్త్రహీనముగా గాని, క్రియాహీనముగా గాని, భక్తిహీనముగా గాని మాచేత చేయబడిన దానిలో నేదైన కొఱత గలియుండిన అదంతయు పరిపూర్ణమగు గాక !

**యదక్షరపద భ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।**
**తత్సర్వం క్షమ్యతాం దేవ ! పరమేశ ! నమోఽస్తు తే ॥**

ఓ పరమేశ్వరా ! ఓ దేవా ! నాచే ఉచ్చరింపబడిన వానిలో అక్షరలోపము గాని, పదలోపము గాని, మాత్రాలోపము గాని యేదైన గలిగినచో దానినంతయు క్షమించెదవుగాక !

తాపత్రయమునకు ఆధ్యాత్మిక తాపమనియు, అధిభౌతిక తాపమనియు ఆధిదైవిక తాపమనియు పేర్లు (1) ఆధ్యాత్మికమనగా దేహసంబంధతాపము, ఇది వాతపిత్తశ్లేష్మాదుల వ్యతి క్రమముచే గలిగెడు దుఃఖము, (2) అధిభౌతికమనగా భూతములచే గలిగెడు దుఃఖము ఇది సర్ప వృశ్చికవ్యాఘ్ర చోరాదులవలన గలిగెడు దుఃఖము, (3) ఆధిదైవిక తాపమనగా పిడుగులు, దైవికములయిన పంచభూతములచే గలిగెడు దుఃఖము, అనగా గాలి, వాన, గ్రహబాధలు మొదలగువాటిచే గలిగెడు దుఃఖము ఈ త్రివిధములగు తాపములు శమించుగాక యని ముమ్మారు 'శాంతిః శాంతిః శాంతిః' అని ఉచ్చరించబడుచున్నది



ఓమ్

# మాణ్డూక్యోపనిషత్

## ప్రథమఖండః - మొదటిఖండము

అవతారిక - వాచ్యవాచకముల కభేదమును విరూపించుటకై ఉపనిషదారంభమున వాచకమగు ఓంకారమే అక్షరమగు పరబ్రహ్మమని వర్ణింపబడుచున్నది

**హరిః ఓం ॥ ఓ మిత్యేదదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ । యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ ॥ ౧**

పద ॥ ఓం - ఇతి - ఏతత్ - అక్షరం - ఇదం - సర్వం - తస్య - ఉపవ్యాఖ్యానం - భూతం - భవత్ - భవిష్యత్ - ఇతి - సర్వం - ఓంకారః - ఏవ - యత్ - చ - అన్యత్ - త్రికాలాతీతం - తత్- అపి - ఓంకారః - ఏవ

టీక ॥ ఓమిత్యేతత్ = ఈ 'ఓం' అనునది, అక్షరం = అక్షరస్వరూపము (అనగా పరబ్రహ్మము), ఇదం సర్వం = ఈ సమస్తప్రపంచము, తస్య = ఆ యక్షరస్వరూపమగు ఓంకారముయొక్క, ఉపవ్యాఖ్యానం= విస్పష్ట వివరణము, భూతం భవత్ భవిష్యత్ = భూత వర్తమాన భవిష్యత్కాల పరిచ్ఛేద్యమైన, ఇతి = ఈ, సర్వం = సమస్తము, ఓంకార ఏవ = ఓంకారమే, త్రికాలాతీతం = భూతవర్తమాన భవిష్యత్కాలముల కతీతమైన, అన్యత్ = ఇతరమైనది, యచ్చ = ఏదియో, తదపి = ఆదియును, ఓంకార ఏవ = ఓంకారమే యగును

తా ॥ ఓంకారముయొక్క నిర్ణయము ఆత్మను తెలిసికొనుటకు లేక పొందుటకు ఉపాయమగుటచే ఈయుపనిషత్తునందు ఓంకారనిర్ణయము గావింపబడుచున్నది ఈ ఓంకారమే నాశరహితమగుపర బ్రహ్మస్వరూపము వాక్కుచేత చెప్పదగిన యీచేతనా చేతనాత్మక సమస్త ప్రపంచమున్ను ఆ ఓంకార రూప పరమాత్మయొక్క సమగ్రస్వరూపమును విస్పష్టముగా తెలియ

జేయుచున్నది భూతభవిష్య ద్వర్తమాన కాలత్రయ పరిచ్ఛేద్యమగు సమస్త ప్రపంచమున్ను ఓంకారమే ఈ కాలత్రయమున కతీతమై కాలపరిచ్ఛేద్యము కానటువంటి ఆ అవ్యాకృతాదికము సర్వమున్ను ఓంకారమాత్రముగానే యున్నది

దీపిక ॥ అవతి బ్రహ్మబుద్ధ్యా దృష్టః ద్రష్టౄనితి ఓమ్ ॥

బ్రహ్మబుద్ధితో తన్ను తెలుసుకొన్నవారిని జన్మజరామృత్యురూప మగు భయంకర సంసారదుఃఖమునుండి సంరక్షించునది గావున 'ఓం' అని శ్రీశంకరానంద భగవత్పాదులవారు నిర్వచన మొనర్చిరి

**సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః ।**

ఒక్కమారు ఉచ్చరించినంతమాత్రముననే శ్రేష్ఠగతిని (పరబ్రహ్మ మును) జేర్పించుటంబట్టి ఓంకార మనబడును ఇది ఓంకారశబ్దమున కర్థము

**ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః ॥**
**చతుర్ధావస్థిత ఇత సర్వదేవవేదయోనిః సర్వవాచ్యవస్తు ప్రణవాత్మకమ్ ॥**

సకల ప్రాణములను పరమాత్మ యందు చేర్పించుటంబట్టి ప్రణవ మనంబడును నాలుగు పాదములతో (నాలుగు అంగములతో) కూడి యుండుటవలన బ్రహ్మవిష్ణురుద్రాది సకల దేవతలకును, సకల వేదములకును ఇది కారణస్థాన మైయున్నది సకల వాచ్యవస్తువులును, సకల దేవతల నామములును ప్రణవాత్మకమగును (అధర్వశిఖోపనిషత్తు) ఈ క్షరాక్షర స్వరూపమును గుఱించి గీత అష్టమాధ్యా యములో నిరూపించబడినది

**''అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే''**

బ్రహ్మము సర్వోత్కృష్టమైన అక్షరస్వరూపమనియు, జీవసంజ్ఞగల ప్రత్యగాత్మస్వరూప మదియే యనియు, అధ్యాత్మమనియు చెప్పబడుచున్నది ఈ అక్షరస్వరూపుడగు పరమాత్మయొక్క అభ్యాసము ఆరంభమగునప్పుడే అక్షరాభ్యాసము ఆరంభింపబడుచుండును అంతవరకు ఎన్ని అక్షరములను అనగా భాషలను, శాస్త్రములను అభ్యసించినవాడైనను అక్షరాభ్యాసము కాని వాడే యగును ఈ భావమును ఋషులు హృదయములో నుంచుకొనియే విద్యాభ్యాసమునకు అక్షరాభ్యాసమని నామకరణమొనర్చిరి శైశవావస్థలో ఈ అక్షరాభ్యాసముయొక్క

అర్థము తెలియకపోయినను పెద్దవాడైన తరువాత అక్షరమనగా నేమియో తెలిసికొనగలడని తలంచియే అట్టి పేరు పెట్టడమైనది

''క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే'' (గీత అ 15)

సమస్తభూతములు క్షరములనియు, కూటస్థాత్మ ఒక్కటే అక్షరమనియు, దానియొక్క అభ్యాసము అక్షరాభ్యాసమనియు గ్రహించుకొన వలయును నశ్వరములగు వస్తువులను గుఱించిన అభ్యాసములన్నియు క్షరములే ఇది ఆత్మప్రాప్తిని పరమేశ్వరుని పొందింపజాలదు కావుననే అక్షరాభ్యాస కాలమున మొదట ''ఓం'' అని వ్రాయించి తరువాత ''నమః శివాయ సిద్ధం నమః'' అని ఆరంభించుటకు హేతువైనది ఈ అక్షరస్వరూపమగు పరబ్రహ్మాభ్యాసము గలవారు బాహ్యసంబంధమైన అక్షరములు అనగా విద్యలు లేనివారైనప్పటికిన్ని నిజముగా వారే అక్షరాభ్యాసము గలవారు అక్షరస్వరూపమగు పరబ్రహ్మయొక్క అభ్యాసము లేనివారు ఎన్ని అక్షరములను అనగా భాషలను, విద్యలను నేర్చినప్పటికిని, పెద్దవారై నప్పటికిని అక్షరాభ్యాసము లేనివారనియే గ్రహించవలయును ఇందువలన నిరక్షరకుక్షులెవరో విజ్ఞులు తెలిసికొందురు గాక!

నిరక్షరస్యాపి తు యస్య కుక్షౌ
బ్రహ్మైవ చా భాతి స ఏవ సాక్షరః ।
సర్వాక్షరస్యాపి తు యస్య చి త్తే
బ్రహ్మైవ నా భాతి స వై నిరక్షరః ॥

ప్రపంచవిద్య అనగా అక్షరము తెలియనివాడై నను ఎవని హృదయ మందు అక్షరస్వరూపమగు బ్రహ్మభావము వెలుగుచుండునో వాడే అక్షరాభ్యాసము గలవాడగును అనేక అక్షరములు అనగా భాషలు నేర్చినవాడైనను ఎవనియొక్క హృదయమందు అక్షరస్వరూపమగు బ్రహ్మభావము భాసించుట లేదో నిజముగా వాడే అక్షరాభ్యాసము లేని నిరక్షరకుక్షి యగును ఓమ్

అవ ॥ ''సర్వము ఓంకారమే, సర్వము అక్షరపరబ్రహ్మ స్వరూపమే'' అను తత్త్వము దుర్బోధమగుటచే నిర్వికార నిర్గుణాఖండ పరబ్రహ్మమునకు చతుష్పాదకల్పన చేయబడి ఆత్మస్వరూపము సుగమ మగునటుల నిరూపింపబడుచున్నది

మం ॥ సర్వం హ్యేతద్బ్రహ్మాయమాత్మా బ్రహ్మసోఽయమాత్మా
చతుష్పాత్ ॥ ౨

ప్రథమఖండః సమాప్తః

పద ॥ సర్వం - హి - ఏతత్ - బ్రహ్మ - అయం - ఆత్మా - బ్రహ్మ - సః- అయం- ఆత్మా - చతుష్పాత్

టీక ॥ ఏతత్ = ఈ, సర్వం హి = సమస్తమున్ను, బ్రహ్మ = పరబ్రహ్మము, అయం= ఈ, ఆత్మా = ఆత్మ, బ్రహ్మ = పరబ్రహ్మము, సోఽయం= ఆ ఈ, ఆత్మా= ఆత్మస్వరూపము, చతుష్పాత్ = నాలుగు పాదములు గలది

తా ॥ ఈ సమస్తమున్ను పరబ్రహ్మము, ఈ ఆత్మయు పరబ్రహ్మము ఆ ఈ ఆత్మస్వరూపము నాలుగుపాదములు గలది నాలుగుపాదము లనగా గోవువలె నాలుగుపాదములు గలది అని కాదు, నాలుగంతస్తులని గ్రహించుకొనవలయును విశ్వతైజస ప్రాజ్ఞులను ముగ్గురిని పూర్వపూర్వము లోపింపజేయుట చేత తురీయమగు పరబ్రహ్మను పొందుటయగును పాదశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము = పద్యతే అనేనేతి పాదః = దీనిచేత పొందబడును గనుక 'పాదము' అని పేరు

ప్రథమ ఖండము - సమాప్తము

దీపిక ॥

**అష్టాఙ్గం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్ ।**
**ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న స బ్రాహ్మణః ॥**

ఓంకారముయొక్క అష్టాఙ్గములను, పాదచతుష్టయమును, స్థానత్రయమును, దేవతాపంచకమును ఎఱుంగవలయును ఇట్టి ఓంకారమును (బ్రహ్మమును) ఎఱుంగనివాడు బ్రాహ్మణుడైనను బ్రాహ్మణ శబ్దమున కర్హుడు గాడు బ్రాహ్మణ కులములో పుట్టకపోయినను, ఓంకారస్వరూపమగు పరబ్రహ్మము నెఱింగినవాడు బ్రాహ్మణశబ్దమున కర్హుడగును అని ధ్యాన బిందూపనిషత్తు, అష్టాంగములు (1) విశ్వ, (2) తైజస, (3) ప్రాజ్ఞ, (4) ప్రత్యగాత్మలు, ఈ నాలుగు జీవాంగములు (1) విరాట్, (2) హిరణ్యగర్భ, (3) అవ్యాకృత (అన్తర్యామి), (4) పరమాత్మలు ఈ నాలుగున్ను ఈశ్వరాంగములు ఈ ఎనిమిదియు అష్టాంగము లనబడును చతుష్పాదమనగా, (1) జాగ్రత్త, (2) స్వప్నము, (3) సుషుప్తి, (4) తురీయము లేక (1) అవిద్యాపాదము, (2) విద్యాపాదము, (3) ఆనందపాదము, (4) తురీయపాదము త్రిస్థానమనగా, (1) భ్రూమధ్యము, (2) కంఠము, (3) హృదయము పంచదైవతమనగా, (1) బ్రహ్మ, (2) విష్ణు, (3) రుద్ర, (4) మహేశ్వర, (5) సదాశివులు



ప్రథమఖండ దీపిక సమాప్తము



# మాణ్డూక్యోపనిషత్

## ద్వితీయఖండః - రెండవ ఖండము

అవ ॥ నాలుగు పాదములలో ప్రథమపాదము వర్ణింపబడుచున్నది

మం ॥ *జాగరితస్థానో బహిఃప్రజ్ఞస్సప్తాఙ్గ ఏకోనవింశతి ముఖః*
*స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః ॥* 3

పద ॥ జాగరితస్థానః - బహిఃప్రజ్ఞః - సప్తాఙ్గః - ఏకోనవింశతిముఖః - స్థూలభుక్-వైశ్వానరః - ప్రథమః - పాదః

టీక ॥ జాగరితస్థానః - జాగ్రదవస్థ స్థానముగా గలిగినటువంటి, బహిః ప్రజ్ఞః= బహిః= వెలుపల, ప్రజ్ఞః =జ్ఞానముగలిగినటువంటి ( అవిద్యాకృతమయి నట్టియు, స్వాత్మవ్యతిరిక్తమయినట్టియు, రూపాది బాహ్యవిషయముల యందు జ్ఞానము గలిగినట్టియు) ,సప్తాఙ్గః = ఏడు అవయువవములు గలిగినటువంటి (1) ద్యులోకము, (2) సూర్యుడు, (3) వాయువు, (4) ఆకాశము, (5) అన్నము, (6) భూమి, (7) ఆహవనీయాగ్ని, ఇవియే (1) శిరస్సును, (2) చక్షువులును, (3) ప్రాణమును, (4) సందేహమును (5) పొత్తికడుపున్ను, (6) పాదములును (7) ముఖమును ఈ ప్రకారము ఏడు అంగములు), ఏకోన వింశతిముఖః = పందొమ్మిది ముఖములు గలిగినటువంటి ( త్వక్, చక్షుః, శోత్ర, జిహ్వా ఘ్రాణములను జ్ఞానేన్ద్రియము లయిదును, వాక్ పాణి పాద పాయు ఉపస్థలను కర్మేన్ద్రియము లయిదును, ప్రాణా పాన వ్యాన ఉదానసమానములను పంచ ప్రాణములును, మనో బుద్ధి చిత్త అహంకారములను అన్తఃకరణ చతుష్టయుమును ఇవన్నియు జేరి పందొమ్మిది ముఖవములు), స్థూలభుక్ - స్థూల = స్థూలవములగు శబ్దాదివిషయువములను, భుక్ = అనుభవించుచున్నట్టి, వైశ్వావరః = వైశ్వానరుడు, ప్రథమః పాదః = ప్రథమపాదము

తా ॥ జాగ్రదవస్థయే స్థానముగా గలిగినటువంటిన్ని, వెలుపలనుండెడి

రూపాదివిషయములందు అవిద్యాకృతమయిన జ్ఞానము గలిగినటువంటిన్ని, ద్యులోకాది సప్తవిధములయిన అంగములు గలిగినటువంటిన్ని, త్వగాది జ్ఞానేంద్రియము లయిదును, వాగాది కర్మేంద్రియము లయిదును, ప్రాణాది పంచప్రాణములును, అన్తఃకరణ చతుష్టయమున్ను ఇవియనుపందొమ్మిది ముఖములు గలిగినటువంటిన్ని, స్థూలరూపములయిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయముల ననుభవించుచున్నట్టిన్ని, సమస్తజీవులకు ప్రేరకుడై ప్రభువైయున్న వైశ్వానరుడు పూర్వము చెప్పబడిన పరమాత్మయొక్క నాలుగు పాదములలో ప్రథమపాదముగా దెలియవలయును

అవ - ఈ మంత్రమున పరమాత్మయొక్క ద్వితీయపాదము నిరూపింప బడుచున్నది :-

మం ॥ స్వప్నస్థానోఽన్తఃప్రజ్ఞః సప్తాఙ్గ ఏకోనవింశతిముఖః
ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయః పాదః ॥ ౪

పద ॥ స్వప్నస్థానః - అన్తః ప్రజ్ఞః - సప్తాఙ్గః - ఏకోనవింశతిముఖః - ప్రవివిక్తభుక్ - తైజసః - ద్వితీయః పాదః ॥

టీక ॥ స్వప్నస్థానః = స్వప్నము స్థానముగా గలిగినటువంటి, అన్తఃప్రజ్ఞః - అన్తః = లోపల, ప్రజ్ఞః = జ్ఞానము గలిగినటువంటి (ఇన్ద్రియముల కంటెమనస్సు అన్తరమందున్న దగుటవలన స్వప్నమందు ఆమనస్సుయొక్క వాసనారూపమయిన ప్రజ్ఞ గలిగివటువంటి), సప్తాఙ్గః = పూర్వోక్తములైన ఏడు అవయవములు గలిగినటువంటి, ఏకోనవింశతిముఖః = పందొమ్మిది ముఖములు గలిగినటువంటి (వీని వివరము పూర్వమంత్రమునందు జెప్పబడినది), ప్రవివిక్తభుక్= ప్రవివిక్త = మిక్కిలి సూక్ష్మములయిన స్వప్నపదార్థములను భుక్ = అనుభవించుచున్న, తైజసః = తైజసుడు (తేజోమయుడగువాడు తైజసుడనబడును) ద్వితీయః = రెండవదైన, పాదః = పాదము

తా॥ స్వప్నావస్థయందు స్థితి గలిగి, మనస్సుయొక్క వాసనారూప మ్మయిన ప్రజ్ఞ గలిగినటువంటిన్ని, పూర్వశ్లోకోక్తములైన సప్తాంగములున్ను, పందొమ్మిది

ముఖములును గలిగి వాసనామాత్రముచే ప్రవివిక్తములగు (సూక్ష్మములగు) స్వప్నవిషయముల ననుభవించుచున్న తేజోరూపుడయిన తైజసుడు (సూత్రాత్మ లేక హిరణ్యగర్భుడు) పూర్వోక్తమయిన పరమాత్మయొక్క నాలుగు పాదములలో రెండవపాదముగా జెప్పబడుచున్నాడు

అవ ॥ సుషుప్తియొక్క స్వరూపము - పరమాత్మయొక్క తృతీయ పాదము ఇందు ప్రతిపాదింపబడుచున్నది :-

మం ॥ యత్ర సుప్తో న కఞ్చన కామం కామయతే
న కంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తమ్ ।
సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానన్దమయో
హ్యానన్దభుక్చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయః పాదః ॥ 5

పద ॥ యత్ర - సుప్తః - న - కంచన - కామం - కామయతే - వ - కంచన- స్వప్నం- పశ్యతి - తత్ - సుషుప్తం - సుషుప్తస్థానః - ఏకీభూతః - ప్రజ్ఞానఘనః - ఏవ - ఆనందమయః - హి - ఆనన్దభుక్ - చేతోముఖః - ప్రాజ్ఞః - తృతీయః- పాదః

టీక ॥ యత్ర = ఏ స్థానమునందు (ఏ కాలమునందైనను), సుప్తః = నిద్రించినవాడు, కంచన = ఏ ఒక, కామం = కోరికనున్ను, న కామయతే = కోరడో, కంచన = ఏ ఒక, స్వప్నం = కలనున్ను, న పశ్యతి = చూడడో, తత్ = అది, సుషుప్తం= సుషుప్త్యవస్థ యనబడును, సుషుప్తస్థానః = సుషుప్తస్థానమును గలిగినటువంటి, ఏకీభూతః = ఒకటియైనటువంటి, ప్రజ్ఞానఘన ఏవ = ఘనీభూతమయిన ప్రజ్ఞయే స్వరూపముగా గలిగినటువంటి, ఆనన్దమయో హి = ఆనందప్రాయమయినటువంటి, ఆనన్దభుక్ = ఆనందము ననుభవించుచున్నటువంటి, చేతోముఖః = చేతః = బోధ లక్షణమయిన చైతన్యము, ముఖః = ద్వారముగా గలిగినటువంటి, ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడను పేరు గల ఆత్మ (సుషుప్తియందు బాహ్యాన్తర విషయోపరమము గలిగియున్నను కేవల జ్ఞానస్వరూపుడై విశేషముగా తెలిసికొనువాడగుట వలన ప్రాజ్ఞుడనంబడును) పరమాత్మయొక్క, తృతీయః = మూడవదియగు, పాదః= పాదము

తా ॥ ఆత్మ యే స్థానమునందు నిద్రనుపొంది యేకోరికనున్ను కోరక యే స్వప్నమునున్ను చూడకయుండునో, అదియే సుషుప్తిస్థానమనంబడును అటువంటి సుషుప్తిస్థానవముగలిగి, జాగ్రత్స్వప్నస్థానవములయందలి ప్రజ్ఞ లేకీభవించినవి గనుకనే దట్టవయియున (ఘనీభూతవైన) ప్రజ్ఞగలదై, ఆనందానుభవము గలదియును, స్వప్నజాగరములను పొందుటకు చైతన్యమే ద్వారముగా గలదియును, విశేషముగా సర్వము దెలియున దగుటచే కేవల ప్రజ్ఞానస్వరూపమునగు ప్రాజ్ఞాత్మ పూర్వోక్తమగు పరమాత్మయొక్క నాలుగు పాదములలో మూడవపాదముగా నున్నది

అవ ॥ పరమాత్మయొక్క మూడవపాదమైన ప్రాజ్ఞునియొక్క వైశిష్ట్యము 'ఇతడే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వాన్తర్యామి' అని నిరూపింపబడుచున్నది ః-

మం ॥ ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష యోనిస్సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్ ॥ ౬

పద ॥ ఏషః - సర్వేశ్వ రః - ఏషః - సర్వజ్ఞః - ఏషః - అన్తర్యామీ- ఏషః- యోనిః- సర్వస్య - ప్రభవాప్యయౌ - హి - భూతానాం

టీక ॥ ఏషః = ఈప్రాజ్ఞుడు, సర్వేశ్వరః = సర్వ= సమస్తమునకు ఈశ్వరః= నియామకుడు, ఏషః = ఇతడు, సర్వజ్ఞః = సమస్తమును తెలిసికొనువాడు, ఏషః = ఇతడు, అన్తర్యామీ= అన్తః = భూతముల యొక్క లోపలప్రవేశించి, యామీ = ఆభూతజాతమును నియమించువాడు ఏషః = ఇతడు, సర్వస్య= సమస్తమునకును, యోనిః = కారణుడు, భూతానాం = భూతముల యొక్క, ప్రభవాప్యయౌ= హి= ఉత్పత్తి ప్రళయములును, ( ఏష- ఏవ = ఇతడే)

తా ॥ ఈపూర్వము చెప్పిన ఆత్మయొక్క పాదములలో మూడవపాదమగు ప్రాజ్ఞుడు సమస్త భేదజాతమునకు నియామకుడు కనుక సర్వేశ్వరుడును ఈప్రాజ్ఞుడే అన్నిటియొక్క భేదావస్థలను గలిగి సర్వమును తెలిసికొనువాడు గనుక సర్వజ్ఞుడును ఈప్రాజ్ఞుడే సవమస్తభూతవములయొక్క లోపల ప్రవేశించి సర్వమును నియమించువాడు గనుక అన్తర్యామియును నితడే ఇతడు సమస్తమునకు కారణుడు భూతవములయొక్క ఉత్పత్తి స్థితి ప్రళయువములకును ఇతడే అధిష్ఠానము

అత్రైతే శ్లోకా భవన్తి

**బహిఃప్రజ్ఞో విభుర్విశ్వో హ్యన్తఃప్రజ్ఞస్తు తైజసః ।**
**ఘనప్రజ్ఞ స్తథా ప్రాజ్ఞ ఏక ఏవ త్రిధా స్మృతః ॥ 1**

పద ॥ అత్ర - ఏతే - శ్లోకాః భవన్తి - బహిః ప్రజ్ఞః - విభుః - విశ్వః - హి - అన్తః ప్రజ్ఞః - తు - తైజసః - ఘనప్రజ్ఞః తథా = ప్రాజ్ఞః - ఏకః - ఏవ - త్రిధా - స్మృతః

టీక ॥ అత్ర = ఈప్రకరణమునందు, ఏతే = ఈ, శ్లోకాః = శ్లోకములు, (గౌడపాదీయ కారికలు), భవన్తి = అగుచున్నవి, బహిః ప్రజ్ఞః = జ్ఞానము గలిగిన, విభుః = సర్వవ్యాపకమయిన, ఆత్మ, విశ్వోహి = విశ్వుడను పేరుగలది, అన్తః ప్రజ్ఞస్తు అన్తః = లోపల, ప్రజ్ఞః= జ్ఞానము గలిగిన ఆత్మ, తైజసః = తైజసుండను పేరు గలది, తథా = ఆప్రకారము, ఘనప్రజ్ఞః = ఘనీభవించిన జ్ఞానము గల ఆత్మ ( బాహ్యాభ్యన్తర జ్ఞానములు ఒకటిగా జేరినటువంటి ఆత్మ ), ప్రాజ్ఞః= ప్రాజ్ఞుండను పేరుగలది, ఏక ఏవ = ఒక ఆత్మయే, త్రిధా = మూడు విధములుగా, స్మృతః = చెప్పబడుచున్నది

తా ॥ ఈ పూర్వోక్తార్థమందే శ్రీగౌడపాదీయ కారికలు గనంబడుచున్నవి జాగ్రత్తయందు శ్రోత్రాదీన్ద్రియముల ద్వారా బహిర్గతమై వెలుపలనుండెడి శబ్దాది విషయములను తెలిసికొనుచుండెడి బాహ్యజ్ఞానముగల ఆత్మ విశ్వుడనబడును స్వప్నమునందు బాహ్యజ్ఞానవేమ మనోవాసనా రూపమై ప్రవివిక్తములగు (సూక్ష్మములగు) స్వప్నవిషయములను చూచెడి అన్తః ప్రజ్ఞగల ఆత్మ తైజసు డనబడును సుషుప్తియందు జాగ్రత్స్వప్న ములయందలి బాహ్యాన్తః ప్రజ్ఞలే ఘనీభవించిన ప్రజ్ఞగల ఆత్మ విజ్ఞాన ఘనస్వరూపుడైన ప్రాజ్ఞు డనబడును ఇట్లు ఒకే ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్తులయందు విశ్వతైజస ప్రాజ్ఞులను నామములతో వ్యవహరింపబడుచున్నది

శ్లో ॥ **దక్షిణాక్షి ముఖే విశ్వో మనస్యన్తశ్చ తైజసః ।**
**ఆకాశే చ హృది ప్రాజ్ఞస్త్రిధా దేహే వ్యవస్థితః ॥ 2**

పద ॥ దక్షిణాక్షిముఖే - విశ్వః - మనసి - అన్తః - చ - తైజసః - ఆకాశే - చ - హృది - ప్రాజ్ఞః - త్రిధా - దేహే వ్యవస్థితః

టీక ॥ (సః = ఆపరమాత్మ ఒక్కడే) దేహే = దేహమునందు , దక్షిణా క్షిముఖే = దక్షిణాక్షి = దక్షిణ నేత్రముయొక్క, ముఖే = అగ్రభాగమునందు, విశ్వః = విశ్వుడుగను, మనసి అన్తః = మనస్సు లోపల, తైజసశ్చ = తైజసుడుగను, హృది ఆకాశే = హృదయాకాశమునందు, ప్రాజ్ఞశ్చ = ప్రాజ్ఞుడుగను ( ఇట్లు), త్రిధా= మూడువిధములుగా, వ్యవస్థితః = ఉన్నాడు

తా॥ జాగ్రదవస్థయందే విశ్వుడు మొదలగు నీ ముగ్గురి యొక్క అనుభవవమును చూపించుట కొఱకు ఈశ్లోకము ప్రవర్తించుచున్నది ఒక్కడగు పరమాత్మయే ఈ దేహమునందు విశ్వుడను పేరు గలిగి స్వప్నావస్థయందును, ( జాగ్రద్వాసనామయమైన మనోమయ కోశమునందు) ప్రాజ్ఞుడను పేరు గలిగి సుషుప్తియందును, ( జాగ్రత్స్వప్నముల యందలి ప్రజ్ఞలే యేకీభవించిన స్వరూపముగల వాడై హృదయాకాశమందును) మూడువిధములుగా నున్నాడు

శ్లో ॥ **విశ్వోహి స్థూలభుఙ్నిత్యం తైజసః ప్రవివిక్తభుక్ ।**
**ఆనన్దభుక్తథా ప్రాజ్ఞస్త్రిధా భోగం నిబోధత ॥ 3**

పద ॥ విశ్వః - హి - స్థూలభుక్ - నిత్యం - తైజసః - ప్రవినిక్తభుక్ - ఆనన్దభుక్ - తథా - ప్రాజ్ఞః - త్రిధా - భోగం - నిబోధత

టీక ॥ విశ్వో హి = విశ్వుడును, నిత్యం = ఎల్లప్పుడు, స్థూలభుక్ = స్థూల = స్థూలములయిన శబ్దాది విషయములను, భుక్= అనుభవించువాడు, తైజసః= తైజసుడు, ప్రనివిక్తభుక్ = ప్రవివిక్త= మిక్కిలి వివిక్తములయిన స్వప్న విషయములను, భుక్ = అనుభవించువాడు, తథా = ఆ ప్రకారము, ప్రాజ్ఞః= ప్రాజ్ఞుడు, ఆనన్దభుక్ = ఆనంద = సంతోషమును, భుక్ = అనుభవించువాడు ( ప్రాజ్ఞుడు జాగ్రత్స్వప్నముల యందలి ప్రజ్ఞలేకీ భవించి యితరము ప్రజ్ఞాన ఘన స్వరూపడగుటచేతనే కేవలానన్దము ననుభవించు చున్నాడు) ( ఇట్లు), భోగం = అనుభవమును, త్రిధా = మూడువిధములుగా, నిబోధత = తెలిసికొనుడు

తా ॥ జాగ్రదాద్యవస్థలయందు విశ్వ తైజసాది భేదముల పొందిన ఆత్మ జాగ్రదవస్థయందు విశ్వరూపమై జాగ్రద్విషయములగు శబ్దాదులనున్ను, స్వప్నావస్థయందు తైజసరూపమై స్వప్నవిషయములనున్ను, సుషుప్తియందు, ప్రాజ్ఞరూపమై జాగ్రత్స్వప్నముల యందలి ప్రజ్ఞలేకీభవించి యితరము లేమియు లేకపోవుట వలన సమస్తవ్యాపారోపరమము గలిగిన ప్రజ్ఞానఘనస్వరూపమగుటచేత కేవలానందమునున్ను క్రమముగా ననుభవించుచున్నది ఇట్లు ఆత్మభోగమును మూడువిధములుగా దెలిసికొనుడు

శ్లో ॥ **స్థూలం తర్పయతే విశ్వం ప్రవివిక్తం తు తైజసమ్ ।**
**ఆనన్దశ్చ తథా ప్రాజ్ఞం త్రిధా తృప్తిం నిబోధత ॥** 4

పద ॥ స్థూలం - తర్పయతే - విశ్వం - ప్రవివిక్తం - తు - తైజసం - ఆనన్దః - చ - తథా - ప్రాజ్ఞం - త్రిధా - తృప్తిం - నిబోధత

టీక ॥ స్థూలం = స్థూలమగు జాగ్రత్తయందలి శబ్దాది విషయజాతము, విశ్వం = విశ్వాత్మను, తర్పయతే = తృప్తిని పొందించు చున్నది, ప్రవివిక్తం తు = మిక్కిలి వివిక్తమగు స్వప్నమునందలి విషయము ( వాసనామయ సూక్ష్మభాగములు), తైజసం = తైజసాత్మను, (తర్పయతే = తృప్తిని పొందించుచున్నది) తథా = అట్లే, ఆనన్దశ్చ = సుషుప్తియందలి యానన్దము, ప్రాజ్ఞం = ప్రాజ్ఞాత్మను, (తర్పయతే = తృప్తిని పొందించుచున్నది) త్రిధా = మూడు విధములుగా, తృప్తిం = తనివిని, నిబోధత = తెలిసికొనుడు

తా ॥ ఈ విశ్వతైజస ప్రాజ్ఞాత్మలను మూటిని జాగ్రత్స్వప్న సుషుప్తులయందలి స్థూల, ప్రవివిక్త, ఆనందములనెడి విషయములు తృప్తిని పొందించుచున్నవి ఇట్లాత్మకు జాగ్రదాద్యవస్థల మూటియందు క్రమముగా తనివిని త్రివిధ మయినదిగా తెలిసికొనుడు

శ్లో ॥ **త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః ॥**
**వేదైతదుభయం యస్తు స భుఞ్జానో న లిప్యతే ॥** 5

పద ॥ త్రిషు - ధామసు - యత్ - భోజ్యం - భోక్తా - యః - చ - ప్రకీర్తితః - వేద- ఏతత్ - ఉభయం - యః - తు - సః - భుఞ్జానః - న - లిప్యతే

టీక ॥ త్రిషు = మూడైన, ధామసు = స్థానములయందు, (జాగ్రత్స్వప్న సుషుప్తులయందు), భోజ్యం = అనుభవింపదగిన విషయము (స్థూల, ప్రవివిక్త, ఆనందములను పేరుగల త్రివిధమయిన భోజ్యము), యచ్చ = ఏదియో, భోక్తా = అనుభవించు వాడును, యశ్చ = ఎవడో, ఏతత్ = ఈ, ఉభయం = భోక్తృభోజ్యములను రెంటిని, యస్తు = ఎవడైతే, వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, భుఞ్జానః = అనుభవించు వాడైనను, న లిప్యతే = దానిచే నంటబడడు

తా ॥ జాగ్రత్స్వప్న సుషుప్తులయందలి స్థూల ప్రవివిక్తా నందములను పేళ్లు గలిగిన త్రివిధమగు భోజ్యమును, విశ్వతైజస ప్రాజ్ఞాది త్రివిధ భోక్తృస్వరూపమునున్ను, ఇట్లు భోక్తృ భోజ్యరూపమయిన యుభయమును ఎవడు తెలిసికొనుచున్నాడో, వాడు ఆయా భోజ్యముల ననుభవించువాడై నను వానివలన గలిగెడు ఉపచయాచయ రూపమయిన వికారములను పొందకయే విలక్షణుడై అవికారిగా నుంటున్నాడు

శ్లో ॥ **ప్రభవస్సర్వభావానాం సతామితి వినిశ్చయః ।**
**సర్వం జనయతి ప్రాణశ్చేతోఽంశూన్పురుషః పృథక్ ॥ 6**

పద ॥ ప్రభవః - సర్వభావానాం - సతాం - ఇతి - వినిశ్చయః - సర్వం - జనయతి- ప్రాణః - చేతోఽంశూ్ - పురుషః - పృథక్

టీక ॥ సతాం = సద్రూపములయిన, సర్వభావానాం - సమస్త పదార్థములకు, (విశ్వతైజసాది భేదములకు), ప్రభవః, ఇతి = ఉత్పత్తి అని, వినిశ్చయః = నిశ్చయము, ప్రాణః = ప్రాణరూపమయిన, పురుషః = చిత్ప్రధానుడగు పురుషుడు, పృథక్= వేరుగా, చేతోఽంశూన్ - చేతః = చైతన్యాత్మకమయిన పురుషునియొక్క, అంశూ్ = కిరణరూపములయిన జీవులనున్ను, సర్వం= సమస్తజగత్తునున్ను, జనయతి = పుట్టించుచున్నాడు

తా॥ పూర్వము ''ఏషయోనిస్సర్వస్య'' అను శ్రుతియందు ప్రాజ్ఞాత్మకు ప్రపంచకారణత్వము ప్రతిజ్ఞ చేయబడినది దానియందు అకారణత్వము సత్కార్యమునకా? అసత్కార్యమునకా? అని సందేహము గలుగగా,

ఆసందేహమును నిర్ధారణజేయుట కారంభించుచున్నాడు విశ్వతైజసప్రాజ్ఞభేదములకు కారణుడైన ప్రాణరూపుడగు పురుషుడు జగత్తునకు శరీరభూతమయినట్టి అజ్ఞానమే ప్రధానముగా గల సమస్తమయిన అచేతనమును గ్రహించి స్వయం ప్రకాశస్వరూపుడయిన పురుషునియొక్క చేతోరూపములగు ఆభాసులగు జీవులను, సమస్తజగత్తునున్ను సూర్యుడు యధార్థముగ భేదము లేనటువంటి తన బిమ్బమువలన జలపాత్రాదుల యందలి ప్రతిబిమ్బసూర్యులను వలెనే వేరుగా పుట్టించుచున్నాడు

శ్లో ॥ విభూతిం ప్రసవం త్వన్యే మన్యన్తే సృష్టిచిన్తకాః ।
స్వప్న మాయాస్వరూపేతి సృష్టిరన్యైర్వికల్పితా ॥ 7

పద ॥ విభూతిం - ప్రసవం - తు - అన్యే - మన్యన్తే - సృష్టిచిన్తకాః - స్వప్నమాయాస్వరూపా - ఇతి - సృష్టిః - అన్యైః - వికల్పితా

టీక ॥ అన్యే - ఇతరు లగు, సృష్టిచిన్తకాస్తు - సృష్టి = ప్రపంచ సృష్టిని, చిన్తకాస్తు - తలంచెడివారలయితే (సృష్టి విచారము చేయువారు), విభూతిం = ఐశ్వర్యమును (ఈశ్వరునియొక్క విస్తారమును), ప్రసవం = సృష్టిగా, మన్యన్తే= తలంచుచున్నారు అన్యైః = ఇతరులచేత (పరమార్థ స్వరూపమును చింతించువారలచేత) సృష్టిః = ప్రపంచమును సృజించుట, స్వప్నమాయా స్వరూపేతి =స్వప్న = స్వప్నరూపమయినదనిన్ని, మాయాస్వరూపా = ఇతి = మాయాస్వరూపమయినదని, వికల్పితా = కల్పింపబడినది

తా॥ చేతనా చేతనాత్మకమయిన జగత్తుయొక్క ప్రస్తుత మయిన సృష్టియందు స్వమతమును వివేచించుటకు మతాంతరమును ఉపన్యసించుచున్నాడు సృష్టినే ఆలోచించుచున్న ప్రపంచమునందాదరణ గల్గినట్టి కొందఱు జనులు ఈశ్వరునియొక్క స్వకీయమయిన ఐశ్వర్యమును విస్తరింపజేయుటయే సృష్టియని తలంచుచున్నారు జాగ్రత్స్వప్న సుషుప్తులయందలి విశ్వతైజస ప్రాజ్ఞులకంటె అన్యమగు మాయాచ్ఛాదితమును తురీయము నగు పరబ్రహ్మ స్వరూపమును చింతించుచు పరమార్థతత్త్వము నందాదరణ గలవారలచేత ఈసృష్టి స్వప్నముతోను, ఐంద్రజాలిక మాయతోను సమానరూపము గలదిగా జెప్పబడుచున్నది

శ్లో ॥ **ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిరితి సృష్టౌ వినిశ్చితాః ।**
**కాలాత్ప్రసూతిం భూతానాం మన్యన్తే కాలచిన్తకాః ॥** **8**

పద ॥ ఇచ్ఛామాత్రం - ప్రభోః, సృష్టిః - ఇతి - సృష్టౌ - వినిశ్చితాః -కాలాత్ ప్రసూతిం - భూతానాం- మన్యన్తే - కాలచిన్తకాః

టీక ॥ సృష్టౌ - సృష్టివిషయమై , వినిశ్చితాః = నిశ్చయింపబడినవారలు, సృష్టిః = సృష్టి, ప్రభోః = పరమేశ్వరునియొక్క, ఇచ్ఛామాత్రం ఇతి = సఙ్కల్పమాత్రమయినదని, మన్యన్తే = తలంచుచున్నారు, కాలచిన్తకాః = కాలమును చింతించువారలు, (కాలమును పరిశీలించు వారలు), కాలాత్ = కాలమువలన, భూతానాం = భూతములయొక్క, ప్రసూతిం = ఉత్పత్తిని, మన్యన్తే = తలంచుచున్నారు

తా॥ సృష్టియే పరమార్థమని తలంచెడివారలకుండెడి వేఱొక వికల్పమును ప్రకటించు చున్నారు అదెట్లనిన - సృష్టి విషయక మయిన నిశ్చయముగల వారలు, ఈ సృష్టి పరమేశ్వరునియొక్క సంకల్పమాత్రమయినదిగా చెప్పుచున్నారు మఱియు కాలమునే పరిశీలించెడు కొందఱు కాలము నుండియే యీ భూతసృష్టి యగుచున్నదని చెప్పుచున్నారు

శ్లో ॥ **భోగార్థం సృష్టిరిత్యన్యే క్రీడార్థమితి చాపరే ।**
**దేవస్యైష స్వభావో ఽ యమాప్తకామస్య కా స్పృ హా ॥** **9**

పద ॥ భోగార్థం - సృష్టిః - ఇతి - అన్యే - క్రీడార్థం - ఇతి- చ - అపరే- దేవస్య - ఏషః - స్వభావః - అయం - అప్తకామస్య - కా - స్పృహా

టీక ॥ అన్యే = కొందఱు , సృష్టిః - సృష్టి, భోగార్థం - ఇతి = భోగవు నిమిత్తమనియు, అపరే = మఱికొందఱు, క్రీడార్థం ఇతి = విలాసార్థమనియు, (మన్యన్తే = తలంచుచున్నారు) అయం = ఈక్రీడా రూపమయిన, ఏషః = ఈసృష్టివిషయము, దేవస్య = పరమేశ్వరుని యొక్క, స్వభావః = నైసర్గికమయినది, ఆప్తకామస్య= పొందబడిన కోరికగల వానికి, స్పృహా = ప్రయోజనాపేక్ష , కా - ఏది, ఇతి = ఈప్రకారము (తెలియ వలయును)

తా॥ సృష్టి యెట్లైనను అగును గాక, ఆసృష్టికి ప్రయోజనమేమి ? అని రెండు విధములుగా వికల్పించి ఇక్కడ సిద్ధాన్తము చేయబడుచున్నది ఈసృష్టిని కొందఱు ఆపరమేశ్వరుని ఉపభోగముకొఱకనియును, మఱికొందఱు క్రీడకొఱకనియును రెండువిధములుగా జెప్పుచున్నారు ఇట్లు చెప్పిన వికల్పద్వయమున్ను, పూర్వము సృష్టి విషయమై జెప్పిన మతాన్తరాభిప్రాయమున్ను ఇవన్నియు సరియయినవి గావు ఎట్లన, పరమేశ్వరుడు సమస్తములయినకోరికలు పొందిన వాడగుటచే ఏకోరికలు లేనివాడై అప్తకాముడగుచున్నాడు అట్టి పరమేశ్వరునకు వేఱొక యే ప్రయోజనాపేక్షయు లేకపోవుటచేత నిరీహుడై యుంటున్నాడు కనుక సృష్టి విషయమై యింతకు పూర్వము జెప్పిన విభూతి ప్రఖ్యాపనము స్వప్నమమాయాస్వరూపములు, ఇచ్ఛా భోగ క్రియలు ఇవన్నియు ఆ పరమేశ్వరునకు మాయ లేకుండా గలుగనేరవు ఈసృష్టి స్వయంప్రకాశ స్వరూపుడగు ఆపరమేశ్వరునియొక్క నైసర్గికమగు మాయచేత నిర్మింపబడు చున్నది ఇందువలననే సృష్టి మాయామయ మయినది

దీపిక ॥ మూలమున మూడవ మంత్రమునుండి అయిదవ మంత్రము వఱకు గల విశ్వతైజస ప్రాజ్ఞుల గుఱించి చెప్పిన విషయమునకు గౌడపాదీయ కారికలలో మొదటి శ్లోకమునుండి నాలుగవ శ్లోకము వఱకు చెప్పిన దానినే మఱల మఱల చెప్పుటచే పునరుక్తి దోషమని గాని, చర్వితచర్వణమని గాని తలంచవలదు గీతయందు పదునాలుగవ అధ్యాయమున గుణత్రయమును గుఱించి చెప్పునప్పుడును, ఆరవఅధ్యాయమున ఆహార విహారముల గుఱించి నిరూపించు విషయములోను, ద్వితీయాధ్యాయమున ఆత్మ నాశము లేనిదని నిరూపించెడు సందర్భమునను ఈలాటి చాలా శ్లోకములు గలవు అది పునరుక్తిదోషముతో గూడినది కాదని ఈ క్రింది ప్రమాణము నిరూపించుచున్నది

విస్మయే చ విషాదే చ దైన్యే చైవావధారణే ।
తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్విరుచ్యతే ॥

(1) దీనభావమందును, (2) విస్మయవిషయమందును, (3) విషాద స్థలములోను, (4) తత్త్వావధారణమందును (5) అనుగ్రహమందును, (6) అతిహర్షమందును, ఈ ఆరుస్థలములలో ద్విరుక్తిదోషము సంభవించదు ఒకసారి

గాదు రెండుమార్లుగాదు మూడు పర్యాయములుగాదు, ఎన్నిసార్లైనను చెప్పవచ్చును ఇచ్చట అవధారణవిషయమగుటచే ఆలాగున చెప్పిరి అవధారణ యనగా నిశ్చయము ధారణ చేయుటకు ప్రయాసమగు విషయమగుటచే మఱల మఱల చెప్పడమయినది

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచో యః ప్రకాశతే**
**తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది యీ ప్రపంచమంతయు ఏయొక్క ఆత్మచేత ప్రకాశించుచున్నదో, అట్టి పరబ్రహ్మ స్వరూపము తన ఆత్మయని తెలిసికొనినవాడు సంసారమునకు సంబంధించిన సమస్తబంధములనుండి విముక్తిని పొందుచున్నాడు అనగా స్థూలసూక్ష్మకారణము లనెడు మూడు దేహములను, వానికి సంబంధించిన సమస్తేంద్రియములను ఏ కూటస్థుడు ప్రకాశింపజేయుచున్నాడో, అట్టి తురీయాత్మను అనగా వ్యష్టి సాక్షిగాను ఉండు ఈశ్వరుని బ్రహ్మముగాను ఆత్మగాను ఎవడు ఎరుంగుచున్నాడో, అట్టివాడు సర్వబంధములనుండి విడివడుచున్నాడు

**ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥**

ఈ ఓంకారమే అక్షరమగు పరబ్రహ్మము ఈ ఓంకారమగు అక్షరమే పరమపదము ఈ అక్షరస్వరూపమగు నోంకారమును తెలిసికొనినవాడు దేని నిచ్ఛగించునో దానిని పొందును అనగా నీ ప్రణవోపాసకుడు ధ్యానకాలమున ధ్యేయైకస్థితిలో నుండి దేనిని సంకల్పించునో దానిని తప్పక పొందును ఏసంకల్పము లేనివాడు మోక్షమును పొందును

**యుఞ్జీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।**
**ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥**

ఓంకారాను సన్ధానమునందు నేర్పు గలవానికి సమస్తద్వైతమును పోగొట్టుచున్న ఓంకారజ్ఞానముచేతనే కృతార్థత గలుగుచున్నది ధ్యానించువాడు మనస్సును ఓంకారస్వరూపమగు పరబ్రహ్మమున బాగుగా చేర్చవలయును ఇట్లు

బ్రహ్మస్వరూపమయిన ఓంకారమును ఎల్లప్పుడును ధ్యానించువానికి ఎచ్చోట నుండినను భయము లేదు

**తైలాధారామివాచ్ఛిన్నం దీర్ఘ ఘంటానినాదవత్ ।**
**ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్ ॥**

ఆత్మానుసంధాన మెటులుండవలయునో దానిని ఈ ఉపనిషద్వాక్యము తెలుపుచున్నది ఒక పాత్రనుండి మఱియొక పాత్రలోనికి నూనె పోయునప్పు డేలాగున ఎడతెగక పడుచుండునో, అదేరీతిగా గొప్ప గంట మ్రోగించిన తరువాత గలిగెడు ధ్వని యేలాగున క్రమేణ లయ మొందుచుండునో ఆలాగున ప్రణవముయొక్క నాలుగవపాదమగు తురీయపదమున శబ్దరహితావస్థలో మనస్సు ననుసంధించి ఎవడు ధ్యానము జేయునో, అట్టివానిని వేదమును సంపూర్ణముగా నెఱింగిన వానినిగా వేదవేత్తలు తలంతురు దీనియందు ''అవాచ్యం'' అని పాఠాన్తరము గలదు ఉపాస్యమను స్థలమున ధ్యేయాకారమై నిలువవలయుననియు, అవాచ్యమని చెప్పుచోట శబ్దమును రహితముగా జేసికొనవలయుననియు గ్రహించవలయును లేక ప్రణవముయొక్క నాల్గవ పాదమే ఉపాసింపదగినదని గూడ గ్రహించవలయును 'ప్రణవస్యాన్తం' అని గూడ పాఠాన్తరము గలదు అర్థమంతయు ఒకటియే

**మృద్వాసనే సమాసీనో జితచిత్తేన్ద్రియక్రమః ।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి ॥**

మెత్తని ఆసనమందు గూరుచుండి యిన్ద్రియాది వృత్తులను నిశ్చలముగా జేసికొని మనస్సు లీనమై బ్రహ్మాకార మగు పర్యన్తము ఓంకారమన్త్రమును పరమాత్మ పరముగా భావన చేసి ధ్యానము జేయవలయును

మృద్వాసనమని చెప్పుటచే కఱకుగల ఆసనముండరాదు ఏలననగా కఱకు గల ఆసనమయినచో పాదమునకు నొప్పి గలుగును అప్పుడు ఎక్కువసేపు కూర్చుండుటకు అనుకూల ముండదు కనుకనే గీతలో ''చేలాజిన కుశోత్తరం'' అని తెలుపబడెను కారణము మొదట దర్భాసనము, దానిపై కృష్ణాజినము గాని, వ్యాఘ్రాజినము గాని, దానిపై వస్త్రాసనమున్ను ఉండవలయునని విధించడమైనది కృష్ణాజినవ్యాఘ్రాజినాదులంత యవసరము లేదు అవి అహింసావ్రతమునకు దూరములు. దర్భాసనముపై దళమైన వస్త్రాసనముండిన చాలును

శబ్దాక్షరం పరం బ్రహ్మ తస్మిన్ క్షీణే యదక్షరమ్ ।
తద్విద్వానక్షరం ధ్యాయేద్యదిచ్ఛేచ్ఛాన్తిమాత్మనః ॥

ఓంకారశబ్దము పరబ్రహ్మము ఆశబ్దము లీనమయిన పిమ్మట ఏఅక్షర స్వరూపమగు పరబ్రహ్మము మిగులు చుండునో అట్టి పరబ్రహ్మమునే బ్రహ్మనిష్ఠుడు ధ్యానించవలయును ప్రకృతి శమించిన పరమశాన్తిని పొందగోరువాడు ఈలాగుననే ప్రణవధ్యానము జేయవలయును అట్టివానికే పరమశాన్తి గలుగును

స్వతస్సిద్ధమిదం మన్త్రం స్వయం ప్రోక్తం స్వయంభువా ।
ఓమిత్యేతత్స్వరూపాన్తం సాధ్యతామేవ సర్వదా ॥

ఈ ఓంకారముయొక్క ధ్యానప్రభావము చేతనే విష్ణువు విష్ణుత్వమును, బ్రహ్మ బ్రహ్మత్వమును, శివుడు శివత్వమునున్ను పొందిరి అనగా విష్ణువునకు పాలన శక్తియు, బ్రహ్మదేవునకు సృష్టిశక్తియు, శివునకు లయింపజేయు శక్తియు గలిగినవి ఇందువలన ఓంకారముయొక్క ప్రభావము ఎట్టిదియో తెలియదగినది

గాయత్రీ వేదమాతా స్యాన్మహావాక్యం పితా భవేత్ ।
ఓంకార స్సర్వమూలం స్యాత్స ఏవ చ పితామహః ॥

గాయత్రీ మన్త్రము వేదములకు తల్లిగాను, మహా వాక్యము తండ్రిగాను, అన్నిటికి మూలరూపమగునది ఓంకారముగాను గ్రహించుకొన వలయును అట్టి ప్రణవమునే పితామహునిగా నెఱుంగవలయును

అవ ॥ పరమాత్మయొక్క తురీయమైన చతుర్థపాదము వర్ణింపబడుచున్నది -

మన్త్రము ॥ నాన్తఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం, న ప్రజ్ఞం, నాప్రజ్ఞం, అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్యమలక్షణ మచిన్త్యమవ్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం, ప్రపఞ్చోపశమం శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః ॥ ౭

పద ॥ న - అన్తః ప్రజ్ఞం - న - బహిఃప్రజ్ఞం - న - ఉభయతః ప్రజ్ఞం - న -

ప్రజ్ఞానఘనం - న ప్రజ్ఞం - న - అప్రజ్ఞం - అదృష్టం - అవ్యవహార్యం- అగ్రాహ్యం - అలక్షణం - అచిన్త్యం - అవ్యపదేశ్యం - ఏకాత్మప్రత్యయసారం- ప్రపఞ్చోపశమం - శాన్తం - శివం - అద్వైతం - చతుర్థం - మన్యన్తే - సః - ఆత్మా - సః - విజ్ఞేయః

టీక ॥ అన్తః ప్రజ్ఞం = అన్తః = లోపలనుండెడి, ప్రజ్ఞం = స్వప్నజ్ఞాన మున్ను, న = కాదు బహిఃప్రజ్ఞం = బహిః = వెలుపల నుండెడి, ప్రజ్ఞం = జాగ్రత్తయొక్క జ్ఞానమున్ను, న = కాదు, ఉభయతః ప్రజ్ఞం = ఉభయతః = జాగ్రత్స్వప్నముల మధ్యనైన, ప్రజ్ఞం = జ్ఞానమున్ను, న = కాదు, ప్రజ్ఞానఘనం= సుషుప్తిజ్ఞానమున్ను న = కాదు, ప్రజ్ఞం= విషయజ్ఞానమున్ను, న = కాదు, అప్రజ్ఞం = అజ్ఞానమున్ను, న = కాదు అదృష్టం = చూడబడనిదియును, అవ్యవహార్యం = వాక్కుచే చెప్పుటకలవిగానిదియును, అగ్రాహ్యం = హస్తాది కర్మేన్ద్రియములచే గ్రహించుటకలవి గానిదియును, అవ్యవహార్యం = వాక్కుచే చెప్పుటకలవిగానిదియును, అలక్షణం = గుఱుతు లేనిదియును, అచిన్త్యం= మనస్సుచే తలంచుటకశక్యమయినదియును ,అవ్యపదేశ్యం = ఇట్టిదని నిర్దేశింపశక్యము గానిదియును, ఏకాత్మ ప్రత్యయసారం - ఏకాత్మ = ఒకటేయయిన ఆత్మయొక్క, ప్రత్య య = జ్ఞానము లేక సత్తయే, సారం = ప్రమాణముగా గలదియును, ప్రపఞ్చోపశమం = ప్రపంచ = ప్రపంచము యొక్క, ఉపశమం = శాన్తి గలదియును, శాన్తం = రాగద్వేషాది దోషరహితమయినదియును, శివం = పరిశుద్ధమయినదియు నయిన, అద్వైతం = భేదములేని అద్వైతతత్త్వమునే, చతుర్థం = తురీయమునుగా, మన్యన్తే = తలంచుచున్నారు, సః = అది, ఆత్మా = పరమాత్మస్వరూపము, సః = ఆ పరమాత్మ స్వరూపము, విజ్ఞేయః = తెలిసికొనదగినది

తా॥ ఆత్మయొక్క చతుర్థపాదము వర్ణింపబడుచున్నది ఇయ్యది తురీయమనబడును ఇది అన్తఃప్రజ్ఞాస్వరూపమయిన స్వప్నజ్ఞానముగలది కాదు బహిః ప్రజ్ఞాస్వరూపమయిన శబ్దాది విషయక జ్ఞానము గలదియును కాదు జాగ్రత్స్వప్నముల యొక్క అన్తరాళావస్థయును కాదు ప్రజ్ఞాన ఘనస్వరూపమయిన సుషుప్త్యవస్థాజ్ఞానము కాదు విషయజ్ఞానము కాదు అచేతన ధర్మమగు అ ప్రజ్ఞయు కాదు తనను గాంచునది లేనందుచే నది అదృష్టము

కనుకనే అది అవ్యవహార్యము కరచర ణాదీంద్రియములచే గ్రహింప శక్యము కానిదగుటచే నది అగ్రాహ్యము గుణుతులు లేనిదగుటచే నది అలక్షణము మనో బుద్ధుల కతీత మగుటచే నది అచిన్త్యము, అవ్యపదేశ్యమున్నైనది జాగ్రదాద్యవస్థలయందలి ఆత్మ యొక్కటియే అనెడి అద్వితీయజ్ఞానము పొందదగినది జాగ్రదాదిధర్మములు లేనిది అనగా సకలప్రపంచోపశమరూపమైనది కనుకనే అది శాంతము అనగా రాగ ద్వేషాదులు లేనిది శివమైనది అనగా పరిశుద్ధము నయినది, అద్వయస్వరూపమైనది ఇదియే పరమాత్మయొక్క నాల్గవపాదము తురీయము అదియే పరమాత్మ స్వరూపము అదియే తెలియదగినది

అత్రైతే శ్లోకా భవన్తి

శ్లో ॥ నివృత్తేస్సర్వదుఃఖానామీశానః ప్రభురవ్యయః ।
అద్వైతస్సర్వభావానాం దేవస్తుర్యో విభుస్స్మృతః ॥ 10

అత్ర - ఏతే - శ్లోకాః - భవన్తి

పద ॥ నివృత్తేః - సర్వదుఃఖానాం - ఈశానః - ప్రభుః - అవ్యయః - అద్వైతః - సత్యభావానాం - దేవః - తుర్యః - విభుః - స్మృతః

అత్ర = దీనియందు, ఏతే = ఈ, శ్లోకాః= శ్లోకములు (గౌడపాదీయ కారికలు), భవన్తి = అగుచున్నవి

టీక ॥ సర్వదుఃఖానాం - సర్వ = సమస్తములైన, దుఃఖానాం = దుఃఖముల యొక్క (విశ్వతైజస ప్రాజ్ఞ లక్షణములయిన సమస్త దుఃఖముల యొక్క), నివృత్తేః= నివృత్తివలన (తురీయుడే), ఈశానః - ఈశానుడు, ప్రభుః = స్వామి (అతడు), అవ్యయః = నాశము లేనివాడు, (మఱియు) తుర్యః = చతుర్థపాద స్వరూపమగు తురీయాత్మ, సర్వభావానాం = సమస్త పదార్థములయొక్క, అద్వైతః= అద్వైత స్వరూపముగను, దేవః = స్వయంప్రకాశముగను, విభుః= సర్వవ్యాపిగను, స్మృతః = చెప్పబడెను

తా॥ జాగ్రదాది సర్వధర్మములు రజ్జుసర్పములవలెనే మిధ్యయగును విశ్వతైజస ప్రాజ్ఞ లక్షణములగు సకల దుఃఖముల నివృత్తివలన (నశించుటచే)

ఆ చతుర్థపాద స్వరూపుడైన తురీయుడే సర్వనియామకుడగు ఈశానుడు ప్రభువు, అవ్యయుడు, అతడే సర్వభావములకును నద్వైతస్వరూపుడును, స్వయంప్రకాశుడు, సర్వవ్యాపకుడునని చెప్పబడుచున్నాడు

దీపిక ॥ స ఆత్మా స చ విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।
తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన ॥

తురీయమగు, ఆ ఆత్మ స్వరూపమునే ముముక్షువు లందఱు తెలిసికొనవలయును అట్టి తురీయాత్మ జ్ఞానము లేని వారికి ఎప్పటికిని మోక్షము గలుగదు

శ్లో ॥ కార్యకారణబద్ధౌ తావిష్యేతే విశ్వతైజసౌ ।
ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌ తౌ తుర్యే న సిద్ధ్యతః ॥ 11

పద ॥ కార్యకారణబద్ధౌ - తౌ - ఇష్యేతే - విశ్వతై జసౌ - ప్రాజ్ఞః - కారణ బద్ధః - తు - ద్వౌ - తౌ - తుర్యే - న - సిద్ధ్యతః

టీక ॥ తౌ = ఆప్రసిద్ధులగు, విశ్వతైజసౌ = విశ్వతైజసులిద్దఱును, కార్యకారణబద్ధౌ= కార్యకారణములచే బద్ధులయినవారుగా, ఇష్యేతే= స్మృతులగుచున్నారు ప్రాజ్ఞస్తు = ప్రాజ్ఞుడయితే, కారణబద్ధః - కారణ = బీజభావముచేతనే, బద్ధః= బద్ధుడైనవాడు, తుర్యే = నాలుగవపాదమగు తురీయమునందు, తౌ ద్వౌ = ఆ బీజభావఫలభావములు ( కార్యకారణములు రెండును), న సిద్ధ్యతః= సిద్ధింపవు

తా॥ జాగ్రత్స్వప్నములందలి ఆవిశ్వతైజసు లిద్దఱును ఫలభావ బీజభావముల రెంటిచే బద్ధులయియున్నారు ( నిజమును గ్రహింపకపోవుట బీజభావమనబడును అట్లు నిజమును గ్రహింపక పోవుటచేతనే దానిని మఱియొక విధముగా గ్రహించుట ఫలభావమనబడును) సుషుప్తియందలి ప్రాజ్ఞుడు బీజ భావమొక్క దానిచేతనే బద్ధుడయియున్నాడు తురీయము నందు పూర్వము జెప్పిన విశ్వతైజస ప్రాజ్ఞులకు నిమిత్తములయిన బీజభావ ఫలభావములు రెండును గలుగనేరవు కనుక చతుర్థపాదము ( తురీయము) జాగ్రదాద్యవస్థలయందలి రజ్జుసర్పస్థానికమగు విశ్వాదిసర్వభేదజాతములేనిదై వాస్తవిక మయిన

రజ్జుస్థానికమగు నద్వితీయమై స్వయంప్రకాశమగు పరిపూర్ణమయిన ఆత్మమాత్రమే అయియున్నది

శ్లో ॥ నాత్మానం న పరాంశ్చైవ న సత్యం నాపి చానృతమ్ ।
ప్రాజ్ఞః కించ న సంవేత్తి తుర్యం తత్సర్వదృక్సదా ॥ 12

పద ॥ న - ఆత్మానం - న - అపరాన్ - చ - ఏవ - న - సత్యం - న - అపి- చ - అనృతం - ప్రాజ్ఞః - కిం - చ - న - సంవేత్తి - తుర్యం - తత్ - సర్వదృక్ - సదా

టీక ॥ ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడు, ఆత్మానం = తనను, న - సంవేత్తి = తెలిసికొనుట లేదు పరాన్-చ = తన కన్యమైన వానిని, న = తెలిసికొనుటలేదు సత్యం = ఘటాదికమును, న = తెలిసికొనుటలేదు, అనృతం = శుక్తిరజతాదికమును, న = తెలిసిగొనుటలేదు, కిం చ = ఏమియును, న సంవేత్తి = తెలిసికొనుటలేదు, తత్ = ఆ, తుర్యం = నాలుగవ పాదమగు తురీయాత్మ, సదా = ఎల్లప్పుడు, సర్వదృక్ = సమస్తమైన దృక్స్వరూపమయినది

తా॥ ప్రాజ్ఞునకు కారణబద్ధత్వమెట్లనిన - ఈప్రాజ్ఞుడు తన్నుగాని, ఇతరములనుగాని, సత్యముగాని, అసత్యముగాని యేమియు తెలిసికొనకుండుటచేత నిజమును తెలిసికొనక పోవుటనెడు అజ్ఞానము చేత మాత్రమే బద్ధుడయియున్నాడు ఇట్లు నిజమును తెలిసికొనకపోవుటచే గలిగెడు మఱియొక విధముగా గ్రహించుటయే (అన్యధా భావమే) రూపముగా గల ద్వైతము చేత జాగ్రత్స్వప్నములయందలి విశ్వతైజసులు బద్ధులైనటుల బద్ధుడు గాడు ఒక త్రాటిని జూచి 'ఇది త్రాడు' అనెడు జ్ఞానము లేకపోవుట చేత దానియందు ఏవిధమయిన జ్ఞానము (అన్యధా భావము) లేక ఊరకనుండువాని వంటివాడు ప్రాజ్ఞుడు, త్రాటి యొక్క జ్ఞానము లేకపోవుటచేత తదితరమయిన సర్పమను జ్ఞానము (భ్రాంతి) గల జనునివంటివారలు విశ్వతైజసులు, చతుర్థపాద స్వరూపమయిన తురీయాత్మ యెల్లప్పుడును దృక్స్వరూపమై సర్వమును చూచుచున్నది సర్వమును చూచెడి దృక్ అదే యగుటచేత దానిని చూచెడి వేరు దృక్కేదియును లేదు కనుక అదియే సర్వమునకు దృక్కు అయినది

శ్లో ॥ ద్వైతస్యాగ్రహణం తుల్యముభయోః ప్రాజ్ఞతుర్యయోః ।
బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే న విద్యతే ॥ 13

పద ॥ ద్వైతస్య - అగ్రహణం - తుల్యం - ఉభయోః - ప్రాజ్ఞతుర్యయోః- బీజనిద్రాయుతః - ప్రాజ్ఞః - సా - చ - తుర్యే - న - విద్యతే

టీక ॥ ఉభయోః - ఇద్దఱయిన, ప్రాజ్ఞతుర్యయోః = ప్రాజ్ఞతుర్యాత్మలకు, ద్వైతస్య= ద్వైతవుయొుక్క అగ్రహణం = తెలిసికొనకపోవుట, తుల్యం = సమానమైనది ప్రాజ్ఞ = ప్రాజ్ఞుడు బీజనిద్రాయుతః = బీజనిద్రా = కారణరూపమయిన నిద్రతో, (నిజమును తెలిసికొనక పోవుట నిద్ర యనబడును అట్టి పరమాత్మతత్త్వమును తెలిసికొనక పోవుట యను నిద్రయే ఈ జాగ్రత్స్వప్నముల యందలి ద్వైత రూపమయిన ప్రపంచమును పుట్టించుటకు బీజమయినది గాన బీజనిద్ర యనబడును), యుతః = కూడుకొని యున్నవాడు, సా= ఆ బీజనిద్ర తుర్యే = చతుర్థపాదాత్మయందు, న విద్యతే = లేదు

తా॥ ప్రాజ్ఞతుర్యాత్మ లిద్దఱికిని జాగ్రత్స్వప్నముల యందలి ద్వైతప్రపంచమును గ్రహింపకపోవుట సమానముగా నున్నది ఆరెంటిలో ప్రాజ్ఞాత్మ ద్వైతరూపమయిన జాగ్రత్స్వప్నప్రపంచముల పుట్టుకకు బీజభూతమైన తత్త్వాగ్రహణమనెడి నిద్రతో గూడియున్నది తురీయాత్మ అట్టి నిద్ర లేనిదై ఎల్లప్పుడు అద్వయమై సర్వదృక్కై స్వయంప్రకాశముగా నున్నది

శ్లో ॥ స్వప్న నిద్రాయుతావాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్న నిద్రయా ।
న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యన్తి నిశ్చితాః ॥ 14

పద ॥ స్వప్ననిద్రాయుతౌ - ఆద్యౌ - ప్రాజ్ఞః - తు - అస్వప్ననిద్రయా - న - నిద్రాం - న - ఏవ - చ - స్వప్నం - తుర్యే - పశ్యన్తి - నిశ్చితాః

టీక ॥ ఆద్యౌ = మొదటి విశ్వతైజసు లిద్దఱును, స్వప్ననిద్రాయుతౌ = స్వప్ననిద్రా= స్వప్ననిద్రలతో (ఒక వస్తువును మఱియొుక వస్తువు నుగా తెలిసికొనుట స్వప్నమనబడును ఒక వస్తువును జూచి దానిని తెలిసికొనకపోవుటయే నిద్ర యనబడును), యుతౌ = కూడుకొనిన వారలు, ప్రాజ్ఞః తు = ప్రాజ్ఞుడైతే

అస్వప్ననిద్రయా- అస్వప్న = స్వప్నములేని, నిద్రయా = నిద్రతో, (యుతః= కూడుకొనినవాడు), నిశ్చితాః = పరబ్రహ్మస్వరూపమును నిశ్చయించుకొనియున్న బ్రహ్మవేత్తలు, తుర్యే= తుర్యమునందు (చతుర్థపాదమునందు) నిద్రాం = నిద్రను, న పశ్యన్తి = చూడరు, స్వప్నం - చ = స్వప్నమునున్ను, నైవ - పశ్యన్తి = చూడరు

తా॥ జాగ్రత్స్వప్నములయందలి విశ్వతైజసు లిద్దఱును అన్యధా గ్రహణ తత్త్వాగ్రహణములతో ( ఒక వస్తువును వేరుగా గ్రహించుట అన్యధా గ్రహణము, ఒక వస్తువును తెలియకుండుట తత్త్వాగ్రహణము ఇవియే స్వప్ననిద్రలు) కూడుకొని కార్యకారణబద్ధులై ద్వైతప్రపంచమును చూచుచున్నారు సుషుప్తియందలి ప్రాజ్ఞుడు అన్యధా గ్రహణరూపమయిన స్వప్నములేని కేవల తత్త్వాగ్రహణరూప నిద్రతో కూడుకొని ద్వైతరూపమును దేనిని తెలియనివాడై కారణము చేత బద్ధుడగుచున్నాడు బ్రహ్మవేత్తలు చతుర్థ పాదాత్మకమగు తుర్యాత్మయందు తత్త్వాగ్రహణరూపమయిన నిద్రనున్ను , అన్యధా గ్రహణరూపమయిన స్వప్నమునున్ను దేనినిన్ని చూచుట లేదు కనుకనే చతుర్థపాదాత్మకమగు ఆత్మ దేనిచేతనున్ను బంధింపబడక అద్వితీయమై స్వయంప్రకాశము, పరమానందముగా నున్నది

శ్లో ॥ **అన్యధా గృహ్ణతస్స్వప్నో నిద్రా తత్త్వమజానతః ।**
**విపర్యాసే తయోః క్షీణే తురీయం పదమశ్నుతే ॥** **15**

పద ॥ అన్యధా - గృహ్ణతః - స్వప్నః - నిద్రా - తత్త్వం - అజానతః - విపర్యాసే - తయోః - క్షీణే - తురీయం - పదం - అశ్నుతే

టీక ॥ అన్యధా = మఱియొక విధముగా, గృహ్ణతః = గ్రహించుటవలన, స్వప్నః = స్వప్నము, (భవతి = అగుచున్నది), తత్త్వం = నిజమును, అజానతః = తెలియకపోవుటవలన, నిద్రా = నిద్రయున్ను, (భవతి= అగుచున్నది), తయోః = ఆస్వప్ననిద్రలయొక్క, విపర్యాసే = వ్యత్యయము (కార్యకారణములయిన అన్యధా గ్రహణ తత్త్వాగ్రహణరూపమయిన విపర్యాసము), క్షీణే-సతి = నశించగా, (జీవః = జీవుడు), తురీయం=చతుర్థ పాదాత్మకమగు, పదం = స్థానమును, అశ్నుతే = పొందుచున్నాడు

తా॥ ఇట్టి తురీయమగు ఆత్మ యెప్పుడు పొందబడునో చెప్పబడుచున్నది నిజమును (పరమార్థమును) వేఱువిధముగా గ్రహించుట (అన్యధా గ్రహణము) స్వప్నమనబడును నిజమును (తత్త్వమును) తెలియక పోవుట నిద్ర యగును ఇటువంటి స్వప్ననిద్రలు రెంటిచేతను బద్ధులయినవారు విశ్వతైజసులు, కేవల నిద్రచేత బద్ధుడయినవాడు ప్రాజ్ఞుడు ఇట్లు అన్యధా గ్రహణ తత్త్వాగ్రహణరూపములయిన స్వప్ననిద్రలచేత జాగ్రత్స్వప్న సుషుప్తులయందలి విశ్వతైజసప్రాజ్ఞులు ముగ్గురున్ను బద్ధులై నిజము తెలియక యున్నారు ఈ ప్రకారము వారి బద్ధత్వమునకు కారణములయిన అన్యధాగ్రహణతత్త్వాగ్రహణ రూపములైన స్వప్ననిద్రల రెంటియొక్క విపర్యాసము ఎప్పుడు నశించునో, అప్పుడే దేనిచేతను బద్ధత్వమును పొందక అద్వితీయమై, స్వయంప్రకాశమై యొప్పు ఆ చతుర్థపాదాత్మకమగు తురీయాత్మ నిశ్చితమై శేషించుచున్నది పొందబడుచున్నది

శ్లో॥ అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।
అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా ॥ 16

పద॥ అనాదిమాయా - సుప్తః - యదా - జీవః - ప్రబుధ్యతే - అజం - అనిద్రం- అస్వప్నం - అద్వైతం - బుధ్యతే - తదా

టీక॥ అనాదిమాయయా - అనాది = ఆదిలేని , మాయయా = మాయచేత, సుప్తః- నిద్రించువాడగు, జీవః = జీవుడు, యదా = యెప్పుడు, ప్రబుధ్యతే= మేలుకొనుచున్నాడో, తదా = అప్పుడు, అజం = పుట్టుకలేనిదియును, అనిద్రం= నిద్రలేనిదియును, అస్వప్నం = స్వప్నములేనిదియునగు, అద్వైతం= అద్వయ స్వరూపమగు తుర్యమును, బుధ్యతే = తెలిసి కొనుచున్నాడు

తా॥ తత్త్వాగ్రహణరూపమయిన బీజాత్మకమగు నిద్ర చేతను, అన్యధా గ్రహణలక్షణమై అనాదికాలప్రవృత్తమును, మాయా లక్షణమునగు స్వప్నముచేతను జాగ్రత్స్వప్నముల రెంటియందును సర్వమును చూచుచున్న యీ జీవుడు ఎప్పుడు ఈ మాయారూపమయిన నిద్రనుండి మేలుకొనుచున్నాడో, అప్పుడే తత్త్వాగ్రహణరూపమయిన నిద్రయున్ను, అన్యధా గ్రహణరూపమయిన

స్వప్నమున్ను నివృత్తమగుచున్నది ఇవి లేకపోవుటచేతనే జన్మాదులు లేని అద్వయస్వరూపమయిన స్వయం ప్రకాశమగు తుర్యాత్మను తెలిసికొనుచున్నాడు

శ్లో ॥ ప్రపఞ్చో యది విద్యేత నివర్తేత న సంశయః ।
మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః ॥ 17

పద ॥ ప్రపంచః - యది - విద్యేత - నివర్తేత - న - సంశయః - మాయా మాత్రం- ఇదం - ద్వైతం - అద్వైతం - పరమార్థతః

టీక ॥ ప్రపఞ్చః = ప్రపంచము, విద్యేత యది = ఉండెనేని, నివర్తేత = పోవును, న సంశయః = సంశయము లేదు, ఇదం = ఈ ప్రపంచమను పేరుగల, ద్వైతం= ద్వైతము, మాయామాత్రం = మాయా స్వరూపమయినది, పరమార్థతః= యధార్థముగా ( జూచిన) అద్వైతం = అద్వైతము, ( భవతి = అగుచున్నది )

తా॥ ప్రపంచమను పేరుగల యీ ద్వైతమున్న యెడల దానికి కారణములగు తత్త్వాగ్రహణ అన్యధా గ్రహణముల యొక్క నాశనముచేతనే రజ్జువునందలి సర్పభ్రమవలె నది నశించుచున్నది ఈ ద్వైతము రజ్జు సర్పమువలెను, ఇంద్ర జాలికుని మాయవలెను, కేవలము మాయారూపమై యున్నది యధార్థముగా నాలోచించిన నిది యంతయు అద్వయస్వరూప మగు పరమాత్మగానే యున్నది

శ్లో ॥ వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్ ।
ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే ॥ 18

పద ॥ వికల్పః - వినివర్తేత - కల్పితః - యది - కేనచిత్ - ఉపదేశాత్ - అయం- వాదః - జ్ఞాతే - ద్వైతం - న - విద్యతే

టీక ॥ కేనచిత్ = ఒకానొకనిచేత, వికల్పః = ప్రపంచాది భ్రాన్తి, కల్పితోయది= కల్పింపబడెనేని, వినివర్తేత = పోవును ఉపదేశాత్ = గురూపదేశము వలన, అయం = ఈ, వాదః = ( భేద) వాదము, జ్ఞాతే = పరమార్థజ్ఞానము తెలియబడగా, ద్వైతం = ద్వైతము, న విద్యతే = లేదు

తా॥ ఎవనిచేతనైనను ప్రపంచాది భ్రాన్తిరూపమగు ద్వైతము కల్పితమయిన దాయెంనేని రజ్జువునందలి సర్పాదిభ్రమ వలెనే యథార్థజ్ఞానముచే నివర్తించిపోవుచున్నది గురూపదేశమువలన అద్వైతాత్మజ్ఞానము గలుగగానే జీవేశ్వరభిన్న వాదము (ద్వైతము) నివర్తించును సర్వము అద్వయస్వరూప మగు పరిపూర్ణమయిన ఆత్మగానే భాసించును ద్వైతముండనే యుండదు

ద్వితీయ ఖండః సమాప్తః

ద్వితీయఖండము సమాప్తము

దీపిక ॥ ఈ ఉపదేశతత్త్వమునే శ్రీకృష్ణభగవానుడు గీత చతుర్థాధ్యాయమున తెలిపెను

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥**

తత్త్వవేత్తలయిన ఆత్మజ్ఞానులు నీకొఱకు జ్ఞానము నుపదేశింప గలరు అట్టి జ్ఞానముపదేశించుట కేలాగున నుండవలయునో క్రింద నిరూపింప బడుచున్నది వినయముతో చేయు నమస్కారముచేతను, సమయమును కనిపెట్టి అడుగుటచేతను, గుర్వాజ్ఞను పాలించుటచేతను వారు చెప్పగలరు ఈశ్లోకమందు గురులక్షణమున్ను, శిష్యలక్షణమున్ను తెలుపబడినది ''జ్ఞానినః - తత్త్వదర్శినః'' అనునది గురువు లక్షణము ''ప్రణిపాతము, పరిప్రశ్న, సేవ'' ఈ మూడున్ను శిష్యలక్షణములు చతుర్థపాదమెటుల సిద్ధించునో, అది యీ ద్వితీయా ధ్యాయమున నిరూపింపబడెను

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

సాధకుడు ప్రకృతికి పరమగు బ్రహ్మపదమును ఎందువలన పొందలేదో ఆ కారణము ఈ శ్లోకములో తెలుపబడినది

సాధకుని మనస్సెంతవఱకు ప్రాకృతవిషయమనెడు మాలిన్యమును దాటలేదో, అనగా ప్రకృతికి పరమగు తురీయపదమును పొందలేదో, అంతవఱకు నతడు బద్ధుడే ఎప్పుడు ప్రకృతివాసన నశించి నిర్విషయస్థితి గలుగునో, అప్పుడే యిదివఱలో

గురువుల వలన లేక శాస్త్రములవలన శ్రవణము జేసిన దానియొక్క అర్థము బోధపడును అప్పుడీజ్ఞానస్థితికన్న అన్యముగా మఱియొకటి వినవలసినది లేదని బోధ గలుగును ఈ మాండూక్యమున జెప్పిన ఆత్మయొక్క సుషుప్తిప్రబోధమును గుఱించి భగవానుడు తెలిపినది చూడుడు

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

ఆత్మజ్ఞానికి ఏది పగలుగా నుండునో, అజ్ఞానికది రాత్రిగా నుండును అజ్ఞానికినేది పగలుగా నుండునో, అది ఆత్మజ్ఞానికి రాత్రిగా నుండును అనగా అజ్ఞానికేది సత్యముగా తోచునో, జ్ఞానికది అసత్యముగా భాసించును జ్ఞానికేది సత్యముగా తోచునో, అజ్ఞానికది అసత్యముగానే తోచును శ్రీశంకరభగవత్పాదులు జాగ్రత్స్వప్న సుషుప్తితురీయముల గుఱించి ఒకశ్లోకమున నిరూపించియున్నారు దాని నొకదానిని నిరన్తరము పఠనము జేసిన చాలు

జాగ్రత్యుద్భూత బాహ్యేన్ద్రియ
విషయ సముల్లాససాక్షీ శివోఽహం
స్వప్నే దృష్టప్రపంచ ప్రతిఫలన
మనోవృత్తి సాక్షీ శివోఽహమ్ ।
సుప్తౌ చిత్తే ప్రలీనే ప్రబలతమ మహా
మోహసాక్షీ శివోఽహం
నిత్యానందే తురీయే విగత కలిమల
స్సర్వసాక్షీ శివోఽహమ్ ॥

జాగ్రదవస్థయందు జనించిన బాహ్యేన్ద్రియ విషయ సముదాయమునకు సాక్షి యయినట్టి శివస్వరూపుడగు పరమాత్మను నేను మఱియు స్వప్నమందు గాంచబడిన ప్రపంచ ప్రతిఫలనరూపములగు మనోవృత్తులకు సాక్షియయిన శివస్వరూపుడను నేను సుషుప్తియందు చిత్తము లయింప ప్రబలతమమగు మహాఅజ్ఞానమునకు సాక్షియయిన శివస్వరూపుడగు పరమాత్మను నేను మఱియు నిత్యానందమునకు నెలవగు తురీయమందు మాయాదోషరహితుడై సర్వసాక్షియై వెలుగు శివస్వరూపుడగు ఆత్మయే నేను మఱియు ఆత్మబోధమున తెలిపినది చూడుడు

సంసారస్స్వప్న తుల్యో హి రాగద్వేషాది సంకులః ।
స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేఽసత్యవద్భవేత్ ॥

ఎంతకాలమువఱకు నిద్రావస్థ జనునిచే ననుభవింపబడుచున్నదో, అంతవఱకు మిక్కిలి అసత్యమయినను స్వప్నము సత్యముగనే కనబడుచున్నది నిద్రనుండి జాగ్రద్దశకు వచ్చిన పిమ్మట అసత్యముగా దోచును అలాగే రాగద్వేషపూర్ణమగు సంసారమున్ను తనకు కారణభూతమయిన అజ్ఞానదశ యుండువఱకు సత్యమయినదిగాను, జ్ఞానోదయమయిన పిమ్మట అసత్యముగాను అగుచున్నది

ప్రణవాదపరం జప్త్వా కదా ముక్తో భవిష్యతి ।
ఓంకారస్సర్వమన్త్రాణా ముత్తమః పరికీర్తితః ॥
ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి ॥

ప్రణవమున కన్యమైన మన్త్రమును జపించిన ఎప్పుడు ముక్తి గల్గును? కలుగ నేరదని భావము ఓంకారము సర్వమన్త్రములలో నుత్తమమయినదని మహర్షులు కీర్తించుచున్నారు వేదములున్ను ఆలాగుననే స్తోత్రము జేయుచున్నవి సముద్రమును దాటుటకు ఓడ యెటువంటిదో, ఆలాగున సంసార దుఃఖసాగరమును తరింపజేయుటలో ఓంకారమనెడు నావకు సమానమైనది మఱియొకటి లేదు

తారకశబ్దార్థము - అధర్వశిఖోపనిషత్

మూ ॥ దేవాశ్చేతి సన్దత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్యః
*సంతారయతీతి తారణాత్తారః ॥*

తా ॥ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలును ప్రణవ స్వరూపమే సమస్తదుఃఖములనుండియు, సకల భయముల నుండియు తరింపజేయునదిగా నుండుటంబట్టి తారణమనంబడును తారణము చేయుటవలన తారక మనబడును

ద్వితీయఖండ - దీపిక సమాప్తము

# మాణ్డూక్యోపనిషత్

## తృతీయఖండః - మూడవ ఖండము

అవ ॥ వాచ్యవాచకవములగు పరవమాత్మ ప్రణవవము లొకటే యని తెలియజేయుటకై ఆత్మయొక్క పాదములు, ఓంకారముయొక్క అకారాది మాత్రలు రెండును ఒకటియే వేఱు కాదని రెంటికిని అభేదము నిరూపింపబడుచున్నది

మం ॥ సోఽయమాత్మాఽధ్యక్షరమోంకారోఽధిమాత్రం పాదా
మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి । ౮

పద ॥ సః - అయం - ఆత్మా - అధ్యక్షరం - ఓంకారః - అధిమాత్రం - పాదాః - మాత్రాః - మాత్రాః - చ - పాదాః - అకారః - ఉకారః - మకారః - ఇతి

టీక ॥ సః = ఆ పూర్వోక్తమయిన, అయం = ఈ, ఆత్మా = పరమాత్మ, అధ్యక్షరం= అక్షరమును పొందియున్నది (అక్షరమనగా వర్ణము, ఆవర్ణమేది యనిన ఓంకారము), ఓంకారః = ప్రణవము, ఆధిమాత్రం = మాత్రలను పొందియున్నది, పాదాః = ఆత్మయొక్క పాదములు, మాత్రాః = ఆ ఓంకారముయొక్క మాత్రలు, అకారః= అవర్ణము, ఉకారః = ఉవర్ణము, మకారః = మవర్ణము ఇతి = అనునట్టి మాత్రాః = ఆ ఓంకారముయొక్క మాత్రలు, పాదాః = ఆత్మయొక్క పాదములు

తా॥ పూర్వము నాలుగు పాదములుగా జెప్పబడిన పరమాత్మ ఓంకారమను అక్షరమును పొందియున్నది ఆ ఓంకారమను అక్షరము అకార, ఉకార మకారములనెడి మాత్రలను పొందియున్నది కనుక ఆపరమాత్మయొక్క పాదములు ఓంకారముయొక్క అకారాది మాత్రలుగాను, ఈ అకారాది మాత్రలు ఆత్మ యొక్క పాదములుగాను ఎఱుంగవలయును

అవ ॥ పరమాత్మయొక్క ప్రధమపాదమగు వైశ్వానరునికి, ఓంకారముయొక్క ప్రధమమాత్రయగు అకారమునకును ఆప్తిత్వ- ఆదిమత్వ సామ్యము తద్విజ్ఞానఫలము వర్ణింపబడుచున్నది

మం ॥ జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రాఽఽ
ప్తేరాదిమత్త్వాద్వాఽఽప్నోతి హ వై సర్వాన్ కామానాదిశ్చ
భవతి య ఏవం వేద ॥ ౯

పద ॥ జాగరితస్థానః - వైశ్వానరః - అకారః - ప్రథమా - మాత్రా - ఆప్తేః - ఆదిమత్త్వాత్ - వా - ఆప్నోతి - హ - వై - సర్వాన్ - కామాన్- ఆదిః - చ- భవతి - యః - ఏవం - వేద

టీక ॥ జాగరితస్థానః = జాగ్రదవస్థయే స్థానముగా గల, వైశ్వానరః= వైశ్వానరుడు, ఆప్తేః = వ్యాప్తివలన, ఆదిమత్త్వాత్ వా = ఆదియగుట వలననున్ను, (ఓంకారస్య = ప్రణవముయొక్క, ప్రథమా మాత్రా-మొదటి మాత్రయగు, అకారః = అవర్ణము, (భవతి = అగుచున్నాడు), యః = ఎవడు, ఏవం = ఈప్రకారముగా, వేద = తెలిసికొనెనో, (సః = వాడు), సర్వాన్ = సమస్తములయిన, కామాన్ = కోరికలను, హవై = ప్రసిద్ధముగా (నిశ్చయముగా), ఆప్నోతి = పొందుచున్నాడు, (మహతాం = మహాత్ములలో), ఆదిశ్చ = మొదటివాడుగను, భవతి = అగుచున్నాడు

తా॥ జాగ్రదవస్థయందుండి స్థూలశరీరాభిమాని యగు ఆత్మయొక్క ప్రథమపాదమయిన వైశ్వానరుడు, ఓంకారము యొక్క మొదటిమాత్ర యగు అకారము సర్వవాక్కులయందును వ్యాపించి అన్నిటికిని మొదటిది యయినట్లు సర్వము నందు వ్యాప్తుడై సర్వమునకు మొదటివాడగుటవలన ఆ ఆకారమాత్రగానే యున్నాడు ఇట్లు ఈ ఓంకార ప్రథమమాత్రయగు అకారమును వైశ్వానరుని ఈ రెంటిని ఒకటిగానే తెలిసికొనెడివాడు సమస్త అభీష్టములను పొంది మహాత్ములలో మొదటివా డగుచున్నాడు

అవ ॥ అట్లే ద్వితీయపాదమగు తైజసునికిని, రెండవమాత్రయగు ఉకారమునకును ఉత్కర్ష ఉభయత్వ రూప సామ్యము - తద్విజ్ఞానఫలము నిరూపింపబడుచున్నది

మం ॥ స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయా మాత్రోత్కర్షాదుభయ

త్వాదా్వ ఉత్కర్షతి హ వై జ్ఞానసన్తతిం సమానశ్చ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి య ఏవం వేద ॥ ౧౦

పద ॥ స్వప్నస్థానః - తైజసః - ఉకారః - ద్వితీయా - మాత్రా - ఉత్కర్షాత్ - ఉభయత్వాత్ - వా - ఉత్కర్షతి - హ - వై - జ్ఞాన సన్తతిం - సమానః - చ - భవతి - న - అస్య - అబ్రహ్మవిత్ - కులే - భవతి - యః - ఏవం - వేద

టీక ॥ స్వప్నస్థానః = స్వప్నమే స్థానముగా గలిగిన, తైజసః = తైజసుడు, ఉత్కర్షాత్= ఆధిక్యమువలన, ఉభయత్వాత్ వా = ఉభయాత్మకు డగుటవలనను (విశ్వప్రాజ్ఞులకు మధ్యమునందుండి ఉభయ స్వరూపుడగుటవలననున్ను), (ఓంకారస్య = ప్రణవముయొక్క) ద్వితీయా = మాత్రా = రెండవ మాత్రయగు, ఉకారః = ఉకార స్వరూపుడుగ (ఉన్నాడు), యః = ఎవడు, ఏవం = ఈవిధముగా, వేద = యెఱుంగుచున్నాడో, (సః = వాడు) హవై= నిశ్చయముగా, జ్ఞానసన్తతిం జ్ఞాన = జ్ఞానముయొక్క, సన్తతిం = పరంపరను, ఉత్కర్షతి = వృద్ధిపొందించుచున్నాడు సమానః - చ = సమానుడును (శత్రుమిత్రులందు సమానుడు), భవతి = అగుచున్నాడు, అస్య = వీనియొక్క, కులే = వంశమునందు, అబ్రహ్మ విత్ = బ్రహ్మమును తెలియనివాడు, న భవతి = కలుగడు

తా॥ స్వప్నమే స్థానముగాగల (సూక్ష్మశరీరాభిమానియగు ఆత్మయొక్క ద్వితీయపాదరూపుడగు) తైజసుడు ఓంకారముయొక్క రెండవపాదమగు ఉకారమగుచున్నాడు ఈ ఉకారము ఓంకారముయొక్క ప్రథమమాత్రయగు అకారమునకంటె తరువాత నుండుటచే దానికన్నను ఉత్కృష్టమైనది మఱియు అకారమకారాత్మకమగుటచే దీనికి ఉభయత్వమున్ను ప్రసిద్ధము ఇట్లే తైజసుడున్ను సూక్ష్ముడగుటచే ఉత్కృష్టుడును, స్థూలశరీరాభిమానియగు విశ్వునికిని, కారణశరీరాభిమానియగు ప్రాజ్ఞునికిని మధ్యనుండుటచే ఉభయ స్వరూపుడును నగుచున్నాడు ఇందుచే ఆత్మయొక్క ద్వితీయపాదరూపుడగు తైజసుడు, ఓంకారముయొక్క ద్వితీయమాత్రయగు ఉకారమున్ను ఒకటే యని గుర్తెఱుంగవలయును ఇట్లు తెలిసికొనినవాడు విజ్ఞానసంతతిని వృద్ధిజేయును

అతడు శత్రుమిత్రులందు సమభావము గలవాడగును ఎవరికి ద్వేష్యుడు కాడు అతని వంశమునందు బ్రహ్మవేత్త గానివాడు జన్మింపడు ఇట్లు తెలిసికొనుటకు ఇదియే ఫలము

అవ ॥ మూడవపాదమగు ప్రాజ్ఞునికి, తృతీయమాత్రయగు మకారమునకు సాదృశ్యము - తద్‌జ్ఞానముచే కలిగెడు ఫలము ప్రతిపాదింపబడుచున్నది -

**మం ॥ సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయా మాత్రా, మితే రపీతేర్వా మినోతి హవై ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద ॥ ౧౧**

పద ॥ సుషుప్తస్థానః - ప్రాజ్ఞః - మకారః - తృతీయా - మాత్రా - మితేః - అపీతేః- వా - మినోతి - హవై - ఇదం - సర్వం - అపీతిః - చ - భవతి - యః - ఏవం - వేద

టీక ॥ సుషుప్తస్థానః = సుషుప్తియే స్థానముగా గలిగిన, ప్రాజ్ఞః - ప్రాజ్ఞుడు (కారణశరీరాభిమానియగు ప్రాజ్ఞుడు), మితేః = పరిమితియగుట వలనను అపీతేః - వా = ఏకీభావమగుటవలనను (ఓంకారస్య= ప్రణవముయొక్క) తృతీయా మాత్రా = మూడవ మాత్రయగు, మకారః= మకారము, (భవతి = అగుచున్నాడు) యః = ఎవడు, ఏవం = ఈప్రకారముగా, వేద = తెలిసికొనెనో (సః = వాడు) ఇదం సర్వం = ఈ సమస్తజగత్తును హవై = నిశ్చయముగా, మినోతి = ఇంతయని జగద్యాథాత్మ్యమును తెలిసికొనుచున్నాడు అపీతిః చ = జగత్కారణా త్మయును, భవతి = అగుచున్నాడు)

తా॥ సుషుప్త్యవస్థయందుండి కారణశరీరాభిమానియగు ఆత్మయొక్క తృతీయపాదమయిన ప్రాజ్ఞుడు, ఓంకారముయొక్క మూడవమాత్రయగు మకారము. ఆ ఓంకారముయొక్క ప్రథమ ద్వితీయ మాత్రలగు అకార ఉకారములు, యవాది ధాన్యములు కొలతపాత్ర యందువలె, మకారము నందు ప్రవేశించి యేకీభావమును పొందుచున్నవి అందు విలీనము లగుచున్నవి అట్లే స్థూలసూక్ష్మశరీరాభిమానులగు విశ్వతైజసులు ప్రాజ్ఞునియందు ప్రవేశించి

యేకత్వమును పొందుచున్నారు జాగ్రదాది త్రివిధావస్థలలోని స్థూల, సూక్ష్మ, కారణాత్మకజగత్తును ప్రాజ్ఞుడు గుర్తెఱుంగుచున్నాడు అందుచే నతడు సర్వజ్ఞుడు ఈ ప్రకారము ప్రాజ్ఞుడు త్రివిధజగత్తుయొక్క ఉత్పత్తి, విలయములకు స్థానమైయున్నాడు ఇందుచే ఓంకారముయొక్క మూడవమాత్రయగు మకారమునకును, ఆత్మ యొక్క మూడవ పాదరూపుడగు ప్రాజ్ఞునకును సాదృశ్యము గలదు కనుక ఓంకారముయొక్క తృతీయమాత్ర యగు మకారమును, ఆత్మయొక్క తృతీయపాదమగు ప్రాజ్ఞుని, ఈ రెంటిని నొకటిగా తెలిసికొనినవాడు, ఈ సమస్తజగత్తుయొక్క పరిమితిని యధార్థ స్వరూపమును తెలిసికొన్నవాడును, మఱియు జగత్కారణాత్మకుడును నగుచున్నాడు

అత్రైతే శ్లోకా భవన్తి

శ్లో ॥ విశ్వస్యాత్వవివక్షాయామాదిసామాన్య ముత్కటమ్ ।
మాత్రా సమ్ప్రతిపత్తౌ స్యాదాప్తిసామాన్య మేవ చ ॥ 19

అత్ర - ఏతే - శ్లోకాః - భవన్తి

పద ॥ విశ్వస్య - అత్వవివక్షాయాం - ఆదిసామాన్యం - ఉత్కటం - మాత్రాసమ్ప్రతిపత్తౌ - స్యాత్ - ఆప్తిసామాన్యం - ఏవ - చ

అత్ర= ఇక్కడ, ఏతే = ఈ, శ్లోకాః = శ్లోకములు (కారికలు), భవన్తి - అగుచున్నవి

టీక ॥ విశ్వస్య = విశ్వునకు, అత్వవివక్షాయాం = అకారమాత్ర యగుటను వివక్ష జేయుటయందు ఆదిసామాన్యం = ఆదిత్వ సాదృశ్యము ఉత్కటం = స్ఫుటమైనది, స్యాత్ = అగును మాత్రాసమ్ప్రతిపత్తౌ= (సత్యాం), మాత్రా= ఆకారమాత్రత్వముయొక్క, సమ్ప్రతిపత్తౌ (సత్యాం) = జ్ఞానము గల్గినయెడల (కుదిరినయెడల), అప్తిసామాన్యం ఏవ చ - అప్తి = సర్వజగద్వ్యాప్తియొక్క, సామాన్యం ఏవచ = సమానతయును, ఉత్కటం= స్ఫుటమయినది, స్యాత్= అగును

తా॥ ఇంతవఱకు ఆత్మపాదములకును ఓంకారమాత్రలకును ఏకత్వము కారణసహితముగా శ్రుతిచేత జెప్పబడినది ఈ విషయములో ఆ శ్రుత్యర్థమును వివరించునట్టి శ్లోకములు పూర్వమువలెనే చెప్పబడుచున్నవి

స్థూలశరీరాభిమానియయిన ఆత్మయొక్క ప్రధమపాదమగు విశ్వుని ఓంకారముయొక్క ప్రధమమాత్రయగు ఆకారముగా వివక్షించుటయందు, అనగా చెప్ప నిచ్ఛగించినయెడల అకారమునకు వలె సర్వమునకును, 'ఆదియగుట' అను సాదృశ్యము స్పష్టమగుచున్నది అనగా అకారము సర్వవర్ణములకును ఆదియైనటుల విశ్వుడును సర్వజగత్తుకు ఆది యని తెలియవలయును అవిశ్వుడు అకారమాత్రతను పొందుటచేతను, సర్వమునందు వ్యాపించుటచేతను, అపాదమాత్రలకు ఆదిత్వవ్యాప్తిత్వ సామాన్యము స్పష్టముగ గనబడుచున్నదని భావము

శ్లో ॥ తైజసస్యోత్వవిజ్ఞాన ఉత్కర్షో దృశ్యతే స్ఫుటమ్ ।
మాత్రాసమ్ప్రతిపత్తౌ స్యాదుభయత్వం తధావిధమ్ ॥ 20

పద ॥ తైజసస్య - ఉత్వవిజ్ఞానే - ఉత్కర్షః - దృశ్యతే - స్ఫుటం - మాత్రా సమ్ప్రతిపత్తౌ - స్యాత్ - ఉభయత్వం - తధా విధం

టీక ॥ తైజసస్య = తైజసునికి, ఉత్వవిజ్ఞానే = ఉకారమాత్ర యగుటను తెలిసికొనుటయందు, ఉత్కర్షః = ఆధిక్యము, స్ఫుటం = స్పష్టముగా, దృశ్యతే= కనబడుచున్నది మాత్రాసమ్ప్రతిపత్తౌ (సత్యాం) మాత్రా = ఉకారమాత్రత్వముయొక్క, సంప్రతిపత్తౌ (సత్యాం) = జ్ఞానము గల్గినయెడల ఉభయత్వం = ఉభయస్వరూపమగుట (విశ్వప్రాజ్ఞుల రూపమగుట), తధా విధం = ఆవిధముగానే (స్ఫుటం = స్పష్టము), స్యాత్= అగును

తా॥ ఆత్మయొక్క రెండవపాదమగు సూక్ష్మశరీరాభిమానియయిన తైజసుని, ఓంకారముయొక్క రెండవమాత్రయగు ఉకారముగాను తెలిసికొనినయెడల, అకారమునకంటె ఉకారము ఉత్కృష్టమైనటుల విశ్వునికంటె తైజసుడు (సూక్ష్ముడగుటచే) ఉత్కృష్టుడని స్పష్టముగా తెలియబడుచున్నది తైజసుడు ఉకారమాత్రరూపుడని చక్కగ దెలియబడగనే యిరువురికి ఉభయత్వసామ్యము స్పష్టమగును అనగా ఉకారము- అకార మకారాత్మకమయి నట్లు తైజసుడు స్పష్టముగా విశ్వప్రాజ్ఞాత్మకుడగుచున్నాడు

మకారభావే ప్రాజ్ఞస్య మానసామాన్యముత్కటమ్ ।
మాత్రాసమ్ప్రతిపత్తౌ తు లయసామాన్యమేవ చ ॥ 21

పద ॥ మకారభావే - ప్రాజ్ఞస్య - మానసామాన్యం - ఉత్కటం - మాత్రా సమ్ప్రతిపత్తౌ - తు - లయసామాన్యం - ఏవ - చ

టీక ॥ ప్రాజ్ఞస్య = ప్రాజ్ఞునకు, మకారభావే = మకారమాత్ర యగుట యందు, మానసామాన్యం - మాన = పరిమితిరూపమైన లేక సర్వజ్ఞరూపమైన సామాన్యం = సమానత్వము, ఉత్కటం = స్ఫుటమయినది (భవతి = అగుచున్నది) మాత్రాసమ్ప్రతిపత్తౌ (సత్యాం) తు మాత్రా = మకారమాత్రత్వముయొక్క, సమ్ప్రతిపత్తౌ (సత్యాం) తు = జ్ఞానము చక్కగా గల్గినయెడలనైతే, లయ సామాన్యం - ఏవ - చ - లయ = విలీనమగుటయును, సామాన్యం ఏవ చ = సమానత్వమున్ను, (భవతి = అగుచున్నది )

తా ॥ ఆత్మయొక్క మూడవపాదమగు కారణశరీరాభిమానియయిన ప్రాజ్ఞని ఓంకారవుయొక్క మూడవమాత్రయగు మకారమునుగా తెలిసికొనినయెడల మకారము, ఓంకార మాత్రలగు అకార ఉకారములను పరిమితి జేయునట్లు ప్రాజ్ఞుడు స్థూలసూక్ష్మశరీరాభిమానులగు విశ్వతైజసులను ఇరువురిని పరిమితి జేయుటచే ప్రాజ్ఞమకారములకు సమానత్వము స్ఫుటమగుచున్నది ఇట్లు ప్రాజ్ఞుడు మకారమాత్రయును సమానమని చక్కగా దెలియుటచే మకారము అకార ఉకారములను తనయందు లీనపరచుకొనునట్లు ప్రాజ్ఞుడు విశ్వతైజసులను తనయందు లీనపరచుకొనునను లయసామాన్యము ఉభయులకును స్పష్టమగును

శ్లో ॥ త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।
స పూజ్యస్సర్వభూతానాం వన్ద్యశ్చైష మహామునిః ॥ 22

పద ॥ త్రిషు- ధామసు- యత్- తుల్యం- సామాన్యం- వేత్తి- నిశ్చితః- సః - పూజ్యః సర్వభూతానాం - వన్ద్యః - చ - ఏషః - మహామునిః

టీక ॥ త్రిషు = మూడైన, ధామసు = స్థానములయందు (జాగరిత స్వప్న సుషుప్తులయందు విశ్వతైజస ప్రాజ్ఞులకు అకార ఉకార మకారములతో), తుల్యం = సమానత్వము, యత్ = ఏదియో, (తత్ = అ), సామాన్యం =

సమానత్వమును, యః = ఎవడు, నిశ్చితః = నిశ్చయమును పొందినవాడై, వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, సర్వభూతానాం = సమస్తభూతములకును, పూజ్యః = పూజింపదగినవాడును వన్ద్యశ్చ= నమస్కరింపతగినవాడును, (భవతి = అగుచున్నాడు), ఏషః = వీడు, మహాముని = గొప్పమునియును ( భవతి = అగుచున్నాడు )

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తులయందుండెడి ఆత్మపాదములయిన విశ్వతైజస ప్రాజ్ఞులకు ఓంకారమాత్రలగు ఆకార ఉకారమకారములతోటి సామ్యమును (ఆప్తి, ఉత్కర్ష, మాన రూపమైన సాదృశ్యమును) నిశ్చయముగ దెలిసికొనినవాడు సర్వభూతములకు పూజింపతగినవాడును, నమస్కరింప దగిన వాడునునై మహాముని యగుచున్నాడు

శ్లో ॥ అకారో నయతే విశ్వముకారశ్చాపి తైజసమ్ ।
మకారశ్చ పునః ప్రాజ్ఞం నామాత్రే విద్యతే గతిః ॥ 23

పద ॥ అకారః - నయతే - విశ్వం - ఉకారః - చ - అపి - తైజసం - మకారః - చ- పునః - ప్రాజ్ఞం - న - అమాత్రే - విద్యతే - గతిః

టీక ॥ అకారః = అకారము, విశ్వం - విశ్వుని, నయతే = పొందించుచున్నది, ఉకారః- చ - అపి = ఉకారమున్ను, తైజసం = తైజసుని, నయతే= పొందించుచున్నది మకారః చ పునః = మకారమున్ను, ప్రాజ్ఞం = ప్రాజ్ఞుని, నయతే = పొందించుచున్నది, అమాత్రే = మాత్రా రహితమయిన ఓంకారమునందు, గతిః = గమనము, న విద్యతే = లేదు

తా॥ పూర్వము చెప్పబడిన సాదృశ్యములచేత ఆత్మ పాదములగు విశ్వతైజస ప్రాజ్ఞులను ఓంకారమాత్రలగు అకార ఉకార మకారములతో ఏకత్వమును చేసి ధ్యానము జేయు వానిని, అకారము విశ్వునిన్ని, ఉకారము తైజసునిన్ని, మకారము ప్రాజ్ఞునిన్ని క్రమముగా పొందించుచున్నవి ఇట్లు పొందింపబడినవాడు నిరంతరధ్యానాదుల చేతను, సద్గురూపదేశము చేతను గలిగిన 'సర్వము ఆపరిశుద్ధమగు పరబ్రహ్మమే యను జ్ఞానముచేత అజ్ఞానము నాశనము కాగా

బ్రహ్మము అపరిచ్ఛిన్న మగుటవలన ఇతరత్ర గతిలేనివాడై పరిపూర్ణమయిన బ్రహ్మమే యగుచున్నాడు మాత్రారహితమైన ఓంకారము నందు వేఱొక చోటికి గమనము లేదు అనగా మకారము లయించిన తరువాత శుద్ధబ్రహ్మము మాత్రమై మిగిలినవారికి పరిచ్ఛేదమేదియు లేనందుచే మఱియొక చోటికి గమనము లేదు

తృతీయఖండః సమాప్తః

తృతీయ ఖండము సమాప్తము

## దీపిక - మాత్రాలక్షణము

**జానుం ప్రదక్షిణీకుర్యాన్న ద్రుతం న విలమ్బితమ్ ।**
**ప్రదద్యాచ్ఛోటికాం యావత్తావన్మాత్రేతి గీయతే ॥**

తన మోకాలును త్వరితముగా గాని, మందముగా గాని గాక చేతితో ఒక ప్రదక్షిణము చేసి (తిప్పి) ఒక చిటిక వేయు కాలము ఒకమాత్ర యనంబడును ఈలాగున మాత్రను గుఱించి అనేక విధములుగా యోగులు తెలిపియున్నారు మామూలుగా కన్ను తెరచి మూయు సమయమునకున్ను, స్వభావముగా ఒక శ్వాస, ఉచ్ఛ్వాస కాలమునకున్ను, మాత్రాకాలమని పేరు అని సిద్ధపురుషులు వచించియున్నారు ఈ కాలమంతయు రమారమి సరిగానే యుంటున్నది

**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ।**
**అప్యాయనః ప్లుతోవాఽపి త్రివిధోచ్చారణేన తు ॥**

ఈ ఓంకారోచ్చారణ హ్రస్వమనియు, దీర్ఘమనియు, ప్లుతమనియు మూడు విధములుగా నుంటున్నది హ్రస్వమయినచో సమస్త పాపములను నశింపజేయును దీర్ఘమయిన మోక్షమును గలుగ జేయును ప్లుతమయిన సర్వేష్టార్థసిద్ధి నొసంగును కావున నిది మూడు విధములు అనుభవజ్ఞులగు బ్రహ్మనిష్ఠులవలన తెలిసికొనుట శ్రేయస్కరము

**హ్రస్వం బిన్దుగతం దైర్ఘ్యం బ్రహ్మరన్ధ్రగతం ప్లుతమ్ ।**
**ద్వాదాశాన్తర్గతం మన్త్రం ప్రసాదం మన్త్ర సిద్ధయే ॥**

ఈ ప్రణవధ్వని బిందుతమగునప్పుడు హ్రస్వమనియు, బ్రహ్మరంధ్ర మగునప్పుడు దీర్ఘమనియు, ద్వాదశాన్తర్గతమగునప్పుడు ప్లుతమనియు చెప్పబడుచున్నది ఇది ప్రణవమన్త్రము యొక్క పై జెప్పబడిన మూడు విధములగు సిద్ధులను గలుగజేయు విధానమైయున్నది

నాసాగ్రే దృష్టిమారోప్య హస్తపాదౌ చ సంయతౌ ।
మనస్సర్వత్ర సంగృహ్య ఓంకారం తత్ర చిన్తయేత్ ॥

కరచరణాది సర్వేన్ద్రియములను సంయమనము చేసి బాహ్యవృత్తినుండి మనస్సు మొదలగు నన్తరిన్ద్రియములను వశీకరించి నాసాగ్రమందు దృష్టిని ప్రాణవాయువుతో సహా స్థిరపరచి ఓంకారమునుచ్చరించి ఓంకారార్థమగు పరబ్రహ్మమును సదా చింతింపవలయును ( బ్రహ్మభావము గలిగి యుండవలయును )

(1) నాసాగ్రమనియు, (2) భ్రూమధ్యమనియు, (3) సుషుమ్నాగ్రమనియు, (4) బ్రహ్మబిలమనియు, (5) తురీయస్థానమనియు, (6) హృదయమనియు స్వస్వరూపస్థానమునకు గల పేర్లని గ్రహించవలయును దృష్టి స్థిరీకరణ కివి ఉపాయములు

ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥

ధ్యానయోగి ఓంకారమును ధనుస్సుగాను, ఆత్మను ( మనస్సును) శరముగాను (బాణముగాను) అనుసన్ధించి బ్రహ్మమును లక్ష్యమునుగా నుంచుకొనవలయును అప్రమత్తుడై ధ్యానము చేయగా బాణము ననుసన్ధించిన వాడు లక్ష్యమును భేదించినటుల ఇతడున్ను బ్రహ్మత్వము నొందగలుగును ఈ ఉదాహరణముచే శరము లక్ష్యములో చేరునటుల జీవాత్మ పరమాత్మలో నైక్యమొందగలుగును శరము ననుసన్ధించు వానికి ఏకాగ్రత లేనిచో లక్ష్యమును భేదింపజాలనటుల ఆన్తరిన్ద్రియనిగ్రహము, బాహ్యేన్ద్రియ నిగ్రహమున్ను లేనిచో సాధకుడు బ్రహ్మమును పొందజాలడని గ్రహించుకొన వలయును

ప్రణవో హి పరబ్రహ్మ ప్రణవః పరమం పదమ్ ।
ప్రణవం సర్వవేదాద్యం సర్వదేవమయం విదుః ।
సర్వేషాం చైవ మన్త్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే ॥

ప్రణవమే పర బ్రహ్మము, ప్రణవమే పరమపదము ప్రణవమే సకలవేదములకును మూలము ప్రణవమే సర్వదేవతలున్ను అని తెలియవలెను ప్రణవమే సకలమన్త్రములకును ప్రాణప్రాయముగా నుండును ప్రణవములేని మన్త్రము ప్రాణములేనిదియే యగును

**ఏకమాత్రో భవేద్ధ్రస్వః ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే ।**
**త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో వ్యఞ్జనస్త్వర్ధమాత్రకమ్ ॥**

ఒక మాత్రకాలమునకు హ్రస్వమనియు, రెండు మాత్రల కాలమునకు దీర్ఘమనియు, మూడుమాత్రల కాలమునకు ప్లుతమనియు, అర్ధమాత్ర కాలమునకు వ్యంజనమనియు ( అర్ధమాత్రమనియు) పేర్లని తెలియవలయును

**ఓమిత్యన్తర్గతం సర్వమభావ్యం భావ్యమేవ చ ।**
**ఓమిత్యేతత్పరం నిష్ఠం జ్ఞానగమ్యమగోచరమ్ ॥**

సమస్తవేదములు, మన్త్రములు ఓంకారమందు అన్తర్గతములై యున్నవి అది మలినహృదయులకు భావన జేయ సాధ్యమయినదిగాదు శుద్ధాన్తఃకరణులకు భావింప సాధ్యమయినది అట్టి ఓంకారమే నిష్ఠ లన్నిటిలోను శ్రేష్ఠమైనది ఇది జ్ఞానగమ్యము ఇంద్రియముల కగోచరము

**ఓంకారాది జపోఽప్యేవం భావగర్భో హ్యుదాహృతః ।**
**ధ్యేయవస్తు స్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః ॥**

ఓంకారాది జపమునందు అ యా దైవభావము గలిగియుండ వలయును ఏలననగా ధ్యేయవస్తువుయొక్క స్వరూపమందు మనస్సు దృఢముగా నిలుచుటకొఱకే జపమేర్పడినది ఇది ఋషులయొక్క మతము ''ఓంకారాది'' అని ప్రయోగించుట వలన ఓంకారము మొదలుగాగల ఏ దేవతలను గుఱించిన మన్త్రమయినను, ధ్యేయస్వరూపమందు మనస్సు నిశ్చలముగా నిలుచుటకున్ను, పాపములు నశించుటకును, ప్రతి బంధములు తొలగుటకును తత్తద్దేవతా మన్త్రములను గుఱించిన జపముల జేయవలయును

**ప్రణవాద్యాస్త్రయో వేదాః ప్రణవే పర్యవస్థితాః ।**
**వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవమభ్యసేత్ ॥**

వేదత్రయమున్ను ప్రణవమునుండే యేర్పడినది ప్రణవమునందే ఆమూడు వేదములు లయించుచున్నవి వాఙ్మయమంతయు (విద్యలన్నియు) ప్రణవస్వరూపమే అందుచే ప్రణవమునే ధ్యానింప వలయును, (ఋక్ యజుస్సామములు మూడున్ను జ్ఞానమునకు సంబంధించినవి అధర్వణము ధనుర్విద్యకున్ను మన్త్రశాస్త్రమునకున్ను సంబంధించినదగుటచే పై మూడింటిలో చేర్చబడలేదు కావుననే సామాన్యముగా వేదములను చెప్పునపుడు మూడింటిని మాత్రము చెప్పుదురు

యావజ్జీవం జపేన్మన్త్రం ప్రణవం బ్రహ్మణో వపుః ।
హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ।
ప్లుతస్తు సర్వసిద్ధ్యై స్యాత్ప్రణవ స్త్రివిధస్స్మృతః ॥

పరబ్రహ్మ స్వరూపమయిన ప్రణవమన్త్రమును జీవితపర్యంతము జపించవలయును అది హ్రస్వమనియు, దీర్ఘమనియు, ప్లుతమనియు మూడు విధములగు ఉచ్చారణములతో గూడుకొనియున్నది హ్రస్వముచే సమస్తపాపములు భస్మములగును దీర్ఘము మోక్షదాయకము ప్లుతముచే సర్వసిద్ధులు సిద్ధించును

ఉత్తమం మానసం జాప్యముపాంశుర్మధ్యమం స్మృతమ్ ।
అధమం వాచికం ప్రాహుస్సర్వమన్త్రేషు వై ద్విజాః ॥

మానసిక జపము ఉత్తమమనియు, ఉపాంశు జపము మధ్యమమనియు, వాచిక జపము అధమమనియు మహర్షులు చెప్పుచున్నారు ఇది సమస్తమన్త్రములకును సంబంధించినదని గ్రహించుకొనవలయును

విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః ।
ఉపాంశుస్స్యాచ్ఛతగుణస్సాహస్రో మానసస్స్మృతః ॥

విధి ప్రకారము చేయు యజ్ఞముకన్న జప యజ్ఞము పదిరెట్లు అధికఫలము గలది అది వాచికముగాక ఉపాంశువయినచో నూరురెట్లధిక ఫలము గలదగును అది మానసికమయినచో వేయి రెట్లు అధిక ఫలము నొసగుచున్నది (ఇతరులకు వినబడులాగున చేయునది వాచికమనియు, అటుల వినబడక పెదవులు కొండనాలుక కదలుచుండిన ఉపాంశువనియు, ఈ రెండును లేక హృదయములో మాత్రము స్మరణ- భావన గలిగియుండునది మానసిక మనియు గ్రహించవలయును )

త్రివిధో జపయజ్ఞస్యాత్తత్ర భేదాన్నిబోధత ।
వాచికశ్చ ఉపాంశుశ్చ మానస స్త్రీవిధస్స్మృతః ॥

జపయజ్ఞము మూడు విధములు దాని భేదముల వినుము, (1) వాచికజపమనియు, (2) ఉపాంశుజపమనియు, (3) మానసిక జపమనియు అయ్యది మూడువిధములు దీని వివరము పైన వ్రాయబడినదే

తృతీయ ఖండదీపిక సమాప్తము



ఓమ్

# మాణ్డూక్యోపనిషత్

## చతుర్థ ఖండః -నాల్గవ ఖండము

అవ॥ మాత్రారహితమైన ఓంకారము, పరమాత్మ యొక్క నాల్గవపాదమగు అఖండాద్వితీయ నిత్యనిర్గుణ నిర్విశేష తురీయస్వరూపమే యని, అభేదము ప్రతిపాదింపబడినదై ఓంకారము - ఆత్మ యీ రెండును ఒకటియే యని చెప్పుచు ఉపనిషత్తు ఉపసంహరింపబడుచున్నది -

**మం ॥ అమాత్రశ్చతుర్థో౽వ్యవహార్యః ప్రపఞ్చోపశమశ్శివో౽ద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మ నా౽౽త్మానం య ఏవం వేద య ఏవం వేద ఇత్యుపనిషత్. ౧౨**

పద॥ అమాత్రః - చతుర్థః - అవ్యవహార్యః - ప్రపంచోపశమః - శివః - అద్వైతః - ఏవం - ఓంకారః - ఆత్మా - ఏవ - సంవిశతి - ఆత్మనా - ఆత్మానం - యః- ఏవం - వేద - యః - ఏవం - వేద

టీక॥ ఏవం = ఈప్రకారము, అమాత్రః = మాత్రారహితమయిన, ఓంకారః = ఓంకారము, అవ్యవహార్యః = వాక్కుచేత చెప్పుట కలవిగానిదియును, ప్రపంచోపశమః - ప్రపంచ = ప్రపంచము యొక్క, ఉపశమః = శాంతిగలదియును (ప్రకృతి రహితమై నదియు), శివః = మంగళ స్వరూపమైనదియును, అద్వైతః = భేదము లేనిదియునైన, చతుర్థః = నాల్గవపాదమగు, ఆత్మైవ = పరమాత్మయే (అగుచున్నది) యః = ఎవడు, ఏవం = ఈ ప్రకారముగా, వేద = తెలుసుకొనుచున్నాడో, (సః=వాడు), ఆత్మనా = తన స్వరూపముచేత, ఆత్మానం = పరమార్థమగు నాత్మను, సంవిశతి = ప్రవేశించుచున్నాడు యః = ఎవడు, ఏవం = ఈప్రకారముగా, వేద = తెలుసుకొనుచున్నాడో (సః=వాడు), ఆత్మనా = తన స్వరూపముచేత, ఆత్మానం = పరమార్థమగు నాత్మను, సంవిశతి = ప్రవేశించు చున్నాడు అనగా నిర్గుణ నిర్వికార పరబ్రహ్మస్వరూపుడగు చున్నాడని భావము

తా॥ అకార ఉకార మకారములనెడి మాత్రలు లేని అమాత్రకమగు ఓంకారము వాక్కుచే వ్యవహరించుటకు నలవి కానిదియును, జాగ్రదాది ప్రపంచవిలయము గలదియును, మంగళస్వరూపమయినదియును, అద్వయస్వరూపమయినదియునైన పూర్వము చెప్పియుండెడి నిర్గుణ శుద్ధపరబ్రహ్మము యొక్క చతుర్థపాదమగును ఓంకారముయొక్క అకారాది త్రివిధ మాత్రలకు పరమాత్మయొక్క మూడు పాదముల తోటి సామ్యము చెప్పబడినది ఇప్పుడు మాత్రారహితమైన ఓంకారముయొక్క నిరాకార తురీయ స్వరూపము పరమాత్మ యొక్క నాల్గవపాదముగ వర్ణింపబడుచున్నది ఇటుల వాచ్యవాచకములైన పరమాత్మ ఓంకారముల యొక్క సాదృశ్యమును అనగా ఏకత్వరహస్యమును ఎవడు గుర్తెఱుంగునో వాడు తానే నిర్గుణ నిర్వికార పరబ్రహ్మస్వరూపమును పొందును వానికి తిరుగా జన్మ ఉండదు ముక్తుడగును 'య ఏవం వేద' అని రెండు సార్లు చెప్పుట ఉపనిషత్సమాప్తిని సూచించుచున్నది మాణ్డూక్యోపనిషత్సమాప్తా

ఓమ్

అత్రైతే శ్లోకా భవన్తి.

ఈ అర్థమున ఈ గౌడపాదకారికలు గలవు

శ్లో ॥ **ఓంకారం పాదశో విద్యాత్పాదా మాత్రా న సంశయః ।**
**ఓంకారం పాదశో జ్ఞాత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ 24**

పద ॥ ఓంకారం - పాదశః - విద్యాత్ - పాదాః - మాత్రాః - న - సంశయః- ఓంకారం- పాదశః - జ్ఞాత్వా - న - కించిత్ - అపి - చిన్తయేత్

టీక ॥ ఓంకారం = ప్రణవమును, పాదశః = ఆత్మపాదములుగా, విద్యాత్= తెలిసికొనవలయును పాదాః = ఆత్మపాదములు మాత్రాః = ఓంకారముయొక్క ఆకారాదిమాత్రలు, న - సంశయః = సందేహము లేదు ఓంకారం = ప్రణవమును, పాదశః = ఆత్మపాదములుగ, జ్ఞాత్వా = (ఆత్మపాదములు ఓంకారమాత్రలు ఒకటేయని) తెలిసికొని, కించిత్ అపి= కొంచమైనను, (దృష్టాదృష్టప్రయోజనమును), న చిన్తయేత్ = చింతింపనక్కర లేదు

తా॥ విశ్వతైజసప్రాజ్ఞాత్మపాదములు, ఓంకారముయొక్క అకారాది మాత్రలుగానే యున్నవి ఇందుకేమియు సందియము లేదు కనుక ప్రణవమును, అకారాదిమాత్రావిభాగముజేసి క్రమముగా నాత్మయొక్క విశ్వతైజసప్రాజ్ఞాత్మపాదములతో నైక్యముజేసి తెలిసికొనవలయును ఇట్లు ప్రణవమును తెలిసికొనెనేని కృతార్థుడగుటవలన ప్రత్యక్షాప్రత్యక్షమయిన వేరొక ప్రయోజనమేమియు తలంపవలసినది లేదు

శ్లో॥ యుఞ్జీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।
ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥ 25

పద ॥ యుంజీత - ప్రణవే - చేతః - ప్రణవః - బ్రహ్మ - నిర్భయం - ప్రణవే = నిత్యయుక్తస్య - న - భయం - విద్యతే - క్వచిత్ -

టీక ॥ చేతః - మనస్సును, ప్రణవే = ఓంకారమునందు, యుఞ్జీత = కూర్పవలయును, ప్రణవః = ఓంకారము, నిర్భయం = భయరహితమయిన, బ్రహ్మ = బ్రహ్మస్వరూపము, ప్రణవే = ఓంకారమునందు, నిత్యయుక్తస్య= ఎల్లప్పుడు కూడుకొనియుండువానికి (ఆ ప్రణవము నెల్లప్పుడు బ్రహ్మభావనతో ధ్యానించువానికి) క్వచిత్ = ఎక్కడనున్ను, భయం = భీతి, న విద్యతే = లేదు

తా ॥ ఓంకారానుసన్ధానమునందు నేర్పు గలవానికి సమస్తద్వైతమును పోగొట్టుచున్న ఓంకారజ్ఞానముచేతనే కృతార్థత గలుగుచున్నదని చెప్పబడినది ఇప్పుడా ఓంకారానుసన్ధానము దెలియనటువంటి పరుని యుపదేశము మాత్రమే రక్షణముగా గలవానికి ధ్యానముయొక్క కర్తవ్యతను చెప్పుచున్నాడు ధ్యానించువాడు మనస్సును ఓంకారమునందు బాగాగా జేర్చవలయును ఆ ప్రణవము భయరహితమయిన బ్రహ్మస్వరూపము ఇట్లు బ్రహ్మ స్వరూపమయిన ఓంకారము నెల్లప్పుడును ధ్యానించువానికి ఎచ్చటనున్ను భయము లేదు అట్టి నిర్భయుడయినవాడు పరబ్రహ్మస్వరూపి యగుచున్నాడు

శ్లో॥ ప్రణవోహ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరస్స్మృతః ।
అపూర్వోఽనన్తరోఽబాహ్యోఽనపరః ప్రణవోఽవ్యయః ॥ 26

పద ॥ ప్రణవః - హి - అపరం - బ్రహ్మ - ప్రణవః - చ - పరః - స్మృతః- అపూర్వః- అనన్తరః - అబాహ్యః - అనపరః - ప్రణవః - అవ్యయః

టీక ॥ ప్రణవః = ఓంకారము, హి = ప్రసిద్ధముగా, అపరం = ఇతరమగు, బ్రహ్మ = బ్రహ్మస్వరూపము (పరబ్రహ్మమునకు వేరైన అవ్యక్తాదికము అపరమనబడును) ప్రణవః = ఓంకారము, పరః చ = శ్రేష్ఠమగు పరబ్రహ్మముగానున్న (అవ్యక్తాదికమునకంటె వేరైన పరిపూర్ణమగు పరబ్రహ్మము) = స్మృతః = చెప్పబడుచున్నది ప్రణవః = ఓంకారము, అపూర్వః = పూర్వము (కారణము) లేనిదియును అనన్తరః = భిన్నజాతి లేనిదియును, అబాహ్యః = ఇతరము లేనిదియును అనపరః = ఇతరకార్యము లేనిదియును, అవ్యయః = నాశములేనిదియును, (భవతి = అగుచున్నది)

తా॥ ఓంకారము పర స్వరూపమయిన పరబ్రహ్మముగా నున్నది పరమార్థముగా నోంకారముయొక్క అకారాది మాత్రలు, ఆత్మయొక్క విశ్వాది పాదములును, క్షీణించు చుండగా ప్రణవము శ్రేష్ఠమగు బ్రహ్మముగానే యుంటున్నది కనుకనే ఆ ఓంకారము ముందు తనకు కారణమయిన దేదియు లేనిదియును తనకు భిన్న జాతీయమయినది కొంచమును లేనిదియును, తనకితరమయినదేదియు లేనిదియును, ఇతర కార్యమేదియు లేనిదియును, నాశరహితమయినదియునై ఇట్లు పరబ్రహ్మభిన్న లక్షణములు గలిగి పరిపూర్ణమగు పరబ్రహ్మమగుచున్నది

**శ్లో॥ సర్వస్య ప్రణవోహ్యాదిర్మధ్యమన్తస్తథైవ చ ।**
**ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనన్తరమ్ ॥ 27**

పద ॥ సర్వస్య - ప్రణవః - హి - ఆదిః - మధ్యం - అన్తః - తథా - ఏవ - చ - ఏవం - హి - ప్రణవం - జ్ఞాత్వా - వ్యశ్నుతే - తత్ - అనన్తరం

టీక ॥ సర్వస్య = సమస్తమునకును, ప్రణవః = ఓంకారము, ఆదిః = కారణమయినదియును, మధ్యం = స్థితిని చేయునదియును, తథైవ= ఆప్రకారముగానే, అన్తః = నాశనము చేయునదియును, (భవతి = అగుచున్నది) ఏవం - హి = ఈ ప్రకారముగానే, ప్రణవం = ఓంకారమును, జ్ఞాత్వా = తెలిసికొని, అనన్తరం = తర్వాత, తత్ = ఆపరమాత్మ భావమును, వ్యశ్నుతే = పొందుచున్నాడు

తా॥ ఓంకారము ఈ విషయాది సమస్త ప్రపంచమునకు సృష్టి స్థితిలయములకు కారణమయినది ఓంకారముయొక్క యీ సర్వకారణత్వ మును తెలిసికొనిన జ్ఞాని ఆక్షణమందే పరమాత్మ స్వరూపమును పొందుచున్నాడు

శ్లో॥ **ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్ ।**
**సర్వవ్యాపినమోంకారం మత్వా ధీరో న శోచతి ॥** **28**

పద ॥ ప్రణవం - హి - ఈశ్వరం - విద్యాత్ - సర్వస్య - హృది - సంస్థితం- సర్వవ్యాపినం - ఓంకారం - మత్వా - ధీరః - న - శోచతి

టీక ॥ సర్వస్య = సమస్త ప్రాణిసముదాయముయొక్క, హృది = హృదయమునందు, సంస్థితం = ఉంటున్నటువంటి, ఈశ్వరం = ఈశ్వరుని, ప్రణవం - హి = ఓంకారమునుగా, విద్యాత్ = తెలిసికొనవలయును, ధీరః = జ్ఞాని, సర్వవ్యాపినం = అంతటను వ్యాపించి యుండెడి, ఓంకారం = ప్రణవమును, మత్వా = తెలిసికొని (సాక్షాత్కారము జేసికొని), న శోచతి = దుఃఖింపడు

తా॥ జనుడు స్మరణజ్ఞానమునకు స్థానమయిన హృదయమునందున్న ఈశ్వరుని ఓంకారమునుగా తెలిసికొనవలయును ఇట్లు సర్వవ్యాపకమయిన ఓంకారమును తెలిసికొనిన జ్ఞాని శోకనిమిత్తమయిన అజ్ఞానాది నాశము గలుగుటవలన దుఃఖింపడు

శ్లో॥ **అమాత్రో౽నన్తమాత్రశ్చ ద్వైతస్యోపశమశ్శివః ।**
**ఓంకారో విదితో యేన స మునిర్నేతరో జనః ॥** **29**

పద ॥ అమాత్రః - అనన్తమాత్రః - చ - ద్వైతస్య - ఉపశమః - శివః - ఓంకారః - విదితః - యేన - సః - మునిః - న - ఇతరః - జనః

టీక ॥ ఓంకారః = ప్రణవము, అమాత్రః = అకారాదిమాత్రలు లేనిదనియును, అనన్తమాత్రః - చ - అనంత = అంతములేని, మాత్రః చ = పరిమితి గలదనియును, ద్వైతస్య = ద్వైతముయొక్క, ఉపశమః = నాశము గలదనియును, శివః = మంగళస్వరూపమయిన దనియును, యేన = ఎవనిచేత, విదితః = తెలిసికొనబడెనో, సః = వాడు, మునిః = ఋషి

(పరమార్థ తత్త్వమును మననము జేయువాడు), ఇతరః = అన్యుడు, న - కాడు

తా॥ పూర్వము చెప్పిన ప్రకారము ఓంకారమును, అకారాది మాత్రలును, విశ్వాది పాదములును లేనటువంటి సమస్తద్వైతోపశమము గల, పరమ మంగళస్వరూపమునుగా దెలిసికొనినవాడే పరమార్థతత్త్వమును మననము చేయునట్టి మహాఋషి యగును ఇతరుడు కానేరడు అట్లు పరబ్రహ్మమును మననము చేయనివాడు మౌనమును ధరించినవాడైనను ముని కాజాలడు

చతుర్థఖండః సమాప్తః

చతుర్థ ఖండము సమాప్తము

మాణ్డూక్యోపనిషత్సమాప్తా

మాండూక్యోపనిషత్తు సమాప్తము

ఓమ్ తత్ సత్

**దీపిక :–**

**ప్రాధాన్యం శ్రూయతే శ్రుత్యా ప్రణవస్య జపాదిషు ।**
**తస్మాత్సర్వప్రయత్నేన ప్రణవైకపరో భవేత్ ॥**

మంత్రజపాదులందు ప్రణవముయొక్క ప్రాధాన్యము వేదముచేత వినబడుచున్నది ఆ కారణమువలన సర్వ ప్రయత్నముచేతను ప్రణవధ్యాన మొకదానియందే ఆసక్తుడు గావలయును

**జపజ్ఞానాత్తథా ధ్యానాన్నాన్యద్భిక్షోస్తు శోధనమ్ ।**
**తస్మాత్తాని సదా కుర్యాద్యతిశ్శుద్ధ్యర్థమాత్మనః ॥**

ప్రణవజపముకంటెను జ్ఞానముకంటెను, ధ్యానము కంటెను యతి యయినవానికి ఆత్మశోధనకొఱకు, అన్యమయిన సాధన మఱియొకటి లేదు అందుచే జపజ్ఞాన ధ్యానములను ఆత్మ శుద్ధికొఱకు సన్న్యాసి సదా చేయుచుండవలయును

శ్రుతపారజపాన్తేషు సమాధినిరతో భవేత్ ।
సమాధివిరతశ్శ్రాన్తశ్శ్రుతపారజపాన్ప్రయేత్ ॥

సమాధి నిష్ఠను శీలించువాడైనను, వేదాంతశ్రవణము, పఠనము, జపాదులను చేయుచుండవలయును అనగా సమాధినిష్ఠను శీలించువాడు నిష్ఠకు పూర్వము పై జెప్పిన మూడును చేయుచుండవలయును సమాధినుండి వ్యుత్థానదశకు వచ్చిన తరువాత కొంత శ్రమ తీర్చుకొని మఱల శ్రుతపాఠ జపాదులననుష్ఠించుచునే యుండవలయును ఇందువలన శ్రుత పాఠజపాదులలో నెంతమహిమ గలదో గ్రహించుకొనవచ్చును ఇప్పటివారలు ఆలాగున చేయకపోవుటచేతనే సమాధినుండి వ్యుత్థానదశకు వచ్చిన పిమ్మట బహిర్దృష్టి గలవారగుచున్నారు

శ్రుత్యాచార్యప్రసాదేన యోగాభ్యాసవశేన చ ।
ఈశ్వరానుగ్రహేణాపి స్వాత్మబోధో యథా భవేత్ ॥

వేదముయొక్కయు, ఆచార్యునియొక్కయు అనుగ్రహముచేతను, యోగాద్యనుష్ఠానములచేతను, ఈశ్వరుని కరుణచేతను నిజమగు ఆత్మబోధ గలుగును ఇవన్నియు లేనందు చేతనే వర్తమానకాలములో నుండువారి కాత్మబోధ గలుగక విఘ్నములు గలుగుచున్నవి

శిష్యో బహిర్ముఖో న స్యాదధ్యాత్మం యోగమాచరన్ ।
దుర్దర్శత్వాదిసంయుక్తమప్యాత్మానం ప్రపశ్యతి ॥

ఆత్మవిషయమైన యోగము నభ్యసించు శిష్యుడు బహిర్ముఖుడు కారాదు అటులైనచో చూడ శక్యము కాక పోవుట మొదలగు ధర్మములు గలదైనను, ఆత్మను దర్శించగలడు

అర్థమాత్రస్తు యద్గ్రాహ్యం చిత్తమాదాయ పార్థివ ! ।
అర్థస్వరూపవద్భాతి సమాధిస్సోఽభిధీయతే ॥

ఓ రాజేన్ద్రా ! చిత్తమును స్వాధీనము చేసికొని ప్రణవముయొక్క శబ్దమును విడచి ప్రణవార్థస్వరూపమేదిగలదో, ఆ పరమాత్మ స్వరూపమును మాత్రము

గ్రహించవలయును ప్రణవార్థ స్వరూపమాత్రమై నిలచుటేది గలదో, అదియే నిజమైన సమాధి యనబడును

**వృక్షస్య మూలసేకేన శాఖాః పుష్యన్తి వై యథా ।**
**తథా ప్రణవమన్త్రేణ దేవాస్తృప్తా భవన్తి హి ॥**

వృక్షముయొక్క మూలమున నీళ్ళు పోయుటవలన శాఖోపశాఖ లన్నియు ఏలాగున ఫల పల్లవ పుష్పాదులచే శోభించుచున్నవో, ఆలాగున ప్రణవస్వరూపము నొకదానిని ధ్యానించుటచేత బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలందఱు తృప్తి నొందుచున్నారు ఏలన, దేవతలందఱిలోను అంతర్యామియై వెలుగుచున్నది ప్రణవస్వరూపమగు పరబ్రహ్మము గదా !

**యథా తోయప్రవాహానాం సముద్రః పరమావధిః ।**
**తథైవ సర్వమన్త్రాణాం ప్రణవః పరమావధిః ॥**

ఏలాగున నానాముఖములుగా ప్రవహించెడు నదీ నదములన్నియు సముద్రములో పోయి చేరుచున్నవో, ఆ లాగున శివ, విష్ణ్వాది మన్త్రములన్నియు ప్రణవస్వరూపమగు పరబ్రహ్మములోనే చేరుచున్నవి ప్రణవమన్త్రము సముద్రము వంటిదనియు, తక్కిన మన్త్రములు నదులవంటివనియు గ్రహించ వలయును

**ఆద్యం యత్త్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా ।**
**స గుహ్యోఽన్యస్త్రి వృద్వేదో యస్తం వేద స వేదవిత్ ॥**

సర్వవేదములలో మొదటిదియై, అకారోకార మకార స్వరూపమయి నందున త్ర్యక్షరస్వరూపమయిన ఏవేద సారము గలదో, ఏ మూడక్షరములందే మూడు వేదములున్నవో అది మఱియొక త్రివృద్వేదము అయ్యెదియే ప్రణవమనునది వేదమన్త్రములలో శ్రేష్ఠమయినది గనుకను, పరమార్థ స్వరూపమగు బ్రహ్మమును వివరించునదిగనుకను, పరమార్థకమైనందున జప తపంబులు చేయువారికి మోక్షప్రదమైనందునను, మిక్కిలి రహస్యమును గోప్యము నయినది ఎవడీప్రణవమును స్వరూపముతోను, అర్థముతోను ఎఱుంగునో వాడే వేదవేత్త యగును
(మనుస్మృతి)

మకారం మననం చైవ త్రకారం త్రాణముచ్యతే ।
మననత్రాణమిత్యాహుర్మన్త్రమిత్యభిధీయతే ॥

మకారమునకు మననమనియు, త్రకారమునకు త్రాణమనియు అనగా తరింపజేయుట యనియు లేక రక్షించుట యనియు అర్థము మననము చేతను, త్రాణముచేతను మన్త్రశబ్దమేర్పడినది మననము చేయువానిని రక్షించునది గాన 'మంత్ర' మనబడును

ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ ।
సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్ ॥

ఎవడు నాసికాగ్రమందు మనస్సును నిలిపి ప్రణవము నుచ్చరించి ప్రణవార్థస్వరూపమగు పరబ్రహ్మమందు నిలకడ గలిగి యొక ముహూర్తకాలమైన నుండునో, వాడు వందలాది జన్మములలో ఆర్జింపబడిన పాపమంతయు నశించిన వాడై సంసారసాగరము నుండి తరింపగలుగుచున్నాడు

స్మరణాత్కీర్తనాద్వాపి శ్రవణాచ్చ జపాదపి ।
బ్రహ్మ తత్రాప్యతే నిత్యమోమిత్యేతత్పరాయణమ్ ॥

ఓంకారముయొక్క స్మరణవలనను, ఉచ్చారణ వలనను, శ్రవణమువలనను, జపమువలనను పరబ్రహ్మము పొందబడుచున్నది అదియే ( ఓంకారమే) మోక్ష స్థానము

దీపిక సమాప్తము



# పరిశిష్టము

## ఓంకారమాహాత్మ్యము

ఇదివరలో వ్రాయబడిన శ్రుతిస్మృతులవలన ఓంకారము యొక్క ప్రభావమును తెలిసికొనగలరు. అంత్యకాలముననెట్టి భావము గలిగియుండినచో జీవులు పరమాత్మను పొందగలరో, ఆవిషయము గీత అష్టమాధ్యాయమున ద్వితీయ శ్లోకమునందు అర్జునుడడిగిన ప్రశ్నకు శ్రీకృష్ణభగవానులేమి సమాధానమును చెప్పిరో, దానిని ముముక్షువులు, భక్తులు, అందఱును తెలిసి కొనవలయును. ఏలన, సాధకులందఱు అంత్యకాలమున మోక్షము కలుగుటకు గదా సాధనలు జేయుచున్నారు. ''ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః'' అని ప్రశ్న. ''నియతాత్మభిః'' అని ప్రయోగించుటచే ఒక జాతిని గుఱించి గాని, స్త్రీ గుఱించిగాని, పురుషుని గురించిగాని అడిగియుండ లేదని స్పష్టమగుచున్నది. ఇదియే యితర గ్రంధములకన్న, గీతకు గల విశిష్ట ప్రభావమునకు కారణము. ఈ గ్రంధము మిక్కిలి సంక్షిప్తమగుటవలన ఎక్కువ విస్తరించి వ్రాయ తలంచలేదు. విస్తారముగా తెలిసికొనదలంచువారు 'గీతార్థ ప్రకాశము'న జూడందగును. అన్త్యకాలమున ప్రణవము నుచ్చరించి, ప్రణవార్థమగు పరబ్రహ్మను ధ్యానించి ఎవరు దేహమును విడచెదరో, వారు సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును పొందగలరని శ్రీ భగవాను డుపదేశించెను. కావుననే ''యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిం'' అని ఉపదేశించిరి. అర్జునునియొక్క ప్రశ్నకు దగిన సమాధానము భగవంతుడు చెప్పినందుచేతనే భగవద్గీత కింత ప్రభావమున్ను, గౌరవమున్ను, లోకవ్యాప్తియున్ను గలిగినది. ప్రణవమన్త్రము నుపదేశించుటకు ముందుగా ఓంకారము యొక్క ప్రభావమును గుఱించి భగవంతుడు స్వయముగా వివరించెను.

> యదక్షరం వేదవిదో వదన్తి
> విశన్తి యద్యతయో వీతరాగాః ।
> యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
> తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥

వేద వేదాంతముల నెఱింగిన పరమఋషులచేత, ఏది నాశరహిత మయినది చెప్పబడుచున్నదో, రాగద్వేషాదులు నశించిన యతీశ్వరులచేత ఏ బ్రహ్మపదము

F18

పొందబడుచున్నదో, బ్రహ్మచర్యవ్రతనిష్ఠగల శుకాది బ్రహ్మర్షులచే నేది కోరబడుచున్నదో, అట్టి అక్షరస్వరూపమగు పరబ్రహ్మమును (పొందెడు ఉపాయమును) గుఱించి అతి సంగ్రహముగా తెలిపెదనని భగవానుడుపదేశించి చెప్ప నారంభించెను ఇచ్చట భగవానుడిచ్చిన సాక్షులెవరో, వారి గొప్పతనమును తెలిసికొనిన భగవానుడుపదేశింప తలంచిన ఓంకారముయొక్క ప్రభావము నెఱుంగగలరు

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥

ఎవడు బ్రహ్మమును ప్రతిపాదించునట్టి ఓంకారమనెడు ముఖ్య మయిన ఏకాక్షరమును ఉచ్చరించుచున్నవాడై ఆయోంకారమునకర్థమయిన పరమాత్మయగు నన్ను స్మరించుచున్నవాడై శరీరమును విడచుచున్నాడో, వాడు సర్వోత్తమమయిన గతిని అనగా మోక్షమును పొందుచున్నాడు ''యః ప్రయాతి'' అని ఉపదేశించుటవలన ప్రణవమును జపించుటకు, ధ్యానించుటకు, దాని అర్థమును చింతించుటకు అందఱును అర్హులేనని చెప్పినట్లైనది అట్లుగాకయుండిన, పలానావారు అర్హులు అని ఇచ్చట తెలిపియుందురు అయితే దీనియందొక మర్మము గలదు అదేమనగా, ''వ్యాహరన్ మామనుస్మరన్' ఓంకారమునుచ్చరించి ఓంకారార్థమగు పరబ్రహ్మము యొక్క భావన గలిగియుండవలయునని తెలుపబడినది అదియే దీని యందు గల కీలకము ఈ విధానము ప్రణవజప మొకదానికి మాత్రము గాదు ఏ మన్త్రమునకైనను జపముతోబాటు దానియొక్క అధిదేవతను స్మరించవలయును, భావింపవలయును అయితే ప్రణవజపమున కధికారిని గుఱించి దీనియందు నిరూపించకపోలేదు అదియే దీనియందు గల గొప్పతనము

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥

సకలేన్ద్రియముల చక్కగా నియమించి, మనస్సును హృదయమందు నిరోధించి తనయొక్క ప్రాణమును, ఆప్రాణమును ప్రేరణజేసెడు ముఖ్యప్రాణమగు నాత్మను, మూర్ధస్థానమునందు (బ్రహ్మరన్ధ్రమునందు) ఉంచి, యోగధారణను స్థిరముగా జేయువాడగుచు, నెవడు దేహమును వదులుచున్నాడో, వాడు పరమగతిని

పొందునని పై జెప్పిన శ్లోకమున కన్వయించుకొన వలయును అనగా నీ ప్రకారముండి ప్రణవమునుచ్చరించి పరమాత్మను భావనచేసి దేహమును విడుచువాడు బ్రహ్మపదమునొందును పై జెప్పిన ఓంకారధ్యానము ఔషధము గాను, ఇప్పుడు చెప్పిన సర్వేంద్రియసంయమము పథ్యముగాను ఎఱుంగవలయును, నిజమైన వైద్యుడు, ఈ ఔషధమున కీపథ్యమని అందఱితోను జెప్పునే గాని, ఈజాతివాని కీమందు, ఈ కులమువాని కీమందని యెటుల జెప్పడో, ఆలాగున భవరోగవైద్యుడగు భగవంతుడున్ను అట్టి సత్యమునే తెలిపెను ఈ ధర్మమునే కఠోపనిషత్తునందు యమధర్మరాజున్ను నచికేతసుడను ఋషికుమారునకు తెలిపెను

సర్వే వేదా యత్పదమామనన్తి
తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥

సమస్తవేదము లెద్దానిని ఏకమైన ప్రాప్యమగు ముఖ్యస్థానముగా జెప్పుచున్నవో' సమస్తతపస్సు లెద్దానిని పొందదగిన వస్తువునుగా బోధించుచున్నవో, ఏబ్రహ్మపదమును పొందగోరువారై వీతరాగులైన మహాత్ములు గురుకులవాసాది లక్షణయుతమయిన బ్రహ్మచర్యవ్రతము ననుష్ఠించుచున్నారో అట్టి పరబ్రహ్మమును (మోక్షమును) గూర్చి సంగ్రహముగా జెప్పుచున్నాను అది ఓంకారమే ఈ శ్రుతివాక్యము ననుసరించియే శ్రీ కృష్ణభగవానుడు గీతలో నుపదేశించెను

ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥

ఈ ఓంకారమే అక్షరమగు పరబ్రహ్మము ఈ ఓంకారమగు అక్షరమే పరమపదము ఈ అక్షరస్వరూపమగు ఓంకారమును తెలిసికొనినవాడు దేని నిచ్ఛగించునో దానిని పొందును

ఏతదాలమ్బనం శ్రేష్ఠమేతదాలమ్బనం పరమ్ ।
ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥

బ్రహ్మప్రాప్తి కవలంబింపతగిన అనగా అనుష్ఠింపతగిన సాధనలలో నీ ఓంకారోపాసనయే శ్రేష్ఠమయిన సాధన మగును ఈప్రణవోపాసనయే పరమయిన ఆలవ్బనవుగును ఈ ప్రణవోపాసన నవలంబించువాడు బ్రహ్మలోకవములో పూజ్యుడగును అనగా బ్రహ్మప్రాప్తిని పొందును గరుడపురాణమునందు శ్రీ వైకుంఠమున శ్రీ మహావిష్ణువు గరుడునికి ఈప్రణవమునే యుపదేశించెను

**అభ్యసేన్మనసా శుద్ధం త్రివృద్బ్రహ్మాక్షరం పరమ్ ।**
**మనో యచ్ఛేజ్జితశ్వాసో బ్రహ్మబీజమవిస్మరన్ ॥**

శుద్ధమును, అ కా ర, ఉ కా ర, మకారాత్మకమును పరబ్రహ్మ స్వరూపమును నగు నోంకారమును మనస్సుచే ధ్యానము జేయవలయును శ్వాసము నిరోధించివాడై బ్రహ్మబీజమగు ప్రణవాక్షరమును మరువనివాడై ప్రణవార్థమగు పరబ్రహ్మమందు మనస్సును నియమించవలయును ఆలాగున దేహము వీడువాడు పరబ్రహ్మమును పొందగలుగును

శ్రీ కాశియందు పరమశివుడున్ను అచట ప్రాణమును విడిచెడు ప్రాణికోట్ల దక్షిణకర్ణమునందు ఈ ప్రణవమునే ఉపదేశించి జీవన్ముక్తులనుగా జేయుచున్నాడని శివపురాణమున తెలుపడమైనది ఈ ఓంకారమునే తారకమన్త్రమని ఉపదేశించడమైనది

**కాశీపతిః కారుణికః కరాభ్యా**
**మాదాయ మూర్ధానమతీవ తాసామ్ ।**
**ఆగమ్య వేగాద్వ్యగపచ్చ తాసా**
**మోంకార మోంకారయతి స్మ కర్ణే ॥**

ఒకనాడు మృగశృంగుని భార్యలు మధ్యాహ్నమున మణికర్ణిక యందు శాస్త్రోక్తముగా స్నానము జేసి విశ్వేశ్వరాలయమునకు ప్రదక్షిణము చేయుచుండగా, ప్రదక్షిణము చేయుటచేత గలిగిన శ్రమ వల్ల ఒడలు తిరుగగా, వారు మనస్సులందిట్లని వేడుకొనిరి 'ఓ విశ్వేశ్వరా ! సకల పాపధ్వంసకా! సర్వమనోరథప్రదా ! హే శూలపాణే! సకలభయనాశకా ! మాకు రక్షకుడ వగుము' అని అనేక ప్రకారములుగా వేడికొనుచు స్మృతి తప్పి నేలపైబడిరి అప్పుడు కాశీవిశ్వేశ్వరుడు అమృగశృంగుని భార్యలయందు కనికరము గలవాడై వారి తలలను తన చేతులతో లేవనెత్తి పట్టుకొని, ఆ నలువురి చెవులయందును ఏక కాలములోనే 'ఓం' 'ఓం' అని తారకమన్త్రమయిన ప్రణవము

నుపదేశించెను అప్పుడు వారు దివ్యదేహము గలవారై శాశ్వతమగు శివపదమును పొందిరి ఈ విషయము మాఘ పురాణమున విస్తృతముగ కనందగును, ఓమ్

ఇప్పుడు శ్రుతిస్మృతి పురాణములలోగల ఓంకార మహాత్మ్యము, తత్ఫలభూతమయిన బ్రహ్మప్రాప్తి విషయము మిక్కిలి సంగ్రహముగా తెలుపడమైనది విశేషించి తెలిసి కొనదలంచినవారు 'ఓంకారము' లేక 'ప్రణవోపాసన' యను గ్రంథమున విశేషముగా చూడగలరు

ఇట్లు

మీచరాచర సుఖాభిలాషి

**శ్రీ మలయాళస్వామి**

ఓం లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఓం తత్సత్



ఓమ్

# ప్రకరణాన్త మంగళ శ్లోకములు

అజమపి జనియోగం ప్రాపదై శ్వర్యయోగాత్
అగతి చ గతిమత్తాం ప్రాపదేకం హ్యనేకమ్ ।
వివిధ విషయధర్మగ్రాహి ముగ్ధేక్షణానాం
ప్రణతభయవిహంతృ బ్రహ్మ యత్తన్నతో ఽస్మి ॥

ఐశ్వర్యమహిమచే వివిధ విషయధర్మములను గ్రహించుచుండు మందమతులకు అజమయ్యును జన్మించునదిగను, గతిలేనిదయ్యు గతిగలదిగను, ఏకమయ్యును అనేకముగ దోచుచుండునదియును, శరణు జొచ్చిన వారి భయమును పోగొట్టు నదియును నగు పరబ్రహ్మమును నమస్కరించుచున్నాను

ప్రజ్ఞావైశాఖ వేధక్షుభిత జలనిధే-
ర్వేదనామ్నో ఽన్తరస్థం
భూతాన్యాలోక్య మగ్నాన్యవిరతజనన-
గ్రాహఘోరే సముద్రే ।
కారుణ్యాదుద్దధారామృత మిదమమరై-
ర్దుర్లభం భూతహేతోః
యస్తం పూజ్యాభిపూజ్యం పరమగురుమముం
పాదపాతైర్నతో ఽస్మి ॥

ఎడతెగని జన్మమృత్యువులను క్రూరజలజంతువులచే భయంకరమగు సంసారసముద్రమున మునిగియుండు ప్రాణులను జూచి జాలిగొన్నవాడై కరుణతో వేదము లేక వేదాంతమను సముద్రమును తన ప్రజ్ఞ యను కవ్వముతో చిలికి అమర దుర్లభమైన అద్వైతసిద్ధాంతరూపమగు అమృతమును వెలికి దీసిన పరమపూజ్యుడగు, పరమగురుని(శ్రీగౌడపాదాచార్యులవారిని) సాష్టాంగముగ భక్తిపూర్వకముగ నమస్కరించుచున్నాను

యత్ప్రజ్ఞాలోకభాసా ప్రతిహతిమగమ
త్స్వాన్త మోహాన్ధకారో
మజ్జోన్మజ్జచ్చ ఘోరే హ్య సకృదుపజనో
దన్వతి త్రాసనే మే ।
యత్పాదా వాశ్రితానాం శ్రుతి శమ వినయ
ప్రాప్తిరగ్ర్యాహ్యమోఘా
తత్పాదౌ పావనీయౌ భవభయవినుదౌ
సర్వభావై ర్నమస్యే ॥

అతిఘోరమైనట్టియు, భయావహమైనట్టిదియు నగు జనన మరణ రూప సంసారసముద్రమునందు మాటిమాటికి మునుగుచు తేలుచున్న నాయొక్క హృదయాంధకారము ఏ మహనీయుని ప్రజ్ఞాప్రయుక్త బోధయనెడి ఆ లోకము (ప్రకాశము)చే సమూలముగ నశించినదో, ఎవనియొక్క పాద పద్మములు తన్నాశ్రయించినవారికి సర్వశ్రేష్ఠమును, అమోఘమును నగుశ్రుతిశ్రవణమును, శమమును, వినయమును కలుగ జేయుచున్నవో, ఏపాదములు జన్మమరణరూపభవభయమును నశింపజేయుచున్నవో, మఱియు నెయ్యవి పరమపవిత్రము లైనవో అట్టి (సద్గురు) పాదపద్మములను సర్వభావముతో (మనోవాక్కాయములతో) నమస్కరించుచున్నాను

(శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు )

గురుభక్తి జ్ఞానప్రాప్తికి ఆంతరంగిక సాధనమగుటచే శిష్య శిక్షార్థము ఆద్యంతములందు గురువందనము మంగళాత్మకముగా జేయబడినది

ఓమ్

'ఆచార్యవాన్ పురుషో వేద'



ఓమ్

## శాన్తి మన్త్రములు

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరై రంగై స్తుష్టువాగ్ంసస్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః ॥

ఓం స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః .



# పీఠిక

పరిశుద్ధమైన జ్ఞానమున్ను, శాంతియు, కరుణయు గల పరమభక్తులారా! సాధువులారా ! ఇదివరలో శుష్కవేదాంత తమోభాస్కరోంకారాది గ్రంథము లనేకములు వ్రాసియుండినను, వాటన్నిటిలోను జ్ఞానము, యోగము, నిష్కామకర్మములు విస్తారముగా తెలుపబడియుండినవేగాక, భగవద్భక్తికిని గూడ అచ్చటచ్చట విశదీకరించుచూ వచ్చినను దైవభక్తిని గూర్చి ప్రత్యేక పుస్తమొకటి రచించియుండలేదు ఆ కొఱత తీరుటకొరకు ఈ శ్రీనారదభక్తి సూత్రములకు పదవిభాగ, టీకా, తాత్పర్య, విశేషార్థములు వ్రాయడమైనది ''జ్ఞానం తు దుష్కరం లోకే భక్తిర్హి సుకరం నృణామ్'' కలియుగమున జ్ఞానమును పొందుట కష్టసాధ్యమనియు, భక్తియైతే సుఖకరమనియు ఋషులు నిశ్చయించిరి మహాప్రజ్ఞావంతులకు సహా ఇంద్రియాతీత దైవజ్ఞానము ప్రయాసమనియు అట్లుండగా ఇంద్రియ పరవశులై యుండువారి కదెంత కష్టసాధ్యమో తెలుసుకొనవచ్చును ఆలాగున యోగమార్గమున్నూ, తపోమార్గమున్నూ అందరికిన్నీ సులభసాధ్యములైనవి గావు ఒకవేళ జ్ఞానముగాని, యోగముగాని, తపస్సుగాని సిద్ధించవలసియుండిన దైవానుగ్రహము లేనిచో నవి సిద్ధించజాల వనియే అన్ని జ్ఞాన, యోగ, శాస్త్రములలో గన్పట్టుచున్నది దానిని గురించిన కారణమంతయు ఈ గ్రంథమున గనందగును ఇది సర్వులకున్నూ విదితము శ్రీకృష్ణభగవానుడు గీత అష్టమాధ్యాయమున -

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ (8-13)

అని చెప్పెను బ్రహ్మవాచకమైన ''ఓమ్'' అనునట్టి ఏకాక్షరము నుచ్చరించుచున్నవాడై నన్ను చింతించుచు శరీరమును విడిచి ఎవడు పోవు చున్నాడో, వాడు సర్వోత్తమమైన స్థానమును (మోక్షమును) బొందుచున్నాడు అయితే దీని కర్తుడెవడో అతని లక్షణము 12వ శ్లోకమున నిరూపించడమైనది

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥ (8-12)

సకలేంద్రియములను చక్కగ నియమించి మనస్సును హృదయమునందు నిరోధించి తనయొక్క ప్రాణమును మూర్ధస్థానమునందుంచి యోగధారణము నాశ్రయించినవాడగుచు పైశ్లోకమున దెలిపినట్లు ప్రణవమును జపించుచు ప్రణవార్థమగు పరమాత్మను భావించుచు దేహమును వీడిపోవువాడు బ్రహ్మప్రాప్తిని బొందునని తెలుపడమైనది సర్వేంద్రియ నిగ్రహముగల్గి యోగధారణమున ప్రాణమును బ్రహ్మరంధ్రమున నిలుపుట యనునది యెంత ప్రయాసమైన కార్యమో, ఎట్టి సిద్ధపురుషులకు ఋషి సత్తములకు సాధ్యమగునో యూహించుకొనవచ్చును, ''సర్వద్వారాణి సంయమ్య'' అని ప్రయోగించుటచే సర్వేంద్రియ నిగ్రహముగల వారిప్పుడు లోకములో ఎంత మందియున్నారో, లోకమే తెలిసికొనగలదు వెంటనే ఇది ప్రయాసమార్గమని తలంచి క్రింది శ్లోకము జెప్పడమైనది

**అనన్య చేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః ॥ (8-14)**

ఓయర్జునా ! ఎవండు ప్రతిదినమును ఎల్లప్పుడు ఇతర చింతలేనివాడగుచు నన్ను స్మరించుచున్నాడో అట్టి నిరంతరధ్యానపరుడైన ధ్యానయోగికి నేను సులభముగా పొందదగినవాడను అని బోధించడమైనది, ఈశ్లోకమున ''తస్యాహం సులభః పార్థ'' అని ప్రయోగించుటచే పైజెప్పినది కఠినమార్గమని యర్థమగుచున్నది

భక్తి మార్గము సులభముగా నుండగా కఠినమార్గమేల ద్రొక్కవలయునని భక్తులయొక్క ఆశయము అంతియగాక విశేషానుష్ఠానము లేకనే ఆ బాలవృద్ధము దీనియందు ప్రవేశించవచ్చును జ్ఞానయోగ తపోమార్గములన్నియు మంచివిత్తనముల వంటివనియు, భక్తి జలము వంటిదనియు ఋషులు వర్ణించియున్నారు అదియును నీగ్రంథమున గనుగొనవచ్చును ఎంత సారవంతములైన భూములైనను, ఉత్కృష్టములైన విత్తనములైనను వర్షము లేక యేలాగున ఫలించజాలవో ఆలాగున దీపమునకు తైలము, వత్తి, ప్రమిద, గాలిలేని స్థలము, ఉండవలసినవానిలో, తైలమేలాగున ముఖ్యమైనదో, ఆతైలమే వెలుతురై

మారునట్లు జ్ఞానదీపమునకు భక్తియే ప్రధాన సాధనమైనదని విజ్ఞుల ఆశయము కావున భక్తియను తైలమే జ్ఞానజ్యోతియై మారుచుండును దీనివల్ల జ్యోతివేరు, నూనె వేరు గాదని యర్థమగు చున్నది నూనెయొక్క పరిణామమే వెలుతురని యర్థము గాగలదు ఈశ్లోకమున ''యోమాం స్మరతి నిత్యశః'' ఈవాక్యము భక్తికి గల ప్రాధాన్యమును నిరూపించుచున్నది

మరియు ఈభక్తి మార్గమును దెలుపుటకు మరియొక కారణముగూడ గలదు అది శ్రీమద్భాగవతమున ప్రధమస్కంధమందు శ్రీనారదమహర్షి శ్రీవేదవ్యాసులకు తెలిపినదే యగును అది యీ క్రింద వ్రాయబడుచున్నది



# శ్రీ మద్భాగవతము

## ప్రథమస్కంధము

దీనియందు భక్తి ప్రభావమును గురించి చెప్పినది జూడుడు ''బదరి కాశ్రమంబున వ్యాసుండు భారతాఖ్యానంబు జేసియు నమ్మని, భూతహితంబు నందు దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీ తటంబున నొంటియుండి హేతువు వితర్కించుచు తనలో నిట్లనియె

వ్రతధారినై వేదవహ్ని గురుశ్రేణి
    మన్నింతు విహితకర్మముల గొఱత
వడకుండ నడపుదు భారతమిషమున
    బలికితి వేదార్థభావ మెల్ల
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మములందు
    దెలిపితి నేజెల్ల దీనజేసి
యాత్మ సంతసమంద దాత్మలో నీశుండు
    సంతసింపకయున్న జాడ దోచె
హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవత విధంబు బలుకనైతి
మోసమయ్యె దెలివి మొనయదు మఱచితి
ననుచు వగచుచున్న యవసరమున.

వ్యాసుని కడకు నారదుండు వచ్చుట

తనచేతి వల్లకీ తంత్రీ చయంబున
    సతత నారాయణ శబ్దమొప్ప
నానన సంభూత హరిగీతర వసుధా
    ధారల యోగీంద్ర తతులు సొక్క
గపిలజటాభారకాంతి పుంజంబుల
    దిశలు ప్రభాతదీధితి వహింప

దనులగ్న తులసికాదామ గంధంబులు
గగనాంతరాళంబు గప్పికొనగ
వచ్చె మింటనుండి వాసవీనందను
కడకు మాటలాడ గడకతోడ
భద్ర విమలకీర్తి పారగుడారూఢ
నయవిశారదుండు నారదుండు

కనియెఁ నారదుడంతఁ
వినయైకవిలాసు నిగమవిభజన విద్యా
జనితోల్లాసుఁ భవదుః
ఖనిరాసుఁ గురుమనోవికాసుఁ వ్యాసుఁ

ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెరింగి లేచి వ్యాసుండు వివిధక్రమంబులం బూజించిన నతండు లే నగవు నెగ డెడి మొగంబుతోడ, విపంచికా తంత్రి వ్రేల మోటుచు నిట్లనియె

ధాతవు భారతశ్రుతి విధాతవు వేదపదార్థజాల వి
జ్ఞాతవు కామముఖరిపుషట్కవిజేతవు బ్రహ్మ తత్త్వని
ర్ణేతవు యోగినేతవు వినీతుడ వీవు చలించి చెల్లరే
కాతరు కై వడిఁవగవ గారణ మేమి పరాశరాత్మజా !

అనిన బారాశర్యుం డిట్లనియె

పుట్టితి వజు తనువున జే
పట్టితివి పురాణపురుషు భజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది
ముట్టితివి మహాప్రబోధమున మునినాథా !

అదియునుం గాక నీవు సూర్యుని భంగి మూడు లోకంబులం జరింతువు వాయువు పగిది నఖిలజనులలోనఁ మెలంగుదువు సర్వజ్ఞుండవగుటం జేసి,

నీ కెఱుగరాని ధర్మము
లోకములను లేదు బహువిలోకివి నీ వీ

నా కొఱత యెట్టి దంతయు
నాకుఁ వివరింపవయ్య నారద ! కరుణన్

అనిన నారదుం డిట్లనియె

అంచితమైన ధర్మచయ మంతయు జెప్పి తి వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్ని నగాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరి గోరి నుతింపమి నార్యపూజితా !

హరి నామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావలీ
సురుచిభ్రాచితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోల గర్తాకృతిన్.

అపశబ్దంబుల గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము జేయు గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచుం
దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా ! తత్త్వజ్ఞ ! చింతింపుమా

మునీంద్రా ! నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు జేయకున్ననది ప్రశస్తంబై యుండదు భక్తిహీనంబులైన జ్ఞానవాచా కర్మ కౌశలంబులు నిరర్థకంబులు గావున మహాను భావుండవు, యథార్థదర్శనుండవు, సకలదిగంత ధవళకీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు నగునీవు నిఖిలబంధమోచనంబుకొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితో వర్ణింపుము హరివర్ణనంబు జేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వివక్షించి తద్వివక్షాకృత రూపనామంబులంజేసి పృథగ్దర్శనుండైన వాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావ చందంబున నెలవు సేరనేరదు కామ్యకర్మంబులందు రాగంబు గల ప్రాకృత జనులకు నియమించిన ధర్మంబులు జెప్పి శాసకుండవగు నీనడవడి దగదది యెట్టులనిన, వారలదియె ధర్మంబని జుగుప్సితంబులగు కామ్యకర్మంబులు సేయుచు తత్త్వజ్ఞానంబు మఱతురు గావున, బుద్ధిమోహంబు జనియింప పక తత్త్వప్రదుండవై వ్యథావియోగంబు సేయుమని

మఱియు నిట్లనియె

ఎఱిగెడు వాడు కర్మచయమెల్లను మాని హరిస్వరూపముఁ
నెఱయ నెఱుంగు దాను మది నేరుపు జూపు గుణానురక్తుడై
తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమానయుక్తుడై
యెఱుగని వానికిం దెలియ నీశ్వరలీల మునీంద్ర ! చెప్పుమా

తనకులధర్మముఁ విడిచి దానవ్వై రిపదారవిందముల్
పనివడి సేవజేసి పరిపాకము వొందక యెవ్వడేని జ
చ్చిన మఱుమేన్నైన నది సిద్ధి వహించు దదీయసేవ బా
సిన గులధర్మ గౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులఁ

అది గావున నెఱుకగలవాడు హరిసేవకుం బ్రయత్నంబుసేయందగు గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబులైనను హరిసేవ విడువందగదు దానంజేసి యూర్ధ్వంబున బ్రహ్మ పర్యంతంబు క్రింద స్థావర పర్యంతంబు దిరుగుచున్న జీవులకు దుఃఖంబులట్ల సుఖంబులు ప్రాకృత కర్మాధీనంబులై సిద్ధించు నెయ్యది వొందరాదట్టి మేలు సిద్ధించుకొఱకు హరిసేవ సేయవలయు హరి సేవకుండగువాడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారంబునం జిక్కండు క్రమ్మఱ హరిచరణ స్మరణంబుజేయు భక్తిరసవశీకృతుండయి విడువ నిచ్ఛగింపండు ''

ఇదియును గాక నైష్కర్మ్యసిద్ధిని వ్రాసిన శ్రీ సురేశ్వరాచార్యులు మోక్షమునకు జ్ఞానమే ముఖ్యసాధనమని నిరూపించినను అట్టి జ్ఞానము దేనివలన గలుగునో అదియును నిరూపించిరి అది వారు వ్రాసినట్లే ఈ క్రిందపొందు పరచడమైనది పుణ్యకర్మలున్నూ, భగవద్భక్తియున్నూ సామాన్యములని దెలుపుచుండు వేదాంతులు చాలమంది గలరు బ్రహ్మ సూత్రమును రచించిన శ్రీ వేదవ్యాసులయొక్కయు, నైష్కర్మ్య సిద్ధిని రచించిన సురేశ్వరాచార్యుల యొక్కయు ఆశయ మిచ్చట నిరూపించడమైనది

**నిత్యకర్మానుష్ఠానాద్ధర్మోత్పత్తిర్ధర్మోత్పత్తేఃపాపహాని స్తతశ్చిత్త శుద్ధిస్తత స్సంసార యాథాత్మ్యావబోధస్తతో వైరాగ్యం తతో ముముక్షుత్వం తతస్తదుపాయపర్యేషణం తతస్సర్వకర్మ తత్సాధన సంన్యాసస్తతో యోగాభ్యాసస్తతశ్చిత్తస్య ప్రత్యక్ప్రవణతా తతస్తత్త్వమస్యాది వాక్యార్థ పరిజ్ఞానం తతోఽవిద్యోచ్ఛేద స్తతస్స్వాత్మన్యే వావస్థానమ్.**

నిత్యకర్మల ననుష్ఠించుటవలన ధర్మము జనించును ధర్మము జనించినందున పాపముల యొక్క నాశము గలుగును పాపహానివలన చిత్తము శుద్ధినొందును చిత్తము శుద్ధినొందుటవలన సంసారముయొక్క వాస్తవస్థితి తెలియును అందువలన వైరాగ్యము పుట్టును అందుచే మోక్షేచ్ఛ కలుగును అందువలన మోక్షసాధనములను విచారించును అందువలన సర్వకర్మములను దాని సాధనములను సన్న్యసించును అందువలన యోగము నభ్యసించును అందువలన చిదాత్మయందు ఆసక్తి గలుగును అందువలన తత్త్వమసి మొదలగు మహావాక్యములయొక్క అర్థము తెలియబడును అందువలన అజ్ఞానము యొక్క వినాశము కలుగును అందువలన స్వస్వరూపమునందు స్థిరత్వము కలుగును

ఇపుడు మోక్షసాధనమును సృష్ట్యారంభమునుండి దెలుపువచ్చిన శ్రీ దక్షిణామూర్తి, దత్తాత్రేయులు, శ్రీ శంకరాచార్యులు మొదలగు వారి ఆశయము తెలియుటకొఱకు వారి అభిప్రాయములను గూడ క్రింద గనపరచెద వారందరున్ను భక్తివల్లనే ముక్తి గలుగుననెడి యభిప్రాయము గలవారే తక్కిన ద్వైత విశిష్టాద్వైతు లందరున్నూ భక్తివల్లనే ముక్తి గలుగుననెడి యభిప్రాయము గలవారగుటచే వారి యాశయమిచట చేర్చనక్కర లేదు వీరలలో శైవ వైష్ణవాచార్యు లందరున్నూ భక్తి లేక మోక్షము గలుగదను నేకాభిప్రాయము గలవారు దక్షిణామూర్త్యుపనిషత్తు ః-

**వైరాగ్య తైలసంపూర్ణే భక్తివర్తి సమన్వితే।**
**ప్రబోధ పూర్ణపాత్రే తు జ్ఞప్తిదీపం విలోకయేత్॥**

ఇది సనకాది మహర్షులకొఱకు శ్రీదక్షిణామూర్తియగు ఈశ్వరుండు బోధించినది దీపముచేతనే గృహాన్తరాళములోగల చీకటి నశించును ఆలాగున జ్ఞానజ్యోతి వెలుగుటకు భక్తియను తైలము ముఖ్యమైనది అయితే దీపమునకు తైలము, వత్తి, ప్రమిద యెట్లవసరమో యాలాగున వైరాగ్యము, భక్తి, ధ్యానము- వమూడున్నూ క్రమముగా నుండవలయును గాలిలేని స్థలమువలె వివిక్తప్రదేశమున్నూ అవసరము ఈ నాలుగున్నూ గలిగిన నిచట గాని, బదరికాశ్రమమునందు గాని, కాశియందు గాని దీపము వెలిగించవచ్చును

బ్రాహ్మణుడు గాని, అబ్రాహ్మణుడు గాని, స్త్రీ గాని, పురుషుడు గాని, మరమునందుగాని, గృహము నందుగాని వెలిగించినను దీపము వెలుగును లేనిచో ఎవరై నను ఎచ్చోటనైనను దీపమును వెలిగింపజాలరు అవధూత గీతయందు శ్రీదత్తాత్రేయులు -

ఈశ్వరాను గ్రహాదేవ పుంసామద్వైతవాసనా।
మహాభయపరిత్రాణా ద్విత్రాణా ముపజాయతే॥

ఈశ్వరాను గ్రహమువల్లనే రక్షణములేని జీవులకు జననమరణ మహాభయమునుండి రక్షించెడు వేదాంతమున జెప్పబడిన అద్వైతవాసన యుదయించును

శ్రీ శంకరుల మణిరత్నమాల -

అపార సంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి।
గురో కృపాళో కృపయా వదై తద్వి శ్వేశపాదాంబుజ దీర్ఘ నౌకా॥

ప్రశ్న - అపారమైన సంసారసాగరమందు మునుగుచుండు నాకు దీనినుండి తరించుటకుపాయమెద్ది ? ఉత్తరము- సర్వేశ్వరుని యొక్క పాదారవింద ధ్యానమనెడు దృఢమైన విశాలమైన ఓడయే తరణోపాయము గీతలో చతుర్దశాధ్యాయమున సత్త్వరజస్తమస్సుల నెడు మూడు గుణములచేత జీవుడు బంధింపబడుచున్నాడనియు, ఈ మూడు గుణములయొక్క బంధనములనుండి విముక్తి గలుగవలసియుండిన భగవంతునియందుగల భక్తి యొక్కటియే కారణమని తెలిపినది జూడుడు

మాం చ యోऽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

ఎవడు అచంచలమైన భక్తియోగముచేత నన్ను సేవించుచున్నాడో వాడు ఈత్రిగుణములను ప్రయాసలేకనే అతిక్రమించి బ్రహ్మసాక్షాత్కారమును బొందుటకు సమర్థుడగుచున్నాడు మఱియు శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవునికి భాగవతమున నుపదేశించినది జూడుడు

న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।
న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా ॥

ఓ యుద్ధవా ! నన్ను బొందుటకు భక్తికి సమానమైన శక్తి, యోగమునందుగాని, సాంఖ్యమునందుగాని, ధర్మమునందుగాని, వేదాధ్యయనమునందుగాని, తపస్సునందుగాని, త్యాగమునందుగాని లేదు అనగా భక్తి యొక్క దానివల్లనే నేను వశీకృతుడను గాగలను

యస్య భక్తిర్భగవతి హరౌ నిశ్శ్రేయసేశ్వరే ।
విక్రీడితోఽమృతామ్భోధౌ కిం క్షుద్రైః ఖాతకోదకైః ॥

ఎవనికి ముక్తిని గలుగజేసెడు భగవంతుడైన శ్రీ హరియందు భక్తి గలిగియుండునో, వాడు అమృత సాగరములో క్రీడించువాడు వానికి బురదగుంటలతోనేమి ప్రయోజనము ? భక్తి అమృతసాగర మనియు తక్కిన సాధనలన్నియు తుచ్ఛములైన బురదగుంటలవంటివనియు తెలుపడమైనది శ్రీపతంజలి మహర్షి యోగదర్శనమున యోగపాదమున ''ఈశ్వర ప్రణిధానాద్వా'' అనగా ఈశ్వరోపాసన వల్ల సమాధిప్రాప్తియు, కైవల్య ప్రాప్తియు నత్యంత శీఘ్రముగ గలుగునని చెప్పిరి శ్రీవిద్యారణ్యులు అనుభూతి ప్రకాశమున -

ఈశ్వరానుగ్రహాచ్ఛాన్తి దాన్త్యాది గుణ సంయుతమ్ ।
జన్మ చేల్లభ్యతే తస్మిన్ విద్యయా మోక్షమాప్నుయాత్ ॥

ఈశ్వరాను గ్రహమువల్లనే జీవునికి శమదమాది గుణములతో గూడిన జన్మము లభించును అట్టి శాన్తిదాన్త్యాది దైవగుణములు గల జన్మమందే జ్ఞానము గలుగును అట్టి జ్ఞానమువల్లనే జీవన్ముక్తి అనగా మోక్షము సిద్ధించును శంకరులు అపరోక్షాను భూతియందు -

స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।
సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ ॥

ధర్మానుష్ఠానముచేతను, తపస్సుచేతను ఈశ్వరానుగ్రహము గలుగునప్పుడే సాధనచతుష్టయ సంపత్తియగు (1) నిత్యానిత్య వస్తువివేకము (2) ఇహాముత్ర

ఫలభోగ విరాగము (3) శమాది షట్క సంపత్తి, (4) ముముక్షుత్వము జీవులకు గలుగును వీనివల్లనే మోక్షము సిద్ధించును సర్వవేదాంత సార సంగ్రహమున -

**ఆజీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।**
**పూర్వం జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వ నివృత్తయే ॥**

జీవించియుండువరకు వేదాంతశాస్త్రము, గురుదేవుడు, ఈశ్వరుడు అను నీ మూడున్ను సదా సేవ్యములు ఒకవేళ ఒకరికి జ్ఞానము గలిగినను పైజెప్పిన మూడింటివల్లనే సిద్ధించియుండును అందుచేతను కృతజ్ఞత గలిగియుండుట కొఱకున్నూ పైజెప్పినవి సేవ్యములు లేనిచో కృతఘ్నత్వ దోష మాపాదించును అట్టి దోషము నివర్తించుట కొఱకే ఋషి పరంపరానుసరణము గలిగి యుండవలయును శ్రీనారదుండు నారదభక్తిసూత్రమందు సూ ॥ ''లభ్యతేఽపి తత్కృపయైవ,'' మహాత్ములతో గల సహవాసముగాని, మోక్షముగాని ఆభగవంతుని కృపాకటాక్షమువల్లనే గలుగవలయుననిరి ఇక విస్తారముగా వ్రాసి గ్రంథము పెంచ తలంచలేదు వ్రాయతలంచిన వేలకొలది ప్రమాణములున్నూ, దృష్టాంతము లున్నూ లభింపగలవు సామాన్యముగా ఈ గ్రంథములోనే ప్రమాణములు దొరక గలవు భక్తివిశ్వాసములు గలవారికింతే చాలునని తలంచి విరమించడమైనది

ఇంకొక్క విషయమును గూడ తెలిపెద మోక్షమునకు జ్ఞానమొక్కటియే సాధనమని శ్రుతియందు గలదు, ఇది బ్రహ్మ జ్ఞానమనియు, దైవజ్ఞానమనియు, ఆత్మజ్ఞానమనియు పేర్లను గలిగియున్నది ఇది రెండు ఉపాయములచే బొందబడునని యనాదినుండి శ్రుతి, స్మృతులు ప్రతి పాదించుచూ వచ్చుచున్నవి ఇవి (1) మార్జాల కిశోరకన్యాయమనియు, (2) మర్కటకిశోరకన్యాయమనియు ప్రసిద్ధమైన పేర్లు గలిగియున్నవి మార్జాల కిశోరక న్యాయము భక్తిమార్గమనియు, మర్కట కిశోరక న్యాయము జ్ఞాన, యోగ, తపస్సులతో కూడినదనియు ప్రసిద్ధము పిల్లి తన పిల్లలను స్వయముగా నెత్తుకొని స్థానములను మార్చుచు పాలిచ్చుచూ ఆహారము తెచ్చి పెట్టుచుం డును కోతి యన్ననో తనపిల్లను తాను పట్టు కొని వెళ్ళునది లేదు అదియే తల్లియొక్క కడుపును పట్టుకొని యుండిన

అది దానిని తీసుకొని పోవుచుండును ఒక వృక్షశాఖనుండి మరియొక శాఖమీది కెగురునప్పుడు గాని, ఒక ప్రాసాదమునుండి మరియొక ప్రాసాదము మీదికి దుముకునప్పుడు గాని, బిడ్డయే తల్లిని గట్టిగా బట్టుకొని యుండిన తల్లియే తీసుకొనివెళ్లును పట్టుదల దృఢముగా లేనిచో క్రింద బడిపోవును తల్లి ఆహారమును దెచ్చిగాని, తీసిగాని బిడ్డకిచ్చునది లేదు అదియే స్వయముగా తీసుకొని తినవలయును ఆలాగున అనన్య భక్తిగల ప్రపన్నుని సమస్త కార్యములున్నూ ఆ భగవంతుడే చూచుకొనుచుండును ''యోగక్షేమం వహామ్యహమ్'' అని తెలుపుటకు గారణమిదే జ్ఞానియో తనయనుష్ఠానాది కార్యములన్నిటిలోను తానే జాగ్రత్త వహించి పతనము గలుగనీయక గట్టి పట్టుదల గలిగియుండిన తరించుటలో సందేహము లేదు భక్తిమార్గమునకున్నూ, ఇతర మార్గములకున్నూ యింతమార్పుగల దని గ్రహించందగినది ఇందువల్లనే గీత చరమశ్లోకమున ''సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'' అని భగవాను డనుగ్రహ పూర్వకముగా వచించెను

**ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్.**

**సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వస్సద్బుద్ధిమాప్నోతు సర్వస్సర్వత్ర నందతు ॥**

**లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు**
**ఓమ్ తత్ సత్**

మీ చరాచర సుఖాభిలాషి,
శ్రీ మలయాళస్వామి.

——— •※• ———

# శ్రీనారద భక్తిసూత్రములు-మూలము

1 అథాఽతో భక్తిం వ్యాఖ్యాస్యామః
2 సా త్వస్మిన్ పరమ ప్రేమరూపా
3 అమృతస్వరూపా చ
4 యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి అమృతో భవతి తృప్తో భవతి
5 యత్ప్రాప్య న కిఞ్చిత్ వాఞ్ఛతి న శోచతి నద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి
6 యద్జ్ఞాత్వా మత్తో భవతి స్తబ్ధో భవతి ఆత్మారామో భవతి
7 సా న కామయమానా నిరోధరూపత్వాత్
8 నిరోధస్తు లోక వేదవ్యాపార న్యాసః
9 తస్మిన్ అనన్యతా తద్విరోధిషూదాసీనతా చ
10 అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా
11 లోకవేదేషు తదనుకూలాచరణం తద్విరోధి షూదాసీనతా
12 భవతు నిశ్చయదార్ఢ్యాదూర్ధ్వం శాస్త్రరక్షణమ్
13 అన్యథా పాతిత్యాశఙ్కయా
14 లోకోఽపి తావదేవ కింతు భోజనాది వ్యాపారస్త్వాశరీరధారణావధి
15 తల్లక్షణాని వాచ్యన్తే నానామత భేదాత్
16 పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః
17 కథాదిష్వితి గర్గః
18 ఆత్మరత్య విరోధేనేతి శాండిల్యః
19 నారదస్తు తదర్పితా ఖిలాచారితా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి
20 అస్త్యేవ మేవమ్
21 యథా వ్రజగోపికానామ్
22 తత్రాపి న మాహాత్మ్య జ్ఞాన విస్మృత్యపవాదః

23 తద్విహీనం జారాణామివ
24 నాస్త్యేవ తస్మింస్తత్సుఖ సుఖిత్వమ్
25 సా తు కర్మజ్ఞాన యోగేభ్యోఽప్యధికతరా
26 ఫలరూపత్వాత్
27 ఈశ్వరస్యాప్యభిమానిద్వేషిత్వాద్దైన్య ప్రియత్వాచ్చ
28 తస్యాజ్ఞానమేవ సాధనమిత్యేకే
29 అన్యోన్యా శ్రయత్వమిత్యన్యే
30 స్వయం ఫలరూపేతి బ్రహ్మకుమారః
31 రాజగృహ భోజనాదిషు తథైవ దృష్టత్వాత్
32 న తేన రాజ పరితోషః క్షుచ్ఛాన్తిర్వా
33 తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః
34 తస్యాః సాధనాని గాయన్త్యాచార్యాః
35 తత్తు విషయత్యా గాత్సంగత్యా గాచ్చ
36 అవ్యావృత భజనాత్
37 లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్
38 ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపా లేశాద్వా
39 మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽ మోఘశ్చ
40 లభ్యతేఽపి తత్కృపయైవ
41 తస్మిం స్తజ్జనే భేదాభావాత్
42 తదేవ సాధ్యతామ్ తదేవ సాధ్యతామ్
43 దుస్సంగస్సర్వ థైవత్యాజ్యః
44 కామక్రోధ మోహస్మృతి భ్రంశ బుద్ధినాశ సర్వనాశ కారణత్వాత్
45 తరఙ్గాయితా అపీమే సంగాత్సముద్రాయంతి
46 కస్తరతి కస్తరతి మాయాం? యస్సంగాం స్త్యజతి యో మహానుభావం
సేవతే

47 యో వివి క్తస్థానం సేవతే యో లోక బన్ధమున్మూలయతి నిస్త్రైగుణ్యో భవతి యో యోగక్షేమం త్యజతి

48 యః కర్మఫలం త్యజతి కర్మాణి సంన్యస్యతి తతో నిర్ద్వన్ద్వో భవతి

49 యో వేదానపి సంన్యస్యతి కేవలమవిచ్ఛిన్నానురాగం లభతే

50 స తరతి స తరతి స లోకాంస్తారయతి

51 అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్

52 మూకాస్వాదనవత్

53 ప్రకాశ్యతే క్వాపి పాత్రే

54 గుణరహితం కామనారహితం ప్రతిక్షణ వర్ధమాన మవిచ్ఛిన్నం సూక్ష్మతరమనుభవరూపమ్

55 తత్ప్రాప్య తదేవావలోకయతి తదేవ శృణోతి తదేవ చిన్తయతి

56 గౌణీ త్రిధా గుణ భేదా దార్తాది భేదాద్వా

57 ఉత్తరస్మాదుత్తర స్మాత్పూర్వ పూర్వా శ్రేయాయ భవతి

58 అన్యస్మాత్సౌలభ్యం భక్తౌ

59 ప్రమాణాంతర స్యాఽనపేక్షత్వాత్స్వయం ప్రమాణత్వాత్

60 శాన్తి రూపాత్పర మానంద రూపాచ్చ

61 లోకహానౌ చిన్తా న కార్యా నివేదితాత్మ లోక వేదత్వాత్

62 న తత్సిద్ధౌ లోక వ్యవహారో హేయః కింతు ఫలత్యాగ స్తత్సాధనం చ కార్యమేవ

63 స్త్రీధన నాస్తిక చరిత్రం న శ్రవణీయమ్

64 అభిమాన దంభాదికం త్యాజ్యమ్

65 తదర్పితాఖిలాచారస్సన్ కామ క్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్

66 త్రిరూప భంగ పూర్వకం నిత్య దాస్య నిత్య కాన్తా భజనాత్మకం ప్రేమ కార్యం ప్రేమైవ కార్యమ్

67 భక్తా ఏకాన్తినో ముఖ్యాః

68 కణ్ఠావరోధ రోమాఞ్చాశ్రుభిః పరస్పరం లపమానాః పావయన్తి కులాని పృధివీం చ
69 తీర్థీకుర్వన్తి తీర్థాని, సుకర్మీకుర్వన్తి కర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి
70 తన్మయాః
71 మోదన్తే పితరో నృత్యన్తి దేవతాః సనాధా చేయం భూర్భవతి
72 నాస్తి తేషు జాతి విద్యా రూపకుల ధన క్రియాది భేదః
73 యతస్తదీయాః
74 వాదో నావలంబ్యః
75 బాహుల్యావకాశ త్వాదనియతత్వాచ్చ
76 భక్తి శాస్త్రాణి మననీయాని తదుద్బోధక కర్మాణి కరణీయాని
77 సుఖదుఃఖేచ్ఛా లాభాది త్యక్తే కాలే ప్రతీక్ష్యమాణే క్షణార్ధమపి వ్యర్ధం న నేయమ్
78 అహింసా సత్యశౌచ దయా_ఽ_ఽస్తి క్యాది చారిత్రాణి పరిపాలనీయాని
79 సర్వదా సర్వభావేన నిశ్చింతితైర్భగవానేవ భజనీయః
80 సకీర్త్యమాన శ్శీఘ్రు మేవావిర్భవత్యనుభావయతి భక్తాన్
81 త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ భక్తి రేవ గరీయసీ
82 గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్త్యాత్మనివేదనా సక్తి, తన్మయతాసక్తి, పరమవిరహా సక్తి, రూపైకధా ప్యేకాదశధా భవతి
83 ఇత్యేవంవదన్తి జనజల్ప నిర్భయా ఏక మతాః కుమార వ్యాస శుక శాణ్డిల్య గర్గవిష్ణు కౌణ్డిన్య శేషోద్ధవారుణి బలి హనుమద్విభీషణా దయో భక్త్యాచార్యాః
84 య ఇదం నారద ప్రోక్తం శివానుశాసనం విశ్వసితి శ్రద్ధత్తే స భక్తి మాన్భవతి స ప్రేష్ఠం లభతే స ప్రేష్ఠం లభత ఇతి

ఓమ్ తత్ సత్



ఓం నమో నారాయణాయ

# శ్రీ నారద

# భక్తిసూత్రములు

## 1. ప్రథమోఽధ్యాయః - భక్తిస్వరూపమ్.

## మొదటి అధ్యాయము - భక్తి స్వరూపము

### 1. సూత్రము ॥ అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః.

పదవిభాగము - అథ - అతః - భక్తిం - వ్యాఖ్యాస్యామః

టీక ॥ అథ అనంతరము, అతః = ఈ కారణమువలన, భక్తిం = భక్తిని వ్యాఖ్యాస్యామః= వ్యాఖ్యానమును జేయుచున్నారము

తా ॥ ఇతర కృత్యములకన్న, భగవత్ప్రాప్తికి (మోక్షమునకు) భక్తి సులభమార్గమగుటచే అట్టి భక్తిని వివరించుచున్నాము

వి ॥ అథశబ్దార్థము - ''మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ'' అను కోశము ననుసరించి (1) మంగలము, (2) తర్వాత, (3) ఆరంభించుట, (4) ప్రశ్నయు, (5) అంతయు నని అథశబ్దమునకు ఐదర్థములు గలవు ఇచట అనంతరమను అర్థమునే గ్రహించడమైనది దేనికనంతరము అని నిరూపించవలసి యున్నది అంతఃకరణ శుద్ధిగలిగి, జిజ్ఞాస, లేక ముముక్షత్వ ముదయమైన తర్వాత యని గ్రహించుకొనవలయును అంతఃకరణశుద్ధి యెట్లు గలుగునో, ఆ విషయమై శ్రీకృష్ణభగవాడు గీత సప్తమాధ్యాయమున దెలిపినది జూడుడు

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వంద్వ మోహ నిర్ముక్తా భజంతే మాం దృఢ వ్రతాః ॥ (7-28)**

పుణ్యకర్మములు జేసినట్టి మనుష్యులలో, ఎవరియొక్క పాపమైతే నశించినది

యగుచున్నదో, అట్టివారలు రాగద్వేషాది ద్వంద్వమోహములవల్ల గలిగెడు యజ్ఞానముచే విడువబడినవారును, దృఢమైన వ్రతనిష్ఠగలవారునై నన్ను భజించుచున్నారు

*తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।*
*ముముక్షూణామపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే ॥*

శాస్త్రోక్తములైన వ్రతాది పుణ్యకర్మములచేత, దురితములు నశించుటవలన శుద్ధమైన అంతఃకరణములు గలవారును, ఐహికాముష్మికాది ఫలభోగేచ్ఛ లేనివారును, మోక్షాపేక్ష గలవారునైన జనులకు ఆత్మస్వరూపబోధ గలుగుటకు ''ఆత్మబోధ'' యనుగ్రంథము మాచే చేయబడుచున్నది పుణ్యకర్మాదులచే పాపము నశించినవారికే మోక్షేచ్ఛ గలుగుచున్నదని శ్రీశంకరాచార్యులవారి ఆశయము (ఆత్మబోధము)

*ప్రక్షీణాశేష పాపానాం జ్ఞానే ధ్యానే భవేన్మతిః ।*
*పాపోపహతబుద్ధీనాం తద్వార్తాఽపి సుదుర్లభా ॥*

పుణ్యకర్మములచే పాపము నిశ్శేషముగ నశించినవారలకు దైవజ్ఞానమునందున్ను, ధ్యానమునందున్ను బుద్ధి గలుగుచున్నది పాపముచే హతమైన మలిన మనస్సు గలవారలకు దైవజ్ఞానమునందు, దైవధ్యానమునందు మనస్సు కలుగనే కలుగదు 'రోగానివ రసాయనమ్' జ్వరాది రోగము గలవానికి మంచి రుచికర వస్తువులు గూడ ఏలాగున చేదుగనుండునో, ఆలాగున పాపమనెడు రోగముచే అంతఃకరణము చెడినవానికి అమృత సమానమగు భక్తిగూడ చేదుగనుండును దివ్యరసాయనముచే రోగము నశించునపుడు ఆహారమం దెట్లభిరుచి గలుగునో ఆలాగున పుణ్యకర్మములచే పాపకర్మములగు భవరోగము క్షయించునపుడు భగవద్భక్తియందు ప్రీతి కలుగును భక్తియొక్క ప్రభావమును గురించి గీతలో శ్రీకృష్ణభగవానుడు నుడివినది జూడుడు ఈ ఆరవ అధ్యాయమున ఆత్మ సంయమ యోగమును గురించి విశేషముగ దెలిపి కట్టకడకు ఇట్టి దైవసాక్షాత్కారజ్ఞానమునకు భక్తియే ముఖ్యసాధనమని తెలుపబడమైనది

*తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।*
*కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥*

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ (6-46,47)

కృచ్ఛ్రచాంద్రాయణాది తపమొనర్చువారికన్నను, యోగి యధికుడు నిత్యానిత్య వస్తు వివేకజ్ఞానము శాస్త్రముద్వారా తెలుసుకున్న వార్లకన్నను యోగి యధికుడు నిత్యనైమిత్తిక కర్మకాండముల నాచరించువార్లకన్నను యోగి యధికుడు అందువలన నో యర్జునా! నీవు యోగివి గమ్ము ఇచట తపస్వులకన్నను, జ్ఞానులకన్నను, కర్మనిష్ఠులకన్నను యోగపరుడు అధికుడని తెలిపి యటువంటి యోగులెవరెవరు గలరో, వారలందరికన్న నెవడైతే నాయందు సమర్పింపబడిన యంతఃకరణము గలవాడై శ్రద్ధగలిగి భక్తిచేయుచుండునో, అట్టివాడు నిజమైన యోగియగుచున్నాడు, కావున నిచట పైజెప్పిన వారలందరికన్న తదేక ధ్యాననిష్ఠగల భక్తుడే యధికుడని తెలుపడమైనది ఏలన భగవదనుగ్రహము గలిగిన మాత్రమే తపస్సును వేదాంత శ్రవణ జ్ఞానమున్నూ, కర్మయున్ను ఫలించును భగవదనుగ్రహము గలుగుటకు భక్తి తప్పక గలిగియుండవలయును మఱియు పదునాల్గవ అధ్యాయమున మూడుగుణముల లక్షణములున్నూ, గుణత్రయాతీతుని స్వరూపమున్నూ వర్ణించి కట్టకడకు అట్టి గుణత్రయాతీత మగు జ్ఞానము గలుగవలసియుండిన భగవద్భక్తి తప్ప వేరు మార్గము లేదని నిరూపించడైనది పైన నుదాహరించిన మూడు గుణములనున్నూ, మూడు గుణములు లేని స్వరూపసాక్షాత్కార జ్ఞానము గలవానియొక్కయు, ముక్తిసుఖమును బొందినవానియొక్కయు స్వరూపస్థితిని తెలిపెడి స్థలములలో భక్తినిగురించి యొక్క మాటనైన దెలుపక కేవలము ఆత్మానాత్మ విచారణ జ్ఞానము మాత్రమే జెప్పుచు వచ్చి కట్టకడలో ఆ భక్తిని గురించి జెప్పుటలో దీని వలననే పైజెప్పినవన్నియు ఫలించగలవని యర్థమగుచున్నది

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ (14-26)

ఎవ డచంచలమ్మైన భక్తి యోగముచేత నన్నే సేవించుచున్నాడో, వాడీత్రిగుణములను ప్రయాస లేకనే యతిక్రమించి బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమును బొందుటకు సమర్థుడగుచున్నాడు సత్వరజః తమస్సులనెడు మూడుపాశములచే జీవుడు బద్ధుడై యుండును, ఈ మూడు గుణములే సంసార పాశములనంబడును

ఈ విషయము ఆ యధ్యాయము యొక్క ఐదవ శ్లోకమున నిరూపించడమైనది అచట గనుగొనవచ్చును మఱియు సప్తమాధ్యాయమున దెలిపినదియు జూడుడు

దైవీ హ్యేషా గుణమయీ మమమాయా మయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥ (7-14)

ఈలోకవమున త్రిగుణాత్మకమైన నాయొక్క ప్రకృతి, దైవమాయా సంబంధమైనది గనుక సామాన్యులకు దాటుట కశక్య మైనది కావున ఎవరు నన్ను శరణు బొందుచున్నారో వారీ మాయను సులభముగా దాటుచున్నారు దీనికి విష్ణు మాయ యనియు, శివశక్తి యనియు బేరులు ఒక చక్రవర్తిదగ్గరకు వెళ్లవలసియుండిన మార్గములో కాపలా యుండువా రితరులను బోనివ్వరు అట్టి ద్వారపాలకులను తిరస్కరించి వెళ్లజూచిన వారడ్డగింతురు ఇక బలమును జూపిన వారు తమ ఆయుధముతో నిరోధింతురు కాని ముందుగా రాజాజ్ఞ పొందియుండినచో యాద్వారపాలకులే ప్రేమతో పిలుచుకొనిపోయి రాజ సన్నిధిలో జేర్చెదరు భక్తితో దైవానుగ్రహము బొందే వారికిన్ని, భక్తిలేక స్వశక్తియగు తపస్సు, యోగము, వేదాన్త విచారణ జ్ఞానము, కర్మానుష్ఠానము మొదలగువానివలన మాయనుదాటి మోక్షముజెంద దలంచు వారికిన్నిస్థితి యాలాగుననుండును ఇకను నవమాధ్యాయమున జెప్పినది జూడుడు -

అనన్యాశ్చింతయన్తోమాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ (9-22)

ఏ పరమభక్తులు ఇతర చింతలు లేనివారలై పరదైవమగు పరమాత్మనగు నన్ను ఎల్లప్పుడున్ను ధ్యానించువారై సేవించుచున్నారో, అట్లు సర్వకాలముల యందు సమాహిత చిత్తులైన భక్తులయొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను యోగమనగా అప్రాప్తమైన దానిని ప్రాప్తింపజేయుట క్షేమమనగా ప్రాప్తమైన దానిని చెడకుండ సంరక్షించుట యగును పరమ భక్తుల యోగ క్షేమములు భగవానుడే చూచుకొనుచుండునని భావము పరమభక్తుల కే యేకాలమున నెచ్చోట యేమేమి కావలయునో అదంతయు భగవంతుడే నిర్వహించు కొనుచుండునని భావము చిన్న పిల్లల సంరక్షణంతయు తల్లి యేలాగున చూచుకొనుచుండునో, పరమభక్తుల యొక్క స్థితియు నాలాగుననే యుండును ఈ కారణమువల్లనే యర్జునుండు శ్రీకృష్ణపరమాత్మను

శరణు బొందెను అందువల్లనే పాండవుల సర్వకార్యములనున్నూ భగవానుడే వహించి అరిష్టముల నన్నింటిని దొలగించి యిష్టప్రాప్తిని గలుగజేసెను రెండవ అధ్యాయమున నేడవ శ్లోకమును జూడుడు -

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః ।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ (2-7)

కృపణత్వమువలన గలిగిన దోషముచే గొట్టబడిన స్వభావము గలవాడను గనుక యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాడనై నిన్ను అడుగుచున్నాను ఏది నాకు శ్రేయస్కరమని నిశ్చయింపబడుచున్నదో దానిని నాకు చెప్పుము నేను నీకు శిష్యుండను నిన్ను శరణుబొందినవాడను కావున నన్ను శాసింపుము దీనికన్న పరమప్రమాణము మరియొకటి గావలయునా? ప్రపంచములోగల మహాత్ములందరిలో మొదట దైవమునే భజించి మోక్షమును బొందిన వారలనే ఎక్కువమందిని చూచుచున్నారము ఎక్కువమందిని యని జెప్పనేల ? అందరినని చెప్పవచ్చును కావుననే యర్జునుండు మొదటనే శ్రీకృష్ణశరణాగతి బొందుటకు గారణమైనది ప్రథమాధ్యాయ ముపోద్ఘాతము వంటిది అచటధర్మ బోధలు జరుగలేదు అదంతయు కార్యక్రమ విధానములతో పూర్తియై ద్వితీయాధ్యాయ ప్రారంభమునుండి యుపదేశమును ఆరంభించుటకు గారణమైన ది కావున ఆరంభమగు ఈ యధ్యాయమున్నూ, మధ్యనుండు తొమ్మిదవ అధ్యాయమున 22వ శ్లోకమున్నూ, అంతిమమునుండు పదునెనిమిదవ యధ్యాయమున 66వ శ్లోకమున్నూ భక్తివల్లనే ముక్తిగలుగునని తెలుపుచున్నవి ముక్తి యనునది యోగ సిద్ధియైనను, జ్ఞాన సిద్ధియైనను, భగవత్ప్రాప్తియైనను కావచ్చును దానికి విరోధమేమియును లేదు ఆత్మ శుద్ధి లేక ఆత్మప్రాప్తిఅని యైనను చెప్పవచ్చును ఈ నాలుగు విధములగు ముక్తియే, యేమతమునందైనను, ఏ శాస్త్రమునందైనను గన్పట్టుచున్నది కర్మ, భక్తి, యోగ, జ్ఞానములనెడు ముక్తులన్నియు వాని మార్గములన్నియు ఈ గీతాశాస్త్రములో గలవు కావుననే గీత సంపూర్ణ శాస్త్రమయినది

*సర్వ ధర్మాన్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥ (18-66)*

సమస్త ధర్మములను విడచి నన్నొక్కని మాత్రము శరణుబొందుము నేను నిన్ను సమస్తపాపములనుండి విముక్తుని జేసెదను దుఃఖింపకుము, సమస్త ధర్మములనగా, మోక్ష విషయమై, యెన్ని యుపాయములు, అనగా సాధనలు గలవో, వాటినన్నిటిని విడచిపెట్టి అనన్యభక్తియను మార్గమొక్క దానిని మాత్రము ఆశ్రయించుము అనిభావము శ్రీరామానుజాచార్యులవారు, ఈ శ్లోకము నాధారముగ జేసుకొనియే ప్రపత్తికి అంత యాధిక్యమిచ్చిరి ఇక భక్తియోగమును గురించిన ప్రమాణ శ్లోకములు గీతలో నెన్నియో గలవు

## భక్తిలక్షణము

''పూజ్యేషు అనురాగో భక్తిః''

పూజ్యులయందు, లేక పూజ్యవస్తువులయందు మనస్సుజేరగ గలిగెడి యనురాగ పూర్వకవృత్తి భక్తి యనంబడును ''అనురక్తిః పరేతత్త్వే భక్తి రిత్యభి ధీయతే'' పరమైన పరమాత్మయందు అపరిమితమైన ప్రీతి భక్తి యనంబడును దీనివల్ల ప్రపంచములోగల వస్తువులపైగల ప్రీతి భక్తి యనంబడజాలదు, మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, మొదలైనవి యొక విధమైన భక్తియైనను అది గౌణభక్తిలో చేరునే గాని భగవంతునియందు గల యనురాగమే ముఖ్యశబ్దార్థమగు భక్తి యగును ''భజ సేవాయాం'' భజధాతువునకు సేవయే యర్థమగుచున్నది ఇచట గూడ మాతా, పితృ, గుర్వాదుల సేవయు భక్తిలో చేరినదే అయితే భగవత్సేవయే, ముఖ్యమైన సేవ యగును ఇపుడు భక్తి యనగా ఏమియో తెలుపడమైనది ఇక సూత్రార్థము నిరూపింపబడుచున్నది

## సూత్రము

*అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్ ।*
*అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥*

కొద్ది యక్షరములతో గూడినదిన్ని సంశయము గలుగనిదిన్ని, సారముమాత్రమైనదిన్ని, సర్వవ్యాపకమైనదిన్ని, యే విధమైన దోషములేనిదిన్ని, నిరంకుశమైనదిన్ని అగునది సూత్రమని సూత్రార్థమెఱింగిన మహనీయులు తెలుసుకొనియున్నారు ఈ నారదసూత్రమెటువంటిదో, ఆలాటివే శ్రీబాదరాయణ బ్రహ్మసూత్రము, శ్రీ పతంజలి యోగసూత్రము, శ్రీ గౌతమ ధర్మసూత్రము,

శ్రీకపిలసాంఖ్యసూత్రము, శ్రీ పాణిని వ్యాకరణసూత్రము మొదలగునన్నియు నని గ్రహించుకొనవలయును ఉపనిషత్తులుగాని, పైజెప్పిన నారదాది సూత్రములుగాని, మన్వాది స్మృతులుగాని కలియుగముగనెవరున్నూ వ్రాయగూడదనియే శాస్త్రసిద్ధాంతము ఏలన దానికి అతీంద్రియ జ్ఞానముగల ఋషులే యర్హులు అట్టి యతీంద్రియ జ్ఞానులు కలియుగమున నుండుట యరుదని తలంచియే శాస్త్రమాలాగున నిర్ణయించుటకు గారణమైనది కావుననే శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్య, దయానంద, ప్రభృతులు ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు అర్థము మాత్రము వ్రాసిరేగాని సూత్రములు స్వయముగా చేయక పోయిరి వేదమో అపౌరుషేయమని చెప్పనక్కర లేదు అది మానవులెవరున్నూ వ్రాయజాలరు

## 2. సూ ॥ సాత్వస్మిౝ పరమ ప్రేమరూపా.

ప ॥ సా - తు - అస్మిౝ - పరమప్రేమరూపా

టీ ॥ అస్మిౝ = భగవంతున్నియందలి, సా తు = ఆభక్తి యైతేనో, పరమ = మిక్కిలి యుత్కృష్టమై నటువంటి, ప్రేమరూపా = ప్రీతి రూపకమైనది

తా ॥ కరుణామూర్తియగు భగవంతునియందుగల యపారమైన ప్రేమకు భక్తియని పేరు

వి ॥ కావుననే శరకోపమునీంద్రాదులు తమ్మును నాయికగాను, శ్రీ మన్నారాయణుని నాయకునిగాను భావించి భక్తిజేసిరి, గోపికా స్త్రీలు ఆలాగుననే భజించి మోక్షమును బొందిరి శ్రీ కృష్ణచైతన్య ప్రభువు ఇట్టి భావన జేసియే శ్రీ కృష్ణుని భజించెను శ్రీ రామకృష్ణ పరమహంసలున్నూ కృష్ణభక్తి జేయుకాలమున తన్ను రాధగా భావించి భజించెను ఇంకను పెక్కండ్రు మహాత్ములు భక్తిభావములో నీలాగుననే జేసిరి ఈభక్తి శివభక్తిగాను, విష్ణుభక్తి గాను, కృష్ణభక్తిగాను, రామభక్తిగాను నుండవచ్చును ఆంజనేయుడు శ్రీరాముని సర్వేశ్వరునిగాను, నంది కేశ్వరుడీశ్వరుని పరమశివునిగా నెంచి భజించి మోక్షమును బొందిరి ఆలాగున సమర్థరామదాసు శ్రీరాముని, పండరీపుర తుఖారాం, ముక్తాభాయ్ మొదలగు భక్తులందరు పండరీ నాథుని పరమపూరుషుండగు శ్రీమన్నారాయణమూర్తిగా దలంచి, భజించి పరమపదవిని బొందిరి శ్రీ నారదుండీ భక్తిని పరమ ప్రేమరూపముగా వర్ణించెను అట్టి ప్రేమలో మరియొక్క భక్తునిగాని, మరియొక్క దైవమును గాని విషమ దృష్టితో జూడందగదని వర్తమాన కాలపుభక్తులు

జ్ఞాపకములో నుంచుకొనవలయును అమృతమునందు విషమునకు, ప్రకాశమునందు అంధకారమునకు ఏలాగున చోటుండదో, ఆలాగున పరమ ప్రేమైక హృదయమునందు ద్వేషమున కవకాశముండదని తలంచవలయును ఒక్కొక్కరి, పూర్వజన్మ వాసనారూప హృదయ సంస్కారమనుసరించి, ఒక్కరికి విష్ణుభక్తి, మరొకరికి శివభక్తియు గలుగువచ్చును కావుననే భర్తృహరి ఈలాగున తెలిపెను

*మహేశ్వరే వా జగతామధీశ్వరే జనార్దనే వా జగదన్తరాత్మని ।*
*న వస్తు భేదప్రతిపత్తిరస్తి మే తథాఽపి భక్తిస్తరుణేందు శేఖరే ॥*

నాకు జగదన్తరాత్మయైన మహేశ్వరుని యందుగాని, సర్వాంతర్యామి యైన జనార్దనుని యందుగాని, కొంచమైన భేదబుద్ధి లేదు అట్లున్నప్పటికిన్ని, స్వభావముగా చన్ద్రశేఖరుండైన యీశ్వరునియందు ప్రేమ యధికముగా గలదు ఈలాగున విష్ణుభక్తులైనను, శివభక్తులైనను నుండవలయును అనగా విష్ణువునందు అధిక ప్రేమగలవారైనను ఈశ్వర దూషణలేక నుండ వలయును ఆలాగుననే ఈశ్వరునియందధిక ప్రీతియుండినను, విష్ణు దూషణము లేక నుండవలయును ఈ విషయమై శాస్త్రము దెలిపినది జూడుడు

*మద్భక్తశ్శంకరద్వేషీ మద్ద్వేషీ శంకరప్రియః ।*
*తావుభౌ నరకం యాతో యావచ్చన్ద్రదివాకరమ్ ॥*

విష్ణుభక్తుడై శివద్రోహియైనను, శివభక్తుడై విష్ణుద్రోహియైనను ఆయిరువురును సూర్యచన్ద్రులున్నంత పర్యంతము నరకమందుందురు అని విష్ణుపురాణము

*శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే ।*
*శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయం శివః ॥*

శివునియొక్క రూపమే విష్ణువు, విష్ణువు యొక్క రూపమే శివుడు శివుని హృదయమే విష్ణువు విష్ణు హృదయమే శివుండని స్కాందోపనిషత్తు భక్తి యెట్లుండవలెనో శివానందలహరియందు శ్రీ శంకరభగవత్పాదులు తెలిపినది జూడుడు

*అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా*
*సాధ్వీనైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్ ।*
*ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం*
*చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే ॥*

ఊడుగచెట్టును తన బీజములు, సూది సూదంటురాతిని, పతివ్రతాస్త్రీ నిజభర్తను, తీగ వృక్షమును, నది సముద్రమును ఎట్లెడతెగక పొందియుండునో అట్లు మనోవృత్తియు భగవంతునియొక్క చరణకమల యుగళమును ఎల్లప్పుడును పొందియుండుటయే యచంచలమైన భక్తి యని చెప్పబడుచున్నది

ఊడుగ చెట్టుయొక్క విత్తనములు చెట్టునుండి వ్రాలినవెంటనే మ్రానుకు నంటుకొనును సూదంటురాతిని సూది అంటుకొనునట్లున్నూ, దేశాంతరము బోయిన భర్తను పతివ్రత సదా మనస్సులో భావించి యున్నట్లున్నూ, తీగ వృక్షమును చుట్టుకొనియుండు నట్లున్నూ, నది సముద్రమువైపు ప్రవహించి సదా యైక్య మొందునట్లున్నూ, ఎవరియొక్క మనస్సు ఎల్లప్పుడును భగవద్ధ్యానమునందెడతెగక యుండునో, అట్టి మనోవృత్తి అచంచలమైన భక్తి యనంబడును ఈలాగున కొందరు చెప్పుదురు తమకు భగవద్భక్తి చేయుటకు, భగవద్ధ్యానము జేయుటకు, సమయము చాలదనియు నందువలన జేయుటలేదనియు వచింతురు అట్టివారిని గురించి సీతారామాంజనేయములో జెప్పినది జూడుడు ఈ దృష్టాంతము అంత శుద్ధమైనది గాకపోయినను, ప్రపంచ జనులవృత్తి దానియందు గలిగియుండుటచే నీ యుదాహరణమును దెలుపడమైనది ఇదే వాక్యమును యోగవాసిష్ఠమునందు వసిష్ఠ మహర్షియు తెలిపియున్నారు

**పరపురుషానురక్తిగల భామిని యెల్ల పనుల్ గృహంబునం**
**బొరిబొరి జేయుచుం బ్రియుని పొందు సుఖంబుగ జూచురీతి భా**
**స్వర పరతత్త్వవేది నిజవర్ణనిజాశ్రమ యోగ్యధర్మముల్**
**నిరతము సల్పుచుం బరమ నిర్మలసౌఖ్యము గాంచు నెమ్మదిన్.**

## 3. సూ ॥ అమృతస్వరూపా చ.

పద ॥ అమృతస్వరూపా - చ

టీక ॥ అమృతస్వరూపా చ = ఆభక్తి అమృతస్వరూపముగా నున్నది

తా ॥ భక్తి యమృతస్వరూపము

వి ॥ పరమాత్మయందుగల యనన్యభక్తి యమృతస్వరూపమైనది ఇతరములగు వస్తువులలో గల భక్తి (ప్రీతి) యమృతస్వరూపము గాజాలదని

యీసూత్రమువలన నిరూపింపబడుచున్నది అమృతమును పానము జేసినవానికి మృతి ( మరణము) లేదు అమృతమును భుజించినవాడు అమరుండగుచున్నాడు, అనగా దేవుడగు చున్నాడు ఇచట క్షీర సాగరామృతమును పానము జేసిన దేవతలని గ్రహించరాదు ఈ భక్తి భగవత్స్వరూపమగుటవలన నీభక్తిరసామృతమును పానము జేయువాడు భగవత్స్వరూపుడే యగుచున్నాడు భక్తిమార్గమున భగవంతుడు పరబ్రహ్మమే యగును అనగా నిట్టి భక్తుడు పరబ్రహ్మ యగుచుండును పరుసవేదిని స్పర్శించిన యినుముగూడ బంగారమగునట్లున్నూ ''భేజే భ్రమరకీటవత్'' భ్రమరమును నిరంతరము భావనజేసిన పచ్చ పురుగు భ్రమరమగునట్లు అమృత స్వరూపమైన భగవంతుని ధ్యానించెడు జీవుడుకూడ భగవత్స్వరూపు డగుచున్నాడు గీతలో అ 14

*గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్ ।*
*జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥* (గీత 14 - 20)

భగవద్భక్తిచే యాజీవుడు మూడు గుణముల నతిక్రమించినవాడై జన్మ, మృత్యు జరాదులనుండి విముక్తుడై అమృతత్వమును బొందుచున్నాడని తెలుపడమైనది

*ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ।*
*సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥* (14-2)

మూడు గుణములకు విలక్షణమైన యవస్థను బొందువారు భగవత్సమానావస్థను బొందుచున్నవారనియు, వారికి పునర్జన్మములేదనియు మరణకాలములో గూడ క్లేశమును బొందరనియు తెలుపడమైనది 'మన్మయా మాముపాశ్రితాః' నన్నాశ్రయించువారు నాస్వరూపులగుచున్నారను మొదలగు వాక్యము లనేకములు గీతలో గలవు 13 అ లో జ్ఞానమును ఎనిమిదవ శ్లోకము మొదలు పన్నెండు శ్లోకములవరకు, అయిదు శ్లోకములచే జ్ఞానికి నుండవలసిన లక్షణముల నుపదేశించి 13 శ్లోకమునుండి జ్ఞేయమునుగురించి జెప్పంబూనినప్పుడు శ్లో ॥ ''జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽ మృతమశ్నుతే'' అని ఏ జ్ఞేయవస్తువును తెలుసుకొనిన యమృతత్త్వమును బొందునో దానిని గురించి మరల చెప్పంబూనెను శ్రుతియును నీయమృతత్వమే బ్రహ్మప్రాప్తమనియు, అమృతమే బ్రహ్మమనియు తెలిపినది 'య ఏనం విదురమృతాస్తేభవన్తి' ఎవరీపరమాత్మను దెలుసుకొనుచున్నారో వారమృతు లగుచున్నారు అని తైత్తిరీయము 'తదేవామృతముచ్యతే' ఆ పరమాత్మ స్వరూపము

అమృతస్వరూపమని శ్రుతిచే చెప్పబడుచున్నది 'ఆ వృత్తిచక్షురమృతత్త్వమిచ్ఛన్' బహిర్దృష్టిని మరలించి యంతర్దృష్టిలో అమృతత్త్వమును జూడవలయునని కఠశ్రుతి యుపదేశించుచున్నది 'ఆపో జ్యోతిరసోఽమృతం' ఆబ్రహ్మము నమృతస్వరూపమని, జ్ఞానస్వరూప మని నిత్యకర్మాను ష్ఠానమున వేదమే దెలుపుచున్నది అమృతము బ్రహ్మమనియు, అమృతమును బొందినవాడమృత స్వరూపుడగు చున్నాడనియు జెప్పెడు శ్రుతు లనేకములు గలవు ఇచట సంగ్రహముగ దెలుపడమైనది

## 4. సూ ॥ యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవత్యమృతోభవతి తృప్తో భవతి.

పద ॥ యత్ - లబ్ధ్వా - పుమాన్ - సిద్ధః - భవతి - అమృతః - భవతి - తృప్తః - భవతి

టీక ॥ పుమాన్ = పురుషుడు, (జీవుడు) యత్ = యేభక్తిని, లబ్ధ్వా = పొంది, సిద్ధః = సిద్ధుడు, భవతి = అగుచున్నాడో, అమృతః = అమృతస్వరూపుడగుచున్నాడో, తృప్తః = సంతుష్టుడు, భవతి = అగుచున్నాడో, (తత్ = దానిని, శృణు = వినుము )

తా ॥ జీవుడు ఏ భగవద్భక్తిని పొంది సిద్ధుడున్నూ, అమృతస్వరూపుడున్నూ,, సంపూర్ణ తృప్తుడగను నగుచున్నాడో దానిని వినుము

*వి ॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।*
*ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే ॥ (గీత -3-17)*

ఎవడైతే పరమాత్మ ధ్యానముచే తనలో తానే యానందించువాడును, తనలో తానే తృప్తిబొందినవాడును, తనలో తాను సంతుష్టుడై నవాడును నగునో వానికి జేయవలసినది మరియొకటి లేదు ఈ మహాత్ముడే యాత్మారాము డనంబడును, వీనినే వేదాంతములో ఆప్తకాముడని చెప్పుదురు ఆ ప్తకాముడనగా సమస్త కోరికలను బొందినవాడనియు తృప్తుడగుటచే నిక గోరందగినది మరేమియు మిగిలియుండని వాడనియు అర్థము వీడు కృతార్థుడు కృతార్థుడు గావలసియుండిన ముందుగా కృతకృత్యుడు గావలయును కృతకృత్యుడన తాను జేయవలసిన కృత్యములన్నింటిని కొంచెమైనను కొఱతలేక సంపూర్ణముగా జేసినవాడని తాత్పర్యము కావున కృతార్థులుగా

తలంచువారు తాము కృతకృత్యులై తిమా యని ముందుగా తమలో తాము ఆలోచించుకొనవలయును ఒకడు పంచభక్ష్యపరమాన్నాదులను భుజించి తృప్తుడైనచో, మరల నేపదార్థమునైనను గోరడు, కోరకనే ఎవరైనను ఇచ్చినను వద్దని చెప్పును, ఆలాగున దైవామృతపానముచే తృప్తుడైన జీవన్ముక్తుడు మరి దేనిని గోరడు అదియే తృప్తిని బొందినదానికి గురుతు ఇట్టి యవస్థ జీవన్ముక్త దశలో మాత్రమే గలుగును

*ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్ ।*
*ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥* *(గీత-2-55)*

మనోగతములగు సమస్తములైన కోరికలను (సంకల్పములను) ఎప్పుడు విడుచుచున్నాడో, ఎపుడు తనయాత్మచేత ఆత్మ (పరమాత్మ) యందే క్రీడించువాడగుచుండునో అప్పుడు స్థిత ప్రజ్ఞుడని జెప్పబడుచున్నాడు ఇదియే పైనాల్గవ సూత్రములో జెప్పిన ఆత్మక్రీడయని గ్రహించదగినది

## 5. సూ ॥ యత్ప్రాప్య న కిఞ్చిద్వాఞ్ఛతి న శోచతి న ద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి.

పద ॥ యత్ - ప్రాప్య - న - కిఞ్చిత్ - వాఞ్ఛతి - న - శోచతి - న - ద్వేష్టి - న - రమతే - న - ఉత్సాహీ - భవతి

టీక ॥ యత్ = ఏ యనన్యభక్తిని, ప్రాప్య = పొందిన పిమ్మట, కించిత్ = తదితరములైనవానిని కొంచెమైనను, న వాఞ్ఛతి = గోరడో, న శోచతి= ప్రాప్తించని విషయములను గూర్చి శోకింపడో, న ద్వేష్టి = తనకు గలిగిన యనిష్టప్రాప్తిని ద్వేషింపడో, న రమతే = ఏ వస్తువునందును క్రీడింపడో, ఉత్సాహీ = ప్రాపఞ్చిక వ్యవహార విషయములలో నుత్సాహము గలవాడుగా, న భవతి = కాడో

తా ॥ ఏకాంతభక్తిని బొందిన పిమ్మట తదితరములైనవాని కొంచెమైనను నాశించడో, ప్రాప్తించని విషయములను గూర్చి దుఃఖింపడో, తనకు గలిగిన యనిష్టప్రాప్తిని ద్వేషింపడో, యే వస్తువునందును రమింపడో, ప్రాపంచిక వ్యవహారవిషయములలో నుత్సాహము గల వాడుగనుండడో,

వి ॥ గీతలో ''వివిక్త దేశసేవిత్వ మరతిర్జన సంసది'' (13-11) అని

విజన ప్రదేశము నందుండగోరుట, ప్రాపంచికజనసమూహము నందుండుటకు ప్రీతి లేకుడుట ఇది విరక్తుని లక్షణముగా నిరూపించడమైనది మరల ''బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి'' (18-54) బ్రహ్మాత్మైకజ్ఞానము గలవానిని గురించి భగవానుడీలాగున దెలుపడమైనది, బ్రహ్మాత్మైకస్థితి గలవాడు పొందబడిన ఆధ్యాత్మ ప్రసన్నతగలవాడై లేనిదానిని గురించి దుఃఖింపడు, దేనిన్నిగోరడు, ఇదిపై సూత్రార్థమునకు సరిపోవుచున్నది

**యం లబ్ధ్వాచాఽపరం లాభం మన్యతే నాఽధికం తతః ।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ (6-22)**

ఏ దైవప్రాప్తిని బొంది ఆ దైవప్రాప్తి లాభమున కన్న నధికమైన ఇతరలాభమును, లేక ఇతరసుఖము ఏదియు లేదని తలచునో, అట్టిదైవభావ మందుండువాడు అత్యధికమగు దుఃఖము గలిగినను చలింపడో, అదియే ఆత్మ లాభమును బొందిన దాని యొక్క గురుతు మఱియు ఆత్మబోధమున -

*యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।*
*యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥*

ఏ భగవత్స్వరూపము యొక్క లాభముకంటె వేరే యధికమైన లాభము లేదో, ఏభగవదానందము కంటె మరియొక యానందము లేదో, భగవత్సాక్షాత్కార జ్ఞానము న కన్న వేరే యధికమైన జ్ఞానము లేదో, అది పూర్ణబ్రహ్మమని నిశ్చయింపవలసినది ఇట్టి యవస్థ గలుగుటయే పూర్ణమైన భగవద్భక్తియని గ్రహించుకొనవలయును

## 6. సూ ॥ యద్జ్ఞాత్వా మత్తో భవతి స్తబ్ధో భవతి ఆత్మారామో భవతి

ప ॥ యత్ - జ్ఞాత్వా - మత్తః - భవతి - స్తబ్ధః - భవతి - ఆత్మారామః - భవతి

టీ ॥ యత్ = ఏభక్తిచేత తెలియందగిన భగవత్స్వరూపమును, జ్ఞాత్వా = తెలిసి, మత్తః = సంతోషభరితచిత్తుడు, భవతి = అగుచున్నాడో, స్తబ్ధః= నిశ్చేష్టుడు,

భవతి = అగుచున్నాడో, ఆత్మారామః = ఆత్మారాముడుగా, భవతి = అగునో

తా ॥ ఏ భక్తిచేత తెలియందగిన భగవత్స్వరూపమును తెలిసి యున్మత్తుని వలె నగుచున్నాడో, నిశ్చేష్టుడగుచున్నాడో, తనలో తాను రమించువాడుగను అగునో ఇదియే పరభక్తియొక్క స్వరూపము

వి ॥ శ్రుతి యీలాగున వర్ణించుచున్నది ''ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాః ఏష బ్రహ్మవిదాం వరిష్ఠః'' తా ॥ ఆత్మయందు క్రీడించువాడును, ఆత్మయందు రమించువాడును, బ్రహ్మవేత్తలలో వరిష్ఠుడగు వాడిట్టిస్వభావము గలిగియుండును శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీకృష్ణచైతన్యులు మొదలగు పరమభక్తులు నీలాగున నుండిరి

*పరమాత్మని విశ్వేశే భక్తిశ్చేత్ ప్రేమలక్షణా ।*
*సర్వమేవ సదా సిద్ధం కర్తవ్యం నావశిష్యతే ॥*

సర్వేశ్వరుడగు పరమాత్మయందు ప్రేమలక్షణమైన భక్తి గలిగెనేని నపుడతనికి సిద్ధించవలసిన సర్వమున్నూ స్వయముగా నేసిద్ధించును అతనికి జేయవలసిన కర్తవ్యము కొంచెమైనను మరల మిగిలి యుండదు మద్యపానముచే నేలాగున నున్మత్తులగుదురో, ఆలాగున భగవద్భక్తి రసామృతపానముచే నున్మత్తులగుదురు అయితే మద్యముచే గలిగెడు ఉన్మత్తత తామస స్వభావముతో గూడినదిన్ని, మూఢత్వమును జెందినదిగా నుండును పరమ భక్తిచే గలిగెడు ఉన్మత్తత, సత్త్వగుణమునుగూడ దాటినదిన్ని, పరమానంద (మోక్షమును) ప్రాప్తిని గలుగజేయునదిగా నుండును ఒక చక్రవమతివేగముగా తిరుగుచున్నప్పు డున్నూ, తిరుగక ఊరక యుండునప్పుడున్నూ ఒకే విధముగనే గనిపించును మొదటిది వేగాతీతము, రెండవది గమనరహితము ఆలాగున నిండు చీకటిలో కన్ను గనిపించదు అతిప్రకాశమధ్యమందును ఏమిన్ని గోచరించదు ఒకటి గాఢ తమోవృతము, రెండవది అతిప్రకాశము ఆలాగున జ్ఞానమత్తతకిన్ని, అజ్ఞానమతి హీనతకున్నూ మార్పు గలదు భాగవతమున ప్రహ్లాదుని లక్షణములను జూడుడు

వైకుంఠ చింతా వివర్జితచేష్టుడై
యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావ నారూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట

విష్ణుడింతియ కాని వేఱొండు లేడని
　　యెత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానము గంటి నేనని
　　యుబ్బి గంతులు వైచు నొక్క చోట

బలుకు నొక్కచోట బరమేశు గేశవు
బ్రణయ హర్షజనిత బాష్పసలిల
మిళిత పులకుడై నిమీలిత నేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు

7. సూ ॥ సాన కామయమానా నిరోధరూపత్వాత్.

పద ॥ సా - న - కామయమానా - నిరోధరూపత్వాత్

టీక ॥ సా = ఆభక్తి, నిరోధరూపత్వాత్ = విషయప్రపంచమును మనస్సున చేరనివ్వక నిరోధించినదగుటవలన, న కామయమానా = కోరనివ్వదు

తా ॥ ఆ దైవభక్తి విషయ ప్రపంచమును మనసున జేరనివ్వక నిరోధించుటవలన కామ్యకర్మలలో ప్రవర్తింపనీయదు

వి ॥ ఇందులకు సరియగు భాగవత వాక్యము జూడందగును

మందార మకరంద మాధుర్యమున దేలు
　　మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
　　రాయంచ జనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవఖాదియై చొక్కు
　　కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
　　బరుగునే సాంద్ర నీహారములకు
అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయు నేల ?

మరియు నుత్తరగీతయందు శ్రీకృష్ణభగవానుని వాక్యమును జూడుడు

*యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్ ।*
*ఏవం తత్పరమం జ్ఞాత్వా వేదైర్నాస్తి ప్రయోజనమ్ ॥*

అమృతపానముచే దృప్తి నొందినవానికి నీటిచే నేమి ప్రయోజనము ? అటులనే పరమాత్మ సాక్షాత్కారము గలిగినవానికి వేదశాస్త్రములో జెప్పబడిన క్రియలచే నేమి ప్రయోజనము ?

## 8. సూ ॥ నిరోధస్తు లోకవేదవ్యాపార న్యాసః.

ప ॥ నిరోధః - తు - లోకవేదవ్యాపారన్యాసః

టీ ॥ నిరోధస్తు = నిరోధమైతే, లోకవేదవ్యాపార = లోకవ్యాపారమునూ, వేదవ్యాపారమునూ, న్యాసః = వదలుటయే

తా ॥ చిత్త నిరోధస్థితి అనన్యభక్తి చేగలుగునప్పుడు ప్రపంచవ్యవహారము నున్నూ, వేదవ్యాపారమునున్నూ వదలించును

వి ॥ తదేకభక్తి గలుగునప్పు డనవసరమైన ప్రాపంచిక వ్యవహారమున్నూ, వేదములలో చెప్పినకర్మకాండ వ్యవహారమున్నూ వదలి పోవును

*త్రివిధా భక్తిరుద్దిష్టా మనోవాక్కాయ సంభవా ।*
*లౌకికీ వైదికీ చాపి భవేదాధ్యాత్మికీ తథా॥*

మనోవాక్కాయ కర్మలచే చేసెడు భక్తి త్రివిధములు అవి లౌకికీ, వైదికీ, ఆధ్యాత్మికీ యని మూడు విధములు ఏకాంత భక్తులు లౌకికము వైదికము రెండింటిని విడిచి ఆధ్యాత్మిక భక్తి నొక్క దానినే గ్రహించుకొనవలయును పైజెప్పిన సూత్రమున్ను దీనినే నిరూపించినది పతంజలి మహర్షి తన యోగశాస్త్రము నందు 2 వ సూత్రమున ''యోగశ్చిత్తవృత్తి నిరోధః'' - యోగము అంతఃకరణములోగల వృత్తులనన్నింటిని నిరోధించునని చెప్పిరి వృత్తులు, వాసనలు, సంస్కారములు, ఇవన్నియు తదనుగుణ ప్రవృత్తులను జయించును యోగధ్యానములవల్ల యట్టి వృత్తున్నియు నశించిపోవుటచే గలిగెడు మనోవృత్తియే నిరోధమనంబడును ఈ నిరోధమునకే యోగసూత్రమున నిర్బీజ సమాధి యనియు, నిర్వికల్పసమాధి యనియు పేర్లు అయితే లోకవ్యాపారముచే

వేదవ్యాపారమును విడిచిపెట్టి సోమరియై యుండుటయా? అని తలంచవలదు యోగసూత్రమున 3 వ సూత్రమునందు దీనిని గురించి వివరించడమైనది సూ ॥ ''తదా ద్రష్టు స్స్వరూపేఽవస్థానమ్'' - ఆ నిర్బీజ సమాధి యేర్పడిన యప్పుడు ఆత్మకు తన నిజస్వరూపమందు నిలుకడ గలుగుచున్నది అనగా ఆత్మసాక్షాత్కార స్వరూపస్థితియందు సుస్థిరత గలుగుచున్నది అది సోమరితనము గాదు 'సోఽహం' పరత్వమని గ్రహించేది

రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ (గీత -14-7)

ఓ యర్జునా ! రజోగుణము దృశ్యవిషయములయందు అనురాగమును గలుగజేయునది అని యెరుగుము కావున ఆ రజోగుణము దేహము నందుండు ఆత్మను ఐహికాముష్మిక సుఖములయందాసక్తి యనెడి కర్మ సంగము చేత లెస్సగా బంధించుచున్నది గీత కట్టకడకు ఉపదేశించిన ప్రపన్నుని గురించి అనగా శరణాగతుని గురించి తెలిపినది జూడుడు

*సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (18-66)*

దీని యర్థము మొదటి సూత్రము క్రిందనే వ్రాయడమైనది

*భోగైశ్వర్య ప్రసక్తానాం తయా ఽపహృత చేతసామ్ ।*
*వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ (2-44)*

భోగైశ్వర్యముల యందాసక్తిగలవారికి పరమాత్మ స్వరూప మందు నిశ్చయాత్మకమైన బుద్ధి గలుగనేరదు ఈ విషయము రెండవ అధ్యాయమున 42, 43, 44 ఈ మూడు శ్లోకములను వరుసగజదివిన నిరుద్ధచిత్తముయొక్క వృత్తియు, దానిచే గలిగెడు దైవసుఖప్రాప్తియు గోచరించును అట్లు గాక భోగములయందును, ఐశ్వర్యములయందును ప్రవృత్తి గలవానియొక్క క్లేశమున్నూ తెలియనగు నని శ్రీ కృష్ణభగవానులే యుపదేశించియున్నారు

**9. సూ ॥ తస్మిన్ అనన్యతా తద్విరోధిషూదాసీనతా చ.**

పద ॥ అస్మిన్ - అనన్యతా - తద్విరోధిషు - ఉదాసీనతా - చ

టీక ॥ తస్మిన్ = ఆ భగవంతునియందు, అనన్యతా = అనన్యభక్తిగలిగియు, తద్విరోధిషు= ఆ భక్తికి విరోధములైన కార్యములయందు, ఉదాసీనతా చ = సంబంధము లేక సాక్షివలె నుండడము శ్రేయస్కరము

తా ॥ ఆ భగవంతునియందు అనన్యభక్తిగలిగియు, ఆభక్తికి విరోధములైన కార్యములయందు సంబంధములేక సాక్షివలె నుండడము పరమభక్తుల కర్తవ్యము ''ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే'' (14-23) - ఉదాసీనుండెవడన, సాక్షి భూతునివలె నున్నవాడై స్వరూప స్థితినుండి చలింపక గుణములచేత చలింపబడక యుండువాడే ఇట్టి స్థితియే ఈ సూత్రమున శ్రీ నారదమహర్షిచే తెలుపడమైనది

## 10. సూ ॥ అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా.

ప ॥ అన్యాశ్రయాణాం - త్యాగః - అనన్యతా

టీ ॥ అనన్యతా = పూర్తిగ భగవంతుని నొక్కనిని మాత్రము ఆశ్రయిం చుట, అన్యాశ్రయాణాం = ఇతరాశ్రయముల నన్నిటిని, త్యాగః = వదలుట

తా ॥ పూర్తిగ భగవంతుని నొకరిని మాత్రమాశ్రయించి యితరాశ్రయముల నన్నిటిని వదలుట

వి ॥ ఇదే ఆరవ అధ్యాయములో భగవానుడు ఉపదేశించిన దానిని మొదటి సూత్రములో తెలుపడమైనది అచట దీని యర్థము చూడదగును

*అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।*
*తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (9-22)*

*అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।*
*సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ (12 -16)*

ఏ భక్తుడు దేనియందును అపేక్షలేనివాడును, బాహ్యాభ్యన్తరశుద్ధి గలవాడును, కార్యదీక్షగలవాడును ఉదాసీనుడును, (ద్వంద్వములలో చేరనివాడును) మనోవ్యాకులత లేనివాడును, లోకాడంబరమగు సమస్తకర్మలను వదలినవాడగుచున్నాడో వాడు నాకు ప్రీతిగల భక్తుడు

**11. సూ ॥ లోకవేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతా.**

పద ॥ లోకవేదేషు - తత్ - అనుకూలాచరణం - తద్విరోధిషు - ఉదాసీనతా

టీక ॥ లోకవేదేషు = లోకవేదములయందు, విహితాచరణం యత్ = విహితమైన ఆచరణము ఏది, వ్యవహృతం = చెప్పబడియున్నదో, తత్ = దానిని, అనుకూలాచరణం = తన పరమాత్మ ధ్యానానుష్ఠానము లకు ప్రతిబంధములేక అనుకూలముగా ఆచరించవలెను, తద్విరోధిషు = ఆ ఆచరణమునకు విరోధములైన విషయములందు, ఉదాసీనతా = సంబంధము లేక సాక్షివలె నుండవలయును

తా ॥ లోకవ్యవహారమందును, వేదవ్యవహారమందును విహిత మైన అచరణము ఏది చెప్పబడియున్నదో, దానిని తన పరమాత్మ ధ్యానానుష్ఠాన ములకు ప్రతిబంధములేక యనుకూలముగా ఆచరించవలెను ఆ ఆచరణమునకు విరోధములైన విషయములయందు సంబంధములేక సాక్షివలె నుండవలయును ఇదే యుదాసీనత యని చెప్పబడును

వి ॥ 8వ సూత్రమున ''నిరోధస్తు లోక వేదవ్యాపార న్యాసః'' యను సూత్రమును దెలిసికొని లోకమర్యాదను, శాస్త్రమర్యాదను అతిక్రమించి నడచెదరేమో యని తలంచి, ఈ 11 వ సూత్రము శ్రీ నారదమహర్షిచే రచించడమైనది

*యశ్శాస్త్ర విధిముత్సృజ్యవర్తతే కామకారతః ।*
*న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ (గీత-16-23)*

ఎవడైతే శాస్త్రవిధిని తిరస్కరించి స్వేచ్ఛాప్రవర్తకుడై నడచు చున్నాడో, అట్టి వానికిహ లోక సౌఖ్యముగాని, స్వర్గముగాని, మోక్షముగాని యేదియును లేదు అయితే బ్రహ్మనిష్ఠులు, ఆత్మజ్ఞానులు, పరమభక్తులు సహా యేలాగున వర్తనము గలిగియుండవలయునో అట్టి యనుష్ఠాన ముండవలయునని భగవాను డుపదేశించెనోగాని కర్మకాండుల ప్రవర్తనము గలిగి యుండవలయునని భావము గాదు విద్యారణ్యులు వేదాంతపంచదశియందు చెప్పినది జూడుడు

*బుద్ధ్వాఽద్వైత్యస్య తత్త్వస్య యథేష్టాచరణం యది ।*
*శునాం తత్త్వదృశాం చైవం కో భేదోఽశుచి భక్షణే ॥*

పరమాద్వైతతత్త్వము నెరింగిన మహాత్ముడు సహావిధి నిషేధవాక్యములను నిర్లక్ష్యముజేసి స్వేచ్ఛాప్రవర్తనము గలిగి యుండెనేని తత్త్వవేత్తకున్ను, శునకమునకున్ను ఏమి భేదము గలదు? అనగా అట్టి యథేచ్ఛాచరణ గలవానికిన్ని, కుక్కకున్ను భేదము లేదని భావము తత్త్వవేత్తలగు మహాత్ములు నీతివిరుద్ధముగా ప్రవర్తింపరు

*అపహాయ నిజం కర్మ కృష్ణ కృష్ణేతివాదినః ।*
*తేహరేర్ద్వేషిణః పాపా ధర్మార్థం జన్మ యద్ధరేః ॥*

భగవద్భక్తులకువిధించియుండు ధర్మమును త్యజించి యెవ రైతే 'హేకృష్ణ' హేకృష్ణ, హేరామ, హేరామయని యుచ్చరించుచుందురో, అట్టివారు పాపాత్ములనియు, శ్రీ విష్ణువునే ద్వేషించు వారలనియు గ్రహించుకొనవల యును ఏలన అధర్మము నణచి ధర్మమును నిలబెట్టుటకొరకే భగవంతుడు శ్రీ రామకృష్ణా ద్యవతారముల నెత్తుచుండును గీతలోను భగవానుడు దానినే స్వయముగా స్పష్టపరచెను - ''ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే''- ధర్మమును స్థాపించుటకొఱకే భగవంతుడప్పుడప్పుడు జన్మమెత్తుచుండును అట్లుండగా భగవదనుకూల కార్యములనే భక్తులు చేయక ప్రతికూల కార్యముల నొనర్చిన వీరికి భగవత్కృప యెట్లు గలుగును ?

## 12. సూ ॥ భవతు నిశ్చయదార్ఢ్యాదూర్ధ్వం శాస్త్రరక్షణమ్.

ప ॥ భవతు - నిశ్చయదార్ఢ్యాత్ - ఊర్ధ్వం - శాస్త్రరక్షణమ్

టీ ॥ నిశ్చయదార్ఢ్యాత్ = భగవద్భక్తిదృఢముగల్గి భగవత్సాక్షాత్కారము గలిగిన, ఊర్ధ్వం= తరువాతను, శాస్త్రరక్షణం = శాస్త్రరక్షణము, భవతు = అగుగాక!

తా ॥ భగవద్భక్తి దృఢము గలిగి భగవత్సాక్షాత్కారజ్ఞానము గలిగిన తరువాతను గూడ పరమభక్తులు ఏలాగున ఆచరణ గలిగి యుండవలయునని శాస్త్రము జెప్పుచున్నదో, అదే ప్రకారముగా యాచరణ గలిగి యుండవలెను

వి ॥ ఆచరణగలిగియుండుటయే శాస్త్రరక్షణమని గ్రహించునది ఏలన భగవానుడు వేదములద్వారా మానవులకు ధర్మమునే యుపదేశించెను అధర్మమునుండి లోకముల

నుద్ధరించుటకు ధర్మము బోధించ వలసి వచ్చినది అట్టి ధర్మానుష్ఠానము లేనిచో మానవుల కున్ను పశువులకున్ను భేదముండదు కావుననే గీతలో ఇట్లుపదేశించిరి

*తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।*
*జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ (16-24)*

ఓ యర్జునా ! ధర్మాధర్మములను, కార్యాకార్యములను, పుణ్యపాపములను, బంధమోక్షములను తెలుపునదే శాస్త్రము కావున శాస్త్రవిధిని అనుసరించి నీవు ఆచరించుట కర్హుడై యున్నావు అయితే ఇచట చెప్పినది కర్మకాండ శాస్త్రము గాదు జ్ఞానశాస్త్రమే యని గ్రహించు కొనవలయును ఒకవేళ జ్ఞానికి శాస్త్రమవసరము లేక పోయినను జ్ఞానియొక్క మార్గము ననుసరించియే తక్కినవారు నడువవలసి యుండుటచే వారలకొరకైన జ్ఞాని శాస్త్రోల్లంఘనము జేయరాదని భగవద్వాక్యము

**యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ (3-21)**

శ్రేష్ఠుడైన వాడెట్టి వర్తనము గలిగియుండునో, అట్టి వర్తనమునే లోకముగూడ అనుసరించును వాడు దేనిని ప్రమాణముగా గ్రహించునో లోకులుగూడ దాని ననుసరింతురు కావున తనకవసరము లేకపోయినను లోకానుగ్రహబుద్ధి గలిగియైనను, ధర్మమార్గము ననుసరించియే నడువవలయును రోగియైన వాడారోగ్యమును బొందినను వైద్య శాస్త్రమును తిరస్కరించరాదు ఒక డున్నతపరీక్షలో నుత్తీర్ణుడైనను క్రిందితరగతి పాఠముల నవసరములేదని చెప్పరాదు ఏలన ఇతడుగూడ క్రింద తరగతిలో చదివియే యిపుడు గొప్పవాడయ్యెను ఇక రాబోవు వారుగూడ అట్టి మార్గము ననుసరించియే యున్నతస్థితిలోనికి రావలసియున్నారు ఒకడు పడవను అవలంబించి నదిని దాటిపోయి తనకు పడవ అవసరము లేకపోయినను అనేకులు ఈవలనుండి యావలకు ఆపడవ చేతనే దాటవలసి యున్నారని మరువకూడదు కావుననే శ్రీ శంకరాచార్యులు ఈలాగున చెప్పిరి

*ఆ జీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।*
*ఆదౌ జ్ఞానాప్తయే పశ్చాత్ కృతఘ్నత్వ నివృత్తయే ॥*

జీవన్ముక్తులైనను బొందిలో ప్రాణముండువరకు గురు, శాస్త్ర, ఈశ్వరులయందు విశ్వాసము, భక్తి విడువరాదు ఏలన మొదట పైజెప్పిన ముగ్గురివల్ల

జ్ఞాన ప్రాప్తి గల్గును అందువల్లను కృతఘ్నుడు గాక కృతజ్ఞుడై యుండవలసి యుండుటచేతను, పైజెప్పిన ముగ్గురిలో భక్తివిశ్వాసములు గలిగి యుండవలయును లేనిచో కృతఘ్నత్వ దోష మాపాదించును

## 13. సూ ॥ అన్యధా పాతిత్యాశఙ్కయా.

ప ॥ అన్యధా - పాతిత్యాశంకయా

టీ ॥ అన్యధా = మరియొక్క విధమున, పాతిత్యాశంకయా = పాప భీతిచేత

తా ॥ 12వ సూత్రమున చెప్పిన విధముగా మరియొక్కవిధమాలోచించినను శాస్త్రతిరస్కరణము పాపహేతువు గాగలదను తలపుతో అయినను శాస్త్రాతిక్రమణము చేయరాదు ఏలన ''శాసనాచ్ఛాస్త్రం'' - శాసించునదగుటచే శాస్త్రమని పేరు వచ్చినది

వి ॥ రాజశాసనాతి క్రమణము ఏలాగున శిక్షాకారణమగుచున్నదో ఆలాగున భగవచ్ఛాసనమే శాస్త్రము కావున దానియొక్క అతిక్రమణము భగవత్ప్రీతి కాదని తలంచి జ్ఞానులు, భక్తులు ప్రవర్తించవలయును అయితే దుష్టశాసన పరుడైన రాజు యొక్క శాసనము తిరస్కరించవచ్చును భగవంతుడు ఆలాగున దుష్టశాసన పరుడు కాడు సర్వ జీవరాసులలో కరుణ గలిగినవాడును, జీవకోట్లను దుఃఖ సాగరమునుండి తరించవలయునని తలంపుగలవాడగుట చేతను భగవచ్ఛాసనము శ్రేయస్సునే గలుగజేయును ఇచ్చట గూడ కర్మకాండ శాస్త్రమని తలంచరాదు

*శ్రుతిః స్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే ।*
*ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తోఽపి న వైష్ణవః ॥*

శ్రుతి స్మృతులు నా యొక్క (విష్ణువుయొక్క) ఆజ్ఞారూప ములు ఎవడైతేవాని నుల్లంఘించి ప్రవర్తించునో, అట్టినాయొక్క ఆజ్ఞను విచ్ఛేదమొనర్చునో అట్టివాడు నాకు ద్రోహమొనర్చినవాడగును ఒకవేళ యతడు విష్ణుభక్తుడైనను వైష్ణవుడు గాడు అనగా నుత్తమవిష్ణు భక్తుడు గాజాలడు ఇచట గూడ భక్తులకు సంబంధించిన శాస్త్రమని గ్రహించవలసినదేగాని యితరములగు కర్మశాస్త్రము, తర్కశాస్త్రము, మీమాంసాశాస్త్రము అని తలంచవలదు

## 14. సూ ॥ లోకోఽపి తావదేవ కిం తు భోజనాది వ్యాపారస్త్వాశరీరధారణావధి.

ప ॥ లోకః - అపి - తావత్- ఏవ - కిం - తు - భోజనాది వ్యాపారః - తు - ఆశరీరధారణావధి

టీ ॥ భోజనాదివ్యాపారస్తు = భోజనాది వ్యాపారమైతేనో, ఆ శరీరధారణావధి = శరీరమున్నంతవరకుంటున్నది, కింతు లోకోఽపి = లోకవ్యవహారశాస్త్రమైతే, తావదేవ = అనన్యమైన భగవద్భక్తి గలుగు వరకు మాత్రమే ( భగవత్సాక్షాత్కార స్థితిగలుగు వరకు)

తా ॥ భోజనాది వ్యాపారమైతేనో, శరీరమున్నంతవరకుంటున్నది లోకవ్యవహార శాస్త్రము భగవత్సాక్షాత్కార జ్ఞానము గలుగువరకు మాత్రమే

వి ॥ ముముక్షుత్వము గలుగు వరకే లోకవ్యవహారశాస్త్రమవసరము ముముక్షుత్వము గలిగిన లేక యనన్య భక్తిగలిగిన, లోకవ్యవహారముతో గాని, లోకవ్యవహారశాస్త్రముతో గాని సంబంధము లేదు అయితే లోకమర్యాదను, శాస్త్రమర్యాదను అతిక్రమించి స్వేచ్ఛాప్రవర్తకుండై యుండవచ్చునని భావము గాదు తరువాత ఆధ్యాత్మజ్ఞానశాస్త్రముతో మాత్రమే సంబంధముండును ప్రపన్నునికిన్ని, యతికిన్ని ఇది ప్రత్యక్షమే వీనికి సత్య, దయా, శాంతి విరక్తులే ధర్మములు ఈ విషయమై ముండకోపనిషత్తుపదేశించినది జూడుడు

మూలం ॥ *ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త మవరం యేషు కర్మ।*
*ఏ తచ్ఛ్రేయోఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపి యన్తి॥*

అస్థిరులైనటువంటిన్ని యజ్ఞస్వరూపులైన యాపదునెనిమిది మందియున్ను నశించువారలే అష్టాదశ స్మృతులయందు చెప్పబడిన శ్రౌత, స్మార్త, రూపమైన కర్మ శ్రేష్ఠమైనది గాదు ఎవరు ఆ యాత్మజ్ఞానరహితమైన శ్రౌతస్మార్తాది కర్మలను గూర్చి మోక్షమునుగా సంతోషించుచున్నారో, అజ్ఞానులైనవారు తిరిగి జరామరణములను బొందుచున్నారు ఇటువంటి కర్మశాస్త్రముచే దుఃఖరూపమైన సంసార సముద్రమును

దాటగోరుట శిధిలమైన ఓడచే సముద్రమును దాటుటకు తలంచుటవలె నుండును కనుక ఈ కర్మ మిక్కిలి శ్రేష్ఠమైనది గాదు ఇటువంటి కర్మను అజ్ఞానులగు ఎవరు మోక్షమునుగా దలంచి సంతోషించుదురో వారు తిరిగి జరామరణ రూపమైన సంసారమును బొందుచున్నారు

మూ ॥ *పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్య కృతః కృతేన।*

బ్రాహ్మణుడు కర్మచేత వృద్ధిబొందింపబడిన లోకములను లెస్సగ పరీక్షించి యాసంసారమందు నిత్యమగు పదార్థము లేదని తెలిసికొని అట్టి కర్మతో నేమి ప్రయోజనమని వైరాగ్యమును బొందవలయును ఈవిషయము గీతయందు శ్రీకృష్ణభగవానుడును ఇట్లు తెలిపెను

*నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।*
*శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥* **(11-53)**

ఓ యర్జునా ! నన్నిప్పుడేవిధముగా చూచితివో, ఇటువంటి రూపముగల నేను వేదపఠనములచేతను, శరీరమును మాత్రము కృశింపజేసెడి కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు చేతను, దానముచేతను, యజ్ఞముచేతను చూడ శక్యుడను గాను

*భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।*
*జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥* **(11-54)**

అయితే నన్ను సాక్షాత్కరించుటకు మార్గమేమన, మదేకనిష్ఠమైన యనన్యభక్తిచేతనే యథార్థముగా తెలిసికొనుటకున్ను, దర్శించుటకున్ను, ప్రవేశించుటకున్ను సాధ్యమైన వాడను దీనియందు ''జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప' అని ప్రయోగించుట వలన నిజమైన తత్త్వమెరుంగుట కున్ను, భగవంతునిలో నైక్యముగుటకున్ను అనన్యమైన భక్తియొక్కటియే మార్గమని గ్రహించదగును ప్రతి అధ్యాయాంతమున నీలాగున కర్మమునకు గౌణత్వమున్నూ, భక్తికి ముఖ్యత్వమున్ను భగవానుడుపదేశించుచునే వచ్చెను 6, 14 అధ్యాయాంతము లలో జెప్పిన విషయము పైన తెలుపడమైనది

## 15. సూ ॥ తల్లక్షణాని వాచ్యన్తే నానామత భేదాత్.

ప ॥ తల్లక్షణాని - వాచ్యన్తే - నానామత భేదాత్

టీ ॥ తల్లక్షణాని = ఆ భక్తి లక్షణములు, నానామత భేదాత్ = అనేక మత భేదమువలన, వాచ్యన్తే = చెప్పబడుచున్నవి

తా ॥ ఆ భగవద్భక్తియు, దాని లక్షణములున్ను అనేకమతభేదముల ననుసరించి బహువిధములుగా జెప్పబడుచున్నవి

వి ॥ అష్టావక్రగీతయందు ఈ యభిప్రాయమునే తెలుపడమైనది -

*నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా ।*
*దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః ॥*

ప్రపంచములో మహర్షులకున్ను, సాధువులకున్ను, యోగులకున్ను అనేక మతసంప్రదాయములు గలవు, వీనినన్నిటిని తెలిసికొనిన వాడు మతవైషమ్యము అనగా మతభేదమును మానును అటువంటి యే మనుజుడు శాంతిని (శమమును) బొందనివాడుగానుండును ? అనగా శాంతిని బొందగల్గును ఇదే ప్రకారముశైవ, వైష్ణవాది భేదములు అనేక విధములుగా నుంటున్నవి

*హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్ ।*
*కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥*

కలియుగమున హరినామస్మరణ, భగవత్సంకీర్తన, ఈశ్వరస్మరణ మొదలగు వానివల్లనే మోక్షము గలుగును, వేరు మార్గము లేనే లేదు, లేనే లేదు, లేనే లేదు కేవలశబ్దము ప్రయోగించుటచేత యోగ జ్ఞాన తపస్సులకీ కలియుగము తగదని యేర్పడుచున్నది

*శివనామైవ సంసారమహారోగై కశామకమ్ ।*
*నాన్యత్సంసారరోగస్య శామకం దృశ్యతే మయా ॥*

సూతసంహితయందు ఈలాగుననే తెలుపడమైనది ఈశ్వర నామస్మరణయే సంసార మహారోగమునకు దివ్యౌషధమైనది వేరు విధముగ ఆయజ్ఞాన వ్యాధికి మందు లేదు కారణమేమన బ్రహ్మవిచారమునకు తగినంత ప్రజ్ఞయు, తపమొనర్చుటకు తగిన శరీరదార్ఢ్యమున్ను, అష్టాంగయోగా భ్యాసమునకు తగిన మానసేంద్రియముల పటుత్వమున్ను కలియుగమున నందరికిన్ని విరివిగా నుండవని మహర్షులు తలంచుటే కలియుగమున భక్తిమార్గము సర్వజనులకు సులభసాధ్యమని తెలుపుటకు గారణమైనది

అయితే కృత త్రేతా ద్వాపరాది యుగములలోగూడ భక్తి యోగశాస్త్రమొకటి యుండనే యుండెను, శాండిల్య, నారద, ప్రహ్లాదాది పరమభక్తులు పైజెప్పిన యుగములలో నుండిన వారలే వారి వారి మానసిక సంస్కార తత్త్వము ననుసరించి ఒక్కొక్కరికి నొక్కొక్క దాని యందభిరుచి గలుగును అట్టివార లిప్పుడున్ను ఉంటున్నారు అయితే శమదమాది గుణములు గలిగి అంతయు బ్రహ్మమను బోధ గల వేదాంతులున్ను, యోగశాస్త్రమున అష్టాంగ యోగపరులై నిర్వికల్ప, నిర్బీజ, సమాధిలో నుండువారు ఎంతమందియున్నారు ? అదేరీతిగ తపస్సుచే ఇంద్రియముల నరికట్టి అతీంద్రియ జ్ఞానమును బొందినవారెంతమంది యున్నారు ? విచారణజేసిన నీతత్త్వము గోచరము గాగలదు ఒకవేళ సత్యాది యుగత్రయములో కొందరుండినను వారు సహాదైవ భక్తిని ముఖ్యాధారముగా జేసికొనియే అట్టి యవస్థను బొందినట్లు వారిజీవితచరిత్రమే ఋజువుజేయు చున్నది ఈ విషయమై శివమహిమ్నః స్తోత్రమున పుష్పదంతుడను గంధర్వరాజు స్తుతించినది జూడుడు

**త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి**
**ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।**
**రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషాం**
**నృణామేకో గమ్యస్త్వ మసి పయసామర్ణవ ఇవ ॥**

వేదచోదిత వేదాంతమార్గము, కపిల సాంఖ్యమార్గము, పతంజలి యోగమార్గము, వైష్ణవమతము, శైవమతము ఈమార్గము లన్నియు మోక్షసామ్రాజ్యమును చేర్చునవియే యగుచున్నవి పూర్వవాసనా విశేషముచే వారివారి రుచులననుసరించి ఆ యా మార్గముల ననుసరించు ముముక్షువులు, భక్తులు వీరందరికి సర్వేశ్వరుడవగు నీ వొక్కడవే గమ్యస్థానమై యున్నావు ఎట్లన ఋజుగాములుగాను, వక్రగాములుగాను తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తరగాములుగా ప్రవహించు నదులన్నియు ఒకే సముద్రములో పోయి చేరునట్లు వీరియొక్క స్థితిగూడ నుండును

*ధ్యాయన్కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్ ।*
*యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ ॥*

కృతయుగమున ధ్యానయోగపరమగు జ్ఞానము చేతను, త్రేతాయుగమున యజ్ఞముచేతను, ద్వాపరయుగమున నర్చనచేతను, ఏఫలమును బొందిరో, ఆఫలమునే

కలియుగమున భక్తి(నామసంకీర్తనము) చేత బొందగలరు ఒక్కొక్కయుగము మారునప్పుడు జనుల జ్ఞానశక్తియు తగ్గుచుండును కావుననే కలియుగమున ప్రజ్ఞాశక్తి తగ్గిపోవుటచేత ''అహం బ్రహ్మాఽస్మి'' యను జ్ఞానమునకున్ను, నిర్వికల్ప సమాధిగల యోగమునకున్ను, మానసకాయి కేంద్రియ నిగ్రహ పరమగు తపస్సునకున్ను శక్తి కలియుగమున చాలకపోవుటయే భక్తి చేత మోక్షము బొందవచ్చునని చెప్పుటకు గారణము

**సత్యాదిత్రియుగే బోధవై రాగ్యే ముక్తిసాధకే ।**
**కలౌ తు కేవలా భక్తిర్బ్రహ్మ సాయుజ్యకారిణీ ॥**

కృత, త్రేతా, ద్వాపర యుగములలో బ్రహ్మజ్ఞానము, యోగము, వైరాగ్యముతో గూడిన తపస్సు మోక్షసాధనములు ఆ మూడు యుగములలో జ్ఞానయోగతపస్సులచే ఏ మోక్షమును బొందిరో అట్టి బ్రహ్మసాయుజ్య జీవన్ముక్తి కలియుగమున భగవద్భక్తివల్లనే బొందగలుగును కారణమేమన పరాశరస్మృతి యీలాగున దెలుపుచున్నది కృతయుగమున ప్రాణము అస్థిగతమనియు, త్రేతాయుగమున ప్రాణము మాంసమును ఆశ్రయించి యుండుననియు, ద్వాపరమున రక్తసంబంధమై యుండుననియు, కలియుగమున ప్రాణము అన్నము నాశ్రయించి యుండుననియు తెలుపడమైనది కావున వ్యాసాది ఋషులు అనుష్ఠించిన జ్ఞానవము, సనకాదులనుష్ఠించిన యోగవము, విశ్వామిత్రాదులనుష్ఠించిన తపస్సును, కలియుగములో నందరున్ను అనుష్ఠింప జాలరని తలంచియే సులభమగు భక్తియే ముక్తిసాధనమని తెలుపబడినది

*కృతే త్వస్థిగతాః ప్రాణాః త్రేతాయాం మాంసమాశ్రితాః ।*
*ద్వాపరే రుధిరం చైవ కలౌ త్వన్నాదిషు స్థితాః ॥*

## 16. సూ ॥ పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః.

పద ॥ పూజాదిషు - అనురాగః - ఇతి - పారాశర్యః

టీ ॥ పూజాదిషు = పూజాదులయందు, అనురాగః = ప్రీతి, ఇతి = అని, పారాశర్యః = పరాశరపుత్రుడగు వ్యాసుడు

తా ॥ పూజాదులయందు ప్రీతి భక్తి యని పరాశర మహర్షి పుత్రుడగు వేదవ్యాసుడు వచించెను

వి ॥ శ్రీనారద మునీంద్రుడు మోక్షమునకు భక్తియే ముఖ్య సాధనమని తన యాశయము మాత్రము గాదని వ్యాస, గర్గ, శాండిల్యాది మహర్షులనుగూడ నిరూపించెను ఈ ''పూజాదిష్వను రాగ ఇతి పారాశర్యః'' పూజాదులలోల అనురాగము, భక్తియని వ్యాసుడు నిశ్చయించునప్పుడు పూజాశబ్దముచే నిచట సాకారము నంగీకరించవలసి వచ్చినది ఆత్మ పూజగూడ నుండినను, నది ఆధ్యాత్మిక జ్ఞానముతో సంబంధించినదగుటచే, నిచట దానినిమాత్రము లక్ష్యముంచుట దగదు కావున సాకారార్చనమే ఇచట ముఖ్యమని గ్రహించుకొనవలయును ఆత్మ చింతనము జేయుటకు పరిపక్వత లేని హృదయము గలవారికే సాకారపూజ యేర్పడినది మొట్టమొదట నిరాకారమగు ఆత్మపూజ జేయుట కందరికిన్ని సాధ్యము గాదు సామాన్య జనుల యంతః కరణాది ఇంద్రియములు దృశ్యవస్తువు లోనే స్థితి గలిగి యుండును దానినుండి మరలించి అంతర్దృష్టి లోనికి ప్రవేశింపజేసి పరమాత్మ ధ్యానము జేయుట యెంతో సంస్కారము గల జీవులకే సాధ్యపడును అక్షరాభ్యాస కాలమున ఓనమాలు బాలుడు వ్రాయవలసి యుండిన పలకలో యాచార్యుండు అక్షరములను లిఖించి బాలునిచే చెప్పించి దిద్దించవలయును ధనుర్విద్యాభ్యాసమున నొక్క గురుతుబెట్టి యభ్యసించిన మాత్రమే తరువాత సూక్ష్మవస్తువును గూడ భేదించెడి శక్తి గలుగును కావుననే శాస్త్రమీలాగున జెప్పుచున్నది

*శివజ్ఞానం ద్విధా జ్ఞేయం సగుణం నిర్గుణం తథా ।*
*ఆదౌ సగుణమాశ్రిత్య పశ్చాన్నిర్గుణమాచరేత్ ॥*

అవ్యక్తమైన పరమాత్మ స్వరూపమును రెండు విధములుగా గ్రహించదగినది అది సగుణమనియు, నిర్గుణమనియు జెప్పబడును మొదట సగుణోపాసనము జేసిన, రాగారాగా యదే నిర్గుణ బ్రహ్మమై పరిణమించును

సగుణజ్ఞాన హీనస్య న హి నిర్గుణవేదనమ్ ।
నందిదర్శన హీనస్య యథా న శివదర్శనమ్ ॥

ఏలాగున నంది దర్శనము జేయు నయనశక్తిలేనివాడు శివదర్శనము జేయజాలడో, ఆలాగున సగుణ జ్ఞానము లేనివానికి నిర్గుణజ్ఞానము సిద్ధింపదు గొప్ప ఆకారముతో బైట నుండునందికేశ్వరుడు నేత్రదోషముచే గనబడని వానికి చీకటి గదియగు గర్భాలయమున చిన్నదిగానుండు ఈశ్వరలింగ దర్శనమెట్లగును? బాలునికొక మహాత్ముని

పటమును పూజించు నప్పుడు చూపిన నారూపము, దీపము, పుష్పాదులయందు మనసు లగ్నమగును అత్తరి ఆమహనీయాత్ముని గురించి ఎంత జెప్పినను దెలిసి కొనజాలడు అతడే పెద్దవాడై యామహాత్ముని జీవితచరిత్రము జదివిన ఫోటోలో గాదు, అమ్మహనీయుని యనుష్ఠానములో ఆయనబొందిన దైవములో విశ్వాస భక్తులేర్పడును

విగ్రహారాధన రహస్యమున్ను ఆలాగున నుండును విగ్రహమును దైవభావముతో నారాధించువారు కేవల మూఢులని భావించరాదు మనోభావనయొక్క శక్తి చాల గొప్పది అట్టి భావనాశక్తి లేనివాడు నిరాకారదైవమును గూడ భావన జేయజాలడు దైవమును జ్ఞానస్వరూపునిగాను, కరుణాస్వరూపునిగాను, వ్యాపకస్వరూపుని గాను, సత్యస్వరూపుని గాను, ప్రకాశస్వరూపునిగాను భావించుటగూడ నొకవిధమగు భావనా పూజయేయగును స్థూలమైన పూజకన్న నిది కొంత యెత్తైన సూక్ష్మపూజయే అనగా మానస పూజయే యగును, ''యద్భావం తద్భవతి'' యని యుండుటచే విగ్రహములలో దైవ బుద్ధిగలిగి పూజించు వారికి దానికి తగిన ఫలితము గలుగును మార్కండేయుడు శివలింగమును ఈశ్వరభావముతో పూజించుటవల్ల దానినుండి పరమేశ్వరుం డావిర్భవించి మృత్యువునుండి రక్షించెను ప్రహ్లాదుండు చరాచర వస్తువులన్నిటిలోను భగవంతుని భావన జేయుటచే స్తంభమునుండి నృసింహమూర్తి యావిర్భవించి యాశీర్వదించెను ఏకలవ్యుండు మృత్తికచే ద్రోణాచార్య విగ్రహమును నిర్మించి ధనుర్విద్యను గ్రహించెను పండరీపురమున ననేకభక్తులు పాండురంగని దర్శించినగాధలు గలవు ఇకను నీలాటి కథలెన్నియో ప్రసిద్ధిలో నున్నవి ఇదంతయు వట్టికల్పిత కధలని ఆస్తికు లెవ్వరున్ను నమ్మజాలరు అయితే అందరికిన్ని విగ్రహారాధన యుండవలెనని మేము చెప్పుట లేదు మానసిక ధ్యానము జేయశక్తిలేని వారికుండుట మంచిదని మాత్రము మాయాశయము అయితే శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్య, శ్రీవల్లభాచార్య, శ్రీకృష్ణచైతన్య సంప్రదాయాదులు మానసిక ధ్యానము జేయ శక్తిగలవారు సహా విగ్రహారాధన తప్పక జేయవలయునని చెప్పుదురు ఈ విషయమై గీతలో గల ''యద్యదాచరతి శ్రేష్ఠః'', ''లోక సంగ్రహమేవాపి'', ''సంపశ్యన్కర్తుమర్హసి'' అనుగీతా ప్రమాణములను జూపుదురు

పూజలు బాహ్యముగా పదునారు విధములుగా జెప్పుదురు దీనినే షోడశోపచారమని తెలుపుదురు (1) ధ్యానము (2) ఆవాహనము, (3) పాద్యము, (4) అర్ఘ్యము, (5) ఆచమనీయము, (6) స్నానము, (7) వస్త్రము,

(8) యజ్ఞోపవీతము, (9) గంధము, (10) పుష్పాక్షతలు, (11) ధూపము, (12) దీపము, (13) నైవేద్యము (14) తాంబూలము, (15) నీరాజనము, (16) మంత్ర పుష్ప నమస్కారాదులు

అంతరాత్మ దర్శనము సామాన్యమని తలంచరాదని కఠోపనిషత్తు పదేశించుచున్నది -

మూ ॥ *పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయం భూస్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్ । కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్ ॥*

సృష్టికర్త ఇంద్రియములను పరాగ్విషయాభి ముఖస్వభావము గలవానిగా సృష్టించెను అందువలన అవి శబ్దాది విషయజాతమునే గాంచుచున్నవి అంతరాత్మను జూచుట లేదు చిత్తశుద్ధిగలిగి చిత్తైకాగ్రముగల ఒకానొక ధీరుడు మోక్షమును గోరుచున్నవాడై మరలింపబడిన యింద్రియ సమూహముగలవాడై పరమాత్మను జూచుచున్నాడు

## 17. సూ ॥ కథాదిష్వితి గర్గః.

పద ॥ కథాదిషు - ఇతి - గర్గః

టీక ॥ కథాదిషు = భగవత్కల్యాణ గుణగణ కథలయందు, ఇతి = ప్రీతి, (భక్తి) యని, గర్గః = గర్గాచార్యులమతము

నారదుడు, వ్యాసుడు, శాండిల్యుడు మొదలయినవారు భక్తియందెంత ప్రీతి గలిగియుండిరో, గర్గాచార్యుడున్ను అట్టివాడే భగవత్కల్యాణ గుణగణ కథలయందాసక్తి గలిగియుండుట భక్తియని గర్గ మహర్షియొక్క మతము

వి ॥ *శుకాద్యాస్సనకాద్యాశ్చ పురా ముక్తా హి భక్తితః ।*
*భక్త్యైవ మామనుప్రాప్తా నారదాద్యాశ్చిరాయుషః ॥*

శ్రీ శుకుడు, శ్రీసనక, సనందన, సనత్కుమార, సనత్సుజాత నారదాది మునులందరు పూర్వము భక్తి వల్లనే యీలోకములో జీవన్ముక్తులైరి భక్తిచేతనే వారు భగవత్ప్రాప్తిని బొంది చిరాయుష్మంతులైరి

*నృణాం జన్మసహస్రేణ భక్తౌ ప్రీతిర్హి జాయతే ।*
*కలౌ భక్తిః కలౌ భక్తిర్భక్త్యా కృష్ణః పురస్థితః ॥*

మానవులకు అనేక జన్మములలో భగవత్ప్రీతి కరమగు పుణ్యకర్మల పరిపాకము చేతనే భగవద్భక్తి గలుగును కలియుగమున మోక్షమునకు భక్తియే ముఖ్యసాధనము భక్తివల్లనే భగవంతుడు సాక్షాత్కరించును ''కలౌ భక్తిః కలౌ భక్తిః'' అని రెండు తూరులు జెప్పుట దార్ఢ్యముకొరకని గ్రహించేది

*న తపోభిర్న వేదైశ్చ న జ్ఞానేన న కర్మణా ।*
*హర్ర్హి సాధ్యతే భక్త్యా ప్రమాణం తత్ర గోపికాః ॥*

తపములచేతగాని, వేదాధ్యయనముల చేతగాని, శాస్త్రజ్ఞానము చేతగాని, కర్మకాండక్రియచేతగాని, భగవత్సాక్షాత్కారము బొందుటకు సాధ్యముగాదు అనన్యభక్తి యొక్కటియే భగవత్ప్రాప్తికి (మోక్షమునకు) కారణమగును దీనికి గోపికాస్త్రీలే ప్రత్యక్ష ప్రమాణము ఈవిషయమై ముకుందమాలయందు కులశేఖరాళ్వారు తెలిపినది జూడుడు

*వ్యాధస్యాచరణం ధ్రువస్యచ వయో విద్యా గజేంద్రస్య కా*
*కుబ్జాయాః కిము కామరూపమధికం కిం వా సుధామ్నో ధనమ్ ।*
*వంశః కో విదురస్య యాదవపతేరుగ్రస్యకిం పౌరుషమ్*
*భక్త్యా తుష్యతి కేవలం న చ గుణైర్భక్తిప్రియో మాధవః ॥*

ధర్మ వ్యాధుని ఆచరణమేమి ? ధ్రువునికి వయస్సెంత ? గజేంద్రుని విద్య యెంత? కుబ్జకు కామ సౌందర్యమెంత ? కుచేలునకు ధనమెంత? విదురుని వంశమేది? యాదవపతియైన ఉగ్రసేనునకు పౌరుషమెంత మాత్రము? వీరందరున్ను భగవద్భక్తి యొక్కదానివల్ల మాత్రమే భగవత్కృపకు పాత్రులైరి వీరి భక్తివల్లనే భగవంతుడు సంతోష భరితుడాయెను వారల జాతి, వయస్సు, విద్య మొదలగు గుణములవల్ల భగవంతుడు ప్రీతిని బొందలేదు భగవంతుడు భక్తప్రియుడు

## 18. సూ ॥ ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః

ప ॥ ఆత్మరత్య విరోధేన - ఇతి - శాండిల్యః

టీ ॥ ఆత్మరతి = ఆత్మక్రీడకు, అవిరోధేన = విరోధములేని భగవత్కర్మముల చే
ఇతి = పొందవలయునని, శాండిల్యః = శాండిల్యమహర్షియొక్క (అభిప్రాయము)

తా ॥ ఆత్మధ్యానముచే గలిగెడు ఆత్మక్రీడకు ప్రతిబంధము లేని భగవత్కార్యములు మాత్రమే చేయవలయునని శాండిల్య మహర్షి యొక్క ఆశయము అనగా బ్రహ్మనిష్ఠకు అడ్డు గలుగని కార్యములు మాత్రమే ఆత్మ ధ్యానపరాయణులగువారు చేసిన చాలును ఆత్మ పరమాత్మలో రమించుటయే భక్తి యని శాండిల్యముని యభిప్రాయము

వి ॥ ఎంత పుణ్య కర్మగల పనియైనను, లేక భగవత్ప్రీతికరమైన పనియైనను ఆత్మధ్యానమునకు ప్రతిబంధకమైనచో వానిని త్యజించి పరమాత్మ ధ్యానపరాయణులై యుండవలయును ఏలన యా ఆత్మారామ తత్త్వము యన్నిటికన్న ముఖ్యమైనది దీనికి భంగము గలుగజేసెడు క్రియలన్నియు అముఖ్యములు అయితే అంతరాత్మయందు రమించెడు పరిపక్వస్థితి గలుగనివారు, సంకల్పములు, వృత్తులు నశించని వారలు, బాహ్యమయిన భగవత్కైంకర్యాదులు లేక లోక సేవాపరమగు పుణ్య కర్మలు చేయుచుండవల యును కావుననే ''అవిరోధేన'' యని సూత్రములో ప్రయోగించడమైనది ఆత్మనిష్ఠకు ప్రతిబంధము గలుగజేయని పుణ్యకర్మాదులు బ్రహ్మనిష్ఠులు గూడ జేయుచుండవచ్చును లేనిచో గీత॥ 3వ అధ్యాయములో జెప్పినట్లు ఆత్మవంచ కులగుదురు

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥ (3-6)

ఏ మూఢాత్ముడు కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను అణచిపట్టి ఇంద్రియ విషయములను మనస్సుచేత స్మరించుచున్నాడో, వాడు మిథ్యాచారుడనియు, వంచకుడనియు చెప్పబడుచున్నాడు ఈ అధ్యాయము లోనే ఆత్మరతియొక్క మహిమను తెలిపినది జూడుడు

యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే ॥ (3-17)

దీని యర్థము ఇదివరలో వ్రాయబడినదే ''తస్య కార్యం న విద్యతే'' - అట్టి యాత్మరతిగలవానికి చేయవలసినది మరియొకటి లేదు కల్పవృక్ష మూలమందున్న వానికి ఇతర వృక్షములతో ఏమి పని ? కామధేనువు గలవానికి ఇతరపశువులతో ఏమి

ప్రయోజనము ? చింతామణి లభించినవానికి ఇతరరత్నములతో నేమి ప్రయోజనము? గంగా తీరమందుండు వానికి ఇతర నూతులు ఏమిటికి ? సూర్యుడు ప్రకాశించు చున్నపుడు దీపములచే ఏమి ప్రయోజనము ? ఆత్మక్రీడలోనున్నవానియొక్క స్థితియు ఆలాగున నుండును

త్రిభిశ్చకరణైస్సమ్యక్ హిత్వా వైషయికీం క్రియామ్ ।
స్వాత్మైక చింతనం యత్తదీశ్వరధ్యానమీరితమ్ ॥

మనోవాక్కాయములలో గల విషయ సంబంధమైన క్రియను తెస్సగా రహితమొనర్చి ఆత్మధ్యానము మాత్రము గలిగి యుండుటేది గలదో, యదే ఈశ్వర పూజ యగును అదే ధ్యానమున్ను అగు చున్నది

**19. సూ ॥ నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి.**

ప ॥ నారదః - తు - తదర్పితాఖిలాచారతా - తద్వి స్మరణే - పరమవ్యాకులతా - ఇతి

టీ ॥ నారదస్తు = నారదుడైతేనో, తదర్పితాఖిలాచారతా = తదర్పిత = ఆ భగవంతుని యందర్పింపబడిన, అఖిలాచారతా = సమస్తాచారములు గల వాడగుట, తద్విస్మరణే = ఆ భక్తిని మరచితే, పరమవ్యాకులతా= మహావ్యాకులత గలిగియుండుట, ఇతి = అని వచించెను

తా ॥ నారదమహర్షి ఆ భగవంతునియం దర్పింపబడిన సమస్తా చారములు గలవాడై ఆ భగవద్భక్తి మరచినచో మహాదుఃఖము గలిగి యుండుట యని చెప్పెను ఇది పరమభక్తులయొక్క లక్షణము

వి ॥ శ్రీరామకృష్ణ పరమహంసలు ఎప్పుడైన జగజ్జననీ భావము అంతఃకరణమునుండి తప్పిపోయినచో, మహాదుఃఖముతో రోదనము చేయుచు నుండేవారు గోపికా స్త్రీలయొక్క శ్రీకృష్ణాను విస్మరణమందు గలిగెడు వ్యాకులత భాగవతమున గనందగును దీనిలో ఇది వరలో వ్రాసిన ''వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడై యొక్కడు నేడుచు నొక్కచోట'' అను ప్రహ్లాదుని అవస్థను గురించిన పద్యము జూడుడు

భక్తిరేవ పరమార్థదాయినీ భక్తిరేవ భవరోగనాశినీ ।
భక్తిరేవ పరవేదనప్రదా భక్తిరేవ పరముక్తి కారిణీ ॥

నారదమునికి గలిగినట్టి పరభక్తి మాత్రమే పరమార్థ జ్ఞానమును గలుగజేయునది అట్టి భక్తియొక్కటియే సంసార రోగమును నశింపజేయునది అట్టి భక్తి యొక్కటిమాత్రమే పరతత్త్వమును గలుగజేయునది అట్టి భక్తియొక్కటి మాత్రమే ముక్తి నొసంగునది

## 20. సూ ॥ అస్త్యేవ మేవమ్.

ప ॥ అస్తి - ఏవమ్ - ఏవమ్

టీ ॥ ఏవం = ఈ ప్రకారమైన భక్తికి, ఏవం = ఈ ప్రకారమైన నిదర్శనము, అస్తి = అవును

తా ॥ పై సూత్రమున వివరించినట్లు సర్వవ్యాపారములనున్నా భగవంతునియం దర్పించిన చిత్తము గలిగి భగవద్భావ మంతఃకరణనుండి తప్పిపోవునప్పుడు మహావ్యాకులమును గలిగి యుండెడి భక్తియే గలిగియుండవలయును

వి ॥ భాగవతము జూడుడు

అడుగడ్గునకు మాధవానుచింతన సుధా
మాధుర్యమున మేను మరచువాని
నంభోజ గర్భాదు లభ్యసింపగ లేని
హరిభక్తి పుంభావమైనవాని

మాతృగర్భము సొచ్చి మున్నది మొదలుగా
జిత్తమచ్యుతు మీద జేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు
శ్రీవిష్ణుమయమని చెలగువాని

వినయకారుణ్య బుద్ధి వివేకలక్ష
ణాది గుణముల కాటపట్టయినవాని
శిష్య బుధలోకసంభావ్యు జీరి గురుడు
ముందరికి ద్రొబ్బి తండ్రికి మొక్కుమనుచు

## 21. సూ ॥ యథా వ్రజగోపికానామ్.

ప ॥ యథా - వ్రజగోపికానామ్

టీ ॥ యథా = ఏలాగున, వ్రజగోపికానాం = గోకులమునందలి గోపికా స్త్రీలు శ్రీకృష్ణభక్తిగలిగి మైమఱచియుండిరో, ఆలాటి తన్మయ భక్తి గలిగి యుండవలయును

తా ॥ ఏలాగున గోకులవునందలి గోపికాస్త్రీలు శ్రీకృష్ణ భక్తిగలిగి మైమరచియుండిరో, ఆలాటి తన్మయభక్తి గలిగియుండవలయును

వి ॥ ఈ విషయమై శివానందలహరియందు శ్రీ శంకర భగవత్పాదులు జెప్పినది జూడుడు

**హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః**
**కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా ।**
**చేతో వాంఛతి మామకం పశుపతే ! చిన్మార్గమృగ్యం విభో !**
**గౌరీనాథ ! భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్ ॥**

ఓ యీశ్వరా ! హంస పక్షి పద్మ సమూహమును, చాతక పక్షి నీలమేఘమును, చక్రవాకపక్షి సూర్యోదయమును, చకోరపక్షి చంద్రోదయమును ఏలాగున నిరంతరము తదేక ధ్యానముతో నపేక్షించుచున్నవో, ఆలాగుననెవనియొక్క చిత్తము ఉపనిషత్ప్రతిపాద్య పరమాత్మయందైక్యమును గోరుచున్నదో అదియే నిజమైన భక్తియొక్క లక్షణమగును

## 22. సూ ॥ తత్రాపి న మాహాత్మ్యజ్ఞాన విస్మృత్యపవాదః.

పద ॥ తత్ర - అపి - న - మాహాత్మ్య జ్ఞాన విస్మృత్య అపవాదః

టీక ॥ తత్రాపి = అట్లుండినను, మాహాత్మ్య జ్ఞాన విస్మృతి = శ్రీకృష్ణమూర్తి యొక్క దేహసంబంధ ప్రభావాదులవిస్మృతికి చెందిన, అపవాదః న = లోకాపవాదమును జెంద లేదు

తా ॥ గోపికా స్త్రీలు పామరులవలె దేహబుద్ధిగలవారై శ్రీ కృష్ణుని చెందలేదు కేవలము తన్మయులై పరమాత్మభావము గలిగి యుండిరి కావుననే

లోకాపవాదమును బొందక పోవుటయేగాక లోకస్తుతికి అర్హులైరి బ్రహ్మాదిదేవతలచే గీర్తింప తగిన వారలైరి

వి ॥ గోపికా స్త్రీలకు శ్రీకృష్ణునియందు గలిగిన విరహము పామర స్త్రీలకు గలిగిన కామవిరహము వంటిది గాదు అది కేవలము దేహమునుగూడ మరచిన ఆత్మవిరహమై యుండెను, లేనిచో గోపికలున్ను, శ్రీకృష్ణభగవానుడున్ను నీచత్వమును బొందియుందురు అట్లయిన బ్రహ్మాదిదేవతలుగాని, వ్యాసాదిఋషులుగాని, సనకాది యోగులుగాని, గోపికాస్త్రీలను శ్రీకృష్ణభగవానుని స్తుతించియుండరు అందువల్లనే ద్వాపరాంతమునుండి నేటివరకు మహాప్రజ్ఞావంతులున్ను నీతిజ్ఞులును నగు మానవులు శ్రీకృష్ణభగవానునిన్ని, గోపికా స్త్రీలనున్నూ, స్తుతించుచున్నారు, పూజించుచున్నారు అందువలననే ఈసూత్రమున ''మాహాత్మ్యజ్ఞానవిస్మృతి'' యని సూచించుటకు గారణము ఇట్టి యవస్థ నిర్వికల్ప సమాధియందు మాత్రమే సిద్ధించును ఇట్టి పరతత్త్వరహస్యము దెలుసుకొనజాలక కొందరు భక్తులు తమ్ము శ్రీకృష్ణులుగాను, భక్తురాండ్రగు నారీమణులను గోపికలుగాను భావించి నరకమును బొందుచున్నారు వల్లభమతమున కంచుకోత్సవమను పేరుతో అదియొక మత సంప్రదాయముగ తలంచువారు గలరు

యోగసూత్రము విభూతి పాదము సూ ॥ ''తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః'' - ధ్యానము నిరంతరాభ్యాసవశమున ధ్యేయాకారమున పరిణమించి తన ధ్యానరూపమును దోపనీయక ధ్యేయాకార మాత్రమై యుండుటయే సమాధి యనంబడును కావుననే సూత్రమందు ''అర్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యం'' అని ప్రయోగించుటకు గారణము అర్థమాత్ర మనగా శబ్దము త్యజించి యది దేనిని గూర్చి చెప్పుచుండునో, ఆ స్వరూపమై యుండుటయు, స్వరూపశూన్యం దేహాకారబుద్ధిలేనిదై, దైవాకారస్థితిగలిగి యుండుటయని భావము ఇట్టి భావమే పరమ భక్తులున్ను, పరమభక్తురాండ్రును, మహాపుణ్యవ్రతలును నగు గోపికాస్త్రీలకుండెను యోగశాస్త్రము జెప్పినది జూడుడు

*క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే ।*
*సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః ॥*

సమాధి లక్షణము చెప్పబడుచున్నది ఏలాగున పాలలో పాలున్ను, నూనెలో

నూనెయున్ను, నీటిలో నీరున్ను ఐక్యమయిన భిన్నత్వము బోయి, యేకత్వము బొందుచున్నదో, ఆలాగున ఆత్మ నేత్త యయిన మునియు, పరమాత్మ యందేకత్వము బొందుచున్నాడు గోపికలు నిట్టి స్థితిలో నుండు వారలే

*ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్వయమ్ ।*
*తథైవోపాధి విలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్॥*

ఏలాగు ఘటాకాశము ఘటము భిన్నమైన స్వయముగా మహాకాశమగు చున్నదో, ఆలాగున దేహోపాధి విలయమైన బ్రహ్మజ్ఞానియు స్వయముగా బ్రహ్మయే యగుచున్నాడు పరమ భక్తురాండ్రగు గోపికా వధూమణులు దేహబుద్ధి గలిగి యుండలేదు ఇట్టి యవస్థను దేహబుద్ధిలో గలవారు అనుసరించుట గాఢసుషుప్తిలో నుండు మూఢాత్ముని నిర్వికల్పసమాధిలో నుండు మహాత్మునితో సమానముగా జెప్పునట్లుండును అమృతమును విషముతో సమన్వయ పరచువానివలె నుంటున్నది తల్లియు, భార్యయు నొకే స్త్రీరూపమని తలంచి విహరించు పాపాత్ముని గతి యెట్టిదో, దేహబుద్ధి గలిగియుండు గురుశిష్యురాండ్ర స్థితియు నట్టిదని మరువకుడు ।

## 23. సూ ॥ తద్విహీనం జారాణామివ.

పద ॥ తద్విహీనం - జారాణాం - ఇవ

టీక ॥ తద్విహీనం = గోపికాస్త్రీలకు గలిగిన తన్మయభక్తిలేని స్థితిని, జారాణా మివ= జారులస్థితి వంటిది అని చెప్పుచున్నారు

తా ॥ గోపికావధూమణులకు శ్రీ కృష్ణభగవానుని యందుగల తన్మయభక్తి లేక ప్రవర్తించువారలను వ్యభిచారులనియే నిజ్ఞులు దలంతురు

*సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్ ।*
*అనంతం బ్రహ్మనిష్ఠానామితి వేదాంతడిండిమః ॥*

'విషయాసక్తులైన జనుల కల్పమైన సుఖమును, అంతము లేని క్లేశమున్ను గలుగును బ్రహ్మనిష్ఠులైన మహనీయుల సుఖమునంతమైనదని వేదాంత భేరి ఘోషించుచున్నది' యని శంకరాచార్యులు (వేదాంతడిండిమము)

*క్షురధారాసు సంలగ్నం యథాస్వాదయతే మధు ।*
*సుఖం స్వల్పం మహద్దుఃఖం సంసారేఽస్మిన్ తథా సుఖమ్ ॥*

ఈ సంసారములో గల స్త్రీ విషయాది విషయసుఖమెట్టిదన, వాడిమిగల మంగలికత్తి పదునుపై పూయబడున తేనెను నాలుకతో నాకునప్పుడు ఒక్క విఘడియకాలము తీయగ గనిపించినను, నాలుక తెగిన తరువాత మహా దుఃఖమెటువంటిదో ఆలాగున విషయసుఖము అత్యల్పముగా గనిపించినను అనంతదుఃఖమును బొందవలసియుండును

నారీణాం నయనాదేశః సురాణామపి దుర్జయః।
స యేన విజితో లోకే హరిభక్తస్స ఉచ్యతే।
హరిభక్తిః కుతః పుంసాం నారీభక్తిజుషాం ద్విజాః॥

కామినీ స్త్రీలయొక్క నయనాదేశము దేవతలకు గూడ జయించుటకు ప్రయాసమైనది ఆలాటి మోహావేశపరిచెడి స్త్రీలయొక్క చూపును ఎవడు జయించినవాడో, అట్టివాడే హరిభక్తుడని చెప్పబడును, ఓ ద్విజులారా ! నారీభక్తియందావేశముగల చిత్తము గల వారికి హరిభక్తి యెక్కడిది ? అనగా వారికిచటగాని, పరమందుగాని, అరణ్యమందుగాని, మరమందుండినగాని నిజమైన దైవభక్తి గలుగదు, అష్టావక్రమునీంద్రుడు జనకమహారాజుకు పదేశించినది చూడుడు

*ముక్తిమిచ్ఛసి చేత్తాత ! విషయాన్విషవత్త్యజ।*
*క్షమార్జవం దయా తోషం సత్యం పీయూషవద్భజ॥*

ఓ నాయనా ! నీవు మోక్షమును ఇచ్ఛించెదవేని, విషయముల నన్నిటిని, విషమువలె త్యజింపుమా ! క్షమయు, ఆర్జవమును, భూతదయను, ఆత్మసంతోషమును, సత్యమును అమృతమువలె సేవింపుమా !

*మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః।*
*ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు॥*

విషయములలో విరక్తిగల్గి యుండుటయే మోక్షము విషయములలో అభిలాష గలిగి యుండుటయే బంధము శాస్త్రము చేతను, గురువాక్యము చేతను, స్వబుద్ధిచేతను తెలిసికొనందగినదిది ఒకటియే తర్వాత మీ యిష్టమేలాగో యాలాగున జేయుమా !

*శ్రుతం సత్యం తపశ్శీలం విజ్ఞానం విత్తమున్నతిమ్।*
*ఇంధనీకురుతే మూఢః ప్రవిశ్య వనితానలమ్॥*

మూఢుడై నవాడు శాస్త్రశ్రవణము, సత్యము, తపస్సు, సుశీలత్వము, విజ్ఞానము, ధనము, ఉన్నతస్థానము మొదలైనవాటిని స్త్రీయను అగ్ని యందు ప్రవేశించి కట్టెలవలె కాల్చివేయుచున్నాడు ''వనితాలయమ్'' అని పాఠాంతరము

*యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।*
*ఆద్యన్తవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ (5-22)*

ఓ యర్జునా ! ఏవి విషయ సంయోగమువలన గలిగిన సుఖములో, యవి దుఃఖమును గలుగజేయునవే అవి ఉత్పత్తి నాశములు గలవి కాబట్టి బుద్ధిమంతుడు ఆ విషయ సుఖములయందు రమించడు

## 24. సూ ॥ నాస్త్యేవ తస్మింస్తత్సుఖ సుఖిత్వమ్ .

పద ॥ నాస్తి - ఏవ - తస్మి౯ - తత్సుఖసుఖిత్వమ్

టీక ॥ తస్మి౯ = భగవంతుని బొందుట యనెడి సుఖము, తత్సుఖసుఖిత్వం= సాధారణ స్త్రీలు తమ ప్రియతములయెడ బొందునట్టి సుఖము వంటిది, నాస్త్యేవ = కానేకాదు

తా ॥ భగవదైక్యముచే గలిగెడు తన్మయ సుఖము జార స్త్రీలు తమ ప్రియతముల యెడ బొందెడు సుఖము వంటిదిగాదు

వి ॥ సామాన్యముగా ప్రపంచములో కామపరవశులై యుండు స్త్రీలు బొందెడు విషయ సుఖమెట్టిదో గోపికలు బొందిన సుఖము అటువంటిది గానేరదు అది భగవదైక్యాను సంధానముచే, పరమయోగులు బొందెడు శాశ్వత బ్రహ్మానందమే గాని, మరియొకటి గాదు ఆసంబంధము మానసిక సంబంధముగా నుండును గోపికలు బొందిన సుఖము దేహేంద్రియ మనోబుద్ధులకు విలక్షణమైనది, అది యాత్మారామసుఖము దేహేంద్రియ మనస్సులు జడములు ఆత్మయో ! చైతన్యస్వరూపము భగవంతుడున్నూ చైతన్య స్వరూపుడే వీరుభయులు అప్రాకృతులు కావున దానివల్ల గలిగెడి సుఖము గూడ యప్రాకృతమైన బ్రహ్మసుఖము అది శాశ్వతమైనది పున రావృత్తి లేనిది దేహేంద్రి యాదులతో గూడిన విషయ సుఖము, పునరావృత్తితో గూడినది, అంతియగాక, నొక క్షణకాలము, సుఖముగా దోచినను, ఉత్తరక్షణమున మహాదుఃఖమును గలుగ జేయునది

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ (5-21)

బాహ్యమునందలి, విషయములందు అంటని మనస్సుగల యే పురుషుడు తనయాత్మయందుగల సుఖమెద్దిగలదో ఆ సుఖమును బొందుచున్నాడు అట్టివాడు భగవదనుసంధానమైన మనస్సుగల వాడై యక్షయమైన బ్రహ్మసుఖమును బొందుచున్నట్లే యా గోపికా స్త్రీరత్నములు అత్మసుఖమునే బొందినారు



ఓం

# 2. ద్వితీయోఽధ్యాయః - భక్తిమహత్త్వమ్

# రెండవ అధ్యాయము - భక్తిమహత్త్వము

## 25. సూ ॥ సా తు కర్మజ్ఞానయోగేభ్యోఽప్యధికతరా.

పద ॥ సా - తు - కర్మజ్ఞానయోగేభ్యః - అపి - అధికతరా

టీక ॥ సా తు = ఆభక్తియైతేనో, కర్మ = కర్మముకన్న, జ్ఞాన = జ్ఞానమునకన్న, యోగేభ్యోఽపి = యోగముకన్నను, అధికతరా = మిక్కిలి అధికమైనది

తా ॥ ఆ తన్మయభక్తియైతేనో, యజ్ఞాదికర్మముకన్నను, నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానముకన్నను, అష్టాంగయోగముకన్నను అధికతరమైనది ఏలన యజ్ఞాదికర్మలు, ఆత్మానాత్మ వివేకజ్ఞానము, అష్టాంగ యోగము మొదలగున వన్నియు భక్తి గల్గియుండిన మాత్రమే ఫలించును భక్తి వాన వంటిదనియు, కర్మజ్ఞానయోగాదులు విత్తనముల వంటివనియు, శ్రేష్ఠ విత్తనములై నను వర్షములేనిచో ఫలించనట్లు పైజెప్పిన క్రియలన్నియు భగవద్భక్తి గలిగియుండిన మాత్రమే ఫలించును, లేనిచో ఫలించవని గ్రహించవలెను

*వి ॥ యోగః కర్మ చ సాంఖ్యం చ తపోధ్యానం వ్రతం శ్రుతమ్ ।*
*వ్యర్థం హి భక్తిహీనస్య వృష్టిహీనా కృషిర్యథా ॥*

యోగాభ్యాసము, యజ్ఞాదికర్మ, సాంఖ్యవిచారము, తపస్సు, ధ్యానము, వ్రతము, వేదాంతశ్రవణము, ఇవన్నియు శ్రేష్ఠములే అయితే బీజములుత్కృష్టములై నను, వర్షము లేనిచో నెట్లు వ్యర్థములో, అట్లు పవిత్రమైన భక్తి లేనిచో, పైజెప్పిన యోగాదులన్నియు ఫలమును గలుగ జేయవు

*న వేదయజ్ఞాధ్యయనైర్న దానైర్న చక్రియా భిర్న తపోభిరుగ్రైః ।*
*ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ (11-48)*

ఓ యర్జునా! ఇట్టి విశ్వ రూపముగల నేను భూలోకమునందు, అనన్యభక్తిగల నీకన్న నితరునిచేత, వేదపఠనములచేతగాని, యజ్ఞాది క్రతువులచేతగాని, శాస్త్రాధ్యయనములచేతగాని, దానముల చేతగాని, కర్మకాండ క్రియలచేతగాని, ఉగ్రతపస్సులచేతగాని దర్శించుటకు సాధ్యమైన వాడను గాను అనన్యభక్తియొక్కదానిచేత మాత్రమే నన్ను చూడసాధ్యమగును ఆరవ అధ్యాయములోని శ్లో॥46,47, చూడుడు ఈ రెండు శ్లోకములిదివరలో వ్రాయబడినవి భాగవతమును జూడుడు

చిక్కడు వ్రతముల క్రతువులఁ
జిక్కడు మరి దానశౌచ శీల తపములం
జిక్కడు యుక్తిని భక్తిని
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుమండీ!

## 26. సూ॥ ఫలరూపత్వాత్.

పద॥ ఫలరూపత్వాత్

టీక॥ (భక్తిః = భక్తి), ఫలరూపత్వాత్ = ఫలరూపమగుటవలన,

తా॥ ఈ భక్తియైతే ప్రత్యక్షఫలమును గలుగజేయునదిగా ఉంటున్నది

వి॥ యజ్ఞాది క్రతువులు, తపస్సులు, మొదలైనవి నిష్కామ కర్మమైనచో భక్తిని గలుగజేయునవిగా నుంటున్నవి భక్తి గలిగిన యదే సాక్షాత్తుగా మోక్షము గలుగజేయును భక్తి తప్ప తక్కిన యజ్ఞాది క్రతువులు పరంపరా ముక్తిని మాత్రమే గలుగజేయును

## 27. సూ॥ ఈశ్వరస్యాప్యభిమానిద్వేషిత్వాద్దైన్య ప్రియత్వాచ్చ.

పద॥ ఈశ్వరస్య - అపి - అభిమానిద్వేషిత్వాత్ - దైన్యప్రియత్వాత్ - చ

టీక॥ ఈశ్వరస్యాపి = ఈశ్వరుడుగూడ, అభిమానిద్వేషిత్వాత్ = అహంకారులను ద్వేషించుటచేతను, దైన్యప్రియత్వాచ్చ = దీనులను ప్రేమించుటచేతను

తా॥ ఈశ్వరునకు దురభిమానుల ద్వేషించుటయు, దీనభావము గల భక్తుల రక్షించుటయు స్వభావమై యుండును

వి ॥ శిష్టరక్షణ, దుష్టశిక్షణకొఱకే భగవదవతారమేర్పడుచుండును కావుననే కంసాదులను శిక్షించుటయు, ప్రహ్లాదాదులను రక్షించుటయు జరిగెను ఆలాగున దుర్యోధనాదుల నిగ్రహించుటయు, ధర్మరాజాదుల ననుగ్రహించుటయు ఏర్పడెను అదే రీతిగ రావణాదుల రహితమొనర్చుటయు, విభీషణాదుల ఆదరించుటయు గలిగెను అట్లు గానిచో లోకసంరక్షణము జరుగదు ధర్మాత్ముడైన రాజైనచో అధర్మాత్ములను అణచుటయు, ధర్మాత్ములను ఆదరించుటయు ఇప్పుడుగూడ ప్రపంచములో జరుగుచునే యుంటున్నది యమధర్మరాజు సహ పుణ్యాత్ములకు స్వర్గమును, పాపాత్ములకు నరకమును విధించుచున్నాడు దీనియందు సమత్వమునకున్ను, దయాళుత్వమునకున్ను, అంతర్యామిత్వ మునకున్ను, సత్యమునకున్ను హాని గలుగదు

*యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।*
*అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ (4-7)*

ఓ యర్జునా ! ధర్మమునకు క్షయమున్ను, అధర్మమునకు వృద్ధియున్ను నెప్పుడు గలుగుచుండునో, అపుడధర్మము నణచుటకున్ను, ధర్మము నుద్ధరించుటకున్ను నేనవతరిచుచున్నాను

*పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।*
*ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ (4-8)*

నేను సన్మార్గ నిష్ఠగలవారియొక్క రక్షణము కొఱకును, దుర్మార్గ ప్రవర్తులై, సాధు సజ్జనుల బాధించు వారియొక్క శిక్షణ కొఱకును, ధర్మమును స్థాపించుట కొఱకును ప్రతియుగమున పుట్టుచున్నాను

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ (16-18)

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥ (16-19)

దురహంకారమును బలమును, గర్వమును, దురాశయును, కోపమును,

నవలంబించినవారై, తవుకంటె నితరవములగు దేహవముల యందుండెడు నన్నసూయాపరులై ద్వేషింతురు సర్వాత్మలను తన యాత్మగా జూడని నిర్దయులని భావము సమస్త ప్రాణులలోగల ఆత్మయను సర్వేశ్వరుండగు నన్ను ద్వేషించుచున్న క్రూరులునగు, అనరాధములను ఎల్లప్పుడును జననమరణ ప్రవాహరూపమగు సంసారమునందు (ఆసురయోనులందు) పుట్టునట్టు చేయుచున్నాను అయితే యట్టి జీవులకు నెల్లప్పుడున్ను నట్టి దుర్గతియా ? లేక సద్గతి లేదా ? అని సంశయము గలుగవచ్చును దానికి సమాధానముగ నాయధ్యాయమున శ్లో ॥ 22, తెలుపడమైనది

*ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభిర్నరః ।*
*ఆచరత్యాత్మన శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥ (16-22)*

ఓయర్జునా ! నరకద్వారము నకు హేతువులైన, కామక్రోధ, హింసాదులైన, ఆసురగుణములను త్యజించి తనకు శ్రేయస్సు గలుగ జేసెడు దైవభక్తి, జీవకారుణ్యాదులను జేసుకొనుచుండిన, అందువల్ల నట్టివాడు సర్వోత్కృష్టమైన మోక్షమును బొందుచున్నాడు మానవులకు మాత్రము బంధము నుండి విముక్తి గలుగజేయు విశేషజ్ఞానము ఈశ్వరుండొసంగియున్నాడు, అట్టి జ్ఞానము పశ్వాదులకు లేదు అట్టి జ్ఞానములేని వారినే పశుసమానులని శాస్త్రము జెప్పుచున్నది ''జ్ఞానేన హీనః పశుభిస్సమానః'' పశువులకు రోగము వచ్చిన స్వయముగా చికిత్సజేసుకొని సంరక్షణ పొందెడి మార్గము దెలియదు మానవులైతే ఔషధసేవచే రోగ విమోచనము జేసుకొనగలరు మరియు పశువులు తృణపత్ర ధాన్యాదుల నున్నదున్నట్లు భుజించు స్వభావమునే గలిగి యున్నవి మనుష్యులైతే పై జెప్పిన ధాన్యాదులను శుభ్రపరచి రుచికరమును, బలకరమును, నగువిధముగ పక్వము జేసి భుజింపగలరు అందువల్ల మానవులు విశేషజ్ఞానము గల వారని జెప్పుటకు గారణమైనది భాగవతము,

సృష్ట్వా పురాణి వివిధా న్యజయాత్మ శక్త్యా
వృక్షాన్ సరీసృప పశూన్ ఖగదంశమ త్స్యాన్।
తైస్తైరతుష్ట హృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోక ధిషణం ముదమాప దేవః॥

సృష్టి కాలములో వివిధములగు వృక్షములను, పశువులను, సరీసృపములను, పక్షులను, మక్షికములను మత్స్యములు మొదలగు సమస్తములను సృష్టించియు,

వి ॥ శిష్టరక్షణ, దుష్టశిక్షణకొఱకే భగవదవతారమేర్పడుచుండును కావుననే కంసాదులను శిక్షించుటయు, ప్రహ్లాదాదులను రక్షించుటయు జరిగెను ఆలాగున దుర్యోధనాదుల నిగ్రహించుటయు, ధర్మరాజాదుల ననుగ్రహించుటయు ఏర్పడెను అదే రీతిగ రావణాదుల రహితమొనర్చుటయు, విభీషణాదుల ఆదరించుటయు గలిగెను అట్లు గానిచో లోకసంరక్షణము జరుగదు ధర్మాత్ముడైన రాజైనచో అధర్మాత్ములను అణచుటయు, ధర్మాత్ములను ఆదరించుటయు ఇప్పుడుగూడ ప్రపంచములో జరుగుచునే యుంటున్నది యమధర్మరాజు సహ పుణ్యాత్ములకు స్వర్గమును, పాపాత్ములకు నరకమును విధించుచున్నాడు దీనియందు సమత్వమునకున్ను, దయాళుత్వమునకున్ను, అంతర్యామిత్వ మునకున్ను, సత్యమునకున్ను హాని గలుగదు

*యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।*
*అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ (4-7)*

ఓ యర్జునా ! ధర్మమునకు క్షయమున్ను, అధర్మమునకు వృద్ధియున్ను నెప్పుడు గలుగుచుండునో, అపుడధర్మము నణచుటకున్ను, ధర్మము నుద్ధరించుటకున్ను నేనవతరిచుచున్నాను

*పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।*
*ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ (4-8)*

నేను సన్మార్గ నిష్ఠగలవారియొక్క రక్షణము కొఱకును, దుర్మార్గ ప్రవర్తులై, సాధు సజ్జనుల బాధించు వారియొక్క శిక్షణ కొఱకును, ధర్మమును స్థాపించుట కొఱకును ప్రతియుగమున పుట్టుచున్నాను

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ (16-18)

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥ (16-19)

దురహంకారమును బలమును, గర్వమును, దురాశయును, కోపమును,

*స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్।*
*సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయమ్ ॥*

వారివారి కేర్పడిన యనుష్ఠానమనెడు ధర్మప్రవర్తనము చేతను, తపస్సుచేతను భగవదనుగ్రహముచేతను, జీవులకు సాధన చతుష్టయ సంపత్తి గలుగును వేరు మార్గము లేదు కావుననే అద్వైతమార్గావలంబులందరు తమతమ ఆశ్రమమరాదులయందు ఇప్పటికిన్ని దేవతార్చన పూజాదులు నడపుచుందురు భగవదుపాసనవలన భగవదనుగ్రహముగలిగిన మాత్రమే మోక్షము గలుగునని, దానిని జ్ఞానమని చెప్పిరి అద్వైతులో। ఆత్మసాక్షాత్కార జ్ఞానమునే జ్ఞానమని వచించిరి జ్ఞానశబ్దమున కింతే భేదము శ్రీశంకరులు ప్రశ్నోత్తర మణిరత్నమాలయందు శిష్యునియొక్క ప్రశ్నకు మొట్టమొదట శ్లోకము జెప్పిరి

**అపారసంసార సముద్రమధ్యే సన్మజ్జతో మే శరణం కిమస్తి।**
**గురో ! కృపాళో ! కృపయా వదైతద్విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా ॥**

ప్రశ్న ॥ శిష్యుడు - ఓగురువరా ! కృపాళూ ! అంతులేని జనన మరణ రోగాదులకు ఆకరమైన ఈ సంసార సాగరములో లెస్సగ, మునిగియున్ననాకు తరణోపాయ మెద్ది ? ఉత్తరము॥ గురువు-సర్వేశ్వరుని యొక్క పాదద్వంద్వధ్యానమనెడు విశాలముగాను, దృఢముగాను నుండు ఓడయే శరణ్యము

సాగరమును తరించుటకు నావ యెట్టిదో సంసారము దాటుటకు భగవద్భక్తి యట్టిదని తెలిపిరి భూలోకములో జన్మించిన బ్రహ్మజ్ఞానులలో శ్రీదత్తాత్రేయు డధికుడు ఈ మహానుభావుడు త్రిమూర్త్యాత్మ స్వరూపుడని లోకమెరింగిన విషయమే వారు రచించిన యవధూత గీతయందు మొదటనే ఈశ్లోకము రచించిరి ఆ అవధూత గీత అద్వైతమయము

*ఈశ్వరాను గ్రహాదేవ పుంసామ ద్వైతవాసనా।*
*మహాభయపరిత్రాణా ద్విత్రాణా ముపజాయతే ॥*

ఈశ్వరాను గ్రహమువల్లనే రక్షణములేనట్టి జననమరణ మహాభయము నుండి రక్షించునట్టి, ప్రాణులకు అద్వైత జ్ఞానమందు ప్రవృత్తిగలుగును ''ఏవ'' శబ్దము ప్రయోగించుటచే ఈశ్వరానుగ్రహము గలుగనిచో జీవులకు అద్వైతవాసనయే పుట్టనేరదని దృఢముగ జెప్పిరి శంకరులు సర్వవేదాంతసార సంగ్రహము నందిట్లు వచించిరి

శ్రుత్వా తత్త్వ మసీత్యేవం బోధ్యమానోఽప్యనేకధా ।
న విజానాత్యయం తత్త్వ మీశానుగ్రహ వర్జితః ॥

తత్త్వమసి మహావాక్యమును అనేకసారులు మహాత్ముడగు గురువువల్ల శ్రవణముజేసినను, అనేకయుక్తి యుక్తానుభవ శాస్త్రప్రమాణములచే అనేక విధములుగా బోధింపబడినను ఈశ్వరాను గ్రహములేనివారికి జీవేశ్వరుల యేకత్వమగు అద్వైత తత్త్వము బోధపడజాలదు ఇక ఈవిషయమై వ్రాయవలసి వచ్చిన గ్రంథము పెరుగునని తలంచి క్రింద శ్లోకమువ్రాసి విరమించెద

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి ॥

## 29. సూ ॥ అన్యోన్యాశ్రయత్వమిత్యన్యే.

పద ॥ అన్యోన్యాశ్రయత్వం - ఇతి - అన్యే

టీక ॥ అన్యే = మరికొందఱు మునులు, అన్యోన్యాశ్రయత్వమితి = భక్తి జ్ఞానములలో నొకదానికి మరియొకటి ఆశ్రయమని చెప్పిరి

తా ॥ కొందరు మహాత్ములు భక్తి లేక జ్ఞానమును, జ్ఞానము లేక భక్తియున్ను గలుగదని నుడివిరి వారలెవరనగా పైసూత్రముయొక్క విశేషఅర్థమున వ్రాయబడిన ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, భీష్మ, దాల్భ్య, రుక్మాంగద, అర్జున, వసిష్ఠ, విభీషణాదులు ఆదిశబ్దము ప్రయోగించుటచే నికను పెక్కండ్రు ఋషులు గలరని తెలియందగినది

వి ॥ ప్రపంచములోగల సమస్త ప్రాణికోట్లున్ను ప్రాణాపానములనెడు రెండు శక్తులచేతనే జీవించుచున్నవి ఒక్క ప్రాణముచేతగాని ఒక యపానముచేత గాని జీవింపజాలవు అనగా శ్వాసోచ్ఛ్వాసములు సమానస్థితిలో నుండినమాత్రమే జీవింపగలవు ఒక శ్వాసమాత్రము చేతగాని, ఒక నిశ్వాసమాత్రము చేతగాని

జీవింపజాలవు ఆలాగున నెండవానలు సమానస్థితిలో నుండిన మాత్రమే తృణగుల్మ వృక్షాదులు జీవించుచున్నవి ఒక యెండచేతగాని ఒక వానచేతగాని, యేతృణమైన బ్రదుకజాలదు ఆలాగున ప్రపంచములోగల మహాత్ములందరున్ను భక్తిజ్ఞానములచేతనే జీవన్ముక్తులై శాశ్వతసుఖమును బొందిరి ఒకవేళ కొందరు మహనీయులకు భక్తియెక్కువగాను, లేక జ్ఞానమెక్కువగాను గనిపించవచ్చును గాని ఏ మహాత్మునకైనను మొట్టమొదట భక్తిగలిగిన పిమ్మట జ్ఞానముదయించవచ్చును పచన క్రియకు సామగ్రులన్నియు నుండినను జలాగ్నులు సరిగాలేనిచో నెట్లు పచనము గాజాలదో, ఆలాగున భక్తిజ్ఞానములు రెండుండిన మాత్రమే అజ్ఞాన క్షుధానివృత్తి పరమగు జ్ఞానామృతమును భుజించి తృప్తినొందగలరు

*యథా జలేనానలేన నైకేన పచనక్రియా ।*
*తపో విద్యాద్వయేనైవ నైకస్మాన్మోక్షసంగతిః ॥*

దీని యర్థముపైన జెప్పినదే దీనియందుగల తపస్సను శబ్దమున కేకాంతమైన భక్తి యనియు, విద్యయను శబ్దమునకు జ్ఞానమనియు అర్థము గ్రహించుకొనవలయును

*జలాగ్నిభ్యాం యథా యంత్రః చలత్యన్యతరేణ న ।*
*తథా విద్యాం చ యోగం చ ప్రాప్య జీవో విముచ్యతే ॥*

ఏలాగున నిప్పుచేతను నీటిచేతను మాత్రమే యంత్రము నడచునో, ఒకదాని మాత్రముచే నడువజాలదో, ఆలాగున భక్తిచేతను, జ్ఞానముచేతను మాత్రమే జీవుడు ముక్తినొందగలడు ఇచట గూఢవిద్యకు జ్ఞానమనియు, యోగమునకు భగవదైక్యానుసంధానమగు భక్తియనియు అర్థము గ్రహించవలయును

*యథా చౌషధపథ్యాభ్యా మామయః పరిశామ్యతి ।*
*తథైవ భవరోగోఽపి విద్యానుష్ఠానతశ్శ్రయేత్ ॥*

రోగము, ఔషధము, పథ్యములచేనెటుల శమించునో యటులే భవరోగమున్ను విద్యవలనను, అనుష్ఠానమువలనను మాత్రమే శమించును వట్టి పథ్యముచేత మాత్రము, వట్టి ఔషధము చేత మాత్రము, రోగశాంతిగలుగనట్లు, రెండున్నునుండిన శమించునట్లు, భక్తిజ్ఞానములు రెండున్ను భవరోగశాంతికి కారణములు ఇచట విద్యను జ్ఞానమనియు, అనుష్ఠానమును భక్తియనియు గ్రహించుకొనవలయును జ్ఞానము మాత్రము గలవారు పరమభక్తులను గౌణముగా చూచెదరు పరమ భక్తులు కొందరు కేవలతత్త్వజ్ఞానముగల

వారిని వీరికి భగవద్భక్తి లేదని తలంచి గౌణముగా తలంతురు వ్యాసాది మహర్షులు భక్తిజ్ఞానములు రెండింటిలో సంపూర్ణత్వము గలవారగుటచేతనే రెండింటిని సమానముగ చూచి బ్రహ్మసూత్రపురాణాదులు రచించిరి

## 30. సూ ॥ స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః .

పద ॥ స్వయం - ఫలరూపతా - ఇతి - బ్రహ్మకుమారః

టీక ॥ స్వయం = ఆ భక్తి స్వయముగానే, ఫలరూపతేతి = మోక్షఫలరూపమైన దని, బ్రహ్మకుమారః = బ్రహ్మపుత్రుడగు నారదుని యభిప్రాయము

తా ॥ ఈభగవద్భక్తి స్వయముగానే మోక్షఫలరూపమైనదని నారదుని యభిప్రాయము

వి ॥ ఇదివరలో నొక్కొక్కరి అభిప్రాయమును జెప్పుచూ పైసూత్ర మున భక్తిజ్ఞానములు రెండున్నూ గలిగియుండవలయునని వ్యాసాదిమహర్షు ల ఆశయము దెలుపడమైనది అయితే నారదముని యాశయము భక్తి యొక్కటియే చాలునని వెల్లడి జేసెను

*త్వత్పాదభక్తియుక్తానాం విజ్ఞానం భవతి క్రమాత్ ।*
*తస్మా త్త్వద్భక్తియుక్తా యే ముక్తి భాజస్త ఏవ హి ॥*

భగవత్పాదభక్తియందు నిశ్చలబుద్ధిగలవారికాత్మ జ్ఞానము క్రమముగ గలుగును అందువల్ల భగవదాసక్తచిత్తముగల వారెవరు గలరో వారందరున్ను ముక్తిని బొందగలరు, సంశయము లేదు

*నృదేహో నౌర్దృఢా ప్రోక్తా గురునావిక సంయుతా ।*
*మయాఽనుకూల వాతేన ప్రేర్యమాణా చ వా పునః ॥*

సంసార సాగరమును దాటుటకు మానవశరీరము దృఢమైన నావగాను, గురుదేవుడు ఓడనడపువాడుగను, భగవదనుగ్రహమగు యనుకూలమైనగాలియు యుండగ మరల నేమి కావలసి యున్నది ? ఇంతనుకూలపడియుండగ మోక్షమును బొందక పోయిన మానవజన్మమగు నోడవ్యర్థమగునని తెలియందగినది యని భాగవతము

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥ (గీ-10-10)

ఎల్లప్పుడును భగవంతుడనగు నా యందేకాగ్రచిత్తముగల వారును, ప్రీతి పూర్వకముగా నన్ను భజించువారునునైన భక్తులు దేనివలన మోక్షమును బొందవలసి యుందురో అట్టి జ్ఞానమును నేనే గలుగు జేయుచున్నాను

తేషా మేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ (10-11)

ఎల్లపుడును భగవదాసక్తచిత్తముగల భక్తుల ననుగ్రహించుట కొరకు వారి హృదయమునందున్న వాడనై వారియొక్క యజ్ఞాన జన్మమైన మోహాంధ కారమును ప్రకాశించుచున్న జ్ఞానమనెడి దీపము చేత బోగొట్టుచున్నాను దీపము వెలిగిన రాత్రికాలములో గృహాంతరాళమున నిబిడమై యుండు చీకటి వెలుపలికి పారిపోవునదోాక, దానియందుగల అన్నివస్తువులు గోచరించుచున్నట్లు భగవదనుగ్రహము వలన జ్ఞానజ్యోతి వెలుగుననియు అజ్ఞాన తమస్సు పారిపోవుననియు ఆత్మయొక్క సాక్షాత్స్వరూపము గలుగుననియు తెలుపడమైనది

## 31 సూ ॥ రాజగృహ భోజనాదిషు తథైవ దృష్టత్వాత్ ।

పద ॥ రాజగృహభోజనాదిషు - తథా - ఏవ - దృష్టత్వాత్ ॥

టీక ॥ రాజగృహ భోజనాదిషు = రాజగృహము, రాజభోజనపదార్థముల యందు, దృష్టత్వాత్ = చూచుటచేత, తథైవ = ఆలాగుననే

తా ॥ రాజసౌధము, రాజభోగ్య పదార్థములు, చూచుటచేత ఏలాగున ననుభవించెడి సుఖము గలుగదో, యాలాగున భక్తిజ్ఞానవైరాగ్యమోక్ష ముల చదువుచుండినను, లేక శ్రవణము జేసినను లేక భక్తిజ్ఞానవైరాగ్యముగల ముక్తాత్ములను జూచినను, భగవద్భక్తి రసామృతమును పానము చేయక పోయిన ప్రయోజనము లేదు అది యనుభవించే లాగున అనుష్ఠానము గలిగి యుండవలయును

వి ॥ లేక పరమభక్తుల, సాధుపురుషుల, వేషము వేసినను దానివల్ల నిజమైన భక్తియు మోక్షసుఖమున్ను గలుగనేరదు అది సాక్షాద్భగవదను గ్రహమువల్లను, జ్ఞానమువలనను గలుగును ఈవిషయమై వివేక చూడామణి చెప్పినది జూడుడు

*అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిల భూశ్రియమ్ ।*
*రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి ।*

రణరంగమున శత్రుసంహారము జేయక సకలమహీమండలాధిపత్యమునొందక ''నేను రాజును, ''నేను రాజు'' నను నంతనే రాజౌనా ? కాడు ఆ లాగున మాయచే ఆక్రమింపబడిన ఆత్మరాజ్యమును బొందవలసి యుండిన నంతఃకరణలో గల ప్రాకృత వృత్తులను విలయమొందించి అవిద్యను రహితమొనర్చు కొనవలయును మరియును,

*న గచ్ఛతి వినా పానం వ్యాధిరౌషధశబ్దతః ।*
*వినాఽపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే ॥*

రోగముగలవాడౌషధ పానమును మాని ''యౌషధ మౌషధ'' మని అనిన మాత్రమున వ్యాధి బోనేరదు అట్లేయా సంసార రోగము నుండి విముక్తి బొందవలసియుండిన భగవత్సాక్షాత్కార జ్ఞానమును బొందక ''బ్రహ్మాస్మి'' యను వాక్యము మాత్రముచే ముక్తుడు గాజాలడు

## 32 సూ ॥ న తేన రాజపరితోషః క్షుచ్ఛాన్తిర్వా.

పద ॥ న - తేన - రాజపరితోషః - క్షుచ్ఛాన్తిః - వా

టీక ॥ తేన = రాజు చక్కగ నున్నాడనెడి జ్ఞానముచేత, రాజపరితోషః = రాజ ప్రీతి, న= కలుగదు, క్షుచ్ఛాన్తిః = భోజన పదార్థములు బాగుగా నుండునని తెలిసిన మాత్రమున, వా = క్షుద్బాధ నివృత్తి గాజాలదు

తా ॥ రాజు మంచివాడని తెలిసినంత మాత్రముచే ఎట్లురాజ ప్రీతి గలుగదో ఆలాగున రుచ్యాహారమని ఎఱింగిన మాత్రముచేత భుజింపనిచో నెట్లాకలి శాంతింపదో, ఆలాగున భగవత్కాలక్షేపాదులు భగవన్మాహాత్మ్యము వినినంత మాత్రమున భగవత్ప్రీతి గలుగదు రాజునకు ప్రీతియైన కార్యమును జేయుటచేతనే రాజ ప్రీతిగలుగును ఆలాగున భగవత్ప్రీతికరమగు భక్తిచేసిన మాత్రమే భగవత్కరుణ గలుగును ఆలాగున మోక్షము ఆత్మజ్ఞానము, భగవత్ప్రాప్తి మహత్తరమైన దనియు, శాశ్వత సుఖమును గలుగ జేయునదనియు శాస్త్రములలో వినినను అనుష్ఠించి యట్టి స్థితి బొందక పోయిన ప్రయోజనము లేదని సూత్రము

వి ॥ సీతారామాంజనేయ సంవాదమును ఇచట జూడందగును

దారుణ గాఢాంధకారం బడంగునే
వసుధపై ఘృతదీపవార్తవలన
నాకొన్న మనుజుని యాకలి దీరునే
ఘన సరసాన్నవర్ణనము వలన
నెఱిపేదవాని పేదఱికంబు వోవునే
ద్రవ్యప్రభావకీర్తనము వలన
రోగపీడితుని బల్రోగంబు దీరునే
కలితౌషధ ప్రసంగంబు వలన

జండిపడి బుద్ధిలో వెలి నిండి మిగుల
దట్టమైనట్టి యజ్ఞాన తమము దెగునె
తర్కిత విచిత్ర శబ్ద బోధంబు వలన
ఫలిత యోగాను భవదృష్టివలన గాక

గాలంబు లేనిచో జాలకాగ్రణిచేత
బారీన జాలముల్ బట్టువడునె
సరియురి లేనిచో శకునాంతకునిచేత
జొక్కంపు పక్షులు జిక్కువడునె
యోదంబు లేనిచో నాగిమావటీనిచే
గజరాజములు నరికట్టవడునె
తగు కోల లేనిచో మృగయావినోదిచే
ఘోరమృగంబులు కొట్టువడునె

రాజితానంద తారక రాజయోగ
పావన సమాధి లేనిచో బరమ శుష్క
తర్కవేదాంత వాద తత్పరులచేత
నింద్రియ మనంబులు వినిగ్రహింపబడునె

అంత స్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకమ్ ।
న నశ్యతి తమో నామ కృతయా దీపవార్తయా ॥

రాత్రికాలమున గృహాంతరాళమున నిబిడమై యుండు అంధకారము దీపముయొక్క వార్తలెన్ని విధముల జెప్పినను నెట్లు నశింపజాలదో, దీపమును వెలిగించిన మాత్రమున స్వయముగా తమస్సు బైటికి వెళ్ళి పోవునో, ఆలాగున వాక్కుతో మాత్రము జెప్పినందుచే నజ్ఞానము నశింపదు అనన్యభక్తి గలిగి యనుష్ఠించు నప్పుడే యజ్ఞానము నశించును

*ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్ ।*
*న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి ॥*

చిల్లగింజయొక్క పేరును జెప్పిన మట్టినీరు ఏలాగున శుద్ధము గాజాలదో, నిజముగ చిల్లగింజనరగ జేసినచో, బురద నీ రేలాగున శుభ్రపడునో, ఆలాగున భక్తి గొప్పది, జ్ఞానముత్తమమైనది, మోక్షము శాశ్వతసుఖ మని వినినను, జెప్పినను యజ్ఞానము నశింపదు అనుష్ఠించ వలయును

## 33 సూ ॥ తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః .

పద ॥ తస్మాత్ - సా - ఏవ - గ్రాహ్యా - ముముక్షుభిః

టీక ॥ తస్మాత్ - పైన నిరూపించిన కారణముచేత, సైవ = అదైవభక్తియే, ముముక్షుభిః = మోక్షాపేక్షగలవారిచేత, గ్రాహ్యా = గ్రహింపబడ దగినది

తా ॥ పైనిరూపించిన కారణముచే ఆదైవభక్తియే మోక్షాపేక్షగలవారిచే గ్రహింపదగినది

వి ॥ ''ముముక్షుభిః'' మోక్షాపేక్షగల వారందరి చేతనని సూత్రించుటవలన ముక్తిని గోరువారు యోగమార్గావలంబనులైనను, జ్ఞానమార్గావలంబనులైనను, తపోమార్గావలంబనులైనను భక్తిమార్గము తప్పక యనుసరించవలయునని నిరూపించడమైనది భాగవతము -

హరినామకథన దావానలజ్వాలచే
కాలవే ఘోరాఘ కాననములు
వైకుంఠదర్శన వాయుసంఘంబుచే

తొలగవే భవదుఃఖతోయదములు
కమలనాభధ్యాన కంఠీరవంబుచే
కూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణ ప్రభాదీప్తిచే
తీరవే షడ్వర్గతిమిరతతులు

నలిన నయనభక్తినావచే గాక సం
సారజలధి దాటి చనగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబు
తెలుపవయ్య సూత ధీసమేత !

సంసారజీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లారునే
విష్ణు సేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే
హరి మనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే
పద్మాక్షనుతి రవిప్రభలు లేక

నిరుపమాపునరావృత్తినిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకునైన దానవేంద్ర.



ఓమ్

# 3. తృతీయో౽ధ్యాయః - భక్తిసాధనాని

# మూడవ అధ్యాయము - భక్తిసాధనములు

**34.** తస్యాః సాధనాని గాయన్త్యాచార్యాః .

పద ॥ తస్యాః - సాధనాని - గాయన్తి - ఆచార్యాః

టీక ॥ తస్యాః = ఆదైవభక్తికి, సాధనాని = అనేక సాధనమార్గములను, ఆచార్యాః = ఋషులు, గాయన్తి = చెప్పుచున్నారు

తా ॥ ఆ భగవద్భక్తి గలుగుట కనేక సాధనములు పూర్వాచార్యులగు వ్యాసాది మునులు చెప్పుచున్నారు

వి ॥ స్తుతిస్మరణపూజాభిర్వాఙ్మనఃకాయకర్మభిః ।
సునిశ్చలా భవేద్భక్తిరేతదీశ్వరపూజనమ్ ॥

స్తుతి, స్మరణ, పూజాదులు వాఙ్మనఃకాయ కర్మములలో నిశ్చయముగ గలుగుటేది గలదో, అదే ఈశ్వరభక్తియు, ఈశ్వరపూజనమున్ను అగుచున్నది కొందరు సదా భగవత్ స్తోత్రము చేయువారును, కొందరు మనస్సులో మాత్రము మననము చేయువారున్ను, కొందరు సాకారమూర్తికి పూజలు చేయువారున్ను నగుచున్నారు ఇకను ననేకవిధములుగా భగవద్ధ్యానస్మరణ పూజాదులు జేయువారు గలరు ఇవన్నియు భక్తిలో చేరినవే కొందరు భగవదాజ్ఞానురూపముగ వారివారి కేర్పడిన కార్యములను తప్పక చేయుట భక్తియని తలంతురు ఆ కార్యము బ్రహ్మచర్యమైనను, గార్హస్థ్యమైనను, వానప్రస్థమైనను, సన్న్యాసమైనను విధి ప్రకార మాచరించుటయు భక్తియని తలంతురు మరికొందరు చరాచర వస్తువులలో వెలుగుచుండువాడు తనలో గూడ వెలుగుచున్నాడని తలంచి యుపాసించుటయు భక్తియని వచింతురు ఇక కొందరు సద్వస్తువు బ్రహ్మ యొక్కటియే సత్యమనియు, తక్కినవన్నియు మిధ్యయని తలంచి వర్తించుటయు భక్తియని వచింతురు మాతాపితరులను దైవభావముతో పూజించుటయు భక్తియని తెలుపుదురు ఏవిధ మునన్నైనను నొక్క నియమమును నవలంబించి యది

యీశ్వరాజ్ఞయని తలంచి చేయుట భక్తియని వచింతురు ఇవన్నియు దృఢవిశ్వాసముతో భగవదాజ్ఞయని తలంచి యనుష్ఠించినచో అదిన్నీ నిజముగా నొకభక్తియే యగును

**యం శైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినః**
**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః**
**సోఽయం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో విభుః ॥**

శైవులు ఏ పరమాత్మను శివునిగా ఉపాసించుచున్నారో, వేదాన్తులు బ్రహ్మముగా ఉపాసించుచున్నారో, బౌద్ధులు బుద్ధునిగా గాను ఉపాసించు చున్నారో, శాస్త్రప్రమాణ నిపుణులగు నైయాయికులు కర్తగాను ఉపాసించు చున్నారో, జైనమతస్థులు అర్హునిగా ఉపాసించుచున్నారో, మీమాంసకులు కర్మగాను ఉపాసించుచున్నారో, అట్టి ఆత్రైలోక్యనాధుడగు విభువు మనకు వాంఛితఫలమును గలుగ జేయును గాక ! వీరందరున్ను భక్తులే !

*యధా తోయ ప్రవాహానాం సముద్రః పరమావధిః ।*
*తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా మహేశ్వరః ॥*

ఏలాగున నదులన్నిటికిన్ని సముద్రము పరమావధిగాగలిగి యున్నదో, ఆలాగున వారి వారి ఉపాసనా మార్గములు వేరువేరుగా ఉండినను కడవరకు వెళ్ళిన అందరున్ను ఆపరమాత్మనే పొందుదురు

*(త్రిభిశ్చ) కరణైః స్సమ్యక్ హిత్వా వైషయికీం క్రియామ్ ॥*
*స్వాత్మైక చిన్తనం యత్తదీశ్వర ధ్యానమీరితమ్ ॥*

మనోవాక్కాయ కర్మలచే లెస్సగా విషయక్రియలను భేదించువాడై ఆత్మచిన్తనము మాత్రము గలిగియుండుట యేది గలదో అదే ఈశ్వర్యధాన మనియు, ఈశ్వరభక్తియనియు చెప్పంబడినది

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥

తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్ ॥ (12-6,7)

ఓ యర్జునా ! యెవరైతే నమస్తకర్మలను నాయందర్పించి నాయందు చేర్చిన చిత్తముగలవారగుచు నన్నే పరమగతిగా ధ్యానించుచున్నవారై అనన్యచింతగలిగి యుపాసించుచున్నారో, అట్లు నాయందు చేర్చబడిన చిత్తముగలవారిని జననమరణకాల ప్రవాహమగు సంసార సాగరమునుండి శీఘ్రముగా నుద్ధరించుచున్నాను

*మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।*
*నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥* (12-18)

నాయందే మనస్సునను నిశ్చలముగా జేయుము నాయందే బుద్ధిని అచంచలముగా నిలుపుము ఆట్లయిన నన్నే పొందగలవు, సందేహము లేదు ఇది జ్ఞానమార్గము - 1

*అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।*
*అభ్యాసయోగేన తతో మామిచ్ఛాఽప్తుం ధనంజయ ॥* (12-9)

ఓ యర్జునా ! పైజెప్పిన ప్రకారము జ్ఞాననిష్ఠలో నిగ్రహము గలిగియుండుటకు సాధ్యము గానిచో అభ్యాసయోగముచే నన్ను బొందుటకు యత్నింపుము ఇది యోగమార్గము - 2

*అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।*
*మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి ॥* (12-10)

పైజెప్పినవిధముగ యోగాభ్యాసముజేయ నశక్తుడనైతివేని భగవత్ప్రీతికరమగు భజన, భక్తి, ప్రార్థన, కీర్తనపూజాదుల యందా సక్తిగలవాడవు గమ్ము, ఆలాగున భగవత్ప్రీతికరమగు భక్త్యాదులు జేసుకొనినను మోక్షసిద్ధిని బొందగలవు ఇది భక్తిమార్గము -3

*అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।*
*సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥* (12-11)

పైజెప్పినవిధము సహ సాధ్యము కాదేని ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామకర్మయోగము నవలంబించుము అట్టి ఫలాపేక్షా రహితమైన

నిష్కామకర్మయోగము ఆత్మనిగ్రహము గలిగి, చేసినచో దానివలనను ఆత్మశుద్ధి గలిగి మోక్షమును బొందగలవు ఇది నిష్కామకర్మయోగము - 4

ఈ నిష్కామకర్మయోగమున్ను, భక్తియోగమున్ను, ధ్యానయోగమున్ను, జ్ఞానయోగమున్ను భక్తిమార్గములో చేరినవే ఈ నాలిగింటిలో ఎవరికెద్ది సాధ్యమో దాని నవలంబించుకొని మోక్షమును బొందవచ్చును భగవంతుడు కరుణాసముద్రుడు కావుననే ఎవరి కేది సాధ్యపడునో దానినే యుపదేశించెను శంకరులు వివేకచూడామణి

*మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ ।*
*స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥*

మోక్షసాధన సామగ్రిలో భక్తియే ముఖ్యమైనది స్వస్వరూపాను సంధానము అనగా జీవేశ్వరుల ఐక్యానుసంధానమున్నూ భక్తి యనంబడును

## 35. సూ ॥ తత్తువిషయత్యాగాత్సంగత్యాగాచ్చ.

పద ॥ తత్ - తు - విషయత్యాగాత్ - సంగత్యాగాత్ - చ

టీక ॥ తత్తు = అదైవభక్తియైతేనో, విషయత్యాగాత్ = విషయవైరాగ్యము వలనను, సంగత్యాగాచ్చ = దుష్టజన సంసర్గత్యాగము చేతను లభించును

తా ॥ ఆభగవద్భక్తియైతేనో ప్రపంచవిషయ వైరాగ్యముచేతను, ప్రాపంచిక జన పరిత్యాగముచేతను గలుగును

వి ॥ వివేకచూడామణి -

*దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహ హేతుకమ్ ।*
*మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥*

మానవత్వము, మోక్షేచ్ఛ, మహాత్ముల సహవాసము అను నీమూడును దైవానుగ్రములేనివారికి గలుగలవు, వైరాగ్యలక్షణము -

*తద్వైరాగ్యం జుగుప్సా యా దర్శన శ్రవణాదిభిః ॥*
*దేహాది బ్రహ్మపర్యన్తే హ్యనిత్యే భోగ్యవస్తుని ॥*

ప్రత్యక్షానుభవము, శ్రుతివాక్యము మొదలగువానిచే అనిత్యములని తెలియవచ్చు, దేహముమొదలు బ్రహ్మవరకు నుండు భోగవస్తువులయందు గలుగు యసహ్యబుద్ధియే వైరాగ్యమనంబడును

*వైరాగ్యం పుష్కలం న స్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్ ।*
*తస్మాద్రక్షేత విరతిం బుధో యత్నేన సర్వదా ॥*

సంపూర్ణమైనవైరాగ్యము లేనిచో భగవద్దర్శనము గలుగదు కావున బుద్ధిమంతుడైనవాడు ప్రయత్నపూర్వకముగా విరక్తిని సంపాదించుకొనవల యును మరియు -

*ఏతయోర్మన్దతా యత్ర విరక్తత్వ ముముక్షయోః ।*
*మరౌ సలిలవత్తత్ర సమాధేర్ధ్యానమాత్రతా ॥*

ఎవనియందీవిరక్తత్వ ముముక్షుత్వములు మందముగనుండునో వానియందు దైవసాక్షాత్కార సమాధియు, దైవామృతపానమున్ను ఎండమావులలో గనిపించెడు జలమువంటివే యగును ఎండ మావులలో నీరున్నట్లు తోచునేగాని దానివల్ల దాహశాంతి ఎట్లుగాదో దేహమందు భక్తిచిహ్నములు అట్లుగనపడునేగాని ఆత్మ శాంతి గలుగదు గీతలో అమానిత్వమునుగూర్చి చెప్పినదానిలో చూడుడు

*మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ ।*
*వివిక్త దేశసేవిత్వ మరతిర్జనసంసది ॥* *(13-11)*

నాకంటె నితరమగు దేనియందును, మనస్సును చేర్చనివాడై నాయందు చలించని భక్తిగలిగియుండుటయు, విజనస్థలము నందుండగోరు టయు, జనసమూహము నందుండుటకు ప్రీతిలేకుండుటయు భక్తుని యొక్కలక్షణముగా నిరూపించడమైనది

**సంగన్న కుర్యాదసతాం శిశ్నోదరతృషాం క్వచిత్ ।**
**తస్యానుగస్తమస్యంధే పతత్యంధానుగాంధవత్ ॥**

భక్తులు శిశ్నోదరములయందు ఆసక్తిగల అసన్మార్గ ప్రవర్తకులయొక్క సంగమము చేయరాదు అట్లైన గ్రుడ్డివానిని అవలంబించి నడచు మరియొక్క గ్రుడ్డివాడు దారితప్పి గోతిలోగాని, నూతిలోగాని, పడిపోవునట్లు ఇతడున్ను అజ్ఞానమను మోహ తమస్సులో పడిపోవును

*ముక్తిం దదాతి వైరాగ్యం రాగో యచ్ఛతి బంధతామ్ ।*
*మతంవై సర్వశాస్త్రాణాం యథేచ్ఛసి తథా కురు ॥*

వైరాగ్యము మోక్షమును గలుగజేయును విషయేచ్ఛ బంధనము నొసంగును సర్వశాస్త్రములయొక్కయు, సర్వమతముల యొక్కయుసార మిది యొకటియే

తర్వాత మీయిష్టమేలాగునో ఆలాగున చేయుమా ! అని అష్టావక్రమునీంద్రుడు జనకున కుపదేశించెను

## 36. సూ ॥ అవ్యావృత భజనాత్.

పద ॥ అవ్యావృత భజనాత్

టీక ॥ అవ్యావృత = ఎడతెగని, భజనాత్ = భజనవల్ల మోక్షమును బొందుచున్నారు

తా ॥ ముగింపులేని దైవ భజనవలన అనన్యభక్తి గలుగును

వి ॥ విషయాన్ధ్యాయతశ్చిత్తం విషయేషు విసజ్జతే ॥
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥

విషయములను భావించువానియొక్క చిత్తము విషయములందే లయించునట్లు భగవంతుని నిరంతరము ధ్యానించువానియొక్క మనస్సు భగవానునియందే లయము గాంచును ఇదే ఎడ తెగనిభక్తియొక్క స్వభావము దీనినే శివానంద లహరియందు ''సింధుస్సరిద్వల్లభమ్'' అని వర్ణించడమైనది నదియేలాగున నెడతెగక సముద్రములోనికి ప్రవహించు చుండునో, ఆలాగుననెడతెగని స్థితియే అనన్యభక్తి యనంబడును

మచ్చిత్తామద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ *(10-9)*

నాయందుంచిన చిత్తముగలవారును, నాయొక్క దైవగుణములను నొకరితో నొకరు బోధించుచుండెడి వారును, నాయొక్క యప్రాకృత దైవగుణములను పరస్పరము జెప్పుకొను చుండువారునునై, ఆనందించుచు పరమానంద భరితులైయుంటున్నారు ఇదే తదేకభక్తియొక్క లక్షణము

తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘ ఘంటానినాదవత్ ।
ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్ ॥

ఒకపాత్రనుండి మరియొకపాత్రలోనికి నూనెపోయునపుడు ఏలాగుననెడతెగక నుండునో పెద్దఘంట కొట్టునపుడు నాద మేలాగున చాలా సమయము వరకు ధ్వనిగలిగి యుండునో, ఆలాగున ప్రణవార్థ స్వరూపుడగు భగవంతునియందు మనసు లయపరచిన వాడెవడో వాడే వేదార్థమును నెఱింగినవాడు

మద్భక్తి విముఖానాం హి శాస్త్రగర్తేషు ముహ్యతామ్ ।
న జ్ఞానం న చ మోక్షః స్యాత్తేషాం జన్మశతైరపి ॥

భగవద్భక్తిలేనివారై శాస్త్రమనెడు బురదగుంటలో దొర్లుచుండువారికీలోకమున ఆత్మజ్ఞానముగాని, మోక్షముగాని వందలాది జన్మములెత్తినను గలుగదు

## 37. సూ ॥ లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్.

పద ॥ లోకే - అపి - భగవద్గుణ శవణకీర్తనాత్

టీక ॥ లోకేఽపి = లోకములోగూడ, భగవద్గుణ శ్రవణకీర్తనాత్ = భగవద్గుణ= భగవంతుని యప్రాకృత గుణముల, శ్రవణ = వినుటచేతను, కీర్తనాత్= కీర్తనము జేయుటచేతను భగవద్జ్ఞానము గలుగుచున్నది

తా ॥ లోకములో భగవంతుని యప్రాకృత గుణముల వినుటచేతను, కీర్తనము జేయుటచేతను భగవద్భక్తి జనులకు గలుగుచున్నది,

వి ॥ ఎవరియందైన భక్తి గలుగవలసి యుండినచో వారియొక్క దివ్య ప్రభావము వినియుండవలయును అప్పుడు వారియొక్కనామస్మరణ జేయుటకు ప్రీతి గలుగును అందువల్ల వారియనుగ్రహమునకు పాత్రులగుదురు ఇప్పుడు గూడ నెచటైన నొక్కదివ్యపురుషుండుండి నచో వారియొక్క దివ్య ప్రభావము వినువారు వారి నామస్మరణ జేయువారు వారి కృపకుపాత్రులగుచు న్నారు వారినిజూడ నక్కర లేదు లేక వారు గతించిపోయిన పిమ్మటగూడ పైజెప్పిన విధముగ శ్రవణకీర్తనాదులచే వారి యనుగ్రహమునకు పాత్రులగుచున్నారు శ్రీసాయిబాబా మొదలైన వారిచరిత్రమే దీనికి తార్కాణము ఆలాగున శ్రీవేంకటేశ్వర, పండరీనాధ మొదలగు దేవతల గురించియు అనేక పవిత్రకధలిప్పుడుగూడ లోకములో వినుచున్నాము కావుననే లోకము, శ్రవణము, అనుపదములు సూత్రములలో ప్రయోగించ డమైనది

తచ్చింతనం తత్కధనమన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

పరమాత్మను గురించిన చింతనము, భగవంతుని గురించిన సంభాషణము, పరస్పరము భక్తులకొకరికొకరు భగవద్గుణమాహాత్మ్యమును జెప్పుచుండుట,

ఆ భగవంతుని పొందుటయే శాశ్వతపదవియని తెలిసికొనుట, ఇవన్నియు బ్రహ్మాభ్యాసమని ఋషులు తెలిసికొని యున్నారు

న తే రూపం న చాకారో ఆయుధాని నచాస్పదచ ।
తథాఽపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే ॥ (భాగవతమ్)

ఓ భగవానుడా ! నీకు రూపముగాని, ప్రత్యేకముగా వైకుంఠమను నొక స్థానముగాని లేదు అట్లయినను భక్తుల యనుగ్రహము కొఱకు నీవు పురుషాకారమును ధరించుచునే యున్నావు భగవంతునికి సాకార, నిరాకార రెండు రూపములు గలవని రామకృష్ణపరమహంసాది మహనీయులు తెలిపియున్నారు సర్వేశ్వరుడు సర్వశక్తుడగుటచే, తనకు సాధ్యముగాని పని యొకటి లేదు నిరాకారుడై యుండియు నేలాగున సాకారమగు సూర్యచంద్ర జగత్తులను, మానవులను, తన దివ్యశక్తిచే సృష్టించుచున్నాడో ఆలాగున భక్తుల ననుగ్రహించుట కొఱకు సాకారమునుగూడ గ్రహించుచుండును జలమునకు ప్రత్యేక ఆకారము లేకపోయినను, చలిచే గడ్డగట్టి అయిసు (మంచుగడ్డగూడ) యగుచున్నదిగదా! ఒక్కొక్కప్పుడు వాన ప్రారంభకాలములో వడగంట్లు పడుటందరున్ను జూచియేయున్నారు ఆలాగున వాయువంతట వ్యాపించి నిరాకారరూపమై యుండినను, అదే మరల వర్షరూపమగు జలమై మారుటలేదా !

నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః ॥
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ (7-25)

నేను యోగమాయచే గప్పబడిన వాడనై యుండుటచే అందరున్ను చూడజాలరు భగవద్భక్తిలేని ఈ జనము, జన్మరహితుడైనట్టియు, నాశరహి తుడైనట్టియు నన్నెరుంగజాలరు ప్రపంచములోగల యేవిత్తనముగాని, ఫలముగాని, పొట్టుతో, (తోలుతో) ఆవరించియే యుండును ఆపొట్టును, తోలును, తొలగించిన, బాదముకాయయున్ను, చీనీపండున్ను భుజించుట కుపయోగపడును ఆలాగున పంచకోశములను శరీరములచే ఆత్మ యావరణమై యున్నది వేదాంత విచారణచే, భగవద్భక్తిచే కోశము దొలగిన వారి కాత్మ గోచరించును నిరాకారమగు ఆత్మయు, సాకారమగు దేహమును జీవులకు గలిగియున్నట్లు, సాకారనిరాకారములు భగవదవతారములో నుండవచ్చునని పరమ భాగవతుల యాశయము అయితే సాకారశరీరము దేనికొఱకువచ్చెనో, అట్టి ప్రారబ్ధకర్మము నశించునప్పుడు తన

నిజస్వరూపమును బొందుచుండును ఆలాగున భక్తుల సంరక్షించుటకొఱకు భగవానుడే సాకారమును గ్రహించినను, మరల నిరాకారముగు, తన నిజస్వరూపమును బొందుచుండును

## 38. సూ ॥ ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాద్వా.

పద ॥ ముఖ్యతః - తు - మహత్కృపయా - ఏవ, భగవత్కృపాలేశాత్ - వా

టీక ॥ ముఖ్యతస్తు = ఈ దైవభక్తియందు ముఖ్యమైనది, మహత్కృపయైవ = మహాత్ములయొక్క కృపచేతనే, అథవా = భగవత్కృపాలేశాద్వా = భగవత్కృపాకటాక్షలేశముచేతను గలుగవచ్చును

తా ॥ ఈ దైవభక్తిగలుగుటకు మహాత్ములయొక్కకృపయు, లేక భగవత్కారుణా లేశమున్నూ ముఖ్యకారణమని తెలుపడమైనది

వి ॥ మహాత్ముల యనుగ్రహమువలనను, భగవంతుని కృపవల్లను సాక్షాద్భక్తి గలుగునని కొందరిమతము మరికొందరు భగవదనుగ్రహము లేనిచో మహనీయాత్ముల దర్శనము గలుగదని చెప్పుదురు ఇక కొందరు, మహనీయాత్ముల యనుగ్రహము గలుగనిచో, భగవదనుగ్రహము సిద్ధించదని వచింతురు రెండున్ను గలిగి యుండవలయు ననియే ఎక్కువమంది యభిప్రాయము అయితే భగవదనుగ్రహమే ముందు గలుగ వలయునని కొందరి సిద్ధాంతము భగవదనుగ్రహము గలిగి మోక్షేచ్ఛ యుదయించినను, మహాత్ముల వల్ల తత్త్వశోధనము గలుగకెట్లు మోక్షము గలుగునని కొందరిఅభిప్రాయము మహనీయాత్ముల యనుగ్రహముచే ముక్తులైనవారు కొందరు గలరు దైవానుగ్రహము చేతను, ఆత్మజ్ఞానము గలిగిన వారు గొందరున్నారు కావున నీ రెండున్ను అపేక్షణీయములు మహాత్ములవల్ల జ్ఞానము గలిగినను, అట్టి భక్తుడు భగవదనుగ్రహమువల్లనే, ఈ మహాత్ముడు లభించెనని తలంచును భగవదనుగ్రహముచే నొకరికి జ్ఞానోదయమైన, నాగురుదేవుని కృపాకటాక్షము చేతనే ఈ భగవత్సాక్షాత్కారము సిద్ధించినదని నిశ్చయించును కావుననే సూత్రమందు నారదముని రెండింటిని నిరూపించుటకు గారణమైనది వైష్ణవ సంప్రదాయమున ఆచార్యానుగ్రహమువలననే భగవత్కృపగలుగుననియు, భక్తిసంప్రదాయమున భగవత్కారుణవల్లనే మహాత్ముడగు గురుదేవుడు దొరకుననియు యభిప్రాయము గలిగి యున్నది

యావన్నానుగ్రహః సాక్షాత్ జాయతే పరమేశ్వరాత్।
తావన్న సద్గురుః కశ్చిత్ సచ్ఛాస్త్రం నో పలభ్యతే ॥

ఎంతవరకు భగవంతుని అనుగ్రహము సాక్షాత్తుగా జీవులకు కలుగలేదో, అంతవరకు ఉత్తముడైన గురువుగాని, భగవత్ప్రాప్తి గలుగు జేయు శాస్త్రముగాని జీవులకు లభించదు

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ (గీత-4-34)

తత్త్వవేత్తలైన ఆత్మజ్ఞానులు మీకొరకు జ్ఞానము నుపదేశింపగ లరు అట్టి జ్ఞానము ఎట్లు గలుగుననిన వినయముతో చేయు నమస్కారము చేతను, సమయమును కనిపెట్టి అడుగుటచేతను, గురు ఆజ్ఞను పాలించుటచేతను వారు చెప్పగలరు

తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥
(ముణ్డకోపనిషత్)

బ్రహ్మమును, తెలుసుకొనుటకై వేదాధ్యయన మొనర్చిన బ్రహ్మనిష్ఠుడగు సద్గురువునే సమిత్పాణియై ఆశ్రయింపవలెను

## 39. సూ ॥ మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ.

పద ॥ మహత్సంగః - తు - దుర్లభః - అగమ్యః - అమోఘః - చ

టీక ॥ మహత్సంగస్తు = మహాత్ముల సాంగత్యమైతేనో, దుర్లభః = దుర్లభమై నది, అగమ్యః =పొందుటకు సామాన్యముగా అసాధ్యమైనది అమోఘశ్చ = ఒకవేళ కలిగినచో వ్యర్థము గానిది

తా ॥ మహాత్ముల సాంగత్య మైతేనో దుర్లభమైనది, పొందుటకు సామాన్యముగా లభించనిది ఒకవేళ గలిగినచో నమోఘ ఫలమును గలుగజేయునది

వి ॥ మహనీయుల దర్శనము ప్రయాసమైనది ఏలన వారు నిరాశగలవారగుటచే, నెవరిని, దేనిని నపేక్షించువారు గారు అదియునుగాక అట్టి నిర్మలాత్ములు ప్రపంచములో నుండడమే యరుదుగా నుండును శంకరాచార్యు లవారుచెప్పినది జూడుడు

దుర్లభం త్రయమేవై తద్దేవానుగ్రహహేతుకమ్ ।
మనుష్యత్వం ముముక్షత్వం మహాపురుషసంశ్రయః ॥

ఈ శ్లోకార్థ మిదివరలో వ్రాయబడినది

*మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే ।*
*యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥* (గీ - 7-3)

మానవులలో వేలకొలది సంఖ్యలయందు నొకానొకడు భగవత్ప్రాప్తి కొరకు యత్నించును ఆలాగున యత్నము జేయువారులలో ఆత్మసిద్ధిని బొందిన వారలలో సహితము ఒకానొకడు నన్ను నిజముగా దెలిసికొను చున్నాడు దీనివల్ల నిజమైన మహాత్ముల సంగతి యెంత దుర్లభమో తెలియందగును

*శైలే శైలే న మాణిక్యం మౌక్తికం నగజే గజే ।*
*సాధవో నైవ సర్వత్ర చందనం న వనే వనే ॥*

రాతి గుట్టలు అనేకములుండినను వాటిలో మాణిక్యరత్నము ఎంతదుర్లభమో, గజనమూహము లనేకములుండినను, గజముత్యముల గల ఏనుగెంత అరుదుగానుండునో, వనవృక్షములు అనంఖ్యాకములగా నుండినను శ్రీగంధపు చెట్టు ఎంత దుర్లభమో, ఆలాగున సాధు వేషధారులగు వారు అనేకు లుండినను, నిజమైన సాధువు దొరకడము ప్రయాసము ''సాధనాత్సాధవః'' సాధన చతుష్టయ సంపత్తి కలిగి ఆత్మజ్ఞానమును సాధించినవాడే సాధువగును, పైజెప్పిన శైలము, ముత్యముగల గజము చందనము దృష్టాంతముగా రూపించడమైనది

*బుభుక్షురపి సంసారే ముముక్షురపి దృశ్యతే ।*
*భోగమోక్ష నిరాకాంక్షీ విరలో హి మహాశయః ॥*

ఈ ప్రపంచములో బుభుక్షువులు అనగా భుక్తిప్రియులు అంతటను కనపడుచున్నారు బాగుగ పరిశీలించిన ముముక్షువులు (మోక్షాపేక్షగలవారు) గూడ అచ్చటచ్చట కానుపించు చున్నారు భోగమందును, మోక్షమందును, అపేక్షలేని ముక్తాత్ముడగు మహానుభావుడు, చాలా అరుదుగా నుంటున్నాడు మోక్షాపేక్షగలదు గాని ప్రయత్నింపనివా డని భావము

*దుర్లభో మానుషో దేహః ప్రాణినాం క్షణభంగురః !*
*తత్రాఽపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనమ్ ॥*

క్షణభంగురమ్మైన ప్రాణికోట్లయొక్క జన్మములలో మానవ జన్మ మత్యంత దుర్లభము ఒకవేళ పూర్వజన్మ సుకృతముచేనట్టి మనుజ జన్మము లభించినను భగవంతుని యనుగ్రహము గలిగిన మహాత్ముల దర్శనము మిక్కిలి దుర్లభమని భాగవతము

*శూన్యమాపూర్ణతామేతి మృత్యురప్య మృతాయతే ।*
*ఆపత్సంపదివాఽఽభాతి విద్వజ్జన సమాగమాత్ ॥*

సూత్రములో అమోఘమని చెప్పిన దానికిం గారణము నీశ్లోకము నిరూపించుచున్నది ఆత్మజ్ఞానుల సహవాసము గలిగెనేని నశించిన వన్నియు పూర్ణముగా గలుగును మరణము అమృతమగును ఆపత్తులు దొలగి సంపత్తు లేర్పడును అని వాసిష్ఠము

## 40. సూ ॥ లభ్యతేఽపి తత్కృపయైవ.

పద ॥ లభ్యతే - అపి - తత్కృపయా - ఏవ

టీక ॥ లభ్యతేఽపి = మహాత్ముల సహవాసము లభించుట, తత్కృపయా= ఆభగవంతుని యనుగ్రహమువల్లనే గలుగును. ఏవ = నిశ్చయము

తా ॥ మహాత్ముల సహవాసము లభించుట యా భగవంతుని యనుగ్రహము వల్లనే గలుగును ఇది నిశ్చయము

వి ॥ **ఈశ్వరానుగ్రహాచ్చాన్తి దాన్త్యాదిగుణసంయుతమ్ ।**
**జన్మ చేల్లభ్యతే తస్మిన్ విద్యయా మోక్షమాప్నుయాత్ ॥**

ఈశ్వరాను గ్రహమువలన, శాంతి, దాంతి మొదలైన, గుణములు గల జన్మ లభించితే ఆ జన్మమందు భగవద్జ్ఞానము గలిగి మోక్షము నొందును

## 41. సూ ॥ తస్మింస్తజ్జనే భేదాభావాత్.

పద ॥ తస్మిన్ - తజ్జనే - భేదాభావాత్

టీక ॥ తస్మిన్ = ఆభగవంతునియందు, అజ్జనే = ఆ భగవద్భక్తుల యందును, భేదాభావాత్ = అభేదముగా నుండుటవలన మోక్షము కలుగుచున్నది

తా ॥ ఆ భగవంతునియందును, ఆ భగవద్భకులయందును, అభేదముగా నుండుటవలన మోక్షము కలుగుచున్నది మరియొక్క విధముగా కొందరు అర్థము చేయుచున్నారు భగవంతునికి భగవద్భక్తిగల వార్లలో భేదబుద్ధి లేదనియు, అందువల్ల మోక్షమునకు అందరున్ను అర్హులనియు చెప్పుదురు

వి ॥ జీవులు బంధావస్థలోనున్నప్పుడు కనిపించెడు భేదము ముక్తావస్థలో నుండదు నానావిధరంగులతో గూడిన వస్త్రములు చూచు నప్పుడు ఏరుపు, పసువు, నలుపు, ఊదారంగులతో కనించినను రంగులు తీసివేసిన అన్నియు ఒకే తెలుపు వస్త్రమగుచున్నవి ఆలాగుననే సత్త్వ, రజ, స్తమో, మిశ్ర భేదములచే జీవులనేక విధములుగానుండినను గుణ విముక్తి కలుగునప్పుడు అభేదమునే అనగా ఏకత్వమునే పొందుచుండును

*సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ॥*
*యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ (9-29)*

నేను సకల ప్రాణులయందును సమానుడను నాకుశత్రువు గాని మిత్రుడు గాని లేడు ఎవ్వరైనను నన్ను భక్తిచేత సేవించుచున్నారో అట్టివారు నాయందున్న వారగుదురు నేను వారియందుండు వాడను

*తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే ।*
*ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం స చ మమ ప్రియః ॥ (7-17)*

పైశ్లోకమున చెప్పబడిన నలుగురి భక్తులలోపల సర్వకాలముల యందును సమాహితచిత్తుడును, సర్వేశ్వరుడనైన నాయందే భక్తి గలవాడగు ఆత్మవేత్త అధికుడగుచున్నాడు ఆత్మ వేత్తయగు వానికి నేను మిగుల ఇష్టుడను, గనుక ఆత్మవేత్త గూడ నాకు పరమప్రియుడు

*ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।*
*ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ (7-18)*

ఈ అధ్యాయములో చెప్పబడిన ఆర్తుడు, జిజ్ఞాసువు, ఆర్థార్థి, జ్ఞాని అందరున్ను ఉత్కృష్టులే జ్ఞాని యైతే అందరికన్న ఉత్కృష్టుడు ఏలన

అజ్ఞానియైనవాడు అన ఆత్మను నా ఆత్మగా భావన చేయువాడు ఇది నాయొక్క అభిప్రాయము జ్ఞానియగు వాడు నాయందు చేర్చిన మనస్సుగలవాడై నన్నే సర్వోత్తమమైనగతిగా తలంచియున్నవాడు ఇది ముక్తాత్మకున్ను, పరమాత్మకున్ను ఏకత్వము చెప్పినదానికి నిరూపించడమైనది జీవబ్రహ్మైక్యజ్ఞానము గల వారిపై పరమభక్తులపై భగవంతునికి ఎంత దయ గలదో అది ఇచట విశదీకరించడమైనది కావుననే ''జ్ఞానీత్వాత్మైవ మే మతమ్'' అని ప్రయోగించడమైనది జ్ఞానియో నాయొక్క ఆత్మస్వరూపుడే అని స్వయముగా భగవానుడే వచించెను

## 42. సూ ॥ తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్.

పద ॥ తత్ - ఏవ - సాధ్యతాం - తత్ - ఏవ - సాధ్యతామ్

టీక ॥ తదేవ = ఆ అభేద జ్ఞానముతో గూడిన భక్తియే, సాధ్యతాం = సాధించ తగినది
తదేవ = ఆ జీవేశ్వరుల యేకత్వమగు భక్తియే, సాధ్యతాం = సాధించ దగినది

తా ॥ ఆ అభేదజ్ఞానముతోగూడిన భక్తియే భక్తులచే సాధించదగినది ఆ జీవేశ్వరుల యేకత్వమగు భక్తియే పరమభక్తులచేత సాధించ దగినది

వి ॥ ఇట్టి ఏకాంతభక్తి, అనన్యభక్తి తన్మయభక్తి, అత్యుత్కృష్టములు తక్కిన భక్తి సామాన్యమైనదగును కావుననే శ్రీకృష్ణ భగవానుడును 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని తెలిపెను

**దాసస్తేఽహం దేహదృష్ట్యాఽస్మి శంభో !**
**జాత స్తేఽంశో జీవదృష్ట్యాఽత్ర దృష్టే।**
**సర్వస్యాత్మన్నాత్మ దృష్ట్యా త్వమేవే**
**త్యేవం మే ధీర్నిశ్చితా సర్వశాస్త్రైః ॥**

ఓ సర్వేశ్వరుడా ! దేహదృష్టితో చూచిన నేను నీయొక్క దాసుడను జీవాంశదృష్టితో చూచిన నీయొక్క అంశస్వరూపుడను ఆత్మదృష్టితో చూచిన నీవే, నేను, నేనే నీవు ఇదే సర్వశాస్త్రముల చేతను నా యనుభవముచేతను దృఢమగుచున్నది ఈ సూత్రము నందు ''తదేవ సాధ్యతామ్'' ''తదేవసాధ్యతామ్'' అని రెండు సార్లు ప్రయోగించుట ద్విరుక్తి అను దోషమును గలిగినది అట్లు ప్రయోగముండరాదు

అయితే ''ఆదరార్థం ద్విరుక్తిః'' ఆదరార్థమున ద్విరుక్తి ప్రయోగము శాస్త్రసమ్మతము అది దోషము గాదు దానికి ప్రమాణము -

*విస్మయే చ విషాదే చ దైన్యే చై వావధారణే।*
*తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్విరుచ్యతే ॥*

ఎచ్చటెచ్చట ద్విరుక్తి ప్రయోగముండవచ్చును అనగా రెండు సార్లు చెప్పవచ్చునో నిరూపించడమైనది అద్భుత విషయమందు, దుఃఖవిషయ మందు, దీన భావమందు, గ్రహింప ప్రయాసమయిన విషయమందు, ఆశీర్వాదమందు, హర్షమునందు ఒక్క వాక్యమును రెండు సార్లు చెప్ప వచ్చును

## 43. సూ ॥ దుస్సంగస్సర్వథైవ త్యాజ్యః.

పద ॥ దుస్సంగః - సర్వధా - ఏవ - త్యాజ్యః

టీక ॥ దుస్సంగః = దుష్టుని సహవాసము, సర్వథైవ = అన్ని విధములచేతను, త్యాజ్యః= విడువతగినది

తా ॥ దుర్మార్గుల సహవాసము అన్ని విధములుగా విడువ తగినది

వి ॥ దుష్టులలో కొందరిచేత మనకు కొంత మేలు కలుగునని తలంచి అట్టివారి సహవాసము కొందరు చేయుదురు అది కూడనే కూడదు అది కొంచము లాభముగా తోచినను విషము కలిపిన క్షీరాన్నము వంటిదేయగును విషయుక్త క్షీరాన్నము భుజించునపుడు స్వల్ప సుఖము కనిపించినను తరువాత అది మహాదుఃఖమును కలుగ జేయును కనుకనే నారదమహర్షి ''దుస్సంగస్సర్వథైవ త్యాజ్యః'' అని ప్రయోగించుటకు కారణమైనది ఈ విషయమై నీతి శాస్త్రము చెప్పినది చూడుడు -

*వృశ్చికస్య విషం పుచ్ఛం మక్షికస్య విషం శిరః।*
*తక్షకస్య విషం దన్తం సర్వాంగం దుర్జనం విషమ్ ॥*

తేలుకు తోకయందు మాత్రము విషముండును కంతిరీగకు శిరస్సునందే విషముండును సర్పమునకు దంతమందు మాత్రమే విషముండును దుష్టునికైతే సర్వాంగములున్ను విషముతో కూడి యుండును అయితే శత్రు మిత్రభేదము పాటింపక సమబుద్ధి గలిగి యుండుటయే, జ్ఞానముగాని, పరమ భక్తియనిగాని తలంతురు

ప్రపంచములో ఏదైన యొకసంస్థనుగాని, సమాజమునుగాని, ఆశ్రమమునుగాని, గృహస్థాశ్రమముగాని నిర్వహించవలసి యుండిన దుష్టత్యాగము, శిష్టగ్రాహ్యము గలిగియుండ వలయును లేనిచో ప్రపంచములో ఏకార్యమైనను, ఎట్టి జ్ఞానియైనను నిర్వహింపజాలడు ఏ కార్యములోను సంబంధములేక ఒకవేళ భక్తులకు భక్తినిగాని, జ్ఞానమును గాని తెలుప బూనినను అప్పుడు గూడ ద్వంద్వమేర్ప డును మౌనముగ నుండి సంజ్ఞ చూపినను అచటగూడ ద్వైతముండనే యుండును అదిన్ని మానినను మనస్సులో సంకల్పముండువరకు తప్పక ద్వంద్వముండనే యుండును ఈ విషయమై ఈఉపాధి యెన్నియో రోజులు ఎంతో దీర్ఘముగ ఆలోచించినను అంతు ఏర్పడ లేదు జనకుని గురించియు, శ్రీబుద్ధదేవుని గూర్చియు, శ్రీశంకరాచార్యులను గురించియు, శ్రీరామచంద్రుని గూర్చియు, శ్రీకృష్ణభగవానుని గూర్చియు అగాధముగ ఆలోచించి చూచినను వారందరున్నూ దుష్టత్వమును తొలగించి శిష్టత్వమును గ్రహించినట్లే కనబడుచున్నది ఈ విషయములో ఏలాగున సమత్వము గలిగి వర్తించవలయునని హృదయమున యాందోళన గలిగి యున్నపుడు పాతంజలియోగ దర్శనమున ఈ సూత్రము కనుపించడమైనది అప్పటినుండి మనస్సులో సమాధానము గలిగి ఈ విధముగ ప్రవర్తింప దొడగెను

యోగదర్శనము యోగపాదము 33వ సూత్రం -

**మైత్రీకరుణాము దితో పేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్య విషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనమ్**

సుఖవిషయమునను, దుఃఖవిషయమునను, పుణ్యావిషయము నను, పాప విషయమునను, (క్రమముగ) 1 మైత్రి, 2 కరుణ, 3 ముదిత, 4 ఉపేక్షలయొక్క భావించుటవలన చిత్తము నిర్మలమగును ప్రశాంతతగల్గును తన వర్తనమునకు సమాన గుణము గల వారి యెడల మిత్రత్వమున్ను, దీనులయందు దయాళుత్వమును, తనకన్న ఎక్కువ స్థితిలో నుండువారిని చూచి సంతోషించుటయు, దుష్టవృత్తిగలవారిని ఉపేక్షించుటచేతను, మనసుకు శాంతి గల్గును దీనియందు దీనులయందు కరుణయు, దుష్టులయందు నుపేక్షయు గలిగియుండవలయునని యుపదేశింపడమైనది ఈ కరుణోపేక్షలయందు రాగద్వేషములు లేవు అందువల్ల మనశ్శాంతికి ఏలాటి ఆటంకమున్ను గలుగదు తాను ప్రారంభించిన ధర్మ కార్యము నిరాటంకముగ చేసుకొనవచ్చును ఈ సత్యమును తెలిసికొనకయేవిధమైన శాస్త్ర జ్ఞానముగాని,

అనుష్ఠానముగాని, కార్య నిర్వహణముగాని, లేనివారై వేదాంతము చెప్పు కొనుచు వీధులలో తిరుగుచుండువారు, ఈ లాగున చెప్పుదురు సాధువులకు శత్రు మిత్ర భేదముండవచ్చునా! సమత్వము గలిగియుండ వలయును గదా! వీరికి సమత్వమెచ్చట నున్నదని చెప్పెడు వాక్యములను విని, కార్యధురంధరు లెవరునన్నూ సందేహపడనక్కరలేదు ఆలాగున సమత్వము జెప్పువారు గోవును, పెద్దపులిని ఒకే స్థలములో మేపే శక్తి గలిగియుండిన వారి వాక్యము నమ్మవచ్చును ఈ విషయమై యోగ వాసిష్ఠమున వసిష్ఠమునియొక్క యాశయము జూడుడు శ్రీరామచంద్రుడు వైరాగ్యము గలిగి రాజ్యమును త్యజించి వనమున తపము కొరకు వెళ్లవలయునని తీవ్రబుద్ధి గలిగినప్పుడే వసిష్ఠునిచే వాసిష్ఠ ముపదేశించడమైనది రామచంద్రుడీలాగున చెప్పెను రాజ్యపాలనమున సమత్వబుద్ధి గలిగియుండుటకు సాధ్యముగాదు సమత్వము లేనిచో మనశ్శాంతి గలుగదు రాజ్యపాలనమున శిష్టరక్షణమును, దుష్టనిగ్రహము ఉండవలయును అందువల్ల మనశ్శాంతి గలుగని ఈ రాజ్యము నాకక్కరలేదని వచించెను అప్పుడు వసిష్ఠ డీలాగున ఉపదేశించెను

*బహిః కృతిమసంరమ్భః హృది సంరమ్భవర్జితః।*
*కర్తా బహిరకర్తాఽన్తః లోకే విహర రాఘవ॥*

ఓ శ్రీరామచంద్రా! బాహ్యజనులకు చూచునప్పుడు కర్తృత్వము గలవానిగాను, లోపల అకర్తగాను, ఆలాగున బాహ్యమున కర్తృత్వము వహించి సర్వకర్మముల జేయువానివలెను, హృదయమున ఏ కర్మయు జేయని సాక్షివలెను ఉండుము ఇట్లుండిన రాజ్యముగాని, సంసారముగాని నిన్ను బంధింపజాలవు కార్యదీక్షాపరులందరును ఆత్మజ్ఞులై యుండియు ఈలాగుననే కాలము గడిపిరి లేనిచో పామరులు జ్ఞాని హృదయము తెలుసుకొనజాలక అరాచక మొనర్తురు గీతలో శ్రీకృష్ణభగవానుడు ఈతత్త్వమును స్పష్టముగ ''పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్'' అని వచించిరి

## 44. సూ॥కామక్రోధ మోహాస్మృతి భ్రంశ బుద్ధినాశ సర్వనాశ కారణత్వాత్.

పద ॥ కామ క్రోధ మోహా స్మృతిభ్రంశ బుద్ధినాశ సర్వనాశకారణత్వాత్

టీక॥ (దుస్సంగః = దుష్టసంసర్గము) కామ = కామమునకు, క్రోధ = క్రోధమునకు, మోహ = మోహమును, స్మృతిభ్రంశ = బుద్ధినాశమునకు, సర్వనాశ = సర్వనాశమునకు, కారణత్వాత్ = కారణమగుటవల్ల (సర్వథైవ = అన్నివిధములచేతను, త్యాజ్యః = త్యజింపదగినది )

తా॥ దుష్టసహవాసము ఎన్ని విధములుగా మానవుని పాడుచేయునో ఈ సూత్రమున నిరూపించడమైనది కామమును, క్రోధమును, మోహమును, స్మృతినాశమును, బుద్ధినాశమును, వెయ్యేల సర్వవిధ నాశమును కలుగజేయును

వి ॥ దుస్సహవాసము కామమును, క్రోధమును, మోహమును స్మృతిభ్రంశమును, బుద్ధినాశమును గలుగ జేసుకొని కట్టకడకు మానవుని సర్వవిధములుగా నశింపజేయును (1) కామముచే రావణేశ్వరుండు వంశముతో నశించెను (2) క్రోధము వలన దూర్వాసమహాముని అవమానమును పొందెను, (3) మోహముచేత కీచకుడు హతుడయ్యెను (4) స్మృతిభ్రంశముచే శిశుపాలుడు కూలెను

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।**
**సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।**
**స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ (గీత–2–62,63)**

దృశ్యవిషయములను చింతించుచున్న పురుషునకు ఆవిషయముల యందు ఆసక్తి పుట్టుచున్నది అట్టి ఆసక్తివలన కామము ఉత్పత్తి యగుచున్నది కామమునకు అడ్డు కలుగజేయువానిపై కోప ముదయమగుచున్నది అట్టి క్రోధమువల్ల మోహపరవశుడగుచున్నాడు మోహమువల్ల స్మృతి భ్రంశము కలుగుచున్నది, దానివల్ల యుక్తాయుక్త వివేకజ్ఞానము నశించుచున్నది అట్టి యుక్తాయుక్త వివేకజ్ఞానము నశించుటవలన తానును నశించుచున్నాడు దుస్సహవాసముచేత గలిగెడు దోషము ఈలాగున నుండునని భగవానుడు ఉపదేశించెను

*నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।*
*న చాభావయతశ్శాన్తిః అశాంతస్య కుతస్సుఖమ్ ॥ (2–66)*

మనోనిగ్రహము లేనివానికి శుద్ధమనస్సు గలుగదు శుద్ధమనస్సు లేనివానికి

ఆత్మభావన చేయుటకు శక్తి గలుగదు, ఆత్మ భావన చేయ శక్తిలేని వానికి ప్రకృతి శమించదు ప్రకృతి శాన్తి నొందనివానికి ఇహసుఖముగాని, పరసుఖము గాని ఎచ్చట? అనగా ఎచ్చటను లేదు శాన్తిలేనివానికి ఇచ్చట నైనను బదరికాశ్రమ ఋషీకేశ కాశ్యాది పుణ్య ప్రదేశములందయినను సుఖము గలుగదు

*కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।*
*మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ (3-37)*

ఈ కామము క్రోధము రజోగుణముచే పుట్టినవే, ఇది అగ్ని వంటిది మహాపాపస్వరూపమైనది ఆత్మజ్ఞానమునకు పరమశత్రువైనదని తెలుసుకొనుము

*ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।*
*కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥ (3-39)*

ఓ కౌన్తేయా! ఈ కామము సముద్రము వంటిది ఎంత ప్రయత్నముతో నిండింపచూచినను నిండనిదియు, అగ్నివలె దృప్తిని చెందనిదియు, కోరికే రూపమైనదియు, ఆత్మజ్ఞానికి సర్వకాలములలోను పరమశత్రువు అయినట్టి కామముచే జ్ఞానము ఆవృతమై యున్నది దీనికి తృప్తి యనునది లేదు అనేక నదుల జలమును పానము చేసినను సముద్ర మేలాగున తృప్తిని నొందక యుండునో, హోమద్రవ్య సమిత్ ఘృతాదులచే అగ్నిహోత్రుడు ఎట్లు తృప్తిపొందక యుండునో, అట్లే ఈకామము నెంత అనుభవించుచుండినను వృద్ధి నొందునేగాని శాంతి నొందదు మనువును ఆలాగుననే చెప్పెను -

*న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।*
*హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥*

ఈ కామమనునది విషయభోగముల నెంతకెంత కనుభవించినను, అంతకంతకు అభివృద్ధి యగుచునే యుండును అగ్ని హోత్రుండు హవిస్సు మొదలగు వానివల్ల అంతకంత కభివృద్ధి యగునే గాని శాంతి నొందనట్లుండును ఈ కామము ఆత్మ జ్ఞానమునెట్లు ఆచ్ఛాదనము చేయుచున్నదో, అది క్రింది శ్లోకముచే నిరూపించడమైనది

*ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ ।*
F24 *యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥ (3-38)*

ఏప్రకారముగా పొగచేత అగ్ని కప్పబడుచున్నదో, ఏప్రకారముగా మావిచేత గర్భములోగల శిశువు గప్పబడునో అదేప్రకారముగ ఆకామముచేత ఈ యాత్మజ్ఞానము కప్పబడుచున్నది. గ్లాసులో వెలుగుచుండు దీపము చిమ్నీయందు పొగదట్టముగా చేరిన దీపప్రకాశమును ఏలాగున కనపరచక చేయుచున్నదో, అద్దముపై దుమ్ము ఉండిన ఏలాగున శరీరము ప్రతిబింబింప చేయక పోవుచున్నదో, అట్లే మనస్సులో గల కామాది మాలిన్యముచే, ఆత్మజ్ఞానము మరుపుబడి పోవుచున్నది మావిచే శిశువు ఆవరించియుండు సంగతి అందరికిన్ని తెలిసినదే కావుననే భగవానుడు ఇట్లు చెప్పెను

*అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।*
*విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥* **(18-53)**

అహంకారమును, నేను బలవంతుడనను దురభిమానమును, గర్వమును, కోరికను, (కామము) కోపమును, పరిగ్రహమును (పరవస్తువును గ్రహించుటయు) నిశ్శేషముగ త్యజించి మమకారము లేనివాడును, శాంత చిత్తము గలవాడును బ్రహ్మజ్ఞానమును (భగత్సాక్షాత్కారమును) పొందుట కర్హుడగుచున్నాడు దీనియందు కామక్రోధాదులతో కలిపి పరిగ్రహమును గూడ చెప్పుటచే పరవస్తుపరిగ్రహమువల్ల తన పుణ్యము నశించి దాతయొక్క పాపము వీనిని పొందుచుండును

*కామ ఏవ మనుష్యాణాం పిధానం బ్రహ్మబోధనే ।*
*తస్మాత్కామం త్యజన్ధీరో జ్ఞానమాప్నోతి మోక్షదమ్ ॥*

మానవులకు బ్రహ్మజ్ఞానోత్పత్తియందు కామమొక్కటియే ఆటంకపరచును కావున ధీరుడైనవాడు కామమును త్యజించవలయును అట్లయిన మోక్షమును పొందగలడు

*కామానాం హృదయే వాసః సంసార ఇతి కీర్తితః ।*
*తేషాం సర్వాత్మనా నాశో మోక్ష ఉక్తో మనీషిభిః ॥*

కామాది దోషములు హృదయమున కలిగి యుండుటయే సంసారమని చెప్పబడుచున్నది, అట్టి కామాదిదోషములు సర్వాత్మనా హతమగుటయే మోక్షమని మనీషులచేత చెప్పబడెను

**45. సూ॥ తరఙ్గాయితా అపీమే సంగాత్సముద్రాయంతి.**

పద ॥ తరఙ్గాయితాః - అపి- ఇమే - సంగాత్ - సముద్రాయన్తి

టీక ॥ సంగాత్ = సహవాసమువలన, ఇమే = ఈకామాదులు, తరఙ్గాయితా అపి = తరఙ్గములవలెనున్నను, సముద్రాయన్తి = సముద్రములవలె ఏర్పడుచున్నవి,

తా ॥ దుస్సహవాసమువల్ల ఈ కామక్రోధ మోహాదులు, తరంగసమూహముల వలె నుండి సముద్రమువలె ఏర్పడుచున్నవి

వి ॥ అలలయొక్క సమూహము ఎట్లు సముద్రమై మారుచుండునో ఆలాగున కామాదిదోషములన్నియు చేరి ఆత్మనుగూడ తన స్వరూపముగా మార్చుచున్నవి వర్ష బిందువులు అనేకములు చేరి కాలువలై, అనేకకాలువలు ఉపనదులై, అనేక ఉపనదులు మహానదులై, అనేక మహానదులు మహాసముద్రమగునట్లు, దుష్టసహవాస మొకటి కొకటి ఏర్పడి మహాగొప్ప సముద్రమువలె పరిణామమును పొందును ఆలాగుననే ఈదోషములన్నియు సముద్రమువలె పరిణమించిన, సముద్రము దాటుటకు ఎంత ప్రయాసయో, ఇదిన్నీ దాటుట మహాప్రయాసమగును జలబిందువును, లేక చిన్న నీటికాలువలను, దాటడము ఎంత సులభమో, ఆలాగున కామాదిదోషములు ఒక్కొక్కటి చేరునప్పుడు, వెంటనే జయించినచో, సులభముగా నుండును అయితే అట్లు కామ సాగరములో మునిగినను ఇప్పుడైనను త్యజింప యత్నించినచో దాటవచ్చును

*సంసారసాగరం ఘోరం తర్తు మిచ్ఛతి యో నరః ।*
*గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥*

ఏ నరుడైతే జననమరణ, జరావ్యాధి దుఃఖములతో గూడిన ఈ సంసారసముద్రమును దాటుటకు ఇచ్ఛించునో, అట్టివాడు భగవద్గీత ( భగవద్భక్తి) యనెడి నావను నాశ్రయించినచో సంసార సాగరమును సులభముగా దాటవచ్చును ఓడలో ఎవరైనను ప్రయాణము చేయవచ్చును, టిక్కెట్టు యుండిన చాలును ఆలాగున మాయామయమోహసముద్రమును దాట తలంచువారికి భక్తియొక్కటుండిన చాలును టిక్కెటుండిన బ్రాహ్మణులు గాని, అబ్రాహ్మణులుగాని, భూపాలుడుగాని, గోపాలుడుగాని, గృహస్థులు గాని, సన్న్యాసులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని పోవచ్చును టిక్కెట్టు పరిశోధించువాడు టిక్కెట్టు గలదా యని చూచునే గాని స్త్రీలా, పురుషులా, సన్న్యాసులా, సంసారులా అని అడుగడు

*సంసారార్ణవ మగ్నానాం విషయాక్రాన్త చేతసామ్ ।*
*విష్ణుపోతం వినా నాన్యత్కించిదస్తి పరాయణమ్ ॥*

విషయాది దోషములచే నాక్రమించబడిన మనస్సు గలవాడై సంసార మహాసాగరములో మునిగియుండువారికి భగవత్ భక్తి యనెడు ఓడ తప్ప దాటుటకు మరియొక్క యుపాయము కొంచమైనను లేదు గీతలోను చూడుడు

*త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।*
*కామః క్రోధ స్తథా లోభః తస్మా దేతత్త్రయం త్యజేత్ ॥* (16-21)

ఆత్మవినాశమునకు అనగా నరకప్రాప్తికి ద్వారములు మూడు 1 కామము, 2 క్రోధము, 3 లోభము కావున బుద్ధిమంతుడైనవాడు నరకద్వారములగు ఈ మూడింటిని మూసుకొనవలయును అయితే ఇతని గతి ఇంతేనా? కాదు ప్రయత్నించిన మార్గము లభించును అదే ఈ క్రింది శ్లోకమున నిరూపించడమైనది -

*ఏతైర్విముక్తః కౌన్తేయ! తమోద్వారైస్త్రిభిర్నరః ।*
*ఆచరత్యాత్మనశ్శ్రేయః తతో యాతి పరాం గతిమ్ ॥* (16-22)

ఓ యర్జునా! నరకద్వారములగు పైచెప్పిన కామక్రోధ లోభాది మూడు దోషములనుండి విరమించిన ఏనరుడైతే శ్రద్ధాభక్తి గలిగి ఆత్మ శ్రేయస్సుకొరకు ప్రయత్నము చేయుచున్నాడో అట్టి పుణ్యాత్ముడు, త్వరలోనే సర్వోత్కృష్టమైన మోక్షమును పొందుచున్నాడు

*అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।*
*సాధురేవ సమన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥* (9-30)

కామక్రోధాది పాపగుణములతో గూడి మిక్కిలి దురాచార ప్రవర్తకుడైనను, అనన్యభక్తితో భగవద్భజన చేసినచో అట్టివాడు మంచి మార్గములో ప్రవర్తించిన వాడగుటవల్ల శ్రేష్ఠుడే యని తెలియందగినది

*క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।*
*కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥* (9-31)

పై చెప్పిన పాపవిమోచనకొరకు భగవద్భక్తి చేయువాడు త్వరగా పాపవిముక్తి గలిగి ధర్మాత్ముడగుచున్నాడు! వాడు త్వరలో పరమశాంతిని (ఉపరతిని) పొందుచున్నాడు! ఓ యర్జునా! నాభక్తులు చెడరు అని పండిత సభలో రెండు చేతులుపైకెత్తి నన్ను ఆనపెట్టి చెప్పుము

*మాం హి పార్థ ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।*
*స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥ (9-32)*

ఓ యర్జునా ! పాపయోని సంభూతులైన వారెవరు గలరో వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను నాయందు భక్తి గలవారై సర్వోత్కృష్టమైన ముక్తిని పొందుచున్నారు

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా । (9-33)

మహాపాపయోనిలో జన్మించిన పాపులున్ను, పవిత్రజాతిలో గల స్త్రీలు, శూద్రులు, వైశ్యులు మొదలైనవారే, భగవద్భక్తిచే, మోక్షమును పొందుచుండగా, పుణ్యాత్ములగు బ్రాహ్మణుల గురించియు, భక్తులగు రాజుల గురించియు మరల చెప్పవలెనా? దీనియందు ఉత్తమ, మధ్యమ, అధమ స్వభావముగల జీవులను గురించి తెలుపడమైనది అనగా భగవద్భజనవల్ల క్షత్రియులకు బ్రాహ్మణులకు మోక్షము గలుగునా లేదా యని సంశయ పడవలెనా?

అపి చేదసిపాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః ॥
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ (4-36)

పాపాత్ములందరికన్నను, నీవు మిక్కిలి పాపాత్ముడవైనను భగవద్ జ్ఞానమనెడు ఓడచే పాపము అనెడి సముద్రమును లెస్సగ దాటగలవు ఇన్ని యుపాయములుండగా మరల సంసారసాగరములో పడి ఏలక్లేశము నొందవలయును, ''రోగానివ రసాయినమ్'' అని శంకరులు ఆత్మబోధములో తెలిపియున్నారు, అనగా శ్రేష్ఠమైన దివ్యౌషధముచే ఎట్టిరోగమైనను శమించునటుల భవరోగము భగవద్భక్తి యనెడు దివ్యౌషధముచే నిశ్శేషముగ నశించును

**46.సూ॥ కస్తరతి కస్తరతి మాయాం యః సంగాం స్త్యజతి యో మహానుభావం సేవతే నిర్మమో భవతి.**

పద ॥ కః - తరతి - కః -తరతి - మాయాం - యః - సంగాన్ - త్యజతి - యః - మహానుభావం - సేవతే - నిర్మమః - భవతి

టీక ॥ మాయాం = మాయను, కః = ఎవడు, తరతి = తరించును? కః = ఎవడు, తరతి = దాటును?, యః = ఎవడు, సంగాన్ = దుష్టసంగములను, త్యజతి = విడుచునో, యః = ఎవడు, మహానుభావం = మహాత్ముని, సేవతే = సేవించునో, నిర్మమః = మమకార వర్జితుడుగా, భవతి = అగునో, సః = వాడు, తరతి = తరించును

తా ॥ మాయను ఎవడు తరించును ? మాయను ఎవడు తరించును? ఎవడు దుస్సాంగత్యములను విడుచునో, ఎవడు మహానుభావుని సేవించునో, మమకారవర్జితుడగునో వాడు తరించును

వి ॥ దీనియందు ''కస్తరతి'', ఎవడు తరించునో అని రెండుసార్లు చెప్పుటచేత ఆదరార్థమని గ్రహించుకొనవలయును రెండు సార్లు చెప్పుటచే మాయను దాటుట ప్రయాసమని ద్యోతకమగుచున్నది మరల యచ్ఛబ్దప్రయోగముండుటచే అచ్చోటగూడ ఎవరైనను సరి అని నిరూపించడమైనది దీనియందు, బ్రాహ్మణుడని గాని, అబ్రాహ్మణుడని గాని, స్త్రీయనిగాని, పురుషుడనిగాని, సన్న్యాసియని గాని, గృహస్థుడనిగాని నిరూపణ చేయలేదు అందువల్ల ఈ భగవద్భక్తియందు మనుష్య మాత్రులందరికిని అర్హత గలదని నిరూపించడమైనది శివానందలహరిని చూడుడు -

**వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో**
**నరో వా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి ।**
**యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే !**
**తదీయస్త్వం శంభో ! భవసి భవభారం చ వహసి ॥**

బ్రహ్మచారి అయిన నేమి, గృహస్థుడయిన నేమి, వాన ప్రస్థుడయిన నేమి, సన్న్యాసి అయిన నేమి , ఈ చెప్పబడిన నాల్గు ఆశ్రమస్థులేగాక తదితరులైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, స్త్రీ మొదలైన వారెవ్వరైననేమి। వీరికంటె భిన్నులై అంత్యజాతులలో

నుండు వారెవరైననేమి, ఓ సర్వేశ్వరుడా ! ఎవరియొక్క హృదయము మీయందర్పింపబడినదై యుండిన, నీవు వారికి సంబంధించిన వాడవగుచున్నావు ఓ ఈశ్వరా ! అట్టివారియొక్క సంసారభారమంతయు నీవే వహించుచున్నావు శ్రీసీతారామాంజనేయ సంవాదమును చూడుడు

ద్విజవరేణ్యులకును విప్రోత్తములకుయో
గీశ్వరులకును యతీశ్వరులకును
భక్తివైరాగ్య సంపద్విశిష్టులకునే
కాంత వాసులకు వేదాంతులకును
జండాలపుల్కస శ్వపచ కంక కిరాత
శబరహూణాంగనా సంగతులకు
బ్రహ్మహత్యాసురాపాన హేమ స్తేయ
గురువధూ సంగమ కరవరులకు

సుందరీ క్షత్రియోరవ్య శూద్రులకును
మరియు నానావిధానేక మానవులకు
బరమ పావనమై శుభప్రదము నైన
రామ నామంబు శరణంబు రాజవదన !

బ్రాహ్మణ వంశములో వసిష్ఠ అగస్త్యాదులున్నూ, క్షత్రియ వంశములో విశ్వామిత్ర జనకాదులున్ను, వైశ్యులలో తులాధారులున్నూ, శూద్రులలో సూత - ఉద్ధవాదులున్నూ, కిరాతవంశములో వాల్మీకి శబర్యాదులున్ను, స్త్రీలలో మైత్రేయి - సులభాయోగిన్యాదులున్ను, అసురవంశములో ప్రహ్లాదాదులున్ను, రాక్షసవంశములో విభీషణాదులున్ను భగవద్భక్తివల్ల ముక్తులైరి హిందూమతములో సంఘ సంస్కరణకర్తలు చాలా తక్కువమందియే యుండిరి అందు వల్లనే ఈ దేశము చాలాకాలమునుండి అధఃపతనమగుటకు కారణమైనది సత్యదృష్టితో ఆత్మయోగ్యతను చూడక కులమునకు ఆధిక్యము ఇచ్చుట చేతనే, నిమ్నావస్థను పొందెను విదేశములలో గుణములకు ఆధిక్యమిచ్చుటవల్ల ఆదేశము ఉన్నతస్థితిలోనికి రావడమైనది ఈ సత్యము తెలిసికొన్నప్పుడే వేదకాలములో, ఆర్యుల కాలములలో భారతదేశము ఎంత ఔన్నత్యమును పొందెనో అట్టి స్థితిన్నీ మరల రాగలదు గీతామహాత్మ్యమును చూడుడు-

*మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్।*
*క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥*

ఎవరైతే గీతాధ్యానమును చేయుదురో, వారిని కమల పత్రమునకు నీరు అంటని విధమున పంచమహాపాతకములు ఉపపాతకములుగాని, కొంచమైనను అంటవు మనదేశములో పాపకార్యములో నడియుండు వారిని, ఆలాగుననే త్రోసివేసినారు వారిని సంస్కరించి పాపమునుండి విముక్తి చేయువారు లేకపోయిరి ఇది ఎటువంటి న్యాయమో, యోచించుడు ! రోగులనందరిని త్రోసివేసి ఆరోగ్యవంతులను సంరక్షించుటకు బూనిన వైద్యుల విధానము వంటిది నిజముగా ఆలోచించిన రోగుల కొఱకే వైద్యులేర్పడిరి ఆలాగున అజ్ఞానములో నుండువారిని సంస్కరించుట కొరకే జ్ఞానులు ఏర్పడిరి అనుతత్త్వము మరచిపోయిరి క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు, గాంధీ మొదలైనవారు పాపులను బాగుపరచుటందుకే యత్నించిరి అందువల్లనే విదేశములు అగ్రస్థానమునకు వచ్చుటకు కారణమైనవి ఈ పరమధర్మమును ఈమధ్యనైన కనుగొని గాంధీగారు ప్రయత్నించుటవల్లనే పరాధీనులైన మనము స్వాతంత్ర్యమును పొందినాము ఏ ఆచార్యులుగాని, ఏ మతస్థాపకులుగాని భారతదేశమున ఇంత ఘనకార్యము చేసిరా? వారందరున్ను వారి వారి జాతిని, వారివారి మతమును మాత్రము సంరక్షించెడు హృదయము గల వారగుటచేతనే భారతదేశము పతనము పొందెను కావున విశాల హృదయముతో యోగ్యత ననుసరించి సర్వజనులకు అర్హత ఇచ్చేలాగున నుండే మతమే నిజమైన మతము, తక్కినవి సత్యమతములు కావు

**యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్ కురుతేఽర్జున।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ (4-37)**

ఏప్రకారము చక్కగా రగుల్కొనుచుండెడు అగ్నిహోత్రము సమిధలు, హోమద్రవ్యము, నవధాన్యములు మొదలైన వాటిని భస్మము జేయుచున్నదో ఆప్రకారముగానే జ్ఞానమనెడి యగ్ని సమస్త కర్మలను భస్మమొనర్చుచున్నది ఇట్టి జ్ఞానాగ్ని జనులలో ప్రజ్వలింప జేసెడు మతబోధకులు, జ్ఞానోపదేష్టలు, ధర్మబోధకులు ఇప్పుడు ప్రపంచమున మనకు కావలసినవారే

**కలికాలోరగదంశాత్కిల్బిషాత్కాలకూటతః।**
**హరిభక్తి సుధాం పీత్వా ఉల్లంఘ్యో భవతి ద్విజః ॥**

కలికాల క్రూరసర్పముయొక్క కాటు అనెడి కాలకూట సమానమగు పాపమను విషమునుండి విడుదల పొందతలచువాడు భగవద్భక్తియనెడి అమృతమును పానము చేసిన, అట్టి విషమునుండి విముక్తుడై మోక్షమును పొందగల్గును పాపమనెడు విషమునకు దైవభక్తి అమృతపానమువంటిది

## 47. సూ ॥ యోవివిక్తస్థానం సేవతే యో లోక బన్ధ మున్మూ లయతి నిస్త్రై గుణ్యో భవతి యో యోగక్షేమం త్యజతి.

పద ॥ యః - వివిక్తస్థానం - సేవతే - యః - లోకబన్ధం - ఉన్మూలయతి - నిస్త్రైగుణ్యః- భవతి - యః - యోగక్షేమం - త్యజతి

టీక ॥ యః = ఎవడు, వివిక్తస్థానం = ఏకాంత ప్రదేశమును, సేవతే = ఆశ్రయించుచున్నాడో, యః = ఎవడు, లోకబన్ధం = లోకబన్ధమును, ఉన్మూలయతి = నశింపచేయుచున్నాడో, నిస్త్రైగుణ్యో భవతి = త్రిగుణాతీతుడగునో, యః = ఎవడు, యోగక్షేమం = యోగ క్షేమమును, త్యజతి = త్యజించినవాడగునో

తా ॥ ఎవడు ఏ కాంతముగ నుండునో, ఎవడు లోకముయొక్క బన్ధమును ఉన్మూలింపజేయునో, ఎవడు సత్త్వరజస్తమస్సులనెడి గుణములనుండి విడివడునో, ఎవడు తనయొక్క యోగక్షేమములను సహ విడనాడునో, వాడు మాయను సులభముగా తరించును

వి ॥ ఈ సూత్రమందు, ''యోగక్షేమం త్యజతి'' అని గలదు యోగక్షేమనగా, ''అప్రాప్తప్రాపణం యోగః'' ప్రాప్తముకానిదానిని ప్రాప్తింపచే యుటయే యోగమనంబడును ''క్షేమస్తు స్థితరక్షణమ్'' క్షేమమనగా ప్రాప్తమై నదానిని స్థిరముగా రక్షించుట యగును అనన్య భక్తి గలవానికి ఏకాలమున ఏది ప్రాప్తించవలయునో, ఏది రక్షించవలయునో ఈ రెండు కార్యములును ఆ భగవంతుడే చేయుచుండును అయితే అప్రాప్తమును ప్రాప్తించవలయుననిగాని, ప్రాప్తించినది స్థిరముగా ఉండవలయుననిగాని

తలంపుకూడ త్యజించవలెనని తెల్పడమైనది ఏలన గీ అ 9 లో ''యోగక్షేమం వహామ్యహం'' అని చెప్పి యుండుటచేత మరల ఆవిషయమై తాను తలంచుటగూడ పనిలేదు తలంచినచో అది దృఢమైన విశ్వాసము గాజాలదు భగవదర్పితము చేసిన పిమ్మట భగవంతుడే చూచుకొనునుగదా ! భగవంతునికి విస్మృతి గలుగ దుగదా యని దృఢవిశ్వాసము గలిగియుండవలెనని భావము.

త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ (2-45)

ఓ యర్జునా ! వేదములు, త్రిగుణాత్మకములగు, సంసార విషయములను దెలుపునవిగానున్నవి ఆకారణమువలన నీవు త్రిగుణాత్మక ములగు సత్త్వ, రజస్తమస్సులనెడి విషయములయందు వాంఛ వదలినవాడవుగను కేవలసత్త్వగుణ విశిష్టుడవుగను, సుఖదుఃఖాది ద్వంద్వములను సహించువాడుగను, యోగక్షేమములను సహ గోరనివాడవుగను, ఆత్మజ్ఞానము గలవాడవునను నగుము వేదము త్రిగుణాత్మ స్వరూపము వేదాంతము త్రిగుణముల కతీతము ఇదే ప్రకృతి రహితమైన పరమపురుషార్థము, ఈశ్వర సాక్షాత్కారము

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ (18-52)

ఏకాంతస్థల నివాసియు, (ప్రతిబంధరహిత ప్రదేశమందుండు వాడును) కొద్ది యాహారముగలవాడును, స్వాధీనముజేసుకొన బడిన మనసు, వాక్కు, కాయముగలవాడును, సదా భగవద్ధ్యానమందాసక్తిగలవాడును, ఇహపర భోగములయందు లెస్సగ వైరాగ్యముగల వాడుగను నుండవలయును

గుణా నేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యు జరాదుఃఖైర్వి ముక్తోఽమృత మశ్నుతే ॥ (14-20)

జీవుడు దేహోత్పత్తికి, బీజభూతములగు నీసత్త్వ రజస్తమోగుణముల నతిక్రమించి జననము, మరణము, వార్ధక్యము, దుఃఖములు అనువాటిచేత విడువబడినవాడై మోక్షమును బొందుచున్నాడు

*యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః ।*
*నిరీహా చ నిరాశాచ నిత్యమేకాంత శీలతా ॥* (వివేకచూడామణి)

మోక్షముయొక్క మొదటి ద్వారము - 1 వాఙ్నిరోధము, 2 పరవస్తు పరిగ్రహము జేయకుండుట, 3 అంతఃకరణములో, నేలాటికోరికలు లేకుండుట, 4 నిరాశగలిగి యుండుట, 5 ఏకాంత ప్రదేశములో నివాసముచేయుట నీయ్యైదున్ను మోక్షద్వారములు

ఇక భజగోవిందమందు సత్సహవాసమును గూర్చి చెప్పినది జూడుడు

*సత్సఙ్గత్వే నిస్సంగత్వం నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్ ।*
*నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥*

సత్ సంగత్వ ప్రయోజనము జూడుడు, సద్వస్తువునందు నిలుకడగల సత్పురుషులయొక్క సాంగత్యముచే నిస్సంగత్వమున్ను, నిస్సంగత్వముచే నిర్మోహత్వమున్ను, నిర్మోహత్వముచే నిశ్చల ఆత్మతత్త్వమున్ను, ఆత్మతత్త్వముచే జీవన్ముక్తియు గలుగుచుండును మరియు శాస్త్రము నిరూపించినది జూడుడు

*యస్స్నాతి శీతతరయా సాధుసంగతి గంగయా ।*
*కిం తస్య దానైః కిం తీర్థైః కిం తపోభిః కిమధ్వరైః ॥*

ఎవరు, పరమ శీతలమైన పుణ్యపురుషులగు సాధువుల సంసర్గమను గంగానదియందు స్నానము జేయుదురో అట్టివారికి దానములచేత, తీర్థస్నానములచేత, తపస్సులచేత పుణ్యము గలుగునే గాని మోక్షము కలుగదని భావము మహనీయుల సేవచే పుణ్యమున్ను, మోక్షమున్ను కలుగునని భావము

## 48. సూ ॥ యః కర్మఫలం త్యజతి కర్మాణి సంన్యస్యతి తతో నిర్ద్వన్ద్వో భవతి.

పద ॥ యః - కర్మఫలం, త్యజతి- కర్మాణి- సంన్యస్యతి - తతః - నిర్ద్వన్ద్వః- భవతి

టీక ॥ యః = ఎవడు, కర్మఫలం = కర్మఫలమును, త్యజతి = వదలుచున్నాడో, కర్మాణి = కర్మములను, సంన్యస్యతి = వదలుచున్నాడో, తతః = అందువల్ల, నిర్ద్వన్ద్వః = ద్వంద్వాతీతుడు, భవతి = అగుచున్నాడు

తా ॥ ఎవడు కర్మఫలమును వదలుచున్నాడో, ఎవడు కామ్యకర్మములను వదలుచున్నాడో, అందువల్ల ద్వంద్వాతీతుడగు చున్నాడు ఈసూత్రమందు మొదట కర్మఫలత్యాగముజెప్పి మరల సర్వకర్మలను గూడ త్యజించే లాగున తెలుపడమైనది అందువల్ల ద్వంద్వాతీతడగు ననియు చెప్పెను

వి ॥ న కర్మణా మనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సంన్య సనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ (గీ-3-4)

పురుషుడు కర్మలనారంభింపక పోవుటవలన, నిష్కామ కర్మచే బొందవలసిన, నైష్కర్మ్య సిద్ధిని బొందడు చేయవలసిన అనుష్ఠానమును విడుచుటవల్ల, అనగా దేహ సన్న్యాసముచేత జ్ఞాన సిద్ధిని సరిగా బొందడు

*నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ॥*
*శరీర యాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ (3-8)*

కర్మము జేయకుండుటకంటె కర్మాచరణము శ్రేష్ఠమైనది కాబట్టి నీవు ఆచరించుటకు శాస్త్రముచే నియతమైన కర్మమును జేయుము ఏలననగా, కర్మమును జేయకుండిన, జీవితయాత్ర సహ జరుగదు ఇదిపుడు ప్రత్యక్షము గదా! ఏదైననొక యనుష్ఠానము గాని ప్రయత్నముగాని చేయక తిరుగుచుండు వారికి, అన్నవస్త్రాదులైనను దొరకక సంకటపడుట గనిపించుట లేదా !

*తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।*
*అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతిపూరుషః ॥ (3-19)*

ఫలాపేక్ష లేనివాడవై ( ఈశ్వరార్పణ బుద్ధితో భక్తి శ్రద్ధగలిగి జేయువాడవై) యెల్లప్పుడు జేయందగిన కర్మను జేయుము ఫలాపేక్షలేనివాడ గుచు కర్మమును జేయుచుండిన యంతఃకరణ శుద్ధిగల వాడై మోక్షమును బొందుచున్నాడు

అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ (12-16)

ఏనా భక్తుడు దేనియందును నపేక్షలేనివాడును, బాహ్యాభ్యన్తర శుద్ధి గలవాడును, కార్యదీక్ష గలవాడును, ఏవిషయములలోను తగుల్కొననివాడును, మనోవృత్తులు నశించిన వాడును, సమస్తకామ్య కర్మారంభములను త్యజించిన వాడునుగా నగుచున్నాడో

భగవంతుని యందర్పింపబడిన హృదయమునుగల వాడగుచున్నాడో, వాడు నాకు ప్రియుడు దీనియందు అంతఃకరణశుద్ధి గలుగువరకు, పిమ్మటను తదేకధ్యానముండ వలయునని, నిరూపించడమైనది, సూత్రమున్ను ఈరహస్యమునే యుపదేశించెను పరమనిర్వాణమును, నిర్వికల్ప సమాధిని, బ్రహ్మసాక్షాత్కార చింతనారూఢత్వము గలుగజేసెడి సమయములో, ఇతర చింతలేమియు నుండకూడదు ఆత్మశాంతి, జీవన్ముక్తి గలిగినపిమ్మట ప్రతిబంధములేని లోకహితార్థ కార్యములు జేయించుటగాని, చేయుటగాని, జేయవచ్చును శ్రీగౌతమబుద్ధుడు, శ్రీ ఆదిశంకరులు మొదలగు మహాజ్ఞానులు ఆలాగుననే ప్రవర్తించిరి కావుననే, గీతచరమశ్లోకమున నిట్లు తెలుపుటకు గారణమైనది

*సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః ॥* *(18-66)*

దీని యర్థమిదివరలో వ్రాయబడినదే,

## 49. సూ ॥ యో వేదానపి సంన్యస్యతి కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే.

పద ॥ యః - వేదాన్ - అపి - సంన్యస్యతి - కేవలం - అవిచ్ఛిన్నానురాగం - లభతే

టీక ॥ యః = ఎవ్వడు, వేదానపి = వేదములనుగూడ, సంన్యస్యతి = వదలుచున్నాడో, కేవలం = మిక్కిలి, అవిచ్ఛిన్నానురాగం = విచ్ఛిత్తి లేని యనురాగమును, లభతేః పొందుచున్నాడో

తా ॥ ఎవ్వడు వేదవములను గూడ వదలుచున్నాడో, ఎడతెగని భగవదనురాగమును పొందుచున్నాడో, అట్టివాడు మాయను దాటును

వి ॥ వేదమనియు, వేదాంతమనియు రెండుభాగములు గలవు వేదము అంతఃకరణశుద్ధి కొఱకు కర్మకాండనుపదేశించుచుండును వేదాంతము అంతఃకరణశుద్ధి గలిగిన తరువాత, శమదమాదిగుణములు గలిగి బ్రహ్మవిచారమును జేయవలయునని జెప్పుచుండును మానవుని జీవితము పూర్వభాగమనియు, నుత్తరభాగమనియు రెండుభాగములు గలిగినది దీనికే ప్రవృత్తిమార్గమనియు, నివృత్తిమార్గమనియు

పేరులు ప్రవృత్తిమార్గము బ్రహ్మచర్మ గృహస్థాశ్రమములు నివృత్తిమార్గము వానప్రస్థసన్న్యాసాశ్రమములు అంతఃకరణశుద్ధిగలిగి విషయ విరక్తి గలుగు నప్పుడు గృహస్థాశ్రమము, దానికిసంబంధించిన సమస్త కర్మములను ధర్మములను, శాస్త్రములును, విడువవలయునని శాస్త్రము జెప్పుచున్నది అదే ఇచట, వేదమునుగూడ విడువవలయునని చెప్పినదని గ్రహించుకొనవలయును వేదమును విడిచి నాస్తికుడై యుండవలయునని భావము గాదు కావుననే

త్రైగుణ్యవిషయా వేదానిస్త్రైగుణ్యో భవార్జున! (గీ -2-45)

అని తెలిపిరి దీని యర్థము ఇదివరలో వ్రాయబడినది మరియు

యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యద స్తీతి వాదినః॥

కామాత్మాన స్స్వర్గపరా జన్మ కర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్య గతింప్రతి॥

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥

ఓయర్జునా! ఆత్మజ్ఞానములేనివారు, వేదవాక్యములయొక్క అర్థవాదములందాసక్తులై స్వర్గాది సుఖములకంటె నిరతమైనది లేదని చెప్పెడు స్వభావముగల వారగుచు, ప్రసిద్ధమైనదియును, పూచిన మోదుగుచెట్టువలె రమ్యమైనదియునునగు, నేవాక్యమును జెప్పుచున్నారో, విషయవాంఛాపరవశులై స్వర్గసుఖమును గోరువారునై జన్మ కర్మఫలమునిచ్చునట్టియు ఇహసౌఖ్యము యొక్కయు, ఐశ్వర్యముయొక్కయు, ప్రాప్తినిగూర్చి, బాహుళ్యమైన కర్మకాండలను జెప్పుచున్నారో, అట్టివారికి మనసునందేకాగ్రతగాని, నిర్మలతగాని, కరుణగాని, అనన్యభక్తిగాని యుండదు భోగైశ్వర్యాదు లందాసక్తిగల చిత్తముగలవారును, ఆవిషయభోగములచేత నపహరింపబడిన మనసు గల వారియొక్క యంతః కరణమందు నిశ్చయాత్మక స్వరూపముగల, ధ్యానము, భగవద్భక్తి గలుగదు కర్మకాండము అతిశయోక్తిచే నిండినదగుటచే, మోదుగపువ్వు, యొఱ్ఱబాడిసెపువ్వు, దర్భపూతవంటిదని శ్రీకృష్ణభగవానుడే వర్ణించడమైనది పైజెప్పిన త్రివిధపుష్పములు జూచుట కందముగా నుండునే గాని కొంచమైన సుగంధవాసన

యుండదు పూజించుట కుపయోగపడవు మానవులు ధరించుట కుపయోగపడవు జనోపయోగమగు ఫలమైనను ఉండదు కావుననే శ్రీనారదుడు ''వేదానపి సంన్యస్యతి'' అని తెలిపెను మరియు అమృతబిందూ పనిషత్తు దెలిపినది జూడుడు

*గ్రంధమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞాన తత్పరః ।*
*పలాల మివ ధాన్యార్థీ త్యజేద్గ్రంధమశేషతః ॥*

మేధాసంపత్తిగలవాడు, వేదశాస్త్రములు చక్కగ చదివి జ్ఞానవిజ్ఞాన పరుడై, కర్షకుడు పైరును పండించి ధాన్యమును సంగ్రహించి గడ్డిని త్యజించినట్లుండ వలయును కావుననే పూర్వాశ్రమమున వేదమునున్ను, ఉత్తరాశ్రమమున వేదాంతమున్ను గ్రహించవలయునని జెప్పుటకు గారణము మరియు ముండకోపనిషత్తుపదేశించినది జూడుడు

*పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో*
*నిర్వేదమాయా న్నాస్త్యకృతః కృతేన ॥*

బ్రహ్మనిష్ఠుడు స్థూలశరీర భూలోకాదులను, కర్మలచే బొంద బడినవిగా తెలిసికొని, కర్మకాండ క్రియలచే బొందుటకు సాధ్యముగాని ఆత్మ( ఈశ్వరుడు) క్రియలచే లభింపదని గ్రహించి పైజెప్పిన క్రియలలో వైరాగ్యమును బొందవలయును

మూ ॥ తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽ థర్వవేద
శ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి ॥

ఋగ్యజుస్సామాథర్వణములు నాలుగు వేదములు వేదాంగములైన శిక్షా, వ్యాకరణ, కల్ప, నిరుక్త, ఛందో, జ్యోతిషములను నారుశాస్త్రములున్ను, అపరావిద్యలనంబడును అనగా అప్రధానమైనవి బ్రహ్మమును దేనిచే బొందుచున్నారో, అది పరావిద్య యనంబడును దీనివల్లనే భగవద్భక్తియు మోక్షమున్ను గలుగునని శ్రుతి స్మృతులు ఎట్లుద్ఘోషించుచున్నవో గ్రహించుకొన వలయును

## 50. సూ ॥ స తరతి స తరతి స లోకాంస్తారయతి.

పద ॥ సః- తరతి - సః - తరతి - సః - లోకాన్ - తాధయతి

టీకా ॥ సః = వాడు, తరతి = తరించును, సః = వాడు, తరతి = తరించును, సః=వాడు, లోకాన్ = లోకములను, తారయతి = తరింప జేయును

తా ॥ ఎవడు ''47॥ సూత్రమున''యో వివిక్తస్థానం సేవతే'' అని చెప్పబడెనో, అట్టివాడు సంసారసాగరమును తరించును వాడు తరించును, అట్లు తరించిన వాడు లోకములను తరింపజేయును

వి ॥ ఎవడు సంసారసాగరమును దాటునో, అట్టి దాటినవాడు ఇతరులను సులభముగా దాటింప గలుగును దీనివల్ల తాను దాటిన పిమ్మట ఇతరులను దాటించేలాగున ప్రయత్నించ వలయును కావున తాను ముందుగ ముక్తుడైన పిమ్మట నితరులను ముక్తులుగా జేయుటకు ప్రయత్నించవల యును లోకములో రోగులుగా నుండువారిపై దయగ లిగి, రోగవిముక్తి జేయదలంయచినచో తాను ముందుగా ఆయుర్వేదము చదివి యుత్తీర్ణుడు గావలయును ఆలాగున విద్యావిహీనుల జూచి జాలిగలిగి వారిని విద్యావంతులగా జేయదలంచిన మొట్టమొదట తాను విద్యావంతు డయ్యేలాగున జూడవలయును లేనిచో వ్యర్థము తాను బద్ధులైన వారి సంసార బంధమును నివృత్తిజేయ దలంచువాడు ప్రప్రథమమున తన సంసారబంధము లన్నిటిని ద్రుంచవలయును, అట్లుగానిచో, బంధనమున నుండు వాడు బంధింప బడిన మరియొకరి బంధమును నెట్లు ఛేదింపజాలదో, వీని గతియు నటువంటిదే ముండకోపనిషత్తు దెలిపినది జూడుడు

మూ ॥ అవిద్యాయా మంతరే వర్తమానా
స్స్వయం ధీరాః పండితం మన్యమానాః ।
జంఘన్యమానాః పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యధాంధాః ॥

అవిద్యయొక్క మధ్యమున బడియుండువారు తామే బుద్ధిమంతుల మని, మహాపండితులమని, తలంచునట్టి మూఢులై ఆపదలచే పీడింపబడినవారై గ్రుడ్డివానిచేతనే తీసుకొని పోబడుచున్న గ్రుడ్డివారివ్మేనే, దారితప్పి తిరుగుచుందురు తరించిన వాడితరులను తరింపజేయగలుగునని జెప్పిన దానికి శ్రీశంకరులు వివేకచూడామణి యందు జెప్పినది జూడుడు

*శాన్తా మహాన్తో నివసంతి సన్తో వసన్తవల్లో కహితం చరన్తః ।*
*తీర్ణాస్స్వయం భీమమహార్ణవం జనా నహేతునాఽన్యానపి తారయన్తః ॥*

ప్రకృతి శమించి ఆత్మశాంతిని బొందిన మహాత్ములు వసంత ఋతువువలె

లోకహితమును ఆచరించువారలై తాము స్వయముగా జననమరణ దుఃఖకారణమగు సంసారసాగరమును దాటినవారై అకారణ కారుణ్యముచే అన్యులను గూడ తరింప జేయుచు ప్రపంచములోనుంటున్నారు శిశిర ఋతువులో వృక్షముల ఆకులన్నియు రాలిపోవుటచే వనమంతయు నెండిపోయినట్లుండును వసంతఋతువు వచ్చినప్పుడు చిగిర్చి సుగంధపుష్పములచే నెట్లు శోభాయమానమై యుండునో ఆలాగున మానవుల హృదయములో దయా, శాంతి, భక్తి, జ్ఞాన, వైరాగ్యరహితములై హృదయము శుష్కావస్థలో నుండునప్పుడు మహాత్ములవతరించి భక్తి వైరాగ్య, జ్ఞాన కరుణాదులుపదేశించి వారి జన్మమును సాఫల్యమొనర్చెదరు

*నృత్యంతి పితరస్సర్వే సంతుష్టాస్తస్య వంశజాః ।*
*దేవాశ్చ ఋషయ స్తృప్తాః ప్రయాన్తి పరమం పదమ్ ॥*

పరమ భక్తుని జన్మమును జూచి దేవతులు సంతోషింతురు ఋషులు తృప్తులగుదురు ఆవంశస్థులైన సమస్త పితరులును ఆనంద పరవశులై తాండవమాడుదురు వానికి సంబంధించిన వారందరున్ను పుణ్యలోకమును బొందుదురు అని వరాహపురాణము

*షష్టిం కులాన్యతీతాని షష్టిమాగామికాని చ ।*
*కులాన్యు ద్ధరతే ప్రాజ్ఞః సన్న్యస్తమితి యో వదేత్ ॥*

జ్ఞానవంతుడైనవాడు, ఏకులమందు బుట్టి నేను సన్న్యసించుచున్నానని చెప్పుచున్నాడో, ఆవంశస్థులైన పితరులు 60 తరములవారున్ను, రాబోవు వంశస్థులు 60 తరముల వారున్ను వరుసగా ధన్యులగుదురు అని సన్న్యాస సంగ్రహము



ఓమ్

# చతుర్థోఽధ్యాయః - భక్తిలక్షణమ్

# నాల్గవ అధ్యాయము - భక్తిలక్షణము

## 51. సూ ॥ అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్.

పద ॥ అనిర్వచనీయం - ప్రేమస్వరూపమ్ ॥

టీక ॥ ప్రేమస్వరూపం = ప్రేమస్వరూపమైన భక్తి, అనిర్వచనీయం = మనోవాక్కులచే చెప్పుటకు వీలు లేనిది

తా ॥ భగవంతుని యందు ప్రేమస్వరూపమైన భక్తి యేది గలదో అది అనిర్వచనీయము అంతదింతయని చెప్పుటకు వీలు లేనిది నారదుడు ప్రహ్లాదుడు, ఉద్ధవుడు, గోపికాస్త్రీలు ఈప్రేమామృతమును పానముజేసి తన్మయులైరి అదివారికి వారే యనుభవించి తెలియందగినదే గాని దానికి దృష్టాంతముగా నుపమానముగా మరియొకదానిని నిరూపించి చెప్పుటకు లేదు పంచభక్ష్యపరమాన్నాదులచే తృప్తిబొందిన మూగవాడేలాగున నితరులకు జెప్పజాలక తనలో తానే ఆనందించియుండునో, పరమ ప్రేమైక స్వరూపమైన భక్తుని ఆనందమున్ను ఆలాగున జెప్పనలవి గానిది

వి॥ **సరసిజనయనే సశంఖ చక్రే మురభిది మావిరమస్వ చిత్త ! రన్తుమ్!**
**సుఖతరమపరన్న జాతు జానే హరిచరణస్మరణామృతేన తుల్యమ్ ॥**

మనసా! తామరల వంటికనులు గలవాడును, శంఖచక్రములు గలవాడునగు శ్రీకృష్ణునియందు విహరించుటను చాలించుకొనవద్దు శ్రీహరిపాదములను దలచుట యనెడు నమృతముతో సమానమైన మరియొక సుఖమైన దానిని నొకానొకప్పుడును ఎరుగను

''హరిచరణ స్మరణామృతేన తుల్యమ్''- భగద్భక్తిని ఇచట అమృతముగా వర్ణించడమైనది క్షీరసాగరోత్పన్నమైన యమృతము జరానెరలను మాత్రమే తీర్చును

భగవచ్చరణారవిందా మృతపానము జనన మరణముల రహితమొనర్చి మోక్షమొసంగును కనుకనే అమృత రూపముగా వర్ణించడమైనది

*జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో ! భజ శ్రీధరం*
*పాణిద్వంద్వ ! సమర్చయాచ్యుత కథా శ్శోత్ర ద్వయ! త్వం శృణు ।*
*కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం*
*జిఘ్ర ! ఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్॥*

ఓనాలుకా ! కేశవుని స్తోత్రముజేసి పాడుమా ! ఓమనసా ! మురారిని పాడుమా! ఓహస్తద్వయమా ! శ్రీధరుని పూజింపుమా ! ఓశ్రోత్రద్వయమా! నీవచ్యుతుని కథలను వినుమా ! ఓకన్నుదోయీ ! కృష్ణుని చూడుమా ! ఓపాదద్వయమా ! హరియొక్క సన్నిధికి పొమ్మా ! ఓనాసికా ! ముకుందుని పాదములయందలి తులసి నాఘ్రాణింపుమా! ఓశిరసా ! అధోక్షజుని నమస్కరింపుము

*అరే ! భజ హరేర్నామ క్షేమధామ క్షణే క్షణే ।*
*బహిస్సురతి నిఃశ్వాసే విశ్వాసః కః ప్రవర్తతే ॥*

ఒరే ! క్షణక్షణమున హరినామస్మరణము జేయుము, అది దుఃఖములేని మోక్షధామమును కలుగజేయును బయటికిపోయెడి నిశ్వాసము మరల లోపలికి తిరిగివచ్చునను నమ్మకము గూడ లేదు

## 52. సూ ॥ మూకాస్వాదనవత్.

పద ॥ మూకాస్వాదనవత్

టీక ॥ మూక = మూగవాడు, ఆస్వాదనవత్ = రుచికరవస్తువులను భుజించునట్లు

తా ॥ మూగవాడు మహారసవంతమైన వస్తువులను భుజించి ఆనందభరితుడై యుండినను, ఆపదార్థములయొక్క రుచి యెట్లుండునని ఎవరైన నడిగినచో, నేలాగున జెప్పజాలక యుండునో, అలాగున భక్తి రసామృత పానముచే, మహానందమును బొందిన భక్తుడు ఆదైవ కరుణామృత రసమును జెప్పజాలడు

కావుననే ''అనిర్వచనీయం ప్రేమ స్వరూపమ్'' అని నిర్వచించడమైనది దాని యొక్క తాత్పర్యములో మూకదృష్టాంతము నిరూపించడమైనది,

వి ॥ నాలుగు వేదములే పరమాత్మయొక్క జ్ఞానైశ్వర్యకరుణలను జెప్పజాలక యుండగా, సహస్రఫణములు గల ఆదిశేషుడు, ద్విసహస్రనాలు కలచే పరమాత్మను వర్ణింపజాలక యుండగా, మానవుండెట్లు వర్ణింప గలుగును? కఠోపనిషత్తును జూడుడు -

మూ ॥ న తత్ర సూర్యో భాతి న చన్ద్ర తారకం
**నేమా విద్యుతో భాన్తి కుతో౽యమగ్నిః ।**
**తమేవ భాన్తమనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వమిదం విభాతి ॥**

ఆపరమాత్మను సూర్యుడు ప్రకాశింప జేయజాలడు చంద్రుడు, నక్షత్రములు ప్రకాశింప జేయజాలవు మెఱుపులు ప్రకాశింప జేయజాలవు అట్లుండగా ఈయగ్ని యాపరమాత్మ నెట్లు ప్రకాశింజేయగలుగును ? సూర్య, చంద్ర, అగ్న్యాదులు అన్నియునాపరమాత్మవల్లనే ప్రకాశవంతములై యుంటున్నవి

## 53. సూ ॥ ప్రకాశ్యతే క్వాపి పాత్రే.

పద ॥ ప్రకాశ్యతే - క్వ - అపి- పాత్రే

టీక ॥ క్వాపి పాత్రే = ఒకానొక యరుదైన సత్పాత్రయందు, ప్రకాశ్యతే = ప్రకాశింపజేయ బడుచున్నది

తా ॥ ఆభక్తి ఒకానొక శుద్ధాత్మునియందు ప్రకాశించుచున్నది వానినుండి లోకములోనికి ప్రకాశమగుచుండును

వి ॥ ఆత్మబోధము దెలిపి నది జూడుడు -

*సదా సర్వగతో౽ప్యాత్మా న సర్వత్రావభాసతే ।*
*బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥*

పరమాత్మ ఎల్లప్పుడున్ను సమస్తమందును వ్యాపించి యున్నప్పటికిన్ని

అంతటను ప్రకాశించుట లేదు నిర్మలమైన అద్దము మొదలైన వానియందు సూర్యబింబమువలె, నిర్మలమైను బుద్ధియందు మాత్రము ప్రకాశించుచున్నది సూర్యుడంతట నొకేవిధముగ ప్రకాశించుచుండినను, స్వచ్ఛమైన దర్పణమందు మాత్రమే ప్రకాశించుచుండుగదా ! ఈశ్వరుని యొక్క స్థితియు నీలాగుననే యున్నది ఈవిషయమై భర్తృహరి తెలిపినది జూడుడు -

> **సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే**
> **ముక్తాకారతయా తదేవ నలినీ పత్రస్థితం దృశ్యతే ।**
> **అన్తః సాగరశుక్తి మధ్యపతితం తన్మౌక్తికం జాయతే**
> **ప్రాయేణాధమ మధ్యమోత్తమ జుషా మేవంవిధా వృత్తయః ॥**

మిక్కిలి కాలియున్న యినుమునందు వర్షజలబిందువు బడిన నామరూపములు లేకపోవును ఆవర్షబిందువే తామరాకుపై బడిన ముత్యమువలె గనబడుచున్నది అదియే సముద్రమధ్యముననున్న ముత్యపు చిప్పలోపల బడి నిజమైన ముత్యమే యగుచున్నది ఆలాగున, ప్రాయేణ, అధమ, మధ్యమ, ఉత్తమ, స్వభావముగల శిష్యులకుపదేశింప బడిన జ్ఞానమున్ను నుండును కార్తిక నెలలో ముత్యపు చిప్పలకు ఋతుకాలము స్వాతినక్షత్రము ప్రకాశించుచుండెడి సమయమున పడిన జలబిందువును గ్రహించుటకై, చిప్పలు సముద్రోపరి భాగమున నోరుతెఱచి పడియుండును దానిలో బడిన వర్షబిందువును గ్రహించి సముద్ర అగాధభాగములో పోయి యెల్లప్పుడున్ను దానిని గురించి భావనజేయుటచే అది తెల్లని బంకయై గట్టి పడి రాగరాగ ముత్యమగుచుండును ఉత్తమ శిష్యుడున్ను గురుదేవునిచే నుపదేశింప బడిన వాక్యమును ఏకాంతమున నిరంతరము ధ్యానము జేయుటచే నది భగవద్జ్ఞాన రూపమగుచున్నది మరియు, వర్షజలమంతటను నొకే విధముగ బడినను భూమియొక్క ధాతువు ననుసరించి నూతిని త్రవ్వగా కొన్ని ప్రదేశములలో గంగోదకముగాను, కొన్నిస్థలములో సామాన్యముగాను, కొన్ని ప్రదేశములలో నుప్పునీళ్లుగాను నెట్లు మారుచుండునో, శిష్యుల చిత్త పరిపాకముల ననుసరించి గుణమున్ను నాలాగుననే మారుచుండును మరియు శాస్త్రమీలాగున నుపదేశించుచున్నది -

> *శశాంకరశ్మి సంయోగా చ్చన్ద్రకాంతమణిః పయః ।*
> *యథోత్సృజతి సంయుక్తః తథా సద్గురు సంగతః ॥*

చన్ద్రకాన్తమణి యందు చన్ద్రిక పడునప్పుడమృతమును స్రవించుచున్నది యోగుల యొక్క హృదయమున్ను పరమాత్మ యందు లయమగుటచే అమృతమును బొందుచున్నది చన్ద్రుని యొక్క రశ్మియన్ని వస్తువులపై సమముగా పడుచుండినను చన్ద్రకాంత మణియందు బడునప్పుడే, అమృతము ఆవిర్భవించుచున్నది ఆలాగున అందరి హృదయములలో ఆత్మ ఒకేవిధముగా నుండినను, శాంతమైన నిర్మల హృదయములో మాత్రమే, భక్తి రసామృతమును ప్రవహింప జేయును

*యథార్క రశ్మి సంయోగా ఉర్క కాంతో హుతాశనమ్ ।*
*ఆవిష్కరోతి నైకః సః తథా సద్గురు దర్శనాత్ ॥*

ఏలాగున సూర్యరశ్మి సంయోగముచే, సూర్యకాంతము అగ్నిని ప్రజ్వలింప జేయుచున్నదో, ఆలాగున, నెవనియొక్క మనసు సూర్యకాంత రత్నమువలె, విశుద్ధమై యుండునో, వానియందు ఆత్మజ్ఞానాగ్ని ప్రజ్వలించియుండును సూర్యుడు అంతటను నన్నివస్తువులయందును సమానముగా ప్రకాశించుచుండినను సూర్యకాంత రత్నములో మాత్రమే జ్వలించునట్లు శుద్ధాన్తఃకరణములేని వారిలో గూడ, భగవంతుడున్నప్పటికిన్ని ప్రకాశించుట లేదు అట్టి అంతఃకరణము గలవారిలో ప్రకాశించును

## 54. సూ ॥ గుణరహితం కామనారహితం ప్రతిక్షణ వర్ధ మాన మవిచ్ఛిన్నం సూక్ష్మతరమనుభవరూపమ్.

పద ॥ గుణరహితం- కామనాహితం- ప్రతిక్షణ వర్ధమానం - అవిచ్ఛిన్నం - సూక్ష్మతరం - అనుభవరూపమ్

టీక ॥ గుణరహితం = అనన్య భగద్భక్తి సత్త్వరజస్తమోగుణములు లేనిది, కామనారహితం= కామాదిదోషములు లేనిది, ప్రతిక్షణవర్ధ మానం= ప్రతిక్షణము వృద్ధిని నొందునదిగ, అవిచ్ఛిన్నం = ఎడతెగనిదిగా, సూక్ష్మతరం= మిక్కిలి సూక్ష్మమైనటువంటిదిగా, అనుభవరూపం = అనుభవమే స్వరూపముగా గలదిగ నుండును

తా ॥ భగవద్భక్తి, ప్రకృతిసంబంధ సత్త్వాదిమూడుగుణములు లేనిదిగను, కామాదిదోషములు( ఫలాపేక్ష) లేనిదిగను, ప్రతిక్షణము వృద్ధిని పొందుచున్నది

గను, విచ్ఛేదవము లేనిదిగను, మిక్కిలి సూక్ష్మతరమైనదిగను, అనుభవమే స్వరూపముగా గలదిగను నుండును

వి ॥ ఇటువంటి భక్తియే శుద్ధమైన భక్తి యగును ప్రకృతిసంబంధమగు మూడు గుణములలో నేగుణముతో గూడినదైనను నది శుద్ధమైన భక్తి గాజాలదు దానియందశుద్ధవాసన గలిగియుండినచో అది, ఊషరక్షేత్రములో గంధక భూమిలో గల నూతి నీరువంటిదే యగును అది పానార్హము గాదు పానము జేసినచో రోగపీడితుండగును శుద్ధభూమిలో గల నూతిజలము గంగోదకము వంటిదగును పానయోగ్యమగును దానివలన దాహశాంతియు గలుగుటయే గాక ఆరోగ్యమున్ను వృద్ధి యగును

*మలినో హి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।*
*తథాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥*

అద్దము ప్రతిబింబము జేయుశక్తిగలదైనను, మాలిన్యముతో గూడిననేలాగున ప్రతిబింబమును గలుగజేయలేదో, ఆలాగున పరిపక్వములేని యంతః కరణము ఆత్మజ్ఞానము గలుగజేయుటకు శక్తి గలిగియుండదు

*ఆత్మా క్షేత్రజ్ఞసంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతై ర్గుణైః ।*
*తైరేవ విగత శ్శుద్ధః పరమాత్మా నిగద్యతే ॥*

ప్రకృతి సంబంధమగు సత్వరజస్తమోగుణములతో గూడినందుచేతనే ఆత్మయనియు , క్షేత్రజ్ఞుడనియు, సాక్షియనియు, పేరుగలిగినది అవిద్యా సంబంధమగు నామూడు గుణములనుండి ఎప్పుడు విముక్తి నొందునో అపుడు పరమాత్మ యని జెప్పబడును

*యథా సిద్ధ రసో లోహత్రయం చైక ప్రకారతః ।*
*కుర్యాత్స్వర్ణం తథా భక్తి రథ చైవం గుణ త్రయమ్ ॥*

ఏలాగున సిద్ధరసము, వెండి, రాగి, ఇత్తలి మొదలగు లోహములను నేకరూపమగు సువర్ణరూపముగా జేయుచున్నదో, ఆలాగున అంతరంగ భక్తియు మూడు గుణములను శుద్ధపరచి అనగా మూడుగుణములను రహితమొనర్చి, ఆత్మను శుద్ధము

జేయును సిద్ధరసమనగా సిద్ధపురుషులు శుద్ధపరచిన రసము దీనియందు పైజెప్పిన లోహములు స్ఫుటము జేసిన బంగారమగును

ఉపాసనమిదం నానావిక్షేపావృత్తి నాశనమ్ ।
అనేనైవ మనోనాశో జీవన్ముక్తి శ్చ నేతరైః'' ॥

నిర్మలబుద్ధితో జేసెడి దైవోపాసన, నానావిధములగు మనసులోగల విక్షేపములను, మరల మరల గలిగెడు సంకల్ప వికల్పములను నశింప జేయును మనోరాహిత్యమున కీయుపాసన దప్ప వేరు మార్గము లేదు జీవన్ముక్తియు మరియే యొక్క సాధనల చేతను గలుగునది గాదు!

అచ్ఛిన్నా తైల ధారావత్ప్రీతిః భక్తి రుదాహృతా ।
వర్ధమానా చ సా భక్తిః కాలే పూర్ణా భవిష్యతి ॥
పూర్ణయా పరయా భక్త్యా జ్ఞానేనేవ భవం తరేత్ ।

అవిచ్ఛిన్నమైన తైలధార వలె భగవంతుని యందుగల ప్రీతి భక్తి యనంబడును ప్రతిరోజును వృద్ధినొందుచున్న యాభాగవద్భక్తియే కాలము, పరిపక్వముజెందునప్పుడు పూర్ణావస్థను పొందును, పూర్ణమైన ఆపరభక్తి 'వేదాంతజనిత' జ్ఞానమువలె సంసారసాగరమును తరింప జేయును భక్తి, ప్రారంభములోకొద్ది యైనను ప్రతిరోజు ననుష్ఠించి రాగా రాగా శుక్ల పక్ష చంద్రుని వలె వృద్ధినొంది పరిపూర్ణజ్ఞానమును గలుగజేయును శుక్లపక్ష ద్వితీయ దినమందు చన్ద్రుడొక్కరేఖమాత్రము గానంబడును మరల, తృతీయ మొదలైన తిథులలో నేలాగున ప్రతిదినమునొక్కొక్క కళవృద్ధి యై పూర్ణిమకు షోడశ కళాపూర్ణుడగుచున్నాడో, భక్తియున్ను నాలాగున వృద్ధినొందునదిగా నుండవలయును అట్లుగాక భర్తృహరి జెప్పినట్లు పామరులైన వారు గొప్పగ ప్రారంభించి క్రమముగా తగ్గించుచు తగ్గించుచూ వచ్చెదరు విజ్ఞానులు తిన్నగ తిన్నగ ప్రారంభించి క్రమముగా వృద్ధిపరచుచూ వచ్చెదరు మధ్యాహ్న కాలమున తననీడ కొంచెముగా గనిపించినను, క్రమముగా పెరిగి పెరిగి సాయంకాలమునకు గొప్పదిగా పెరుగుచుండును సజ్జనుల ప్రవృత్తియు నీలాగుననే యుండును ఇది సత్త్వగుణము గలవారి స్వభావము పైజెప్పినది తామస, రాజస స్వభావము గలవారి గుణముగానుండును

ఆరంభ గుర్వీ క్షయిణీ క్రమేణ లఘ్వీ పురావృద్ధిముపైతి పశ్చాత్ ।
దినస్య పూర్వార్ధ పరార్ధభిన్నా ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానానామ్ ॥

**55. సూ ॥ తత్ప్రాప్య తదేవావలోక యతి తదేవ శృణోతి తదేవ చిన్తయతి.**

పద ॥ తత్ - ప్రాప్య - తత్ - ఏవ- అవలోకయతి - తత్ - ఏవ - శృణోతి- తత్ - ఏవ - చిన్తయతి

టీక ॥ తత్ప్రాప్య = ఆభగవద్భక్తిని బొంది, తదేవ = ఆభగవద్భక్తినే, (భగవత్స్వరూపమును) అవలోకయతి = చూచును, తదేవ = ఆభక్తివిషయమునే, శృణోతి = వినును, తదేవ = ఆభగవద్భక్తినే, చిన్తయతి = చింతించుచు నుండును

తా ॥ ఆభగవద్భక్తిని బొంది, ఆభగవద్భక్తినే జూచుచు ఆభక్తి విషయమునే వినుచు ఆభగవద్భక్తినే చింతించుచు నుండును

వి ॥ భగవద్భక్తిని జూచుచు, అనగా భగవద్భావము విడిపోవు చున్నదా లేక మరచి పోవుచున్నదా అని చూచుచు, లేక మంగళ స్వరూపుడగు నాభగవంతుని మనోదృష్టితో జూచుచు యని గూడ జెప్పవచ్చును తక్కినవి మామూలర్థములు ఇచట కాముకుల మనసు కామినుల యందును, కామినులమనసు కాముకులయందును, జేరుచున్న ట్లుండును ఈ విషయమై సీతా రామాంజనేయ మున జెప్పబడిన పద్య మిదివరలో దెలుపడమైనది (పర పురుషానురక్తి గలభామిని )

**మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।**
**కథయంతశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥ (10-9)**

దీని తాత్పర్య మిదివరలో వ్రాయబడినదే

**సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః ॥ (12-14)**

నిత్యము సంతోషియు, మనోనిగ్రహము కలవాడును, దృఢమైన జ్ఞానము గలవాడును, భగవంతుని యందర్పిపబడినమనస్సును, బుద్ధియును,గల భక్తియోగముగల వాడెవడు గలడో వాడు భగవంతునికి ముఖ్యమైన భక్తుడున్ను, మిక్కిలి ప్రీతియున్ను గలవాడు గానగుచున్నాడు ముకుందమాలను జూడుడు

హేలోకాశ్శృణుత ! ప్రసూతి మరణ వ్యాధే శ్చికిత్సామిమాం
యోగజ్ఞాస్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః ।
అన్తర్జ్యోతిరమేయ మేకమమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణమాత్యన్తికమ్ ॥

ఓ జనులారా ! జనన మరణమనెడు సంసారమహారోగమునకు ఔషధమును వినుడు దీనికి నే చికిత్సను యాజ్ఞవల్క్య, వ్యాస, శుక, నారదాదులు జెప్పియున్నారో, మనసులోపల ప్రకాశించునదియు, అపరిమిత మైనదియు, అద్వితీయమైనదియు, ''శ్రీకృష్ణ'' యనుపేరుగల ఆయమృతము చక్కగ పానముజేసి సుఖించెదరుగాక ! అట్టి సర్వోత్తమ మైన దివ్యౌషధము పానము చేయబడినదై, పరిమితి లేని ఆనందమగు నిర్వాణమును గలుగ జేయుచున్నది

## 56. సూ ॥ గౌణీ త్రిధా గుణభేదా దార్తాదిభేదాద్వా.

పద ॥ గౌణీ - త్రిధా - గుణభేదాత్ - ఆర్తాదిభేదాత్- వా

టీక ॥ గుణభేదాత్ = సత్త్వాది గుణభేదముల వలనను, ఆర్తాదిభేదాద్వా = ఆర్తాది భేదముల వలనను,గౌణీ = అముఖ్యభక్తి, త్రిధా = మూడు విధములుగా అగుచున్నది

తా ॥ సత్త్వాది గుణభేదముల వల్లను, ఆర్తాది భేదముల వల్లను, త్రిగుణములతో గూడిన భక్తి మూడువిధములుగా నుంటున్నది

వి ॥ త్రిగుణముల స్వభావమును బట్టి, భక్తియున్ను మూడువిధము లుగా నుంటున్నది అదిసాత్విక భక్తి, రాజసభక్తి, తామస భక్తియనబడును విశుద్ధ గుణభక్తి మరొకటి గలదు అది కేవలము ఆత్మజ్ఞాన స్వరూపమై యుండును అది కేవల భగవన్మయమై యుండును గీతలో నీ భక్తిని నాలుగు విధములుగా వర్ణించడమైనది అయితే నారదుడు''గౌణీ'' అని ప్రారంభించుటచే ముఖ్యమగు ఆత్మ జ్ఞానభక్తిని దీనిలో చేర్చలేదు

చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥ (7-16,17)

దీనియర్థము ఇదివరలో వ్రాయబడినదే సూత్రార్థము వివరింప బడుచున్నది
1 ఆర్తుడు, అనేక దుఖములతో గూడి రక్షణము దోచక భగవంతుని ప్రార్థించువాడు,
2 జిజ్ఞాసువు, తత్త్వజ్ఞానము బొందుటకు శుభేచ్ఛ గలిగినను తగిన మార్గము గాని, తగిన గురుదేవుడు గాని దొరకక తపనము గల్గి భగవంతునిపై భారముంచి భజించువాడు
3 అర్థార్థి, వ్యాపారములో నష్టపడిగాని, దొంగలచే నపహరింప బడిన ధనముగల వాడైగాని, దారిద్ర్యబాధచే సుఖజీవితము గడుప మార్గము లేకగాని, తపించుచు భగద్భక్తి జేయువాడు వీరున్ను ఇతరాశ్రయమును వీడి భగవంతుని యాశ్రయించినందుచేత పుణ్యజీవులలో జేరిన వారే సత్త్వాది గుణభేదముచే గలిగెడు భక్తి భేదమిచట నిరూపించడమైనది

యజన్తే సాత్త్వికా దేవా॰ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥ (17-4)

సత్త్వగుణము గలవారు ఉత్తమదేవతల నారాధింతురు రజోగుణము గలవారు యక్షరాక్షసులను పూజింతురు తమోగుణ స్వభావము గలవారు భూతప్రేత పిశాచ గ్రామదేవతాదులను గొలుతురు ఎవరెవరు ఏయే దేవతలను గొలుతురో మరణానంతరము ఆయాజీవులు ఆయా దేవతల లోకములను బొందుదురు

గౌణ భక్తులను గురించి శంకరులు వేదాంత డిండిమమునందు తెలిపినది చూడుడు

పురుషార్థత్రయావిష్టాః పురుషాః పశవో ధ్రువమ్।
మోక్షార్థీ పురుష శ్రేష్ఠః ఇతి వేదాంత డిండిమః॥

పురుషార్థ చతుష్టయమున ధర్మ, అర్థ, కామములనెడి, యీమూడింటిని మాత్రము అపేక్షించి భగవద్భక్తి జేయువారు పశుప్రాయు లనియు, నాల్గవదగు మోక్షముకొఱకు భగవద్భక్తి జేయువాడు శ్రేష్ఠమనుజు డనియు తెలుపడమైనది ఏలన ధర్మార్థ కామములు మూడున్ను, ఇహలోక, స్వర్గలోక, సుఖమును మాత్రము గలుగ జేయునవగటచేతనే ఆలాగున జెప్పబడినది

## 57. సూ ॥ ఉత్తరస్మాదుత్తరస్మాత్పూర్వపూర్వా శ్రేయాయ భవతి.

పద ॥ ఉత్తరస్మాత్ - ఉత్తర స్మాత్- పూర్వపూర్వా - శ్రేయాయ - భవతి

టీక ॥ ఉత్తరస్మాదుత్తరస్మాత్ = వెనుక వెనుక నుండు భక్తి కన్న, పూర్వపూర్వా= ముందు ముందున్న భక్తి, శ్రేయాయ ( శ్రేయసే ? ) = శ్రేయస్సు (మోక్షము) కొఱకు, భవతి = ఉపకరించుచున్నది

తా ॥ వెనుక వెనుకనుండు భక్తికన్న ముందు ముందున్న భక్తి శ్రేయోదాయకమగుచున్నది అనగా, తామస భక్తికంటె రాజసభక్తి, రాజసభక్తి కంటె సాత్త్విక భక్తి శ్రేష్ఠములనియు, మోక్షముకొఱకుపకరించుచున్నవనియు గ్రహించందగినది

వి ॥ మనుమహర్షి యీలాగున వచించెను

*తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।*
*తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥*

విప్రునికి, (సంస్కారముగల మానవునికి) విద్యాతపస్సులు నిశ్శ్రేయస్సును (మోక్షమును) గలుగజేయుననియు, శ్రేష్ఠమైన వనియు వచించెను తపస్సు అనగా పరమాత్ముని బొందవలయునను హృదయ తపనము, సమస్త పాపములను నశింప జేయుననియు, విద్య అనగా భగవత్ప్రాప్తి గలుగజేయుటయే, మానవునియొక్క లక్ష్యమనియెడి గలిగెడు జ్ఞానము అమృతత్వమును జననమరణ రహితమైన మోక్షమును గలుగ జేయునని తెలిపెను ఇట్లు తెలుపుటచే విద్యాతపస్సులు రెండుమాత్రమే మానవున కమృతత్త్వమును గలుగ జేయునని గ్రహించవలయును అర్జునుడు ఈ ప్రశ్న యేజేసెను

తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ । **(3-2)**

దేనివలన నేను శ్రేయస్సును పొందగలుగుదునో దానిని నిశ్చయించి చెప్పుమని యడిగెను

సర్వ గుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తేహితమ్ ॥
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ **(18-64,65)**

రహస్య మన్నిటిలో నతిరహస్యమైనదియు, శ్రేష్ఠమైనదియనగు నాయొక్క వాక్యమును ఇకను వినుము నీవు నాకు మిక్కిలి ప్రియుడవై యున్నావు అనుకారణమునుబట్టి నీకు హితమును( శ్రేయస్సును) చెప్పుచున్నాను నాయందు చేర్చిన చిత్తముగలవాడవును నాయెడల భక్తి గలవాడవును, నన్నారాధించువాడవును అగుము, నాకునమస్కారింపుము నన్నే యాధారపడుము అట్లైన నన్నే పొందగలవు ఇది సత్యము నీవు నాకు ప్రియుడవై యున్నావు గాబట్టి నీకొఱకుప్రతిజ్ఞ జేయుచున్నాను అనగా ఆనబెట్టి చెప్పుచున్నాను ఓహో భగవంతుడే ప్రతిజ్ఞాపూర్వకముగా జెప్పుచున్నాడని తెలుపునప్పుడున్ను, గోప్యములన్నింటిలోను నతిగోప్యమని జెప్పునప్పుడున్ను అనన్యమైన భక్తి యొక్కయు, శరణాగతియొక్కయు, మాహాత్మ్య మెటువంటిదో భక్తు లూహించుకొనవచ్చును

## 58. సూ ॥ అన్యస్మాత్సౌలభ్యం భక్తౌ.

పద ॥ అన్యస్మాత్ - సౌలభ్యం - భక్తౌ

టీక ॥ బక్తౌ = భక్తియందు, అన్యస్మాత్ = ఇతరమున కన్న, సౌలభ్యం - సులభత్వము కలదు

తా ॥ భగవత్ప్రాప్తి యందు భక్తి ఇతర సాధనములకన్న సులభమైనదిగా నుంటున్నది,

వి ॥ ముండకోపనిషత్తు దెలిపినది జూడుడు -

మూ ॥ **నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన।**
**యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥**

ఈయాత్మ వేదవేదాంత విశేష ప్రవచనముల వల్ల లభించునది గాదు ప్రాంపంచిక విషయ మహాబుద్ధి బలముచేతగాని లభించునది గాదు అనేక విధములగు శాస్త్ర, శ్రవణములచేతను లభించునది గాదు పరమాత్మను ఏజీవుడు వరించునో (ఆశ్రయించునో) అట్టి జీవునిచేత లభింప బడును అతనికి పరమాత్మ తన స్వరూపమును ప్రకటన జేయును (ప్రకాశింప జేయును) పతంజలి మహర్షియు తనయోగదర్శనము నందు మోక్షప్రాప్తికితర సాధనములకన్న తీవ్ర మైన భక్తి శ్రేష్ఠమని చెప్పిరి యోగపాదము సూ ॥ 21 తీవ్రసంవేగానా మాసన్నః= భగవత్ప్రాప్తిలేక, సమాధి

పొందవలయునని తీవ్రమైన భక్తి గలవారికి ఇతరములగు తపస్స్వాధ్యాయ యోగాదులు చేయువారికన్న, నిర్వి కల్పసమాధి అనగా యీశ్వర సాక్షాత్కార ప్రాప్తి త్వరలో సిద్ధించును శివానందలహరియందు నీలాగుననే శ్రీశంకరులు దెలిపిరి

గుహాయాం గేహే వా బహిరపి వనే వాఽద్రిశిరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వదఫలమ్ ।
సదా యస్యైవాంతఃకరణమపి శంభో తవ పదే
స్థితం చేద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ ॥

పర్వత గుహయందైనప్పటికిన్ని, గృహమునందైనప్పటికిన్ని, బాహ్య ప్రదేశమందైనప్పటికిని, అరణ్యమందైనప్పటికిన్ని, పర్వతముయొక్క శిఖరమందున్నప్పటికిన్ని, వానివల్ల నేమి ప్రయోజనము, చెప్పుమా ! ఎవనియొక్క హృదయము, ఓయీశ్వరా ! నీచరణార విందము నందెల్లప్పుడున్ను లగ్నమై యుండునో, యదే నిజమైన యోగము, వాడే నిజమైన యోగియు, నిరతిశయానందమును గూడ బొందిన వాడగుచున్నాడు

## 59. సూ ॥ ప్రమాణాంతరస్యాఽనపేక్షత్వాత్స్వయంప్రమాణత్వాత్.

పద ॥ ప్రమాణాంతరస్య - అనపేక్షత్వాత్ - స్వయం - ప్రమాణత్వాత్

టీక ॥ ప్రమాణాంతరస్య = ఇతర ప్రమాణము, అనపేక్షత్వాత్ = అపేక్షింపక యుండుటవలన, స్వయం = తానే, ప్రమాణత్వాత్ = ప్రమాణమగుట వలన

తా ॥ ఇతర ప్రమాణము మోక్షవిషయమున నపేక్షింపక యుండుటవలన తానే, అనగా భక్తియే ప్రమాణమగుచున్నది

వి ॥ భగవత్ప్రాప్తికి (మోక్షమునకు) ఈభక్తి యొక్కటియే చాలును అది స్వయం ప్రమాణమై యున్నది స్వయం ప్రమాణమైనందుచే మరియొక ప్రమాణమును అంగీకరించ వలసిన పని లేదు ఎట్లన స్వయముగా చూచిన దానికి, వినినదానికి, రసము గ్రహించినదానికి, గంధమాఘ్రాణించి ఫలమును పొందిన దానికి మరియొక ప్రమాణముగాని, సాక్షిత్వము గాని ఎట్లవసరములేదో, ఈభక్తివల్లనే ఈ నారదమునియు, అనేక మహర్షులు భగవత్సాక్షాత్కారము బొందియుండుట వల్లనే ఆలాగున తన

స్వానుభమును ప్రకటించడమైనది అయితే నేత్ర జిహ్వాదులు రోగసంయుక్తములైనచో ఒకదానిని మరియొక విధముగా దెలుసుకొన వచ్చునని యొక వాదము గలదు అయితే అదిరోగము గలవారికి సంబంధించునే గాని రోగరహితులకు దానితో సంబంధము లేదు శ్రుతియు, యుక్తియు, ననుభవము మూడున్ను నేకముగాలేనప్పుడే ప్రమాణావశ్యకత గలదు ఈమూడున్ను నొకే విధముగా నున్నప్పుడితర ప్రమాణావశ్యకత లేదు ప్రత్యక్ష ప్రమాణముండగా అన్య ప్రమాణాపేక్ష లేదు

శాస్త్ర దృష్టిర్గురోర్వాక్యం తృతీయశ్చాత్మనిశ్చయః ॥

శాస్త్ర వాక్యము, గురు వాక్యము, తన యనుభవము నీమూడున్ను గలిగియుండిన మరల ప్రమాణాంతరావశ్యకత లేదు భక్తి వల్ల మోక్షము గలుగునని శ్రుతి స్మృతులు సహస్ర ముఖములు గా తెలుపుచున్నవి నారద, వ్యాస, శౌనకాద్యనేక ఋషులున్ను ఆలాగుననే చెప్పుచున్నారు శ్రీనారదమహాముని యొక్క అనుభవమున్ను ఆలాగుననే యున్నది కావుననే సూత్రమందు ''స్వయంప్రమాణత్వాత్ '' అని దృఢముగా జెప్పుటకు గారణమైనది పతఞ్జలి మహర్షియు యోగసూత్రమున నీలాగుననే వచించెను అష్టాంగ యోగమే తన సిద్ధాంతమైనను యీశ్వర భక్తి లేనిచో, నది సాధ్యముగాదని తన యభిప్రాయము

కావుననే యోగపాదమున సూ ॥ 23 '' ఈశ్వర ప్రణిధానాద్వా'' -

ఇతర సాధనము లెన్ని యుండినను భగవత్ప్రణిధానము అనగా భగవద్భక్తి వలన త్వరలో భగవత్సాక్షాత్కారము నిర్వికల్ప సమాధిసిద్ధి, జీవన్ముక్తియు గలుగునని చెప్పెను

## 60 . సూ ॥ శాన్తి రూపాత్పరమానందరూపాచ్చ.

పద ॥ శాన్తి రూపాత్ - పరమానంద రూపాత్ - చ ॥

టీక ॥ భక్తిః = భక్తి, శాంతిరూపాత్ = పరమ శాంతి గలుగజేయుటవల్లను, పరమానంద రూపాత్ = పరమానందము గలుగజేయుటవల్లను, సులభమనియు ఇతర ప్రమాణావశ్యకత లేదనియు నారదమహర్షి తన అభిప్రాయమును తెలిపిరి

తా ॥ భగవద్భక్తి పరమశాంతిని కలుగజేయుటవల్లను, పరమానంద ప్రాప్తిని గలుగ జేయుటవల్లను, భగవత్ప్రాప్తికిన్ని, మోక్షమునకున్ను సులభమనియు ఇతర ప్రమాణావశ్యకత లేదనియు నారదుడు స్వానుభవమును వెల్లడిచేసెను

వి ॥ భాగవతము -

**చాలదు భూదేవత్వము, చాలదుదేవత్వమధిక శాంతత్వంబుం।**
**జాలదు హరిమెప్పింప విశాలోద్యములార! భక్తి చాలిన భంగిౕ ॥**

ప్రహ్లాదు డసుర కుమారులగు తనతోడి విద్యార్థుల కీలాగున చెప్పెను శ్రీవిష్ణువును మెప్పించుటకు బ్రాహ్మణ కులమందు బుట్టినను చాలదు దేవతలై పుట్టినను ప్రయోజనము లేదు బాహ్య శాంతత్వమున్ను జాలదు భక్తి యొక్కటి చాలినట్లు ఇక మరియొక్క టేదిన్ని చాలదు కఠోపనిషత్తు

**నిత్యో నిత్యానాం చేతనశ్చేత నానామేకో బహూనాం యోవిదధాతి కామాౕ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేత రేషామ్ ॥**

ఒక్కడగు ఏపరమేశ్వరుఁడు వినాశ రహితము లగు పదార్థముల లోపల నిత్యమైనటువంటివాడు, చైతన్యముగల ప్రాణులలోపల చేతన స్వరూపుడుఅట్టి భగవంతుని తనయాత్మలో ఎవరు చూచుచున్నారో అట్టివారికి నిత్యమైన ఆత్మశాంతి సుఖము గలుగును తద్భిన్నులైన వారికట్టి శాశ్వతమైన శాంతి సుఖము లేదు ''నిత్యో నిత్యానాం'' అను పదమునకు అనిత్యమైన దేహాదులలో నిత్యుడైన పరమేశ్వరుడని కొందరు అర్థము జేసియున్నారు అదియే చాల బాగున్నట్లు తలంచెద

**ఏకోవశీ సర్వభూతాన్తరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఒక్కడై సర్వజగత్తును స్వాధీనమునగలవాడును, సర్వభూతము లకు అంతరాత్మ స్వరూపుడును నగు నేపరమాత్మ శుద్ధ విజ్ఞాన ఘనస్వరూపుడై యుండియు, ననేక విధములు గలవానినిగా సామాన్యులు తలంచుచున్నారో, అట్టి ఆత్మను తన యాత్మగా అంతఃకరణ శుద్ధిగల ఏ ధీమంతులు చూచుచున్నారో, అట్టి వారికే శాశ్వతమైన బ్రహ్మ సుఖము గలుగును తదితరుల కట్టి నిరతి శయానందము లేదు అది యనన్య భక్తిచేతనే గలుగవలసి యున్నది ఈసూత్రమునందు శాన్తిరూపమున్ను, పరమానంద రూపమున్ను, నిరూపించిన దానికి ఉపనిషత్తే యాధారము గీత లో జ్ఞేయమును గురించి చెప్పిన భాగమును జూడుడు -

***జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।***
***జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥*** ***(13-18)***

ఆజ్ఞేయమగు బ్రహ్మము ప్రకాశించెడు వస్తువులగు సూర్యచన్ద్ర అగ్నులకు గూడ ప్రకాశము నిచ్చునదియు, ప్రకృతి కావలనుండునట్టిదని జెప్పబడుచున్నది అమానిత్వాది జ్ఞానముచు నెరుంగదగినది అమానిత్వాదులు గీత అ 13వ అధ్యాయములో జూడందగును అట్టి జ్ఞానము చేతనే ఆజ్ఞేయము బొంద సాధ్యమగును ఆపరమాత్మ స్వరూపము సమస్త ప్రాణుల హృదయము నందుంటున్నది భగవద్భక్తి వల్లనే ఎట్టి వారికైనను బొంద సాధ్యపడును

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ (13-28)

సమస్త భూతములయందు సమానముగ నుండునట్టియు, దేహాది పంచభూతములు నశించినను నాశము లేనట్టిదియునగు ఆపరమాత్మను ఎవడు చూచుచున్నాడో వాడే చూచుచున్నాడు తక్కిన వారలు నేత్రములుండియు జూడనివారు, అనగా పంచ భూతాత్మక మగునీ మాంసపు చక్షువు పంచభూతముల మాత్రమే చూడగలుగును ఆత్మజ్ఞాన మనియెడు దివ్యచక్షువుచేతనే, సర్వేశ్వరుని చూడగలరు అట్లు జూచుటకు శక్తిలేనివారు గ్రుడ్డివారితో సదృశులు ఈగీతాస్మృతియు పై జెప్పిన కరవల్లి శ్రుతియు నొకే యభిప్రాయమును దెలుపుచున్నవి

## 61. సూ ॥ లోకహానౌ చిన్తా న కార్యా నివేదితాత్మలోకవేదత్వాత్.

పద ॥ లోకహానౌ - చిన్తా - న - కార్యా- నివేదితాత్మలోక వేదత్వాత్

టీక ॥ నివేదితాత్మలోకవేదత్వాత్- నివేదిత = అర్పింప బడిన, ఆత్మలోకవేద త్వాత్= ఆత్మ, లోకవము, వేదవము అను నీమూటిని గల్గియుండుట వల్ల, లోకహానౌ= లోకహానిని గురించి, చిన్తా నకార్యా = చిన్తించ గూడదు

తా ॥ ఆత్మ, లోకవము, వేదవము ఈమూటిని పరవం భక్తుడు భగవదర్పితము జేసియుండుటచే లేక త్యాగము చేయవలసి యుండుటచే లోకనాశమును గురించి విచారపడకూడదు ఏలన నుత్పత్తి, స్థితి, లయములు మూడున్ను ప్రకృతి స్వభావములు ఈతత్త్వమునే శ్రీకృష్ణభగవానుడు అర్జునుని గురించి విశేషముగ బోధించడమైనది దీనియొక్క తత్త్వము దెలియకపోయిన ముఖ్యశాంతియు, నానందప్రాప్తియు గలుగదు

వి ॥ దేహినోఽస్మిన్ యధా దేహే కౌమారం యౌవనం జరా।
తధా దేహాన్తర ప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి ॥ (2-13)

దేహధారియగు జీవునికి ఈశరీరమునందు బాల్యదశయును, యౌవన దశయును, వార్ధక్యదశయును ఏప్రకారము మారుచున్నవో ఆప్రకారమే మరియొక్క దేహమును పొందుట గూడ నగును ఆత్మస్వరూప మిట్టిదని యెరింగినవాడు దేహము పోవుట వల్ల మోహమును పొందడు

*వాసాంసి జీర్ణాని యధా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।*
*తధా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ (2-22)*

మనుష్యుడు ఏ ప్రకారము పాతవై చినిగిపోయిన వస్త్రములను విడిచి క్రొత్తవైన ఇతర వస్త్రములను గ్రహించుచున్నాడో, ఆప్రకారమే ఆత్మ పాతదేహములను విడిచి క్రొత్తదేహమును పొందుచున్నది కావున దేహము నశించుట వల్ల ఆత్మకు నాశనము లేదని తెలిసికొన్న వాడే జ్ఞానవంతుడగును

*జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ।*
*తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥ (2-27)*

జన్మించిన వానికి మరణము నిశ్చయము జ్ఞానము గలుగక మరణించిన వానికి జననమున్ను నిశ్చయము కావున అనివార్యమైన విషయమునందు నీవు దుఃఖించుటకు తగవు మరియు ఇతర ప్రమాణము

**అమేధ్య పూర్ణం క్రిమిజాల సంకులం**
**స్వభావ దుర్గన్ధమ శౌచమధ్రువమ్।**
**కళేబరం మూత్ర పురీష భాజనం**
**రమన్తి మూఢా న రమన్తి పండితాః ॥**

ఈదేహము ఎటువంటిదన, మలముతో నిండినదిన్నీ, అనేక క్రిములసమూహముతో కూడినదిన్నీ, స్వభావముగ దుర్వాసనతో గూడినదిన్నీ, నవద్వారములచే సదా స్రవించుచుండుమాలిన్యమగుటచే అశుచి అయినదిన్నీ, అట్లు ఉండియు స్థిరముగానిదిన్నీ, మలమూత్రముల భాగమున్ను గల అట్టి ఈదేహమునందు

మూఢులు ఆనందింతురే గాని జ్ఞానులు ఆనందింపరు మరియు శ్రీశంకరులు దెలిపినది జూడుడు

పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్ ।
ఇహ సంసారే బహుదుస్తారే కృపయా ఽపారే పాహి మురారే ॥

దీని యర్థము గ్రాహ్యము

**62. సూ ॥ న తత్సిద్ధౌ లోకవ్యవహారో హేయః కిం తు ఫలత్యాగ స్తత్సాధనం చ కార్యమేవ.**

ప ॥ న- తత్ సిద్ధౌ - లోకవ్యవహారః - హేయః - కిం - తు - ఫలత్యాగః - తత్ సాధనం - చ - కార్యం - ఏవ

టీక ॥ ఒకవేళ, తత్ = అనన్యమైన భక్తి, సిద్ధౌ = గలిగినను, లోకవ్యవహారః = వేదవిహిత ధర్మయుక్త వ్యవహారము, న హేయః = హేయమని తలంచరాదు, కిం తు = అయితే, ఫలత్యాగః = ఫలాపేక్షనుత్యజించి చేయవలయును తత్సాధనం చ= భగవదనుగ్రహమునకు పాత్రమగునట్టి సాధనమును, కార్యమేవ = ఆచరించదగినదే

తా ॥ ఒకవేళ పరమేశ్వరుని కృపచే భక్తి గలిగినను లోకోపకారమునకు సంబంధించిన కార్యము చేయుట హేయమని తలంచరాదు అయితే ఫలాపేక్షను త్యజించి చేయవలయును భగవదనుగ్రహమునకు పాత్రమగునట్టి యుత్తమ కార్యమును లోకమునకు మార్గదర్శక మగునట్లు చేయుచుండవలయును

వి ॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ (3-21)

దీనియర్థము ఇదివరలో వ్రాయబడినదే

*సక్తాః కర్మణ్యవిద్వాంసో యధా కుర్వన్తి భారత ।*
*కుర్యా ద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥* (3-25)

ఓయర్జునా ! అజ్ఞానులు కర్మమునందు ఫలాసక్తిగలవారై , ఎట్లు కర్మమును ఆచరించుచున్నారో, ఆలాగున ఆత్మజ్ఞానమున్ను, భగవద్భక్తి యున్ను గలిగినవాడు

ఫలాసక్తి లేనివాడై, లోకమునకు మార్గదర్శకుడై చేయవలయును ఏలన పుణ్యకర్మచే భగవత్కారుణ గలిగియే భక్తిగాని, జ్ఞానముగాని సిద్ధించును ఒకవేళ నొకనికి జన్మములో సత్కర్మమున్ను, భగవదుపాసనయున్ను లేకనే, జ్ఞానము సిద్ధించెనేని అది తాను పూర్వజన్మములో జేసిన పుణ్య విశేషముచేతను, భగవదనుగ్రహముచేతను గలిగిదనియే తలంచవలెను ఏలన భగవంతుడు పక్షపాతరహితుడు అట్లుండగా కోటాను కోట్ల జనులను నజ్ఞానులగాను, తన్ను జ్ఞానిగాను చేయుట పొసగదు కావున తనయొక్క పూర్వపుణ్యవిశేషము వల్లనే జ్ఞానము గలిగినదని తలంచి, ఇతర జనులు జ్ఞానవంతులై మోక్షమును బొందవలసి యుండిన, సత్కర్మము, భగవద్భక్తి తప్పక చేయవలయునని తలంచి చేయించవలయును

*యది హ్యాహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।*
*మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః ॥* (3-23)

ఓయర్జునా ! నేను శ్రీవైకుంఠ సుఖమును వదలి రామకృష్ణాద్య వతారములనెత్తి కర్మమునందొకప్పుడైనను, నన్నివిధములచేత సోమరితనము లేనివాడనై, జాగరూకుడనై ప్రవర్తింపనియెడల ఈజనము తరింప జాలదు ఏలన జనము నాయొక్క మార్గముసే అవలంబించును అందువల్ల నేను కర్మపరుడను గానిచో, లోకము భ్రష్టత్వము నొందును

*జ్ఞానలభ్యం పరం మోక్షం ప్రాహుస్తత్త్వార్థ చిన్తకాః ।*
*త ద్జ్ఞానం భక్తి మూలం చ భక్తిః కర్మవతాం తథా ॥*

వేదార్థత త్త్వమెఱింగిన మహనీయులు, మోక్షము జ్ఞానము వలననే గలుగునని చెప్పిరి అట్టి జ్ఞానము భక్తివల్లను, అట్టి భక్తి నిష్కామకర్మము వల్లను గలుగునని వచించిరి

## 63. సూ ॥ స్త్రీ ధన నాస్తికచరిత్రం న శ్రవణీయమ్ ।

పద ॥ స్త్రీధన నాస్తికచరిత్రం - న- శ్రవణీయమ్

టీక ॥ స్త్రీధన నాస్తిక చరిత్రం = స్త్రీ- స్త్రీలయొక్కయు, ధన = ధనము యొక్కయు, నాస్తిక = నాస్తికులయొక్కయు, చరిత్రం = చారిత్రము, భగవద్భక్తులైన వారు, న శ్రవణీయమ్ = వినందగదు

తా ॥ భగవద్భక్తులు, వైరాగ్యపురుషులు, స్త్రీ, ధన, నాస్తికుల యొక్క చరిత్రమును వినరాదు ఏలన నీమూడున్ను ప్రపంచవ్యామోహములను,

గలుగజేయునవి యగుటచేతను, భక్తిజ్ఞాన వైరాగ్యములను చెరుచున వగుటచేతను అట్టి చరిత్రములను వినుటగాని, అట్టి వారిసహవాసములను చేయుటగాని మంచిది గాదు స్త్రీలని చెప్పుటచే, కామినీ స్త్రీలను గ్రహించవలెనే గాని, పుణ్య స్వభావముగల నారీమణులను గ్రహించరాదు ఆలాగున కాముక పురుషులను స్త్రీలు గూడ త్యజించందగినది

వి ॥ నారీస్తన భరనాభీ దేశం దృష్ట్వా మాగా మోహావేశమ్।
ఏతన్మాంసవసాది వికారం మనసి విచింతయ వారం వారమ్ ॥

దీని యర్థము సుగమము

*అర్థమనర్థం భావయ నిత్యం నాస్తి తతస్సుఖ లేశస్సత్యమ్।*
*పుత్రాదపి ధనభాజాం భీతిః సర్వత్రైషా విహితా రీతిః ॥*

దీని యర్థము సులభము మరియు నాస్తికులగురించి శాస్త్రము చెప్పినది జూడుడు

*న వందనీయాస్తే కష్టం దర్శనాద్భ్రాన్తికారకాః।*
*వర్జయేత్తాన్ గురూన్ దూరే ధీరస్య తు సమాశ్రయేత్ ॥''*

దైవనిందితులు, ధర్మదూరులు, నాస్తికులనంబడుదురు వారు వందనీయులు గారు వారిదర్శనముచేతను, వాక్కుచేతను, మనోభ్రాంతి గలుగును, అనగా వారు మనోభ్రాంతిని గలుగజేయుదురు అట్లు నాస్తికులను ధర్మదూరులను, దూరముగా నుపేక్షించి, భగవద్భక్తియు, ధర్మనిరతియు గల మహనీయుల నాశ్రయించి జ్ఞానమును బొందవలయును పైజెప్పిన వారి జీవితము మరణానంతరము మహాకష్టముతో గూడినది

*పాషణ్డినః పాపరతా నాస్తికా భేదబుద్ధయః।*
*స్త్రీలంపటా దురాచారాః కృతఘ్నా బకవృత్తయః ॥*

మరియు పాషణ్డులు, పాపరతులు, నాస్తికులు, భేదబుద్ధి గలవారు, స్త్రీలంపటులు, దురాచారులు, కృతఘ్నులు, కొంగధ్యానము గలవారు వీరందరున్ను త్యాజ్యులు

*అభక్తే వంచకే ధూర్తే పాషండే నాస్తికాదిషు ॥*
*మనసాఽపి న వక్తవ్యా గురుగీతా కదాచన ॥*

భగవద్భక్తి లేనివారికి, వంచకునికి, ధూర్తునికి, పాషండునికి, నాస్తికునికి, దివ్యమగు దైవజ్ఞానమును జెప్పుటకు మనసా నైవను తలంచరాదని ఈశ్వరుండు గురుగీతయం దుపదేశించెను

## 64. సూ ॥ అభిమానదంభాదికం త్యాజ్యమ్ .

పద ॥ అభిమానదంభాదికం - త్యాజ్యమ్

టీక ॥ అభిమానదంభాదికం - అభిమాన = అభిమానము, దంభ = డాంభికత్వము, ఆదికం = మొదలగునది, త్యాజ్యం = త్యజింప దగినది

తా ॥ భగవద్భక్తి గలవాడు, అభిమానము అనగా జాతిచేతను, పాండిత్యముచేతను, తాను గొప్పవాడను గల తలంపును, డాంభికత్వము మొదలగు డంభాచారములను విడువవలయును ఇవి అసురగుణములు

వి ॥ *దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ।*
*అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్ ॥* (16-4)

ఓయర్జునా ! అసుర గుణమునందు బుట్టిన వారికి దంభము, గర్వము, దురభిమానము, క్రోధమున్ను, పరుషవాక్యమున్ను, అజ్ఞానమున్ను గలుగుచున్నవి ఇట్టి గుణము గలవారి గతి యెట్టిదో క్రింది శ్లోకము నిరూపించుచున్నది -

**దైవీ సంపద్వి మోక్షాయ నిబన్ధాయాఽ సురీ మతా ।** (16-5)

సత్యము, శాంతము, దయ, భక్తి మొదలగుదైవగుణము లతో బుట్టిన వాడు దైవమును అనగా మోక్షమును బొందును రాగ, ద్వేష, కామ, క్రోధ, దంభాసూయాద్య సురగుణములతో గూడిన వాడు నరకమును బొందును అనగా సంసారమందు గట్టిగా బద్ధుడగును

*ప్రవృత్తిం చ నివృత్తించ జనా విదురాసురాః ।*
*న శౌచం నాపి చాఽచారో న సత్యం తేషు విద్యతే ॥* (16-7)

అసుర గుణములతో బుట్టినవారు ప్రవృత్తి మార్గమును గాని, నివృత్తి మార్గమునుగాని ఎఱుంగజాలరు వారియందు బాహ్యాభ్యన్తర శుద్ధియు, సదాచారము,

సత్యమున్ను ఉండదు అదే వారియొక్క గురుతు ప్రవృత్తి మార్గమనగా నేది చేయవచ్చునో, నివృత్తిమార్గమనగా నేది చేయకూడదో ఈరెండుమార్గములు వారికి తెలియవు

## 65. సూ ॥ తదర్పితాఖిలా చారస్సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్.

పద ॥ తర్పితాఖిలాచారః - సన్ - కామక్రోధాభి మానాదికం - తస్మిన్- ఏవ - కరణీయమ్

టీక ॥ భక్తుడు, తదర్పితాఖిలాచారస్సన్ = తదర్పిత = భగవంతునియందు సమర్పించిన, అఖిలాచారస్సన్ = సమస్త కర్మములు గలవాడై, కామక్రోధాభిమానాదికం = కోరిక, కోపము, దురహంకారము, అదిగాగల అన్ని దుర్గుణములను, తస్మినేవ = ఆభగవంతుని యందే, కరణీయం = లయింప జేయవలయును

తా ॥ భగవద్భక్తుడు భగవంతునియం దర్పింపబడిన సమస్త కర్మలను గలవాడై కామక్రోధాది సకల దుర్గుణములను త్యజించ వలయును ఒకవేళ త్యజింప జాలనిచో, ఆకామ క్రోధాభిమానములను ఆభగవంతునియందే చేయవలయును

వి ॥ కామముచే గోపికలును, క్రోధముచే రావణాదులును, అభిమానముచే శిశుపాలాదులున్ను తరించిరి గోపికాస్త్రీలు భగవంతునియందు కామపరవశులై రేగాని మానవులయందు పరవశులుగాలేదు రావణాదులు, సామాన్యమనుష్యులలో కోపమును చూపలేదు భగవంగతుడగు శ్రీరామునియందే చూపిరి శిశుపాలుడున్ను తన గర్వమునుమానవుల యందు జూపలేదు శ్రీకృష్ణభగవానుని యందే జూపెను అట్టి స్వభావము ఉత్తమ పౌరుషమైనదేగాని, దీనులపై అల్పులపై జూపే పౌరుషము నీచమైనది

మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః। (12-14)

నాయందర్పింప బడిన మనస్సున్ను, బుద్ధియున్ను, కర్మయున్ను, గలవాడెవడో వాడు నాకు చాల ప్రీతి గలవాడు వాడు నన్నే పొందగలుగును ముకుందమాల దెలిపినది జూడుడు

హేమర్త్యాః ! పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపత
స్సంసారార్ణవ మాపదూర్మి బహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః।

నానాజ్ఞాన మపాస్య చేతసి ''నమో నారాయణా'' యే త్యముం
మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥

సంసార సాగరము దాటరానిది అందు పలుమారు సంభవించునట్టి యాపదలు, సముద్రమునందు మీద మీద వచ్చు నలల వంటివి దీనినుండి తప్పించుట కుపాయమేది యనగా నానావిధములైన యజ్ఞాన ప్రవృత్తులను మాని ''నమో నారాయణాయ'' అను మంత్రమును ప్రణవముతో చేర్చి ఆవృత్తి జేయుచుండుటయే సంసారసముద్రమును తరింప జేయునదిగా నుంటున్నది

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా యత్ప్రకృతేస్స్వభావాత్ ।
కరోమి యద్యత్స కలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

మనోవాక్కాయములచేతను, ఇంద్రియములచేతు, బుద్ధిచేతను, ప్రకృతి స్వభావమువల్లను, నేను ఏ యే కర్మలను జేయుచున్నానో, అవన్నియు పరమాత్ముడగు శ్రీమన్నారాయణమూర్తికి సమర్పించుచున్నాను ఇది విష్ణుపరమైన సమర్పణము ఇక శివపరమైన సమర్పణ మొకటి గలదు

**కరచరణ కృతం వాక్కాయజం కర్మజం వా**
**శ్రవణ నయనజం వా మానసం వాఽపరాధమ్ ।**
**విహిత మవిహితం వా సర్వమేతత్క్షమస్వ**
**జయ జయ కరుణాబ్ధే ! శ్రీమహాదేవ ! శంభో ॥**

ఓ శ్రీమహాదేవా! శంభో ! నాకరముచేతను, చరణము చేతను చేయబడినదిన్ని, వాక్కుచేతను, కాయముచేతను చేయబడినదిన్ని ఏకర్మమైతే గలదో శ్రవణముచేతను, నయనముచేతను, మానసముచేతను, చేయబడిన యపరాధమేదిగలదో అదిన్ని, విధియుక్తముగాను, విధినిషిద్ధముగాను జేయబడిన కర్మమేది గలదో, అదంతయు కరుణాసాగరా! క్షమింపుమా ! నీకెల్లప్పుడున్ను జయము గలుగుగాక !

**66. సూ ॥ త్రిరూప భంగ పూర్వకం నిత్య దాస్య నిత్య కాన్తాభజనాత్మకం ప్రేమ కార్యం ప్రేమైవ కార్యమ్.**

సూ ॥ త్రిరూప భంగపూర్వకం నిత్య దాస్య నిత్యకాన్తా భజనాత్మకం - ప్రేమ-కార్యం- ప్రేమ - ఏవ - కార్యమ్

టీక ॥ త్రిరూప భంగపూర్వకం = భక్తుడు, భక్తి, భజింపంబడునది, అను త్రిపుటి నతిక్రమించిన, నిత్యదాస్య = నిత్యమైన భగవంతుని సేవించుటయు, నిత్యకాన్తా భజనాత్మకం = ఎల్లప్పుడున్ను పతివ్రతా స్త్రీ పతినిసేవించునట్లు, ప్రేమకార్యం= ప్రీతిని జేయుము, ప్రేమైవ కార్యం = అట్టి ప్రేమనే జేయవలయును, '' ఏవ'' అని ప్రయోగించుటవలన నట్టి ప్రేమైక రూప భక్తియే భగవత్ప్రాప్తికి సాధనము గాని మరియొక విధము గాదు

తా ॥ భక్తుడు, భక్తి, భజింపంబడు భగవంతుడు అను త్రిపుటి రహితమైన నిత్యుడగు భగవంతుని సేవించునట్లు ప్రీతిని జేయుము అట్టి ప్రీతి పూర్వకమైన ప్రేమను గలిగియుండుము '' ఏవ'' అని ప్రయోగించుటవలన అట్టి ప్రేమైక రూపభక్తియే భగవత్ప్రాప్తికి సాధనము గాని మరియొకవిధము గాదు

వి ॥ 1 భక్తుడు, భక్తి, భజింపంబడు భగవంతుడు 2 ప్రేమించు వాడు, ప్రేమ, ప్రేమింపంబడు భగవంతుడు 3 జ్ఞాత, జ్ఞానం, జ్ఞేయం 4 ద్రష్ట (జీవుడు) దర్శనము, దృశ్యము 5 ధ్యాత, ధ్యానము, ధ్యేయము ఈలాటివన్నియు త్రిపుటులని చెప్పబడును ఇట్టి భేదమును గలిగియుండు వరకు నేకత్వము గలుగదు అనగా, జీవేశ్వరుల ఐక్యము సిద్ధింపదు ఇది సిద్ధించుటకు ఈసూత్రమున జెప్పిన ''ప్రేమైవ కార్యమ్'' నిరతిశయ ప్రేమతో నిర్విషయ ప్రేమతో భగవంతుని ప్రేమించుటయే మోక్షమునకుపాయము వేరు విధములేదు పతిప్రేమ సతికి గలుగవలసియుండిన నకలంక, అకుటిల ప్రేమ పతియందుండవలయును అప్పుడే సతిని, పతి పూర్ణముగా ప్రేమించును, విశ్వసించును అత్తరి భార్యయొక్క సర్వకార్యములు భర్తయే చూచుచుండును అంతేకాదు అత్తరి భార్యభర్తల ఆత్మలు భిన్నముగా నుండవు ఏక రూపముగానే యుండును అట్టి భక్తియే నిజమైన ప్రేమ యగును అట్టి ప్రేమైక రూప భక్తివల్లనే జీవులు భగవదైక్యము, భగవత్తాదాత్మ్యము బొందగలుగుదురు ఇది త్రిపుటి రహితమైన అతీతావస్థ యగును ఇది సామాన్య మైనది గాదు మూడు గుణములు, మూడవస్థలు, మూడు దేహములు దాటువారికే గలుగును

ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థమహం స చ మమ ప్రియః ॥ (గీ-7-17)

జ్ఞానియగువానికి, నే మిక్కిలి ప్రియుడను ఆజ్ఞానియును నాకు మిక్కిలి ప్రియుడు ''జ్ఞానీత్వా త్మైవ మేమతమ్''

అట్టి జ్ఞాని యన్ననో నాయొక్క స్వరూపమే(నేను) అని నాయొక్క మతము కావుననే ''మే మతమ్'' అని భగవంతుడు స్వయముగ తెలిపెను ఇట్టి తన్మయత్వము, తదేకత్వము గలుగుట సామాన్యమైనది గాదని నిరూపించ బడుచున్నది

*బహూనాం జన్మనామ న్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।*
*వాసుదేవస్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః ॥*

దీని యర్థమిదివరలో వ్రాయబడినదే ''వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః'' ఈజాగ్జీవేశ్వర ఏకత్వము సామాన్య స్థితి గాదనియు, అట్టి వారిని దుర్లభుడని జెప్పక 'సుదుర్లభః' మిక్కిలి దుర్లభుడనియు శ్రీభగవంతుడే స్వయముగా జెప్పెను

*ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।*
*అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ॥ (6-45)*

పట్టుదలతో అనుష్ఠానము జేయుచున్న ధ్యానయోగి, అనేక జన్మములలో జేయుచుండు భక్తి, ధ్యాన, యోగాదులచే పరిశుద్ధాత్ముడై ఆత్మసాక్షాత్కారమును జీవేశ్వరైక్యమును, త్రిపుటి రహితమగు నేకత్వమును పొందుచున్నాడు ఎన్నియో జన్మములలో చేసిన భక్తి వల్లనే సాలోక్యమున్ను, మరలబహుకాలము జేసిన భక్తివల్ల సామీప్యమున్ను, మరికొంత కాలము జేసిన ధ్యాన జ్ఞానములచే సారూప్యమున్ను నీమూడింటి వలన సంపూర్ణముగ ప్రకృతి నశించినప్పుడు సాయుజ్యమున్ను గలుగునని శాస్త్రముద్ఘోషించు చున్నది ఈవిషయమై శివానందలహరిలో శ్రీశంకరులు దెలిపినది జూడుడు

సారూప్యం తవ పూజనే శివమహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషణే ।
సాలోక్యం చ చరాచరాత్మక తనుధ్యానే భవానీ పతే
సాయుజ్యం మమ సిద్ధమత్ర భవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్ ॥

ఓసర్వేశ్వరా ! నీయొక్క పూజచే సమాన రూపభావ మగుచున్నది శివనామస్మరణ సదా జేయుటవలన మీ సమీపమందుండు నట్లగుచున్నది శివభక్తులతో గూడి సంభాషించుటచేతను, వారితో బ్రహ్మ విచారము చేయుటచేతను మీలోకమున నుండుటయు గలుగుచున్నది ఓయీశ్వరా! స్థావర జంగమాత్మకమైనట్టి నీ స్వరూపము ధ్యానముచేయబడగా, నాకీజన్మయందే సాయుజ్యముక్తి సిద్ధమగుచున్నది అందువల్లనే కృతార్థుడనైతిని ఈశ్లోకమునందు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులను వరుసగా జెప్పక దేనివల్లనేది గలుగుచుండునో ఆప్రకారముగా జెప్పిపోవడమైనది గీ అ 14 ఈవిషయమునే భగవానుడున్ను గీతలో నుపదేశించెను -

*ఇదం జ్ఞానము పాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।*
*సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥* (14-2)

ఈత్రిగుణ రహితమగు జ్ఞానమును బొందిన వారు నాసమాన స్థితిగలవారై మరల జన్మించరు దేహావసానకాలమున దుఃఖింపరు ఆత్మజ్ఞానముచే గలిగిన ప్రయోజనమిది అట్టి జ్ఞానమును బొందక పోయిన జనన మరణ దుఃఖములతో సంకట పడవలసి యుందురు ఈజ్ఞానముయొక్క ప్రభావమును క్రింది శ్లోకము నిరూపించుచున్నది

*పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।*
*యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥* (14-1)

మునులందరున్ను, పరమభక్తులందరున్ను, యోగపురుషులం దరున్ను, తాపసోత్తములందరున్ను, వేదాంతులందరున్ను త్రిగుణాతీత మగు జ్ఞానమునెఱింగి, సర్వోత్కృష్టమగు మోక్షమును బొందిరి ''జ్ఞానానాం జ్ఞానము త్తమమ్'' ఇది జ్ఞానములన్నిటిలోను ఉత్తమోత్తమమైన జ్ఞానమని భగవానుడుపదేశించెను మఱియు ''మునయస్సర్వే'' మునులందరున్ను అని గూడ ప్రయోగించిరి

*వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।*
*బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥* (4-10)

అనేకులు జ్ఞానమనెడి తపస్సుచేత పోగొట్టబడిన రాగభయక్రోధములు గలవారై పరిశుద్ధాత్ములై నన్ను ఆశ్రయించిన వారై నాయొక్క స్వరూప స్థితిగలవారగుచు

నాభావమును పొందినవారైరి ''మన్మయాః'' అని ప్రయోగించుటచే భగవత్స్వరూపులైరని స్పష్టముగ తెల్పడమైనది ''జ్ఞానతపసా'' అని ప్రయోగించుటచే, కర్మ తపస్సు కాదని గ్రహింప వలయును

*న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।*
*తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥ (4-38)*

ఈలోకమున జ్ఞానముతో సదృశమైనదియు, పావనమైనదియు మరి యొకటి లేదు అట్టి జ్ఞానమును యోగాద్యనుష్ఠానముచే శుద్ధుడైన తన యాత్మలోనే స్వయముగ పొందుచున్నాడు

*కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।*
*కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో విశిష్యతే ॥*

ఈశ్రుతి వాక్యము ఎంత యధార్థమును తెలిపినదో చూడుడు మలినోపాధితో గూడిన వాడు జీవుడనియు,, మయోపాధితో గూడిన వాడు ఈశ్వరుడనియు, ఈకార్యకారణోపాధుల రెంటిని తొలగించునపుడు పూర్ణబ్రహ్మైక్య బోధము మిగులుననియు తెలియదగినది ఇదియే ఉపాధిద్వయ రహిత భగవద్జ్ఞానమని నారదులు బోధించినది ముణ్డకశ్రుతియు దీనినే బోధించుచున్నది

**యథా నద్యస్స్యందమానాస్సముద్రే అస్తంగచ్ఛంతి నామరూపే విహాయ।**
**తథా విద్వాన్ నామ రూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥**

ఏప్రకారముగ ప్రవహించుచున్న నదులు సముద్రమునందు నామరూపములు విడిచి, లయమొందుచున్నవో, ఆప్రకారముగనే బ్రహ్మవేత్త, నామరూపములనుండి విడువబడిన వాడై శ్రేష్ఠమైన పరాప్రకృతికంటె, వేరైన బ్రహ్మమును బొందుచున్నాడు పరాప్రకృతి ఈశ్వరోపాధియనియు, అపరాకృతి జీవోపాధి యనియు గ్రహించుకొన వలయును

*భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః ।*
*క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే ॥*

పరాప్రకృతికంటె శ్రేష్ఠమయిన, యాశుద్ధబ్రహ్మము, దర్శనమగుచుండ హృదయమునకు సంబంధించిన సంకల్పాత్మకమైన ముడి భేదింప బడుచున్నది సంశయములన్నియు ఛేదింపబడుచున్నవి బ్రహ్మావలోకన మొనర్చు నీతని యొక్క కర్మలన్నియు నశించుచున్నవి వృక్షమునకు వేళ్లవలె, ఆత్మకు అనాత్మవస్తువులతో గల సంబంధమే బంధము ఇది హృదయ గ్రంధి యనబడును

*ధ్యాతృ ధ్యానే పరిత్యజ్య నివాతస్థిత దీపవత్।*
*ధ్యేయైక గోచరం చిత్తం సమాధిరభిధీయతే॥*

ధ్యానము, ధ్యాత యనువృత్తి లేక, ధ్యేయమైన బ్రహ్మస్వరూప మొందిన చిత్తమే సమాధి భ్రమరకీట న్యాయమున ధ్యానింపగ ధ్యాతయే ధ్యేయాకారమగు బ్రహ్మాకారమొందును అదియే సమాధి యనంబడును ఇదే త్రిపుటి యొక్క రహస్యము



ఓమ్

# పఞ్చమోఽధ్యాయః - భక్తి మహిమా

# ఐదవ అధ్యాయము - భక్తి మహిమ

## 67. సూ ॥ భక్తా ఏకాన్తినో ముఖ్యాః.

పద ॥ భక్తాః - ఏకాన్తినః - ముఖ్యాః

టీక ॥ ఏకాన్తినః = ఏకాన్త వాసులగు, భక్తాః = భగవద్భక్తులు, ముఖ్యాః = ముఖ్యులు

తా ॥ భగవద్భక్తులలో నేకాంతస్థలములో నుండువారు శ్రేష్ఠులు

వి ॥ దీనియం దేకాంతవాసులగు భక్తులు శ్రేష్ఠులని తెలుపడమైనది ఏకాంతమనగా శరీరము నిర్జన ప్రదేశములో నుంచుటయని పూర్ణార్థము గాదు దేనికిన్ని స్థూలార్థ మనియు, సూక్ష్మార్థ మనియు రెండు విధముల అర్థములు గలవు ఆలాగున బాహ్యమనియు, ఆభ్యన్తరమనియు ద్వివిధార్థములు గలవు అది దేహమున్ను దేహివంటి దగును కావుననే శ్రుతి ఈలాగున దెలుపుచున్నది

*ఏకమేవాద్వితీయం యద్గురోర్వాక్యేన నిశ్చితమ్ ।*
*ఏతదేకాన్తమిత్యుక్తం న మఠో న వనాన్తరమ్ ॥*

గురుదేవునిచేతను, శాస్త్రముచేతను '' ఏకమేవాద్వితీయమ్'' ఆసద్వస్తువగు బ్రహ్మము( ఈశ్వరుడు) ఒకటియే గాని రెండవది లేదని గ్రహింపబడు ఆత్మలోగల యనుభవమే యేకాంతమగును అట్టి యవస్థను తనలో బొందక ఏకాంతప్రదేశమునగాని, మఠమునగాని, ఆశ్రమమున గాని నొంటరిగా యుండుటమాత్ర మేకాంతము గాదు అయితే అట్టి యేకైకనిష్ఠ గలుగుటకు నేకాంతప్రదేశము కొంత యనుకూలపడును భగవంతునియం దేకాగ్రచిత్తము గలిగి, రెండవతలం పేదియు లేని స్థితియే ఏకాంతమగును ఏకాంత ప్రదేశ మందుండినను తన హృదయమున నెన్ని సంకల్పములుండునో, అంత మంది జనులతో తాను గూడినట్లే తలంచ వలయును ఊరిలోనుండి నను రెండవ సంకల్పములేక భగవద్ధ్యానపరుడై యుండినచో, యథార్థముగా

నతడేకాంత మందుండు వాడే యగును ఏకాంత ప్రదేశములో నుండియు హృదయములో ననేక సంకల్పములుండిన అతడు గ్రామమధ్యములో యుండువాడే యగును

*ఆదావంతే చ మధ్యే చ జనో యస్మిన్న విద్యతే ।*
*యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనః స్మృతః ॥*

ఇది శ్రుతివాక్యము దీనికి సరియైన సీతారామాంజనేయ మునగల పద్యముల జూడనగును

మొదల నడుమను జివరనే మూలజూడ
నెవడు నుండని చోటెద్ది యేది విశ్వ
మంతటను నిండియుండు నిరంతరంబు
నదియె విజనస్థలంబని యార్యమతము

ధీరులచేతనే దేశమాచార్యో ప
దేశంబు చే నర్థి తెలియబడియె
పరమ పవిత్రమై భాసిల్లు నేదేశ
మే దేశమున్నింటి కెక్కుడయ్యె
నేదేశమురుమాన సేంద్రియ ప్రాణాది
సంచార శూన్య మై సమత నొప్పు
నేదేశమున సాధ్వసేచ్ఛా మదక్రోధ
దుఃఖ గంధలవంబు దోపకుండు

గరము నిరుపద్రవంబు నిష్కంటకంబు
నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు
దివ్యమానంద మగుచునే దేశమలరు
నదియె యేకాంతదేశమౌ నాంజనేయ !

*న తత్సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।*
*యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥*

ఏకాంత ప్రదేశమందుండు వాడై, రాగరహితుడై, మౌనశీలుడై ( మననము చేయు) తదేకనిష్ఠగలవానికి ఏయొక్క భగవద్ధ్యానానందము సుఖము గలదో అట్టి

దైవసుఖము దేవేంద్రునికిగాని, చక్రవర్తులకు గాని కలుగదు కావుననే ఏకాంతమందుండు భక్తులు శ్రేష్ఠులని శ్రీనారదులు దెలుపుటకు గారణమైనది ఏకాంత మందుండు వాడైనను, గ్రామమందుండు వాడైనను, భక్తి , జ్ఞాన, వైరాగ్య, కరుణాదులు అందరికిన్ని సమానముగనే యుండవలయును లేనిచో మోక్షమెవ్వరికిన్ని గలుగదు ఎట్లన నొకడు క్షీరాన్నము వండుటకొఱకు గాలిలేని ప్రదేశమేర్పాటు జేసెను మరియొకడు గాలిగల స్థలములో స్థలమేర్పరచెను క్షీరాన్నమునకు దగిన పాలు, చక్కెర, సగ్గుబియ్యము, ద్రాక్ష, జీడిపప్పు, ఏలకులు నుభయులకు సమానముగ నుండిన మాత్రమే హృద్యముగా నుండును దానియందు గొరతెవ్వరికిన్ని ఉండరాదు అయితే గాలిబాధ లేని స్థలములోత్వరలో పచనము పూర్తి యగును ఎక్కువగాలి ప్రదేశమైనచో చాల సమయము పట్టును అంతియ భేదము, ఆలాగున బ్రాహ్మణుడైనను, అబ్రాహ్మణుడైనను, స్త్రీయైనను, పురుషుడైనను దైవజ్ఞానామృతమును భుజించి మోక్షతృప్తిని బొందవలసియుండిన, సర్వులకున్ను శమదమాది గుణములు సమానముగ నుండవలయును వివేక చూడామణియందు శంకరులు జెప్పినది జూడుడు

*మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్య భూమిషు ।*
*చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః ॥*

ఈప్రపంచమనెడు ఇంద్రియ విషయములను నరణ్యములలో మనస్సను బెబ్బులి దిరుగాడుచున్నది కావున మోక్షేచ్ఛ గల సాధుజనులారా! మీరా విషయకానన సీమలోనికి బోకుందురుగాక ! ఏకాన్తస్థానములను గురించి కుల్పార్ణవ మందు తెలిపినది చూడదగును

**పుణ్యక్షేత్రం నదీతీరం గుహాపర్వత మస్తకమ్ ।**
**తీర్థ ప్రదేశాః సింధూనాం సంగమః పావనం వనమ్ ॥**

**ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటం గిరేః ।**
**దేవతాయతనం కూలం సముద్రస్య నిజం గృహమ్ ॥**

**సాధనేషు ప్రశస్తాని స్థానాన్యేతాని మంత్రిణః ।**
**అథవా నివసేత్తత్ర యత్ర చిత్తం ప్రసీదతి ॥**

పుణ్యక్షేత్రము, నదీతీరము, పర్వతగుహ, పర్వతోపరిభాగము, పుణ్యతీర్థ ప్రదేవములు, నదుల సముద్రసంగమ ప్రదేశము, పవిత్రవనము, నిర్జన ప్రదేశములగు,

ఉద్యానవనములు, మారేడుచెట్టు మూలము, పర్వతముల యొక్క సానుప్రదేశము, సాత్త్విక పూజగల దేవాలయము, సముద్రతీరము, అనుకూలమైనచో స్వగృహము, సాధనానుష్ఠానములకు పైజెప్పిన స్థానములు ప్రశస్తములు, దివ్యమంత్ర జపములకున్ను ఈస్థానములు యోగ్యములు పైజెప్పిన స్థానములేగాక ఏ యే ప్రదేశమున మనస్సున శాంతియు, ప్రసన్నతయు, తన కనుకూలమున్ను గలుగునో ఆయాస్థలములలో నుండి ధ్యానజపాద్య నుష్ఠానములు చేసుకొనవచ్చును

## 68. సూ ॥ కణ్ఠావరోధ రోమాఞ్చాశ్రుభిః పరస్పరం లపమానాః పావయన్తి కులాని పృధివీం చ.

ప ॥ కణ్ఠావరోధ రోమాఞ్చాశ్రుభిః - పరస్పరం - లపమానాః - పావయన్తి- కులాని- పృధివీం - చ

టీక ॥ పరమ భక్తుల లక్షణము, పరస్పరం = ఒకరినొకరు, కణ్ఠావరోధరోమాఞ్చాశ్రుభిః = గద్గదస్వరముతో పులకాంకిత గాత్రులై ఆనందభాష్పములచే, లపమానాః = భగవద్భక్తిని గూర్చి సంభాషించుకొనుచు, కులాని = వంశములను, పృధివీంచ = లోకమును, పావయన్తి = పవిత్రమొనర్చుచున్నారు

తా ॥ పరమ భక్తులొకరికొకరు గద్గద స్వరముతో పులకాంకిత గాత్రులై ఆనంద బాష్పములు గలవారై భగవద్భక్తిని గురించి సంభాషించుకొనుచు లోకమును వంశమును పావనమొనర్చుచున్నారు

వి ॥ పరమ భక్తులకిట్టి లక్షణము గలిగియుండును భగవద్భక్తి విషయమై వారు మాట్లాడునప్పుడుగాని, ఇతరులు జెప్పునప్పుడుగాని, 1 గద్గదస్వరము 2 గగుర్పాటు, 3 ఆనందబాష్పములు గలిగియుండును వారులోక వ్యవహారసంబంధమైన వ్యర్థపుమాటలుచ్చరింపక భగవత్కల్యాణ గుణములను మాత్రమే భాషింతురు గీతలో భగవానుడు దెలిపినది జూడుడు

**మచ్చిత్తా మద్గతః ప్రాణా బోధయన్తః పరస్పరమ్।**
**కథయ న్తశ్చ మాంనిత్యం తుష్యన్తి చరమన్తి చ ॥ (10-9)**

దీనియర్థమిదివరలో వ్రాయబడి యుండెను

*కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వం భరా పుణ్యవతీ చ తేన ।*
*అపార సచ్చిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః ॥*

ఏవంశమందు పరమభక్తుడు జన్మించునో, అట్టివారి వంశము పావనమగును తల్లి ధన్యురాలగును ఆమహాత్ముని వలన భూమి పుణ్యవంతమగును లపారమగు సచ్చిదానంద సాగరములో నెవనియొక్క మనసు లీనమగునో అట్టి మహాత్ముని వలన పైజెప్పిన పవిత్రములన్నియు జరుగును

*యస్య గేహం సముద్దిశ్య జ్ఞానీ గచ్ఛతి సువ్రత ।*
*తస్య క్రీడన్తి పితరో యాస్యామః పరమాం గతిమ్ ॥*

ఓపవిత్రమైన వ్రతముగలవాడా ! ఏగృహమును గురించి ఆత్మజ్ఞాని వెళ్లునో, ఆమహాత్ముడు గృహస్థుని గృహావరణములో పాదము బెట్టినంతనే ఇదివరలోనుండు పితృదేవతలందరు నానందభరితులైనృత్యము జేసికొని పుణ్యలోకమును బొందుచున్నారు ఈప్రమాణము ననుసరించియే పైసూత్రమున నారదుడు ''పావయన్తి కులాని పృథివీం చ'' అని తెలుపుటకు గారణమైనది

**యన్మనీషి పదాంభోజ రజఃకణ పవిత్రితమ్।**
**తదేవ భవనం నోచేత్ భకార స్తత్ర లుప్యతే ॥**

ఏ మహాత్ముల పాదకమలరజః కణములు బడుటచే ఏ గృహము పవిత్రమగుచున్నదో ఆగృహమే భవనమగును గాని, అట్టి మహాత్ముల పాదధూళిచే పావనత బొందని గృహము భవనమను శబ్దమునందుగల భకారము లోపించిపోవుటవల్ల వనమే యగును భకారమునకు భవ్యమనియు, భాగ్యమనియు, భద్రమనియు పేరులు గలవు మహనీయాత్ముల పాదధూళిచేతను భవనమగును అదిలేనిది వనము అనగ అరణ్య సదృశమగును

**69. సూ॥ తీర్థీకుర్వన్తి తీర్థాని, సుకర్మీకుర్వన్తి కర్మాణి సచ్ఛాస్త్రీకుర్వన్తి శాస్త్రాణి.**

ప ॥ తీర్థీ కుర్వన్తి - తీర్థాని - సుకర్మీకుర్వన్తి - కర్మాణి - సచ్ఛాస్త్రీకుర్వన్తి- శాస్త్రాణి

టీక ॥ పరమ భక్తులు, తీర్థాని = తీర్థములను, తీర్థీకుర్వన్తి = పుణ్యతీర్థము లుగా జేయుచున్నారు, కర్మాణి = కర్మలను, సుకర్మీకుర్వన్తి = సత్కార్మలనుగా జేయుచున్నారు, శాస్త్రాణి = సామాన్య శాస్త్రములను, సచ్ఛాస్త్రీ కుర్వన్తి = సచ్ఛాస్త్రములనుగా జేయుచున్నారు

తా ॥ పరమ భక్తులు తీర్థములను పుణ్యతీర్థములనుగా జేయుచున్నారు కర్మలను సత్కార్మలనుగా నొనర్చుచున్నారు సామాన్య శాస్త్రములను సచ్ఛాస్త్రములనుగా జేయుచున్నారు

వి ॥ భగవదనుగ్రహమును బొందిన పరమభక్తులు సామాన్యమైన నీటిని పుణ్యతీర్థముగా జేయుదురు సామాన్యముగా దేవాలయములో నూతినుండిగాని, తటాకమునందుండిగాని, నదినుండిగాని తెచ్చెడు జలము మంత్రపూతముగా పవిత్రమొనర్చిన తరువాత అభిషేకాదుల నొనర్చి అందరికిన్ని తీర్థముగా నిచ్చుచున్నారు అంతవరకు మామూలు జలమే తరువాత తీర్థమయ్యెను ఆలాగున ననేక మహర్షులు తపమొనర్చి స్నాన సంధ్యాదులనొనర్చిన కారణముచే నాజలములన్నియు నిపుడు తీర్థముల పేరిట ప్రసిద్ధినొందుచున్నవి శ్రీతిరుపతి పర్వత మెక్కుటకు ముందుగా కపిలతీర్థమున స్నానమొనర్చెదరు అచ్చట కపిలుండు తపమొనర్చుటచే అది, కపిలతీర్థమను పేరు గాంచెను ఆలాగున తిరుమలపైన పాండవ తీర్థమనియు, జపాలతీర్థమనియు, సనకసనందన తీర్థమనియు ననేక దివ్యనామములతో తీర్థములు విరాజిల్లుచున్నవి ఆయాపేర్లతో ఆతీర్థములు ప్రసిద్ధికెక్కుటకు కారణమేమన - పాండవులు తపమొనర్చిన ప్రదేశమగుటచే పాండవతీర్థమనియు, జపాలముని తపమొనర్చుటచే జపాలతీర్థమనియు, సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు తపమొనర్చుటచే, ఆయాపేరులు వచ్చినవి ఆయాతీర్థములలో స్నానసంధ్యాదులొనర్చుటచే, ఆయా నామధేయములు గలిగినవి ఆలాగుననే శ్రీకాళహస్తిలో భరద్వాజ తీర్థము, శుకతీర్థము, మొదలగు తీర్థములు గలవు పైజెప్పిన రీతిగ భరద్వాజ, శుకాదులు తపమొనర్చిన జలస్థలములగుటచే మామూలు నీటికి తీర్థమని యభిధానము గలిగెను ఈలాగున శ్రీకాశి, రామేశ్వరాది పుణ్యప్రదేశములలో ఋషుల పేరులతో ననేక తీర్థములు గలవు అవి ఇపుడు జనుల

పాపములను బోగొట్టెడు పుణ్యతీర్థములై ప్రసిద్ధికి వచ్చినవి భగీరథుడు తపమొనర్చి తెచ్చినదగుటచే భాగీరథియనియు, గౌతముడు తపమొనర్చి తెచ్చినదగుటచే గౌతమి(గోదావరి) యనియు నామము లేర్పడినవి అవన్నియు పుణ్యతీర్థములైనవి ఆఋషుల తపః ప్రభావముల చేత ఆతీర్థములలో కర్మజీవుల పాపములు నశించవలయునని వారు సంకల్పించుటచేతను, లేక వారికి భగవత్సాక్షాత్కారము గలిగినప్పుడీ తీర్థము మనుష్యుల పాపములను నివారించ వలయును, అనిభగవంతుని వలన ఆశీర్వాదము బడసియుండుటచేతను తీర్థత్వము సిద్ధించెను ఆలాగున నొక్కొక్క దివ్యపురుషులు బుట్టునప్పుడా కాలపు జనులలో ననేక దురాచారములుండిన, అట్టి దుష్కర్మమును దొలగించి, వారు సత్కార్మలను జనులకుపదేశించి, పవిత్రులనుగా జేయుచుందురు శ్రీబుద్ధభగవానుని కాలమున పశుహింసా పరము లగు యజ్ఞములు బహుళముగా నుండెను గౌతమ బుద్ధుడా పాపకర్మలన్నిటిని దొలగించి జనులకు పుణ్యకర్మలను జీవకారుణ్యమును, ఆత్మజ్ఞానమును, నిర్వాణము నుపదేశించెను ఆలాగునే శ్రీశంకరాచార్యులవవతరించినప్పుడు ప్రపంచమంతటను కర్మకాండ జటిలమైయుండెను అది కర్మమే ప్రధానమను పూర్వ మీమాంసకుల కాలము, కుమారిల భట్టు, మండన మిశ్రుడు దానికాచార్యులై యుండిరి అట్టి కర్మలను నిరసన జేసి, శంకరులు పరమాద్వైతము బోధించి జనులను పావనులను గా నొనర్చిరి అప్పుడుగూడ కొంచెము కర్మము మిగిలి యుండెను శ్రీరామానుజ మధ్వాచార్య ప్రభృతులు పశుహింసాయజ్ఞము పాపమని తలంచి పిష్టపశువును నిర్మించి దానివలన యజ్ఞము నాచరించిరి వీరలలో శ్రీరామానుచార్యులు భగవదారాధనకు మించిన యజ్ఞము లేదని తెలిపి భక్తివల్లనే ముక్తి గలుగునని నిర్ణయించిరి ఆలాగున శ్రీకృష్ణచైతన్యులున్ను యజ్ఞాది కర్మలను దొలగించి భగవద్భక్తియే మోక్షమును కలుగజేయునని ప్రచారమొనర్చిరి ఆలాగున శ్రీయేసుక్రీస్తు జన్మించిన కాలమున జరీస్లేమున, నెన్నివిధములగు పాపకర్మములుండెనో, ఆలాగుననే శ్రీమహమ్మదువారు బుట్టినప్పుడు అరెబియా దేశమునెంత క్రూరకర్మములుండెనో, కాబా, నుందిరమున నెంత నీచకర్మ యుండెనో బైబుల్ చేతను, ఖురానుచేతను, దేశచరిత్రము చేతను తెలుసుకొనుచున్నాము ఈమధ్య జన్మించిన శ్రీగురునానక్, శ్రీరామ మోహన్ రాయ్, శ్రీదయానందసరస్వతి మొదలగు వారు ఈకాలములో ఆత్మజ్ఞానమార్గమున నుండిన అనేక దురాచారములను మాయమొనర్చి జనులకు నుపదేశించిరి నానక్ సిక్కుమతమును, రాంమోహన్ రాయ్ బ్రాహ్మ మతమును, దయానందసరస్వతి

ఆర్యమతమును స్థాపించిరి ఒక్కొక్క మహాత్ముడు జన్మించినప్పుడు లోకము నెంత పావనమొనర్చిరో అట్టి వారియొక్క జన్మమెంత పుణ్యమైనదో జనులు ఆలోచించుకొనవచ్చును ఆలాగున ఇక శాస్త్రవిషయమై చూడుడు శ్రీవ్యాసభగవానులు వేదములన్నిటిని విభాగపరచి సారమును దీసి బ్రహ్మసూత్రములను రచించిరి ఆలాగున పతంజలి ముని జన్మించి హఠయోగాది బహుళగ్రంథములలోనుండి మోక్షమునకు సుసాధ్యమగు యోగదర్శనమును నిర్మించిరి శ్రీనారద మహర్షియు, అన్నిశాస్త్రముల సారముగాను, సర్వజనులకు ముక్తికి సులభమగు నారదభక్తి సూత్రములను నిర్మించిరి ఆలాగున దయానంద సరస్వతి స్వామియు కల్పితములగు కపోల కథలన్నిటిని తొలగించి జనులనుష్ఠించి తరించులాగున ఆర్యమతము నందరికిన్ని ఉపదేశించెను వారందరు నీటిని తీర్థముగాను, అసత్కర్మలను సత్కర్మములగాను, దుష్టశాస్త్రముల సచ్ఛాస్త్రములగా నొనర్చలేదా! ఇదియే యీ సూత్రము యొక్క భావము, అయితే విమర్శకులు సచ్ఛాస్త్రముపై విశ్వాసము లేని వారు నొక శంక జేయుదురు అదేమన అసత్కర్మలను సత్కర్మములగాను దుష్టశాస్త్రముల శిష్టశాస్త్రములగాను నొనర్చుట సరి జలమును పుణ్యతీర్థముగా నొనర్చినది సత్యమైనచో అట్టి జలములో స్నానము చేసిన వారి పాపములెల్లను బోవలసినవిగదా ! అట్లు కనుపించుటలేదే ? కారణమేమి? దీనికి సరియైన సమాధానము శాస్త్రమున పరమర్షులు నిర్ణయించియున్నారు వివేక చూడామణి యందు జూడుడు

*పథ్య మౌషధ సేవా చ క్రియతే యేన రోగిణా ।*
*ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽ స్య నాన్యానుష్ఠిత కర్మణా ॥*

పథ్యము, ఔషధసేవయు నేరోగిచే జేయబడునో, వానికే ఆరోగ్య సిద్ధిగలుగును అట్లు గాక ఔషధ సేవ మాత్రము జేసి అపథ్యము చేసినచో రోగశాంతి ఎట్లు గాదో దీనివల్ల ఔషధమునకు ప్రభావములేదని చెప్పవచ్చునా ! మరియొక అర్థము తన రోగమునకు తానే ఔషదపథ్యములు గలిగియుండవలయును గాని మరియొకడు ఔషధ సేవ సలిపిన తన రోగము శమించదు గదా ! కావున తన భవరోగమునకు తానే బ్రహ్మవిచారము, శమదమాది గుణములను గలిగియుండవలయును తీర్థస్నానమొకటి మాత్రముగాక మూడు నకారములతో కూడియుండవలయునని శాస్త్రనిర్ణయము 1 స్నానము, 2 దానము, 3 ధ్యానము ఇవి మూడున్ను గలిగి యుండవలయును అప్పుడే పాపము నశించును మరియు తీర్థ స్నానమును చేయునప్పుడెంత పవిత్ర

ధర్మములతో గూడియుండవలెనో అలాగున జేసిన మాత్రమే పాపశాంతియు, పుణ్య ప్రాప్తియు, గలుగునని శాస్త్రము నిర్వచించుచున్నది దీపపు కాంతిచే చీకటి నశించునని ఒకరు వినియుండిన నట్టి దీపజ్యోతికి ప్రమిద, తైలము, వత్తి, గాలిలేని స్థలము నుండవలయును ఈనాలుగింటిలో నొక్కటిమాత్రము సంపాదించిన చీకటి ఎట్లు బోవును? అలాగున ఫలాని విరేచనా ఔషధముచే దుర్మల విముక్తి గలుగునని ఆయుర్వేదములో నొకడు చూచి కరక్కాయ మొదలగు నాలుగైదు ఓషధులచే చేయవలసిన వానిలో ఒకటి మాత్రము సంపాదించుకొనిన విరేచనమెట్లు గలుగును? కలుగదు గదా! అలాగున తీర్థస్నానమునకున్ను అనేక నియమములు గలవు అలాగున సంపూర్ణనియమము ఆచరించక పోవుటచే పాపనివృత్తి కాలేదని మనము నిశ్చయించుకొన వలయును

అనిష్కల్మష చిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్ ।
నరస్యాంగారకస్యేవ సదా క్షీరాభి షేచనమ్ ॥

కల్మష హృదయము గలవాడు (కపటబుద్ధిగలవాడు) సమస్త తీర్థములలో స్నానమొనర్చినను బొగ్గును శుద్ధమైన తెల్లని ఆవుపాలలో నెన్ని సార్లు గడిగినను నలుపుబోయి యేలాగున తెలుపు గాజాలదో, అలాగున నతడున్ను శుద్ధాత్ముడు గాజాలడు

*అన్తశ్శుద్ధి విహీనైస్తు యేఽధ్వరా వివిధాః కృతాః ।*
*న ఫలన్తి మునిశ్రేష్ఠ! భస్మని న్యస్తహవ్యవత్ ॥*

ఓమునిశ్రేష్ఠా ! ఆత్మశుద్ధి లేనివాడు అనేక విధములగు యజ్ఞదానాది క్రియలొనర్చినను నవేమియు ఫలమును గలుగ జేయువు ఎట్లన నవన్నియు బూడిదయందు హోమించిన హవిస్సువలె వ్యర్థమైపోవును

*భావశుద్ధి విహీనానాం సమస్తం కర్మ నిష్ఫలమ్ ।*
*తస్మాద్రాగాదికం సర్వం పరిత్యజ్య సుఖీభవేత్ ॥*

ఆత్మశుద్ధిలేని వారి సమస్త పుణ్య కర్మలున్ను నిష్ఫల ము అందువలన హృదయములో సమస్త విషయాది రాగములను సంపూర్ణముగా త్యజించి సుఖస్వరూపుడు గావలయును

*మృదాం భారసహస్రైస్తు కుంభకోటి జలైస్తథా ।*
*కృత శౌచోఽపి దుష్టాత్మా చండాలసదృశస్స్మృతః ॥*

వేయి టన్నుల మట్టిచేతను, కోటిఘటముల జలములచేతను చేయబడిన స్నానశౌచములతో గూడినవాడైనను, దుష్టాత్ముడైన వాడొకప్పుడున్ను శుద్ధాత్ముడు గాడు వాడు చండాలసదృశుడు మహాభారతమున ధర్మరాజులకొఱకు భీష్మాచార్యులు తీర్థస్నాన మాహాత్మ్యముల నన్నిటి జెప్పి కట్టకడన నీశ్లోకమును దెలిపెను -

**ఆత్మా నదీ సంయమ తోయపూర్ణా**
**సత్యహ్రదా శీల తటా దయోర్మిః ।**
**తత్రావగాహం కురు పాణ్డుపుత్ర !**
**న హ్యన్యధా శుధ్యతి చాంతరాత్మా ॥**

ఓపాండుపుత్రా ! పుణ్యతీర్థములలో నెంత స్నానమాచరించినను పాపము మాత్రము కొంత శమించును దేహేంద్రియములకు కొంత శుద్ధి గలుగునే గాని ఆత్మశుద్ధివల్లనే జ్ఞానము గలుగ వలసి యున్నది అట్టిది ఆత్మతీర్థస్నానము చేతనే సిద్ధించును అది ఎట్టిదన ఆత్మజ్ఞానమనెడి నది సంయమమగు జలముతో నిండినది సత్యమనెడి హ్రదముతో గూడినది పవిత్రశీల మనెడు తటములతోను, దయయనెడు నలలతోను గూడియుండును కావున నోధర్మరాజా ! అట్టి శుద్ధికిట్టి స్నానము తప్ప మరి యేలాటి మార్గమున్ను లేదు

పరిగ్రహాన్మునీనాం చ తీర్థానాం పుణ్యతా స్మృతా ।

మునులయొక్క పరిగ్రహమువల్ల సామాన్య జలమునకు పుణ్యతీర్థత్వము సిద్ధించుచున్నది

## 70. సూ ॥ తన్మయాః.

పద ॥ తన్మయాః

టీక ॥ తన్మయాః = ఆభగద్భక్తులు భగవత్స్వరూపులగుచున్నారు
భగవద్భక్తులు భగవత్స్వరూపులగుచున్నారు

వి మన్మయా మాముపాశ్రితాః (4-110)

గీతయందు చెప్పిన భగవద్వాక్యమున్ను, శ్రీనారదమహర్షి చెప్పినదిన్ని ఒకేవిధముగానే యుంటున్నది భగవంతుని ఆశ్రయించిన వారలు భగవత్స్వరూపులే యని గీతావాక్యము

*కర్పూరమనలే యద్వత్ సైంధవం సలిలే యధా ।*
*తధా సంధీయమానం చ మనస్తత్త్వే విలీయతే ॥*

కర్పూర మేలాగున అగ్నియందు లీనమై అగ్నిమయమై పోవుచుండునో, ఉప్పుకల్లు జలమందైక్యమై ఏకత్వమునొందు చున్నదో ఆలాగున మనస్సున్ను ఆత్మయందు అనుసంధానముచేత ఏకత్వమును పొందుచున్నది అనగా ఆత్మ పరమాత్మయందలి ధ్యానము చే ఐక్యమగుచున్నది ఈతత్త్వమునే ఆంజనేయులు తన అనుభవమును గురించి శ్రీరామచంద్రులకు తెలిపెను

*దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః ।*
*ఆత్మబుద్ధ్యా త్వమేవాఽహమితి మే నిశ్చితా మతిః ॥*

ఓశ్రీరామచంద్రా! దేహబుద్ధితో చూచిన నేను మీకు దాసుడను జీవబుద్ధితో ఆలోచించిన మీ అంశము, ఆత్మబుద్ధితో ఆలోంచిన నీయొక్క స్వరూపమే నాయొక్క ఆత్మయున్ను అగుచున్నది పాత్రలు జలములు నానాప్రకారములుగా నుండినను దానియందు ప్రతి బింబించిన చంద్రబింబము లేక సూర్యబింబము, ఎట్లు ఒకేవిధముగా నుండునో అట్లు ఉపాధిత్రయమును నిరసించిన ఆత్మ యన్నిటిలోను ఒకేవిధముగానే యుండును అని అమృత బిందూపనిషత్తు

*ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।*
*ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచన్ద్రవత్ ॥*

సీతారామాంజనేయము తెలిపినది చూడుడు -

ఆరోపిత భుజంగమమర గన్పట్టునే
స్ఫురదదిష్ఠాన రజ్జువును గనిన
నారోపిత మనుష్యుడ లర జూ పట్టునే
భువి నధిష్ఠా నదారువును గనిన
నారోపితోదకం బరయంగ దోచునే
కన దధిష్ఠానార్క కరము గనిన
నారోపితాచ్ఛ రౌప్యము లక్ష్యమగునె య
ధిష్ఠాన మైన శుక్తి కను గనిన

దలప నారోపితాసితత్వంబు మరల
గాన నగునె యధిష్ఠానఖంబు గనిన
దెలియ నారోపితమనంబు దృశ్యమగునె
తగనధిష్ఠాన పూర్ణతత్త్వమును గనిన ॥

## 71. సూ ॥ మోదన్తే పితరో నృత్యన్తి దేవతాః సనాథా చేయం భూర్భవతి.

పద ॥ మోదన్తే - పితరః -నృత్యన్తి - దేవతాః - సనాధా - చ - ఇయం - భూః - భవతి

టీక ॥ తన్మయులగు పరమభక్తుల జన్మమువల్ల, పితరః = పితృదేవతలు, మోదన్తే = సంతోషించుచున్నారు, దేతా ః= దేవతలు, నృత్యన్తి = ఆనందభరితులై నృత్యము చేయుచున్నారు, ఇయం భూః = ఈ భూమి, సనాధాచ = నాధునితో కూడినదియు, భవతి = అగుచున్నది

తా ॥ తన్మయులగు పరమభక్తుల జన్మమువల్ల పితృదేవతలు సంతోషించుచున్నారు దేవతలు ఆనందభరితులై నృత్యము చేయుచున్నారు ఈభూలోకము మంచిరాజుతో అనగా ధర్మపరిపాలన ప్రభుత్వముతో కూడినదగుచున్నది

వి ॥ మహనీయాత్ముల జన్మకాలమున వారి వంశజులగు పితృదేవతలకు గయలో విష్ణుపాదమున శ్రాద్ధ తర్పణాదులు చేయుటచే పితృలోకమునుండి పుణ్యలోకమును పొందుచున్నారు దైవ ప్రీతికర కార్యములు చేయుటచే దేవతలు తృప్తులగుచున్నారు సద్ధర్మముల రాజులకు బోధించి వారివల్ల ధర్మపరిపాలనము చేయించుటచే భూమి అనాధత్వము పొందక సనాధత్వమును పొందుచున్నది అధర్మపరిపాలనము నాధుడులేని ప్రభుత్వము, ధర్మపరిపాలనము నాధునితో కూడిన ప్రభుత్వమగును శ్రీబుద్ధదేవు డవతరించినప్పుడు బింబిసార ప్రభువుచే చక్కగా ధర్మపరిపాలనము చేయించెను అశోకచక్రవర్తి యును జీవహింసాదియజ్ఞముల నివృత్తి జేసెను శంకరులవతరించినప్పుడు సుధన్వుడను రాజుచే ధర్మబద్ధముగా రాజ్యపాలనము చేయించెను, ఆలాగున శ్రీవసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రునిచే ధర్మయుక్తముగా

ప్రజాపరిపాలనము నిర్వహింప జేసెను అదేరీతిగా శ్రీసమర్థ రామదాసుగారు శివాజి చక్రవర్తి చే భక్తి పరముగా లోక పాలనము చేయించెను ఈలాటి కథలెన్నియో గలవు

నృత్యన్తి పితరస్సర్వే సంతుష్టాస్తస్య వంశజాః ।
దేవాశ్చ ఋషయస్తృప్తాః ప్రయాన్తి పరమం పదమ్ ॥

దీని యర్థము ఇదివరలో వ్రాయబడినదే

**72. సూ ॥ నాస్తి తేషు జాతి విద్యా రూపకులధన క్రియాది భేదః.**

పద ॥ నాస్తి - తేషు - జాతివిద్యారూపకుల ధన క్రియాది భేదః

టీక ॥ తేషు = ఆభగవద్భక్తుయందు, జాతి = స్త్రీజాతి పురుషజాతియను భేదముగాని, విద్యా = విద్యగలవాడని గాని విద్యలేనివాడని గాని భేదము లేదు రూప = రూప వంతుడులేక కురూపియని గాని భేదములేదు కుల బ్రాహ్మణా బ్రాహ్మణ భేదము గాని లేదు ధన = శ్రీమంతుడని గాని బీదవాడని గాని భేదము లేదు క్రియాది భేదః = యజ్ఞాది క్రతవులు చేసిన వాడని గాని చేయని వాడని గాని భేదము, నాస్తి = లేదు

తా ॥ భగవద్భక్తి చేయుటలో పైజెప్పిన భేదములెవ్వియు చూడబనిలేదు లేక యెవరున్ను పైజెప్పిన భేదము భగవద్భక్తుల యందు చూడరాదు స్త్రీజాతి పురుష జాతి యను భేదము గాని, విద్య గలవాడు విద్యలేని వాడను భేదముగాని, రూపవంతుడు రూపరహితుడను భేదముగాని, బ్రాహ్మణాబ్రాహ్మణ భేదముగాని, ధనవంతుడు, నిర్ధనుడను భేదము గాని, యజ్ఞాది కర్మలు చేసిన వాడు చేయనివాడను భేదము గాని లేదు

వి ॥ భగవద్భక్తులలో పైజెప్పిన భేదమేమియు కనుపించుట లేదు భృగ్వాది బ్రాహ్మణులున్ను, విశ్వామిత్రాది క్షత్రియులున్ను, తులాధారాది వైశ్యులున్ను, సూత, ఉద్ధవ, విదురాది శూద్రులున్ను, వాల్మీక్యాదికిరాతు లున్ను పరమభక్తులై ఆత్మజ్ఞానులై యుండిరి ఆలాగున స్త్రీలలో మైత్రేయి, చూడాల, కాత్యాయని, సులభ, మదాలస, శబరి, గార్గ్యాదులగు వారలున్ను పరమ భక్తిగలవారై జ్ఞానమును బడసిరి ఆలాగున కలియుగమున సమర్థరామదాసు, కబీరు దాసు, బోలామేల, నందనారు, తిరుప్పాణి

ఆళ్వారు మొదలగు వారనేకులు భగవద్భక్తి గలిగి ముక్తిని పొందిరి ఇకను వ్రాయ వలసి యుండిన ఎందరో గలరు అని జిజ్ఞాసువులు తెలుసుకొనవచ్చును

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్ ॥ (9-32)

ఓయర్జునా ! పాపయోని సంభూతులైన వారెవరు గలరో వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను నన్నాశ్రయించి భక్తి గలవారై సర్వోత్తమమైన మోక్షమును పొందుచున్నారు

జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణో వాఽంత్యజోఽపి వా ।
సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥ (సూత సంహిత)

జ్ఞానమనెడు ఓడచేత బ్రాహ్మణుడైనను, అంత్యజుడైనను సంసారసముద్రమును దాటి ఈలోకములోనే మోక్షమనెడు గట్టును చేరగలడు

న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాః స్మృతాః ।
సర్వవర్ణేషు తే శూద్రా యే హ్యభక్తా జనార్దనే ॥

భగవద్భక్తులైనవారు శూద్రకులములో జన్మించిన వారైనను అట్టి వారిని సామాన్య శూద్రులు అని తలంచ కూడదు వారిని విప్రులుగాను, పరమభాగవతులుగాను తలపవలెను బ్రాహ్మణాది నాల్గు వర్ణములలో జన్మించిన వారెవరైనను భగవద్భక్తి లేనివారై యున్నచో వారినే శూద్రులుగా తలంచవలయును

భక్తి ర్హష్ట విధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే ।
స విప్రేంద్రో మునిశ్శ్రీమాన్ స యతి స్స చ పండితః ॥

స్మరణం, కీర్తనం మొదలగు ఎనిమిది విధములగు భక్తి ఏమ్లేచ్ఛునియం దైనను కనిపించునో వాడే బ్రాహ్మణోత్తముడనియు, ముని యనియు, శ్రీమంతుడనియు, సన్న్యాసి యనియు, పండితుడనియు గ్రహించుకొన వలయును అతనికి సమస్త విధములగు దానములిచ్చుటకున్ను, ఆమహాత్మునియందుండి తీర్థప్రసాదములను తీసుకొనుటకున్ను అర్హుడగును ఆపుణ్యాత్ముడు నావలెనే పూజార్హుడని వరాహ పురాణము

## 74. సూ ॥ వాదో నావలమ్బ్యః.

ప ॥ వాదః - న - అవలమ్బ్యః

టీక ॥ వాదః = వాదము, (భగవద్భక్తులచే), న అవలంబ్యః = అవలంబింపదగదు

తా ॥ భగవద్భక్తులు కుతర్క వాదములోనికి దిగరాదు

వి ॥ పరమ భగవద్భక్తులు, కుతర్క వివాదములోని ప్రవేశింప రాదు ఏలన కుతర్క వాదములచే తన భక్తికైన హాని గలుగ వచ్చును లేనిచో ఒక్కొక్కరిపై విరోధము గలిగి మనస్సుఅశాంతి లోనికి దిగిపోవచ్చును అంతేకాదు అందరిలోను, అన్నిటిలోను పరమ భగవద్భక్తులు భగవంతుని చూడవలసి యుండగా భేదబుద్ధిగలిగి సమత్వమునుండి జారిపోకూడదు శంకరాచార్యులున్ను సాధన పంచకమున ఈలాగుననే వచించిరి ''బుధజనైర్వాదః పరిత్యజ్యతామ్'' మహాత్ములతో పరమభక్తులతో వాదము చే యరాదు అని ఉపదేశించిరి అయితే ప్రపంచములో అనేక మతములుండగా నిజమైన మతమేది? నిజము కాని మతమేది? అని నిశ్చయించుటకు వాదము చేయనిచో ఎట్లు సత్యము తెలియునని ఒక్క సంశయము కలుగును అట్టి వాదము మతస్థాపకులకు సంబంధించినదే గాని భగవద్భక్తులకు సంబంధపడినది గాదు అయితే ముందుగానే ఏదైన నొక సంప్రదాయమున జేరవలసి యండిన ఆసంప్రదాయ పద్ధతి, దానిని బోధించెడు ఆచార్యులను కనుగొన వలయును వారి వర్తనము శుద్ధముగా నుంటున్నదా? వారి భక్తి సాక్షాద్భగవద్భక్తిగా నుంటున్నదా? దయా, సత్య, ధర్మ, వైరాగ్యములతో గూడియున్నదా? యని మొదటనే తెలుసుకొనియే ఏసంఘమున్నైనను చేరవలయును కావుననే భారతము ''మహాజనో యేనగతః స పంథాః''- మహాత్ములగు జనులు ఏమార్గము నవలంబించి నడుచుచున్నారో, అట్టిమార్గమే అవలంబనీయమని యుపదేశించినది గీతలో వాదమును గురించి చెప్పినది చూడుడు ''వాదః ప్రవదతామహమ్'' (10-32) వాదము మూడు విధములు 1 వాదము, 2 జల్పము 3 వితండము, వాదమనునది రాగద్వేషరహితులై భక్తి శ్రద్ధలతో తెలియనిదానిని సావధానముగ నుభయులున్ను మాట్లాడుచు తెలుసుకొనుట ఇది సత్త్వగుణముతోను తత్త్వార్థ గ్రహణముతో గూడినదగుటచే నది మాత్రము భక్తులు చేయవచ్చును (2) జల్పము - శాస్త్రప్రమాణములచేత, యుక్తులచేతను తన వాదమును స్థాపించి ఇతర పక్షమును ఖండించుట జల్పమనందగును (3) వితండము- తన సిద్ధాన్తము తెలుపకయు, స్థాపింప

కయు కుతర్క కుయుక్తులచే ఇతర పక్షమువారిని నిందించుటయు, అవమాన పరచుటయు నగును ఇతరుని వాక్యమును విననీయక యు తన మురాలలో వారు అల్లరి చేయుటయు, వితండముతో గూడినది మొదటిది ఉత్తమము, రెండవది మధ్యమము మూడవదిఅధమము మొదటిది సత్త్వగుణముతో గూడినది రెండవది రజోగుణముతో గూడినది మూడవది తమోగుణముతో గూడినది కావుననే తమోగుణమును గురించి శాస్త్రమీలాగున నిర్ణయించడమైనది

*అజ్ఞానం మోహానిద్రా చ చాపల్యం బుద్ధిహీనతా ।*
*పాపిష్ఠ పరవాదత్వం తామసం గుణలక్షణమ్ ॥*

అజ్ఞానము (యథార్థ జ్ఞానము తెలియక పోవుట) మోహము ఒక్కదానియొక్క స్వరూపమును వేరుగా తలచుట, అతినిద్ర, చపలత్వము, బుద్ధిమాంద్యము, పరప్రాణులను పీడించుట, ఇతరులతో కుతర్క వాదమును జేయుట తామసగుణ లక్షణము గీత అ 6

*సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు ।*
*సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥* (6-9)

ప్రతిఫలాపేక్ష లేక యుపకారము జేసిన వానియందును, ప్రతిఫలము ఎప్పుడైనను గలుగునని తలంచి మేలొనర్చిన వానియందును శత్రువునందును, తన యెడల మిత్రత్వముగాని, శత్రుత్వముగాని లేని వానియందును, తన యెడ మిత్రత్వ శత్రుత్వముల యందు సమానముగా ప్రవర్తించువానియందును, తనచేద్వేషింపబడతగిన వారియందును, చుట్టముల యందును, సజ్జనుల యందును, దుర్జనులయందును సమానమైన బుద్ధిగలవాడు ఉత్కృష్టుడగుచున్నాడు ''సమబుద్ధిర్విశిష్యతే'' అని ప్రయోగించుటచే ఇట్టి బుద్ధి మిక్కిలి శ్రేష్ఠతమమైనదని భగవదాశయము అయితే సజ్జన, దుర్జన శత్రు మిత్రభేదమును పాటింపక అందరిని సమానముగ చూచి ప్రవర్తించిన వ్యవహారమెట్లు జరుగునని సందేహము గలుగవచ్చును ఇది వ్యవహారము నశించి అవధూతవృత్తిలో నుండువారి లక్షణమును తెలుపడమైనది అయితే ఆత్మజ్ఞానులు వ్యవహారము నిర్వహించ వలసియున్నప్పుడు ఎట్లుండ వలయునో అది పతంజలి యోగదర్శనమునందును, వసిష్ఠుడు యోగవాసిష్ఠమునందును వివరించడమైనది ఆవిషయము ఇదివరలో వ్రాయడమైనది అట్టి వారు మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష

యను నాలుగు ధర్మములను అవలంబించు కొనవలయును 1 మైత్రి - తన స్వభావమునకు సమానమైన వారితో మిత్రత్వమున్ను, 2 కరుణ - దీనులయందు (దుఃఖితులయందు) దయయు, 3 ముదిత - తనకన్న అన్నిటిలోను అధికుల చూచి సంతోషించుట, 4 ఉపేక్ష - దుష్టుల యందు ఉపేక్ష (ఉదాసీనత) అనగా వారి జోలికి పోకయుండుట జనకాది మహర్షులందరు ఇట్టి ధర్మములను అవలంబించియే కార్యమును నిర్వహించిరి

మైత్రం కురు సుఖాఢ్యేషు దుఃఖితేషు దయాం కురు ।
పుణ్యాకృత్సు చ సంతోషం ఔదాసీన్యం కుబుద్ధిషు ॥

తనకన్న ఎక్కువ అన్నివిధములలోను సుఖముగలవానితో మైత్రియు, దుఃఖితులయంతు దయయు, పుణ్యాత్ములయందు సంతోషమున్ను, కుబుద్ధులయందు ఉదాసీనత్వమున్ను గలిగియుండవలయును అని శాస్త్రనిర్ణయము

రాగద్వేష విషయుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మ వశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ (2-64,65)

మనస్సును స్వాధీనమునందు నుంచుకొన్నవాడై తనకు వశవర్తులుగా నుండునట్టియు రాగద్వేషాదులు లేనట్టివియు నయిన ఇంద్రియములచే ఆత్మసంరక్షణ (ధర్మ నిర్వహణ) కొరకు మాత్రము గల విషయములలో ప్రవర్తించిన వాడెవడైనను చిత్తశాంతిని బొందుచున్నాడు దీనివల్ల ఉపరతికి హాని గాని, స్వరూపస్థితి నుండి జారుట గాని, ఆత్మకు ఆవరణము కలుగుట గాని యుండదు లేనిచో జనక, శ్రీరామ, శ్రీకృష్ణ , ధర్మరాజాదులు ఎట్లు ధర్మముతో రాజ్యపాలనము చేయగల్గిరి ? మనోనిర్మలత్వము గలుగుచుండగా నీ బ్రహ్మనిష్ఠులకు సమస్తదుఃఖములయొక్క వినాశము గలుగుచున్నది నిర్మలమైన చిత్తము కలవానికి శీఘ్రముగా బుద్ధి స్వరూప స్థితిలో నిలకడగలుగుచున్నది ఇట్టి ధర్మమును గొప్ప ప్రజ్ఞావంతులు మాత్రమే అనుష్ఠింపగలరు

ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత ॥
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ (7-27)

ఓయర్జునా ! సకల జంతువులు కామక్రోధముల వలన గలిగిన సుఖదుఃఖాది ద్వంద్వరూపమగు మాయ చేత సృష్టి కాలమునందు మిక్కిలి అజ్ఞానమును పొందుచున్నవి ద్వంద్వములనగా సుఖదుఃఖములు, స్తుతినిందలు, శత్రు మిత్రులు, లాభనష్టములు మొదలైనవి వీనిలో తగుల్కొనుటయే సంసార చక్రములో చిక్కుకొనుట యగును ఆత్మజ్ఞాన శక్తిచేత వానితో సంబంధపడక విలక్షణముగా నుండి సాక్షియై నిలిచి స్వధర్మమును అనుష్ఠించుటయే ద్వంద్వాతీత మనబడును కార్య దక్షులగు జ్ఞానులు ఇట్టి ప్రవర్తనమును గలిగియుండవలయును పక్షికి రెండు పక్షములవలె మనస్సనెడు పక్షికి రాగద్వేషములనెడు పక్షద్వయము గలదు పక్షములను ఛేదించిన పక్షి యెట్లు ఎచ్చటకిన్ని ఎగురలేక ఒకేస్థలములో పడియుండునో అట్లే మనస్సుయొక్క యిచ్ఛాద్వేషములనెడు పక్షద్వయమును వివేకశక్తి యను ఖడ్గముతో ఛేదించిన మనస్సున్ను శాంతిని పొందియుండును

## 75. సూ ॥ బాహుళ్యావకాశత్వాదనియతత్వాచ్చ.

పద ॥ బాహుళ్యా వకాశత్వాత్ - అనియతత్వాత్ - చ

టీక ॥ వాదము, బాహుళ్యావకాశత్వాత్ = పెంచిన కొలది పెరుగుటకు అవకాశముండుట వలననూ, అనియతత్వాచ్చ = ఇట్టిది యని నిర్దిష్టమైన అవధి లేనిదగుట వలన అవలంబింప రాదు

తా ॥ వాదము పెంచిన కొలది పెరుగుట కవకాశముండుట వల్లను ఇట్టిదని నిర్దిష్టమైన అవధి లేని దగుటవల్లను భగవద్భక్తులు అవలంబింపరాదు

వి ॥ పరమ భక్తులు వాదములో చేరరాదు అని పైనుదాహరించిన సూత్రము యొక్క కారణమును ఈ సూత్రములో తెలుపడమైనది వాదము పెంచిన కొలది పెరుగునదగుటచేతను, దానికి ఒక అంత్యము లేనందుచేతను, ఒకనియమము లేనందుచేతను భగవద్భక్తులు దానియందు దిగరాదు అయితే శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్య ప్రభృతులు పరమతస్థులతో వాదించిగదా స్వమతమును స్థాపించిరని తలంచెదరేమో శ్రీబుద్ధుడు మొదలు నేటివరకు గల మతాచార్యులు ఎవ్వరున్ను ఆయాకాలములో అందరిని జయించి సర్వులను స్వమతములో చేర్చి యుండలేదు అప్పుడున్ను కొందరు మిగిలే యుండిరి అయితే వారి మతగ్రంథములలో ఆకాలపు వారి నందరిని జయించినట్లు వ్రాసియుండవచ్చును ఒకవేళ ఒక్కొక్క మతకర్తలు

జన్మించినప్పుడు వారితో సమానులైన ప్రజ్ఞాశక్తియు, విద్యాశక్తియు, యోగశక్తియు లేని జనముండవచ్చును అందువల్ల మతకర్తల ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పక పోవచ్చును కొందరు మనకు ఈమతవాదముతో సంబంధము దేనికని తలంచి ఉదాసీన భావము పొందియుండవచ్చును మతకర్తలు జన్మించిన కాలమున వారి మతములను ఖండించుటకు నొకవేళ నెవరున్ను వాదమునకు రాక పోయినను ఒక్కొక్క మతస్థాపకులకు పిమ్మట వచ్చిన వారందరు తమ తమ పూర్వమతములను ఖండించుచునే వచ్చిరి లేనిచో ఇప్పటికి ఇన్ని మతములు ఎట్లు ఏర్పడును? జైనమతమును బుద్ధుడు, బుద్ధమతమునుశంకరులు, శంకరమతమును రామానుజులు, రామానుజ మతమును మధ్వులు, వరుసగ పూర్వపక్షము చేయుచునే వచ్చిరి ఇప్పటివరకు గల మతములన్నిటిని పూర్వపక్షముచేసి దయానంద సరస్వతీ స్వామి ఆర్యమతమును స్థాపించెను అదిన్నీ లోకమంతయు వ్యాపించుట గాని, అందరున్ను అంగీకరించుటగాని గల్గియుండలేదు వర్తమాన కాలములో గల జనసముదాయము యొక్కయు మత సంఘముయొక్క స్థితిని చూచిన ప్రజ్ఞావంతులు ఇదితెలుసు కొనగలరు ఈమతము లన్నియు ఒక్కొక్క సమాజమని గ్రహించుకొనిన జాలును ఇప్పుడు ప్రపంచములో ఎన్ని సమాజములుండనో మతము యొక్క పుట్టుపూర్వోత్తరమున్ను ఇట్లనే యుండును ఎవనియొక్క మతి నిర్మలముగానుండునో వానియొక్క మతమేదైనను అది మంచి మతము ఎవని యొక్కమతి నిర్మలముగానుండదో వాడు ఏమతములో నుండినను నది దుర్మతమే ఒక్కొక్కరి మతి ననుసరించి చెప్పినదే మతము దీనికి సిద్ధాంతముగ వేదముగాని, శాస్త్రముగాని, మునిగాని (ఋషిగాని) యుండలేదు అయితే వారి వారి మతికి ఇష్టపడిన ప్రమాణములను వేదములనుండియు శాస్త్రములనుండియు సంగ్రహించుకొని సిద్ధాంతముజేసిరి వారికి ఇష్టమైన యొక్క ఋషిని దృష్టాంతము జూపిరి వారందరు జెప్పిన ప్రమాణములు వేదశాస్త్రములో అసంఖ్యాకములుగా గలవు కావుననే భారతమున మతమును గురించి యిట్లు నిర్ణయించుటకు కారణమైనది

> శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా
> నైకో మునిర్యస్య వచః ప్రమాణమ్ ।
> ధర్మ స్య తత్త్వం నిహితం గుహాయాం
> మహాజనో యేన గతస్స పంథాః ॥

వేదములను చూచిన అనేక భావములతో గూడియున్నవి మన్వాది స్మృతులు చూచిన అవిన్ని అనేకాభిప్రాయములతో గూడి యున్నవి వ్యాస, కపిల, జైమిని,

శుకాదిమునులలో చూచిన వారున్ను భిన్నాభిప్రాయులై యున్నారు ధర్మతత్వమైతేనో, ఈశ్వరస్వరూపమైతేనో హృదయ గుహయందు దాగియున్నది అది దృష్టికి గోచరమైనది గాదు అయితే ముముక్షువుల జిజ్ఞాసువుల గతి ఏమని సందేహింప నక్కరలేదు వర్తమాన కాలములో ఎవడు మహాత్ముడు గాను, సత్యధర్మపరుడుగాను, దైవసాక్షాత్కారము గల్గిన వాడుగాను, తత్వవేత్తగాను వీరిని ఆశ్రయించిన తరించగలవుని విశ్వాసము గలిగించువాడుగాను ఉండునో వారిని ఆశ్రయించ వలయును ఇదే యధార్థమైన మార్గము అందువల్లనే జినుని మతమును అవలంబించినవారు జైనులుగాను బుద్ధుని మతము నవలంబించిన వారు బౌద్ధులుగాను, శంకరునిమతము నవలంబించిన వారు అద్వైతులుగాను, రామానుజుని మతమును అవలంబించినవారు వి శిష్టాద్వైతులుగాను, మధ్వునిమతము నవలంబించిన వారు ద్వైతులుగాను, (మాధ్వులుగాను), క్రీస్తుమతము నవలంబించు వారు క్రై స్తవులుగాను, మహమ్మదు మతమును నవలంబించిన వారు మహమ్మదీయులుగాను ఏర్పడిరి ఇదే మతము యొక్క రహస్యము

*నిస్సంగతా ముక్తి పదం యతీనాం సంగాదశేషాః ప్రభవంతి దోషాః ।*
*ఆరూఢయోగోఽపి నిపాత్య తేఽధః సంగేన యోగీ కిముతాల్పసిద్ధిః॥*

పరివ్రాజకులకు నిస్సంగత్వమే మోక్షపదము నొసంగును దుర్జన సహవాసముచే ననేక దోషములు సంభవించును యోగారూఢత్వము పొందిన వాడైనను అధః పతితుడగును అట్లుండగా అభ్యాసియు సాధకుడు అయినవాడు పతితుడగునని చెప్పవలయునా?

*సంగం న కుర్యాదసతాం శిశ్నోదరతృషాం క్వచిత్।*
*తస్యానుగస్తమస్యంధే పతత్యంధానుగాంధవత్॥*

శిశ్నోదర పరాయణులైన అసత్పురుషుల సంగమునొకప్పుడున్ను చేయరాదు చేసెనేని అంధుని ననుసరించిన అంధునిగతివలె నతడున్ను అంధతమస్సైన అజ్ఞానములో పడిపోవును

## 76. సూ॥ భక్తి శాస్త్రాణి మననీయాని తదుద్బోధక కర్మాణి కరణీయాని.

పద॥ భక్తిశాస్త్రాణి - మననీయాని - తదుద్బోధక కర్మాణి - కరణీయాని,

టీక ॥ పరమ భక్తులచే, భక్తిశాస్త్రాణి = భక్తి శాస్త్రములు, మననీయాని = మననము చేయదగినవి, తదుద్బోధక కర్మాణి = ఆభక్తి శాస్త్రములందు చెప్పబడిన భగవత్కైంకర్యములు మొదలగు కర్మములు, కరణీయాని = చేయందగినవి

తా ॥ భగవద్భక్తులచే భాగవతము, భగవద్గీత, మహాభక్తవిజయము మొదలగు భక్తిని వృద్ధిపరచెడు శాస్త్రములు శ్రవణ మననములు చేయదగియున్నవి ఆభక్తి శాస్త్రములో చెప్పబడిన భగవత్ప్రీతికరమగు కార్యములనే చేయవలసినది

వి ॥ భగవత్ప్రీతి గలిగి త్వరలో మోక్షము సిద్ధించుటకు తగిన కార్యములను మాత్రమే అంతరంగ భక్తులు చేయవలయునే గాని, కర్మకాండములో మునిగి కడగానక వ్యర్థజీవులు గాకూడదు కావుననే ఉత్తర గీతయందీ లాగున తెల్పిరి

**అనంతశాస్త్రం బహు వేదితవ్యం**
**స్వల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః ।**
**యత్సారభూతం తదుపాసితవ్యం**
**హంసో యథాక్షీరమివాంబుమిశ్రమ్ ॥**

శాస్త్రము అనంతము ఎంతకాలము చదివినను అంతు కనబడదు జీవితము అతిస్వల్ప కాలము దానిలో విఘ్నము లనేకములు కావున శాస్త్రములలో మోక్షముకొరకు చెప్పబడిన ఏసారము గలదో అది ఉపాసింప దగినది ఎట్లన బహుళనీరమున స్వల్పక్షీరమైనను కలిపి పెట్టినచో రాజహంసము నీటిని త్యజించి క్షీరమును ఎట్లు గ్రహించుచున్నదో అట్లు ముముక్షువు లైన వారున్ను ఇట్టి స్వభావము గలిగియుండవలయును

*అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్య నేకశః ।*
*బ్రహ్మతత్త్వం న జానాతి దర్వీ పాకరసం యథా ॥*

ఋగ్వేదాది నాలుగు వేదములను చదివినను అనేక ధర్మశాస్త్రము లను పఠించినను దైవసాక్షాత్కారము గలుగజేయక పోయినచో అనేక క్షీరాన్నాది రుచ్యపదార్థములలో త్రిప్పెడు గరిట వాటి యొక్క రుచిని ఎట్లు తెలుసుకొనజాలదో ఆలాగున ఇతడు శాస్త్రసారమును తెలిసికొని అనుష్ఠింపక పోవుటచేత ఆ గరిటతో సమానుడగును

అన్యవిద్యా పరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్,
బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్॥

ఎన్ని ప్రపంచ శాస్త్రముల నెంతో కష్టపడి చదివినను దానిచే గలిగెడు ప్రయోజనము ఈదేహముండువరకే దేహము నశించుటతోనే అదిన్నీ నశించును పరలోకమునకు అది కించిత్తైన నుపయోగపడదు భగవద్భక్తి కరమగు శాస్త్రమో జీవించునప్పుడు మనశ్శాంతి గలుగజేయును జీవితానంతరము మోక్షము గల్గించును

శబ్దజాలం మహారణ్యం చిత్త భ్రమణకారణమ్ ।
అతః ప్రయత్నాత్జ్ఞాతవ్యం తత్త్వజ్ఞా తత్త్వమాత్మనః ॥

శాస్త్రజాలము మనస్సులో అనేక సంకల్పములను కలుగ జేసెడు గొప్ప కారడవి వంటిది మహారణ్యమధ్యమున ప్రవేశించిన వానికి దిక్కు తెలియనట్లు ఇదిన్నీ ఇద మిత్థమని తెలియక మనోభ్రాంతి ని గలుగ జేయును కావున మిక్కిలి ప్రయత్నముతో భగవత్సాక్షాత్కారజ్ఞానమును పరమ భక్తులగు మహాత్ములవల్ల తెలుసుకొనవలయును

ఆచారహీనం న పునన్తి వేదా యద్యప్యధీతా స్సహ షడ్భిరంగైః ।
ఛందాస్యేనం మృత్యుకాలే త్యజన్తి నీడం శకున్తా ఇవ జాతపక్షాః ॥

భగవద్భక్తియు, సదాచారమున్ను లేని వానిని నాల్గువేదములున్ను, ఆరుశాస్త్రములున్ను పవిత్రునిగాచేయజాలవు వీడు చదువుకొన్న వేదములన్నియు మరణ కాలమున వానిని వదలి పోవును ఎట్లన పక్షములు వచ్చిన తరువాత పక్షిపిల్లలు గూటిని వదలి పోవునట్లుండును

షడంగాది వేదో ముఖే శాస్త్ర విద్యా
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।
హరేరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం తతః కిం తతః కింతతః కిమ్॥

ఎవని మనస్సు భగవచ్చరణారవిందములయందు లయము గాకుండునో వానికి నాల్గువేదములున్ను, ఆరుశాస్త్రములున్న ముఖస్థములుగా నుండినను గద్య పద్యాది కవిత్వ రచనమున్ను అనర్గళముగా గలిగియుండినను వీని వల్ల పరలోకమున నేమి ప్రయోజనముండును? అనగా వ్యర్థమని భావము ఇట్లు నాల్గు సార్లు తతః కిం తతః కిం తతః కిం తతః కిం అని శంకరులు ప్రశ్నించిరి

కళత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం
గృహం బాంధవాః సర్వమేతద్ధి జాతమ్ ।
హరేరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

మనస్సు భగవచ్చరణారవిందముల యందైక్యమును బొందని మానవునకు భార్యయును, ధనమును, కొమాళ్లున్ను, మనుమలు, సర్వము, గృహము, బంధువులున్ను, ఇవియన్నియు సమృద్ధిగా నున్నను ప్రాణ ప్రయాణ కాలమున వీటి వల్లనేమి ప్రయోజనము ? ఏమి సహాయము గలుగును? ఏమి ఆత్మశాంతి యగును? ఏమి సుఖము గలుగును? ఏమియు గలుగదని భావము

భజ గోవిందం భజ గోవిందం భజ గోవిందం మూఢమతే ।
సంప్రాప్తే సన్నిహితే కాలే న హి న హి రక్షతి డుకృఙ్కరణే ॥

ఓమూఢబుద్ధీ ? మరణసమయమాసన్నమైన కాలమున ఈడుకృఙ్ కరణే అను వ్యాకరణ శాస్త్రము నిన్ను రక్షింప జాలదు రక్షింప జాలదు అందువల్ల గోవింద స్మరణ చేయుము నారాయణుని భజింపుము భగవంతుని గురించి భజన చేయుము అవిముమ్మార్లు చెప్పిరి ఇది శ్రీకాశియందు ఆదిశంకరాచార్యులు బ్రహ్మముహూర్తమున గంగాస్నానమునకు వెళ్ళునప్పుడు ఆవీధిలో నొక వృద్ధబ్రాహ్మణుడు డుకృఙ్ కరణే అను వ్యాకరణ సూత్రమును పఠించుచున్న వానిని గూర్చి చెప్పినది ఈలాగున ప్రతిరోజున్ను స్నానమునకు వెళ్ళునప్పుడు ఆస్థలమునకు వచ్చినప్పుడు ఈభజగోవిందశ్లోకముల నొక్కదానిని చెప్పుచుండిరి ఆపండితుడు ఆశ్లోకములన్నిటిని వ్రాసుకొని అర్థమును బాగుగ చింతన చేయుటచేవైరాగ్యము చెంది భగవద్భక్తి హృదయుడై శంకరాచార్యులయొక్క శరణు పొందెను ఈభజగోవింద శ్లోకములయొక్క పూర్వ చరిత్ర ఇట్టిది

## 77. సూ ॥ సుఖదుఃఖేచ్ఛాలాభాదిత్యక్తే కాలే ప్రతీక్ష్యమాణే క్షణార్ధమపి వ్యర్థం న నేయమ్.

పద ॥ సుఖదుఃఖేచ్ఛా లాభాది త్యక్తే - కాలే- ప్రతీక్ష్యమాణే - క్షణార్ధం - అపి - వ్యర్థం - న - నేయమ్

టీక ॥ భక్తులు, సుఖదుఃఖేచ్ఛా లాభాది = సుఖదుఃఖేచ్ఛా లాభాదులచేత, త్యక్తే = విడిచి పెట్టబడు, కాలే = కాలము, ప్రతీక్ష్యమాణే సతి = నిరీక్షింపబడు చుండగ, క్షణార్థమపి = అర్థక్షణమైనను, వ్యర్థం = వ్యర్థముగా, న నేయమ్ = పోనీయ గూడదు

తా ॥ భక్తులు సుఖదుఃఖేచ్ఛా లాభాదులచేత విడిచి పెట్టబడు కాలము ఒకటి గలుగునని నిరీక్షించునప్పుడు కాలమును అర్థక్షణ మైనను వ్యర్థము చేయగూడదు

వి ॥ మన సంసార సంబంధ శుభాశుభములు పూర్తి యైన తరువాత భగవద్భక్తి చేసుకొన వచ్చునని తలంచి కాలమును వ్యర్థపుచ్చరాదు ఏలన ''న హి ప్రమాణం జన్తూనాముత్తరక్షణజీవనే'' ప్రాణికోట్లకు ఇక ఉత్తరక్షణకాలము జీవించ వచ్చునని ఏలాటి ప్రమాణమున్ను లేదు '' విద్యుచ్చలం జీవితం'' మెరుపు వంటిది జీవితమని విజ్ఞుల యభిప్రాయము నీటిపై బుడగ వంటిది జీవితమని జ్ఞాను లెఱింగియున్నారు

*శాన్తే సముద్రకల్లోలే స్నానమిచ్ఛతి మూఢధీః ।*
*తథైవ శాంతే సంసారే జ్ఞాన మిచ్ఛతి దుర్మతిః ॥*

సేతు స్నానమునకు వెళ్లినవాడు అలలను చూచి భయపడి ఈకెరటములు శాంతించిన పిమ్మట స్నానము చేయవచ్చునని తలంచి యుండిన ఎప్పటికైన నవి శమించునా? ఆలాగున సంసారములో గల కార్యములన్నియు శాంతించిన తరువాత భగవద్భక్తి చేసుకొని జ్ఞానమును పొంది ముక్తిని చెందవచ్చునని గల తలంపు అటువంటిదే సముద్ర ముండు వరకు కల్లోలములు ఉండనే యుండును సంసారముండు వరకు వానికి సంబంధించిన శుభాశుభములు ఉండుచునే యుండును ఒక తరంగము వచ్చినది చూచి ఇది శాంతినొందిన స్నానము చేయవచ్చునని తలంపుతో నుండిన నది శాంతించుటకు ముందుగా మరియొక తరంగము వచ్చుచునే యుండును ఈలాగున సంసారములోను ఒక కార్యము పూర్తియగుటకు జీవితము వ్యర్థపరచక చూచుకొనుచుండవలయును

*యావత్స్వస్థ మిదం శరీర మరుజం యావజ్జరా దూరతః ।*
*యావచ్చేంద్రియ శక్తి రప్రతిహతా యావత్క్షయో నాయుషః ।*

ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ॥

ఎంత పర్యంతము ఈదేహము ఆరోగ్యవంతమై స్వస్థముగానున్నదో, ఎంతవరకు ముదిమి దూరముగానుండునో, ఎంతవరకు నింద్రియముల పటుత్వము తప్పిపోదో, ఎంతలోపల ఆయుస్సు క్షీణించదో అంతలోపల నే బుద్ధిమంతునిచే ఆత్మ శ్రేయస్సుకొరకు బలమైన ప్రయత్నము చేయందగినది అట్లుగాక అంత్యదశలో ప్రయత్న పడుట గృహము దహింపబడుచుండగా నీటికై నుయ్యిని త్రవ్వ యత్నించినట్టిదే యగును కావున జనులారా ! మాయామోహములో పడి అజాగ్రత్త నొందవలదు

ధనం చ భూమౌ పశవశ్చ గోష్ఠే
కాన్తా గృహద్వారి జనః శ్మశానే।
దేహశ్చితాయాం పరలోక మార్గే
ధర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥

తాను సంపాదించిన ధనమంతయు అచ్చటచ్చటనే నిలిచి పోవును ఏనుగులు, గుఱ్ఱములు, పశువులన్నియుదొడ్డిలోనే ఆగిపోవును ప్రాణసమానమైన భార్య వాకిటిలోనే నిలిచి చూచుచుండును తన బిడ్డలు, సోదరులు, బంధువులు, ఉద్యోగస్థులందరున్ను శ్మశన భూమి వరకే వచ్చెదరు ఇంత సుందరముగా గౌరవముగా అభిమానముతో కూడిన ఈదేహమును చితిపై పెట్టి నిప్పును రగిలింతురు పరలోక ప్రయాణములో తాను ఏకాకియై పోవలసిన కాలమొకటి ప్రతివారికి వచ్చుననే సంగతి మాయామోహముచే మరచిపోవుచున్నారు

*ఆశయా బధ్యతే లోకః కర్మణా బహుచింతయా ।*
*ఆయుః క్షీణం న జానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత ॥*

ఈజనము ఆశాపాశముచేతను, అనేకములైన కర్మల చేతను సంసారమునందు బంధింప బడుచున్నది ఆయుస్సు క్షణ క్షణమున్ను రంధ్రము పడిన కుండనుండి జలము ఒక్కొక్క కణము కారిపోయి కడకు వట్టి కుండ యగునట్లు అగునను సంగతిని తెలుసుకొనుట లేదు

బాలస్తావత్క్రీడాసక్తస్తరుణస్తావత్తరుణీసక్తః ।
వృద్ధస్తావచ్చింతాసక్తః పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః ॥

దీని యర్థము సుగ్రాహ్యమే

దినయామిన్యౌ సాయం ప్రాతః శిశిర వసంతౌ పునరాయాతః ।
కాలః క్రీడతి గచ్ఛత్యాయుస్తదపి న ముంచత్యాశాపాశః ॥

దీనియర్థము సులభము ఈవిషయమై కేనోపనిషత్తు ఉపదేశించి నది చూడుడు

శ్రుతి ॥ ఇహ చేద వేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః ।
భూతేషు భూతేషు విచింత్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥

ఈలోకమునందు భగవత్స్వరూపమును తెలుసుకొన్న వారికి గొప్ప లాభము గలదు ఈలోకమున భగవత్స్వరూపమును తెలుసుకొనని వానికి గొప్పనష్టము గలుగుచున్నది ఏలన తాను సంపాదించినవన్ని యున్ను, తానున్ను నశించిపోవుటకన్న గొప్ప నష్టమేమి కలదు? జ్ఞానులు సమస్త భూతము లందుండెడి యద్వితీయమగు ఏకస్వరూపమైన ఆత్మతత్త్వమును తెలిసికొని అజ్ఞాన రూపమగు ఈలోకమునుండి మరణమునొంది జననమరణ రహితమైన శాశ్వతమగు ముక్తిని ( అమృతత్వమును) పొందుచున్నారు ''కఠవల్లి శ్రుతి'' -

మూ ॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।
శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగ క్షేమాద్వృణీతే ॥

శ్రేయస్సున్నూ, ప్రేయస్సున్నూ మనుష్యుని పొందుచున్నవి బుద్ధిమంతుడైన వాడు ఆశ్రేయః ప్రేయస్సులను మనస్సుచే బాగుగా విచారించి ఎయ్యది శ్రేష్ఠమో ఎయ్యది నికృష్టమో యని విభజించుచున్నాడు ధీరుడగు వాడు ప్రేయస్సుకంటె శ్రేయస్సునే వరించుచున్నాడు అల్పబుద్ధిగలవాడు దేహాది సంరక్షణ నిమిత్తము వలన పశుధన పుత్రాది లక్షణమగు ప్రేయస్సునే వరించుచున్నా డు శ్రేయస్సు అనగా మోక్షము

ప్రేయస్సు అనగా ప్రపంచ సుఖము ఒక్కనికి పూర్వపుణ్య విశేషముచేత అంతఃకరుణశుద్ధి గలిగి ముముక్షుత్వము గలుగునప్పుడు ఈశ్రుతియందు చెప్పిన యవస్థ కలుగును ఒకచేతిని ముక్తి కాంతయు మరియొకచేతిని భోగకాంతయు పట్టుకొని నన్ను వరించెదవా! నన్ను వరించెదవా! యని యడుగుచుండును అప్పుడు గలిగెడు అవస్థను ఈయుపనిషత్తు వర్ణించడమైనది

## 78. సూ ॥ అహింసా సత్యశౌచ దయాఽఽస్తిక్యాది చారిత్రాణి పరిపాలనీయాని.

పద ॥ అహింసా సత్య శౌచ దయాస్తిక్యతాది చారిత్రాణి - పరిపాలనీయాని

టీక ॥ భగవద్భభక్తులచేత, అహింసా సత్యశౌచ దయాసిక్యాది = అహింసయు, సత్యము, శౌచము, దయ, ఆస్తిక్యము మున్నగు ఆచరణలు, పరిపాలనీయాని= పరిపాలింప బడదగినవి

తా ॥ భగవద్భక్తులచే ఆచరింప బడవలసిన ధర్మములు ఈసూత్రమున తెలుపడమైనది అహింస, సత్యము, శౌచము, దయ, ఆస్తిక్యము మున్నగు ఈపవిత్ర ధర్మములు పరిపాలింప బడదగినవి

వి ॥ భగవద్భక్తులకు ఇట్టి పవిత్ర ధర్మములు అవసరము లేదని కొందరు తలంతురు కావుననే ఈసూత్రమునందు ''చారిత్రాణి'' అని ప్రయోగించిరి ఇది నారదుల యొక్క స్వంత అభిప్రాయము కాదనియు అనాదినుండి ఏర్పడి వచ్చుచున్న ధర్మమనియు తెలిపిరి ఈవిషయమునే పతంజలి మహర్షి తన యోగదర్శనమున యమనియమములుగా నిర్ణయించిరి సాధన పాదము సూ ॥ 30 - అహింసా సత్యాస్తేయ, బ్రహ్మచర్యాపరిగ్రహో యమాః - అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ఈ ఐదున్ను యమమనబడును, సూ ॥ 32 - శౌచ సంతోష తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః - శౌచము , సంతోషము , తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము ఈ ఐదున్ను నియమములనంబడును ఈయమ నియమములు పతంజలి యోగదర్శనమునందును, ఓంకార గ్రంధమునందును విస్తారముగ గనందగును వీటన్నిటికిన్ని బాహ్యాభ్యంతర అర్థము గలదు

*న ప్రమాదో ఽత్ర కర్తవ్యో విదుషా మోక్ష మిచ్ఛతా ।*
*ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్బ్రహ్మణః సుతః ॥*

మోక్షేచ్ఛ గల బుద్ధిమంతులు పైజెప్పిన యమనియమములందు కొంచమైనను ప్రమాదము గలుగనీక చూచుకొనవలయును ప్రమాదము గల్గినచో మరణమే గతియని బ్రహ్మమానసపుత్రుడగు సనత్కుమారుడు ఉపదేశించెను

*ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః ।*
*గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి? ॥*

ఈమానవ జన్మమునందే నరకమనెడి వ్యాధికి భక్తి యనెడి చికిత్స నెవడు చేయలేడో వాడు పరలోకమునవెళ్లి ఏమిమయున్ను చేయజాలడు అది ఎట్లనగా వైద్యుడున్ను, ఔషధమును, అనుకూలమైన పథ్యమున్ను లేని స్థలములోనికి వెళ్లి వ్యాధిగ్రస్తుడేమి చేయుగల్గును? ఆలాగున ఈమానవ జన్మమును, గురువున్ను, ఆత్మజ్ఞానోపదేశమును, అనుకూలాహారమును గలిగియుండియు భవరోగమునకు చికిత్స చేయని వాడు వ్యర్థుడగుచున్నాడు

న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।
మంథనేన యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥
మర్దనాదిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥

శరీర సౌఖ్యమునకు లోబడిన వానికి పుణ్యము లభింపదు అది శరీరముయొక్క పరిశ్రమచే సిద్ధించును ఎట్లన మథనముచేత పాల నుండి నవనీతము ఏర్పడునో, చెరకుగెడలను గానుగలో పెట్టి త్రిప్పిన చెరకు రసమేలాగున నుద్భవిల్లుచున్నదో ఆలాగున శరీర పరిశ్రమ చేతనే మహాధర్మమగు జ్ఞానమా విర్భవించును అట్టి తపో, ధ్యాన, వ్రత, స్వాధ్యాయానుష్ఠానములు చేయని వారియొక్క జన్మము వ్యర్థము అదిముదిరిపోయిన చెరకు వట్టి బెండు అయిపోవునట్లున్ను తరచని పాలనుండి వెన్న ఏర్పడ నట్లునుండునని గ్రహించుకొనవలయును

*నిమేషార్ధం న తిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా ।*
*యథా తిష్ఠంతి బ్రహ్మాద్యాస్సనకాద్యాశ్శుకాదయః ॥*

బ్రహ్మాదులున్ను, సనకాదులున్ను, శుకాదులున్ను అర్ధనిమిషమైన బ్రహ్మాకార వృత్తిని విడిచియుండలేదు వారుప్రమాద రహితులై మిక్కిలి జాగ్రత్తగలవారై యుండిరి

కొన్నిటిలో ''జనకాదయః'' అని పాఠాంతరము గలదు జనకుడు రాజ్యపరిపాలనము చేయుచుండినను అర్ధక్షణమైనను బ్రహ్మాకార వృత్తిని మరచియుండలేదు

## 79. సూ ॥ సర్వదా సర్వభావేన నిశ్చింతితైర్భగవానేవ భజనీయః.

పద ॥ సర్వదా - సర్వభావేన - నిశ్చింతితైః - భగవాన్ - ఏవ - భజనీయః

టీక ॥ సర్వదా = సర్వకాల సర్వావస్థలయందు, సర్వభావేన = అన్నిభావములచేతను, నిశ్చింతితైః = ఇతర చింతలేనివారిచే, భజనీయః = భజన చేయదగినవాడు, భగవానేవ = భగవంతుడే

తా ॥ సర్వకాల సర్వావస్థలయందు అన్నిభావముల చేతను నిర్విషయము గలవారిచే భజన, స్మరణ, కీర్తనలు చేయదగిన వాడు భగవంతుడే

వి ॥ భగవత్ స్మరణ కీర్తన, ధ్యానాదులు చేయుటకు కాల సమయము, అవస్థా సమయము చూడనక్కర లేదు అదే భక్తి యోగములో గల విశేషము తక్కిన యోగాభ్యాసముగాని, తపస్సుగాని, అధ్యయనము గాని, వేదాంత విచారణము గాని చేయుటకు కొన్ని కాల సమయముల ఏర్పాటు గలదు అదిన్నీ కాక కొందరికి మాత్రమే అర్హత గలదని విధిగూడ ఉంటున్నది అట్లయిన అర్హులయిన వారికి మాత్రమే మోక్షము, అందరికిన్ని కలుగదు నారదముని సర్వజనములున్ను స్త్రీ పురుషాది భేదములు లేక తరించే మార్గము నుపదేశించేను శ్రీకృష్ణ చైతన్య ప్రభువున్ను ఈనారద మహర్షి మార్గమునే అవలంబిచెను ఇప్పటి నుండియే సర్వకాల సర్వావస్థలలోను భగవత్స్మరణ ధ్యానాదులు చేయక పోయిన యెుక చిక్కు గలుగును అదేమనగా ఏసమయమున ప్రాణము వదలిపోవునో అది యెవరికిన్ని తెలియదు

కొందరు స్నానమాచరించు నప్పుడున్ను, కొందరు బహిర్భూమికి వెళ్ళినప్పుడును, కొందరు సూతకాది కాలములోను, స్త్రీలయిన రజస్వలా కాలములోను, ప్రసవకాలములోను ప్రాణము పోవచ్చును అప్పుడు భగవత్స్మరణ చేయకపోయిన జన్మమే వ్యర్థమగును మరియొక్కచిక్కు గూడ గలుగవచ్చును అదేమన ఒకవేళ అంత్యకాలమాసన్నమైనదనితెలిసినచో రోగగ్రస్తుడై యుండియో, మలమూత్రములలో పడియుండిన నేను స్నాన, శౌచ మడివస్త్రాదులు చేయక భగవత్స్మరణ ధ్యానాదుల నెట్లు చేయవచ్చునని సందేహము కర్మకాండులకు కొందరికి గలుగవచ్చును ఆఖరు సమయమున భగవత్స్మరణ ధ్యానాదులు చేయక పోయినచో అదిన్నీ నిష్ప్రయోజనము గదా!

ఇదంతయు ఆలోచించుకొనియే పరమ కారుణికుడగు నారదముని సర్వకాల సర్వావస్థలలోను భక్తి యోగమునవలంబించుకొన వచ్చునని తెలిపెను ఆత్మానాత్మ విచారణ చేయువారికి ఈసందేహము గలుగదు ఏలన తాను శుచితో గాని, అశుచితోగాని యున్నప్పుడు గూడ ఆత్మ తనలో నుండనే యుంటున్నది అది దేహేంద్రియ మనోబుద్ధ్యాదులకు విలక్షణముగాను ఆకాశమే లాగున శుద్ధాశుద్ధ వస్తువులలో ఉండి నప్పటికిన్ని వస్తువులతో సంబంధములేక విలక్షణముగా నుంటున్నదో అటులనే ఆత్మయొక్క స్థితియు నున్నదని తెలుసుకొనుచున్నాడు ఈకారణమువల్లనే సంధ్యావందన కాలమున ప్రతివారున్ను పఠించుటకు క్రింద కనుపరచిన మంత్రము నేర్పాటు చేయుటకు కారణమైనది

*అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।*
*యస్స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరశ్శుచిః ॥*

ఎవడు స్నానాది క్రియలచే శుద్ధుడై గాని స్నానసంకల్పా దులు చేయక అశుద్ధుడైనను, లేక అన్ని యవస్థలను పొందియుండినప్పుడుగాని, మలమూత్ర విసర్జనము చేయున్నప్పుడుగాని, స్త్రీయైనచో ఇంటికి దూరముగా నుండునప్పుడుగాని, పరమాత్మ ధ్యానము చేయవచ్చును ''స బాహ్యంతరశ్శుచిః'' అని చెప్పుటచేత ఆభగవత్స్మరణచే వెంటనే బాహ్యంతరములయందు శుచిగలవాడగును ఒకడు స్నానశౌచాదులచే నెంత శుద్ధుడైనను శుద్ధాత్ముడగు పరమాత్మ యందు మనస్సు లీనము గానిచో, అతడశుద్ధుడే ఒకడు దేహేంద్రియ శుద్ధి చేయక పోయినను పరమాత్మయందు లయమొందిన మనస్సు గలవాడై యుండినచో అతడు మహాపరిశుద్ధుడే ఏలన సృష్టిలో శుద్ధము, అశుద్ధము అని రెండు పదార్థములే గలవు పంచ భూతాత్మ నిర్మిత దేహాదులన్నియు అశుద్ధములే (జడములే) పంచ భూత విలక్షణమై సాక్షి అయియుండు ఆత్మ ఎల్లప్పుడున్ను శుద్ధమే

*అత్యంత మలినో దేహో దేహీ త్వత్యంత నిర్మలః ।*
*ఉభయోరంతరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే ॥*

పంచభూత సమ్మేళనమై మలమూత్ర క్రిమికీటక సంకులమైన ఈదేహ మెవరిదైనను సరే! సర్వదా యశుచియే శుద్ధమై, ముక్తమై యుండెడు ఆత్మ సర్వదా పరిశుద్ధముగ నేయున్నది ఈరెంటియొక్క రహస్యము తెలిసినచో శౌచ విధి ఎవరికొఱకు చెప్పినదిన్ని గోచరమగును ఒకవేళ శౌచాచారాది క్రియలు దేహమందు

జరిపినను హృదయము శుద్ధిచేయుటకు ఎవరితరము? హృదయమునుండి గదా సమస్త మంత్రములు గాని, ధ్యానములు గాని, వేదాధ్యయనములుగాని జరుగుచున్నవి అచ్చోటు గడుగువారైనను గలరా? ఈవిషయమై హఠయోగ పరులు ఇట్లు చెప్పుదురు 16 మూరల వస్త్రములను మ్రింగి మేము ఆత్మశుద్ధి చేయుచున్నామని వారు మ్రింగెడు వస్త్రము నిండా పలుచనిదగుట చేతను, నాల్గు అంగుళములు వెడల్పుగల దగుటచేతను నీటిలో తడిపి మ్రింగుటచేతను నదియొక పిడికెడు మాత్రము ఉండును అది జీర్ణకోశము అనగా అన్నాది వస్తువులు భుజించునప్పుడు మొట్టమొదట రొమ్మునకు క్రింది భాగములో నుండు సంచి పైభాగమున నిల్చిపోవును తరువాత యుండు చిన్న పేగులలోకి గాని, అడుగున నుండు పెద్దపేగుల లోనికి గాని పోజాలదు మలమంతయు ఆపేగుల లోనే యుండును ఈవస్త్ర ధౌతి మనమేదైన భుజించిన పిమ్మట వమనము చేసిన ఎట్లుండునో ఇదిన్ని ఆలాగుననే యుండును దీనికన్న సులభమైనది జలధౌతి ప్రాతః కాలమున నిల్చుకొని త్రాగుటకు తగిన వేడిగల నీరు కడుపునిండుగా త్రాగి ఉదరమును బాగుగా కదలించి గొంతులోనికి చేతి వ్రేలిని దూర్చి కొంచము కదలించిన ఆనీరంతయు వమనరూపముగా వచ్చి వేయును దీనివల్ల పైత్యాది దోషములన్నియు బటకు వచ్చివేయును ఇది మంచి యారోగ్యమును గలుగజేయును మరియొకటి వాయుధౌతి గలదు ఇది అనుకూలమున్నప్పుడెల్ల చేయవచ్చును నిలిచి గాని సిద్ధాసనములో కూర్చుని గాని శరీరకంఠ శిరస్సులను చక్కగా నిలిపిగాని లేక కొంచము పైకెత్తి గాని పక్షిముక్కువలె పెదవులను జేసుకొని గాలిని బాగుగా లోపలికి పీల్చి కొంచము సేపు నిలిపి నాసికారంధ్రముల ద్వారా విడుచుట వాయుధౌతి యనంబడును దీనియందు భావనగూడ కలిగి యుండిన చాలా బాగుండును వాయు పూరణము చేయునప్పుడు తనలోనికి ఆదైవ శక్తులన్నియు, పుణ్యగుణము లన్నియు వచ్చిచేరినట్లున్ను, వాయువును వదలునప్పుడు తనలో గల రాగద్వేష విషయాదులన్నియు వదలి పోయినట్లున్ను భావన చేయవలయును తరువాత కొంతసేపు ప్రాణాపానముల రెండింటిని నిశ్చలము జేసికొని తాను దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియై సర్వచరాచర వస్తువులన్నిటిలోను అంతర్యామి యై వెలుగుచుండు పూర్ణచైతన్యాత్మ స్వరూపముగ నుండు వాడని భావన చేయవలయును ఆత్మశుద్ధి కి, మనశ్శుద్ధికి, ఇదే సరియైన మార్గము మనసు భావనా రూపమగుటచేత నదియొక్క స్థలమందున్నది గాని ఒక వస్తురూపముగాని గాదు అచట జలధౌతి గాని, వాయుధౌతి గాని, వస్త్రధౌతిగాని శుద్ధము చేయజాలవు ఆరోగ్యమును మాత్రము సమకూర్పగలుగును దానికిన్ని బ్రహ్మచర్యము, శుద్ధాహారము, సత్యప్రవర్తనము

గలిగియుండవలయును తక్కిన ధౌతులన్నియు పామర మనుష్యులకు భ్రమ గలుగ జేయునని మరువ గూడదు మరియొక్క మల శుద్ధి గూడ యోగశాస్త్రమందు గలదు, అది మూలాధారము ద్వారా జలమును ఉదరములోనికి ఎక్కించి ఉదరమును చాలన మొనర్చి బయటకు విడుచుట యగును ఇది యెనిమావంటిదే గాని మరియొక్కటిగాదు దీనివల్ల గొప్ప ప్రయోజనమేమి లేదు ఆత్మయన్ను, మనస్సున్ను నిరాకారమై భావనరూపములు గలవి అది భావముతోనే శుద్ధి గావలసినదే గాని గుడ్డతో తుడిచిశుద్ధము చేయువారెవ్వరైన నుండినచో వారు మాత్రమే వస్త్ర, జల, వాయు, ధౌతులచే ఆత్మను శుద్ధముగ చేయగలరు ఈక్రియలన్నియు హఠయోగ ప్రదీపికాది గ్రంధములలో గలవు

*సర్వేషామేవ శౌచానామర్థశౌచం పరం స్మృతమ్ ।*
*యోఽర్థే శుచిస్స తు శుచిః న మృద్వారిశుచి శ్శుచిః ॥*

సర్వశౌచాది శుద్ధులలో అర్థశుద్ధితో గూడిన మనఃపారిశుద్ధ్యము గొప్ప శుద్ధియని మహర్షులు తలంతురు ఆత్మశుద్ధిలేని వాడు మృత్తిక చేతను, జలముచేతను, ఎంత శుద్ధిచేసినను అశుద్ధుడే ఇది చాణక్య వచనము

*వాచాం శౌచంచ మనసః శౌచమింద్రియ నిగ్రహః ।*
*సర్వభూత దయాశౌచమేతచ్ఛౌచం వరార్థినామ్ ॥*

పరమార్థ చింతన చేయు వారికి యుండవలసిన శౌచము హితోపదేశ మీలాగున చెప్పుచున్నది 1 వాక్శుద్ధి, 2 మనశ్శుద్ధి, 3 ఇంద్రియశుద్ధి, 4 జీవరాసులలో కరుణ గలిగియుండుట, ఇవియే నిజమైన శుద్ధులగును

*జ్ఞానశౌచం పరిత్యజ్య బాహ్యే యో రమతే నరః ।*
*స మూఢః కాంచనం త్యక్త్వా లోష్టం గృహ్ణాతి సువ్రత! ॥*

ఓ మంచి వ్రతము గలవాడా! పైజెప్పిన జ్ఞాన శౌచమునుపేక్షించి బాహ్యశౌచమందు మగ్నులై త్రిసంధ్యా స్నానములు, ద్వాదశోర్ధ్వ పుండ్రములు, షోడశ విభూతి త్రిపుండ్రములు, తులసి, రుద్రాక్షాది మాలలు, పట్టు మడివస్త్రములు మొదలగు బాహ్యాచార క్రియలయందు భ్రమించి యుండు వారి వివేక మెట్టిదనగా చేతియందలి బంగారమును బంగారము కాదని తలంచి పారవేసి గాజుపెంకును అపరంజి బంగారమని తలంచి దాచుకొన్నట్లుండును

*రత్యంతరే మూత్ర పురీష యోర్వా చండాలవేశ్మన్యథవా శ్మశానే ।*
*కృత ప్రయత్నో ఽ ప్యకృత ప్రయత్నః సదా స్మరేత్పే-శనామ ధేయమ్ ॥*

రతికాలమందు గాని (మిథున క్రియ వేళయందు గాని), మలమూత్ర విసర్జన కాలమున గాని, మాలపల్లె యందు గాని, శ్మశాన భూమియిందు గాని, స్నానసంధ్యా దికృత్యములచే శుచితో గూడిగాని, లేక స్నానాదిశౌచము చేయకనే గానీ, సర్వేశ్వర స్మరణ, ధ్యాన, కీర్తనముం చేయవచ్చునని వైశ్వానరస్మృతి చెప్పుచున్నది

*నో దేశ కాల నియమశ్శౌచా శౌచ విన్నిర్ణయః ।*
*పరం సంకీర్తనా దేవ రామ రామేతి ముచ్యతే ॥*

పరమాత్మ ధ్యానమునకు దేశము కాలము నియమము లేదు దేశమనగా పుణ్యప్రదేశము, కాలమనగా ఉదయాస్తమయములు నియమమనగా స్నానాదికములు అనగా సర్వకాల సర్వావస్థల సర్వస్థలభేదములను పాటింపకనే భగవత్స్మరణ ధ్యానాదులను చేయవచ్చును శుద్ధాశుద్ధములను గూడ చూడంబనిలేదు శ్రీరామ రామ రామ అని యుచ్చరించుట వల్ల జీవుడు సర్వపాపములనుండి విముక్తుడగుచున్నాడు

*శుచిర్వాప్యశుచి ర్వాఽపి యోజపేత్ప్రణవం సదా ।*
*న స లిప్యతి పాపేన పద్మ పత్ర మివాంభసా॥*

శుచితో గూడిగాని, అశుచితో గూడినప్పుడు గాని ఎవడు ఏకాక్షరమై ప్రణవ స్వరూపమైన పరమాత్మను ధ్యానించునో (ప్రణవమును జపించునో) వాడు తామరాకు నీటిచే తడవనట్లు సంసారమాలిన్యముచే స్పర్శింప బడడు అని యోగ చూడామణ్యుపనిషత్తు ఇట్లు చెప్పుటచేత స్నాన శౌచ శుచి ప్రదేశాదులు అవసరములు ప్రధానములు కావనియు, ఆత్మశుద్ధియే ముఖ్యముగా నుండవలయుననియు శాస్త్రముయొక్క ఆశయము వర్తమాన కాలమున ఎక్కువ జనులు ఈ బాహ్యాడంబరములోనే మునిగి పోవుచున్నారు ఆత్మ శుద్ధిని గురించి, దైవజ్ఞానమును గురించి విచారించుట లేదు ఈభ్రమను తొలగించుటకే శ్రుతిస్మృతులు ఇట్లు ఉద్ఘోషించుచున్నవి శాస్త్రముయొక్క నిశ్చయ మీలాగున నుంటున్నది

*శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్యమాభ్యంతరం తథా ।*
*మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్తదాన్తరమ్ ॥*

శౌచము రెండు విధములు, అవి వెలిశుద్ధియు లోని శుద్ధియు గలిగియుండవలయును ఈవిధానము లోక రంజనమున కున్ను, మహాత్ముల ప్రీతికిన్ని లేక దైవ ప్రీతికిన్ని కారణమగును ఆరోగ్యమునకున్ను, జ్ఞానప్రాప్తికిన్ని హేతువుగా నుండును

**80. సూ ॥ సకీర్త్యమానశ్శీఘ్ర మేవావిర్భవత్యనుభావయతి భక్తాన్.**

పద ॥ సః - కీర్త్యమానః - శీఘ్రం- ఏవ - ఆవిర్భవతి - అనుభావయతి - భక్తాన్

టీక ॥ సః = ఆభగవంతుడు, కీర్త్యమానః = భగవద్భక్తులచేత స్తుతింప బడుచున్నవాడై, శీఘ్రమేవ = త్వరితముగానే, ఆవిర్భవతి = ప్రత్యక్షమగు చున్నాడు భక్తాన్ = భక్తులను, అనుభావయతి = తన స్వరూప అనుభవము గలవారినిగా చేయుచున్నాడు

తా ॥ ఆభగవంతుడు భక్తులచేత స్తుతింపబడుచున్నవాడై ఆలస్యము లేకనే ప్రత్యక్షమగుచున్నాడు (ప్రసన్నుడగుచున్నాడు) మరియు తన స్వరూపానుభవానందము గలవారినిగా చేయుచున్నాడు

వి ॥ ఇచ్చట సాకార భక్తులను గురించి తెలుపడమైనది నిరాకార రూపముగ ధ్యానించువారికి ఆవిర్భావమనగా తనలో ఆత్మ రూపములేక పరమాత్మ స్వరూపముగ హృదయమున బోధ గలుగుచుండును

''అనుభావయతి'' అను దానికి దైవామృతపానము చేయుచు దైవానందమును అనుభవించే లాగున చేయునని తలచు కొనవలయును

*న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।*
*దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥*

ఓయర్జునా ! ఈనీయొక్క ప్రాకృతమైన నేత్రములచేత విశ్వరూపధరుడనగు నన్ను చూచుటకు శక్తుడవు గావు కావున అప్రాకృతమైన దివ్యనేత్రము నిచ్చుచున్నాను ఈదివ్య నేత్రముచే నాయోగ శక్తిని చూడుము

కావుననే అనన్యమైన భక్తి గలిగి దైవానుగ్రహము సిద్ధించిన వారికి మాత్రమే దైవసాక్షాత్కారము గలుగునని మహనీయులును, శాస్త్రములును చెప్పుచున్నారు

*ఈశ్వరాను గ్రహోచ్ఛాన్తిదాన్త్యాది గుణ సంయుతమ్ ।*
*జన్మ చేల్లభ్యతే తస్మిన్విద్యయా మోక్షమాప్నుయాత్ ॥*

ఈశ్వారాను గ్రహమువల్ల శాన్తి దాన్తి మొదలయిన గుణములు గల జన్మ లభించితే ఆజన్మ యందు జ్ఞానముచే మోక్షమును పొంచున్నాడని అనుభూతి ప్రకాశము దీనియందు గూడ ఈశ్వరానుగ్రహమే అనగా భగవద్భక్తియే ముక్తికి కారణమని చెప్పడమైనది

*నైవ జన్మని సర్వస్మి న్విద్యా౽సౌ సులభా౽పి తు।*
*శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥*

అన్ని జన్మలయందు ఈబ్రహ్మవిద్య లభించుట దుర్లభము శిష్యుని యందుగల శమద మాది గుణములు సంపూర్ణముగా గల జన్మయందే ఈజ్ఞానము కనబడుచున్నది

## 81. సూ ॥ త్రిసత్యస్య భక్తి రేవ గరీయసీ భక్తి రేవ గరీయసీ.

పద ॥ త్రిసత్యస్య - భక్తిః - ఏవ - గరీయసీ - భక్తిః - ఏవ - గరీయసీ

టీక ॥ త్రిసత్యస్య = మూడుకాలములలోను మార్పు లేని భగవంతుని గురించిన, భక్తిరేవ = భక్తియే, గరీయసీ = శ్రేష్ఠమైనది, భక్తిరేవ = అట్టి భక్తియే, గరీయసీ = శ్రేష్ఠమైనది

మోక్షమునకు త్రికాలాబాధ్యుడగు భగవంతుని యందు గల భక్తి యొక్కటియే శ్రేష్ఠమైనది అట్టి భక్తియొక్కటియే అధికమైనది

వి ॥ త్రికాలాబాధ్యమనగ సృష్టి, స్థితి , లయ మనెడు భూత భవిష్యద్వర్తమాన కాలములలోను నొకే విధముగనుండు భగవంతుని యందుండు భక్తియే ముక్తికి సాధనలన్నిటిలోను శ్రేష్ఠమైనది

*బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।*
*తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ (4-5)*

ఓయర్జునా ! నాకును నీకున్ను జన్మము లనేకములు గడచిపోయినవి నేనా జన్మములన్నింటి నెరుగుదును నీవెరుంగవు

*అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్।*
*ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥ (4-6)*

నేను పుట్టుక లేని వాడనై నాశరహిత స్వభావము గలవాడనై భూతములకు ఈశ్వరుడనైయుండియు నాయొక్క విష్ణుమాయను ఆధారముగ జేసికొని పుట్టుచున్నాను జీవులు మాయాపరవశులు ఈశ్వరుడు మాయను స్వాధీనము జేసుకొనిన వాడు గావుననే ''సంభవామ్యాత్మ మాయయా'' అని ప్రయోగించుటకు గారణమైనది భగవంతుడు గ్రహించెడు అవతారముల శరీరముల నుపేక్షించినను భగవానుడు శాశ్వతుడు శరీరములన్నియు మానవుల శరీరముల వలెనే యుండును అయితే భగవచ్ఛరీరము అప్రాకృత దివ్య తేజశ్శక్తిగలిగి యుండును మానవుల దేహములు సామాన్య పంచభూతములతో గూడియుండును దేహములు నశించినను మానవుల ఆత్మకు నేలాగున నాశనము లేదో భగవత్స్వరూప మున్ను ఆలాగున నేయుండును కావున గీతలో

*వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।*
*తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ (2-22)*

దీనియర్థ మిదివరలో వ్రాయబడినదే ఈసూత్రములంత్యములగుటచే ఆత్మయొక్క సాక్షాత్స్వరూపము తెలుసుకొనవలయునని అభిప్రాయము హృదయములో నుంచియే దేవర్షి యగు నారదుండు ''త్రిసత్యస్య'' అని ప్రయోగించుటకు గారణమైనది ఈరహస్యమునే అ 13 లో శ్రీ కృష్ణభగవానుడు పదేశించెను

*క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।*
*క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్జ్ఞానం మతం మమ ॥ (13-3)*

బ్రహ్మాది స్తంబ పర్యంతముగల సకలోపాధులయందును ఉపాదిభేదముచే వేరుగా నున్నను పరమార్థ జ్ఞానముచేత నొకటే యగు ఆత్మయే నేనని తెలుసుకొనుము ఇట్టి

క్షేత్ర క్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞానమేది గలదో అదియే నిజమైన జ్ఞానమని నామతము ఈజ్ఞానము తెలిసియుండవలయునని అభిప్రాయము శ్రీకృష్ణభగవానునికి గలిగి యుండుటచేతనే ''యత్తదద్జ్ఞానం మతం మమ'' అని ప్రయోగించుటకు గారణమైనది ఇదే నిజమైన జ్ఞానమని శ్రీకృష్ణభగవానుని యాశయము ఇది మహావాక్యములలో మొదటిది యగు ''ప్రజ్ఞానం బ్రహ్మ'' అనుదానిని గురించి నిరూపించుచున్నది ఈజ్ఞానము గలుగు నప్పుడే యధార్థమైన ధైర్యము జీవులకు గలుగును లేనిచో దేహోపాధులే తామను భ్రమలోచిక్కు కొని ఆదేహసంబంధ అర్హతయే తమకు గలదని తలంచి జడప్రాయులగుటయేగాక ఆత్మోన్నతికి ప్రయత్నముగూడ జేయ జాలక పోదురు మహావాక్య ములలో మొదటిదియగు ''ప్రజ్ఞానం బ్రహ్మ'' అను దానిని గురించి ఈ శ్రుతి నిరూపించుచున్నది

*చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వ గవాదిషు ।*
*చైతన్య మేకం బ్రహ్మేతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥*

చతుర్ముఖ బ్రహ్మ మొదలు ఇంద్రుడు, దేవతలు, మనుష్యులు, అశ్వములు, గోవులు మొదలగు నన్నిటిలోను నే బ్రహ్మచైతన్యము గలదో అట్టి చైతన్యము నాయందు గూడగలిగి యుండుట వల్ల ఆచైతన్యమే తానగుటవల్లను తానున్నూ ఆ బ్రహ్మస్వరూపుడే యగుచున్నాడు ఈఅవస్థనే వేదాంత ముపదేశించుచున్నది ఈభావన రూఢిగలిగినచో పుత్ర రహితుడైన సార్వ భౌముడు వీధిలో బిక్షమెత్తెడు పిల్లవానిని పట్టాభిషిక్తుని జేసి చక్రవర్తిగా జేసిన నెంత మార్పుగలుగునో ఈజీవునికిన్ని అంత మార్పు గలుగును

*శ్రుతి ॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే,*
*తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥*

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది స్థూల సూక్ష్మకారణదేహాదులను ఏ యాత్మ ప్రకాశింపచేయుచున్నదో ఆ ఆత్మయే తన యాత్మగాను, పరమాత్మ స్వరూపముగాను నుండునని నెరింగిన వాడు సర్వబంధములనుండి విముక్తిని బొందుచున్నాడు

*ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్ర త్స్వప్న సుషుప్తిషు ।*
*స్థాన త్రయవ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥*

స్థూల, సూక్ష్మ, కారణములనెడు మూడు దేహములనున్ను జాగ్రత్స్వప్న సుషుప్తులయందున్ను ఏకమైన మూడింటిని నతిక్రమించిన వాడై దైవసాక్షాత్కార జ్ఞానము

బొందిన వానికి పునర్జన్మము గలుగదు ఈవిషయమై శ్రుతులు సహస్ర ముఖములుగా నుపదేశించుచున్నవి గ్రంథవిస్తారమగునని తలంచి ఎక్కువ వ్రాయ తలంచలేదు

పాపానాం హి పరం శ్రేష్ఠం మమ విస్మరణం స్మృతమ్ ।
సర్వేషామపి పుణ్యానాం వరిష్ఠం స్మరణం మమ ॥

పాపములన్నిటిలోను అధికమైన పాపమేమన భగత్స్మరణ మరచి యుండుటయే యగునను పుణ్యములన్నిటిలోను నధికమైన పుణ్యమేమన భగవత్స్మరణ గలిగియుండుటయే యగును

యతః పాపార్ణవం త్రాతుం భక్తిర్నౌరివ నిర్మితా ।
త్వరితం జీవితం యాతి త్వరితం యాతి యౌవనమ్ ॥

త్వరితం వ్యాధిరభ్యేతి తస్మాత్పూజ్యః పినాకధృక్ ।
యావన్నేంద్రియ వైకల్యం తావత్పూజయ శంకరమ్ ॥

పాప ( అజ్ఞాన) మనెడి సాగరమును దాటుటకు భక్తియనెడు నావ సర్వేశ్వరునిచే నిర్మింప బడెను జీవితము అతిత్వరలో నశించి పోవుచున్నది ఆలాగున యౌవనమున్ను శీఘ్రముగా గడచి పోవుచున్నది ఆలాగున రోగమున్ను త్వరలోనే దగ్గరలోనికి చేరుతున్నది అందువలన త్వరలోనే ఆలస్యము చేయక భగవంతుని సేవింప వలయును ఎంతవరకు మరణము దగ్గరకు రాలేదో ఎంతవరకు జరానెరలు ఈశరీరమును ఆక్రమించలేదో, ఎంతవరకు దేహేంద్రియముల పటుత్వము తప్పలేదో దానికి ముందుగానే సర్వేశ్వరుని సేవింపుము అనగా భగవద్భక్తిని జేయుము

హరిర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః ।
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥

దుష్టచిత్తము గలవాడై యుండినను తెలిసి గాని తెలియక గాని భగత్స్మరణ జేసినచో శ్రీహరి పాపములన్నిటిని హరించును అగ్నియందు తెలిసి గాని, తెలియక గాని పడినను లేక ఏవస్తువులైనను పడిపోయిననేలాగున భస్మమొనర్చునో ఈభాగవద్భక్తియును నాలాటిదే

**82. సూ ॥ గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాఽఽసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి,**

**కాంతా౽౽సక్త్యాత్మ నివేదనా౽౽సక్తి,**
**తన్మయంతా౽౽ సక్తి, పరమ విరహాసక్తి,**
**రూపైకధా౽ప్యేకాదశధా భవతి.**

పద ॥ గణమాహాత్మ్య సక్తి రూపాసక్తి పూజాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి వాత్సల్యాసక్తి కాంతాసక్త్యాత్మనివేదనాసక్తి తన్మయతాసక్తి పరమవిహార సక్తి రూపా - ఏకధా- అపి - ఏకదశధా - భవతి

టీక ॥ భగవద్భక్తి యనునది ఒక విధమైనను జీవుల సంస్కారము అభిరుచులను బట్టి పదకొండు విధములుగా నుండును (1) గుణమాహాత్మ్యసక్తి భగవంతుని దివ్యగుణముల వినుట యందాసక్తి గలిగియుండుట, (2) రూపాసక్తి = భగవంతుని దివ్యావతార స్వరూపములను సందర్శించుట యందాసక్తి గలిగియుండుట, (3) పూజాసక్తి = భగవంతుని పూజించుట యందాసక్తి కలిగియుండుట, (4) స్మరణాసక్తి = భగవన్నామస్మరణ చేయుట యందాసక్తి గలిగియుండుట, (5) దాస్యాసక్తి = భగవంతుని భక్తితో అనగా దాసభావముతో సేవించుట యందాసక్తి గలిగియుండుట, (6) సఖ్యాసక్తి= స్నేహితుని వలె భగవంతుని ప్రేమించుట యందాసక్తి గలిగి యుండుట, (7) వాత్సల్యాసక్తి = భగవంతుని యందు వాత్సల్యముంచుట యందాసక్తి గలిగియండుట, (8) కాంతాసక్తి= భగవంతుని నాయకునిగా దలచి భక్తుడు నాయిక వలె సేవ చేయుట యందాసక్తి గలిగియుండుట, (9) ఆత్మనివేదనాసక్తి = భగవంతునికి తనను పూర్తిగ సమర్పించుకొనుట యందాసక్తి గలిగియుండుట, (10) తన్మయతాసక్తి = భగవంతుని తో నైక్యమును బొందుట యందాసక్తి గలిగియుండుట, (11) పరమవిరహాసక్తి = పరమాత్మను విడచి ఒక క్షణమకాలమైనను యుండలేక భరింపలేని మహావిరహాసక్తిగలిగియుండుట, రూపా ఏక ధాపి = అట్టి భక్తి ఒకే విధమైనను, ఏకాదశధా= పదకొండు విధములుగా, భవతి = అగుచున్నది

తా ॥ భగవద్భక్తి యనునది ఒకే విధమైనను అదిజీవుల సంస్కారమును, అభిరుచులను బట్టి పదునొకండు విధములుగా నుంటున్నది అవేవన (1)గుణమాహాత్మ్యసక్తి (2) రూపాసక్తి (3) పూజాసక్తి (4) స్మరణాసక్తి

(5) దాస్యాసక్తి (6) సఖ్యాసక్తి (7) వాత్సల్యా సక్తి (8) కాంతా సక్తి (9) ఆత్మనివేదనాసక్తి (10) తన్మయతా సక్తి (11) పరమ విరహాసక్తి యని పదకొండు విధములు

వి ॥ దీని యందు చిట్ట చివరకు చెప్పిన పరమ విరహాసక్తి గొప్పది ఈభక్తి గోపికలకు గలిగి యుండెను నీటినుండి యొడ్డునకు పడిన చేప జలములో పోయి చేరుటకు నెట్లు పరితపించునో అత్తరి ఆయొక్క చింతన తప్ప మరియొక చింతన మెట్లు గలుగదో ఆలాగున భగవంతునిలో నైక్యమగుటకు అది యొక్క చింతమాత్రము గలిగి తక్కిన సంకల్పము లెవ్వియు గలుగక యుండని అవస్థయే పరమ విరహాసక్తి యను భక్తి యగును ఈవిషయమై కైవల్య నవనీతము తీవ్ర ముముక్షుత్వమును గూర్చి చెప్పునప్పుడీలాగున వచించెను రాత్రి కాలమున తలుపు వేసియుండగా అగ్నిచే దహించెడు నింటి నిప్పును నార్పుట కనేక పురుషులు ఇంటిచుట్టు నుండగా వస్త్రము సహా కా లిపోయిన నారీమణి ఎచ్చట సందుదొరికిన దానివల్ల పురుషుల మధ్య పరుగెత్తి పోయి నీటిలో పడులాగున నుండునని నిరూపించడమైనది

కావుననే విరహాసక్తి యని చెప్పక పరమ విరహాసక్తి యని ప్రయోగించడమైనది విరహాసక్తి యని చెప్పినచో నది కామముతో గూడినదగును గోపికల విరహాసక్తి యట్టిది కాదని నిరూపించుట కొఱకే ''పరమ'' యను పదమును ప్రయోగించడమైనది పరమ మనుటచే యప్రాకృతమైనదనియు, పరమాత్మకు సంబంధించిన దనియు తెలియదగినది కైవల్యనవనీతమున మరియు నిట్లు చెప్పబడెను పేడదిబ్బలోపల నుండు తెల్లని దొడ్డదగు పురుగు వేసవికాలమున కాలుచుండు ఇసుక లోపడిననెట్లు తపించునో ఆలాగున తాపత్రయాగ్నిచే తపించెడు జీవుడు పరమాత్మ జ్ఞానము గలిగి ఆత్మశాంతి గలుగుటకు అట్టి తపనము గలిగియుండవలయునని నిరూపించడమైనది శ్రీరామకృష్ణ పరమహంసల వారు ఈవిషయమును ఒక్కరిని గురించి చూపినారు అతడంత నిర్మల భక్తుడు గాడు నిర్మల భక్తుని వలె నటించి అప్పుడప్పుడు శ్రీరామకృష్ణ పరమ హంసల వారి దగ్గరకు వచ్చి యుపదేశమడుగు చుండెడివాడు ఉపదేశమునకు ఇతర చింతలేమియు లేక తదేక భగవచ్చింతన మాత్రము గలిగియుండ వలయునని పరమహంస లవారు చెప్పు చుండెడివారు ఆభక్తుడు తనకితర చింతన లేమియు లేవనియు, మోక్షము గలిగిన చాలునెడి చింత యొక్కటే గలిగియున్నదని చెప్పగ సరిమంచిది రేపు ప్రాతః కాలమున నాతో గంగలో స్నానము జేయుము చూచుకొని మంత్రోపదేశ విషయమై

ఆలోచించెదమనిరి స్నానకాలమున అతడు నీటిలో మునుగునపుడు పరమ హంసలవారు యతని మెడను గట్టిగ నీటిలోని కదిమెను అతనికి ఊపిరి ఉక్కిరి బిక్కిరై పైకి లేయుట కెంత ప్రయత్నించినను పరమహంసలవారు మరింత బలముతో కొంత కాలము పట్టిన తరువాత విడిచి పెట్టెను కొంత సేపు శ్వాస నిశ్వాసములను నెమ్మతి చేసుకొన్నప్పుడు పరమహంసలవారిట్లడిగిరి, ''నాయనా ! గురువు దగ్గర సత్యము జెప్పవలయును అసత్యమును జెప్పరాదు నీటిలో మునిగి యుండగనేను అదిమిపట్టగ ఊపిరి తక్కిరి బిక్కిరిగానుండిన సమయమున మీకేచింతగలిగియుండెనో చెప్పుమా?'' యని అడిగెను అపుడతడు ''స్వామీ ! నీట నుండి బయటికి వచ్చి యూపిరి యాడిన చాలు''నను భావముండెనని చెప్పగా ''నీటిలో నున్నప్పుడు నీకు భగవత్ప్రాప్తి గలుగవలయునని భావముండలేదుగదా ! ప్రాణ రక్షణజేయు వలయుననెడి తలంపు గదా గలిగియుండెను ఇట్టి వారు మోక్షమున కర్హులు గారు నీటిలో మునిగియుండగ ప్రాణ బాధ గలిగిన సమయమున గూడ భగవద్ జ్ఞానము గలుగలేదే ! భగవద్దర్శనము చేయలేదే మోక్షము బొందలేదే జీవితము వ్యర్థమాయెను గదా యను మనోవేదన గలవాడే మోక్షమున కర్హు'' డని తెలిపిరి ఇది చూచిన నిపుడు గలవారియొక్క భక్తి వైరాగ్యము లెట్లుండునో తెలుసుకోవచ్చును

ఈ నారదసూత్రమందు పదకొండు విధములుగా భక్తిని గురించి వివరించడమైనది భాగవతాది గ్రంథములలో భక్తి నవ విధములుగా వర్ణించడమైనది 10 తన్మయతాసక్తి 11 పరమవిరహాసక్తి ఈ రెండున్ను భాగవతాది పురాణకాలములో జెప్పిన భక్తికన్న అధికరించినవి

*శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనమ్ ।*
*అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥*

1 శ్రవణము, 2 కీర్తనము, 3 స్మరణము, 4 పాదసేవనము, 5 అర్చనము, 6 వందనము, 7 దాస్యము, 8 సఖ్యము, 9 ఆత్మనివేదనము 1 శ్రవణమనగా అనంతకల్యాణగుణ పరిపూర్ణుడైన భగవానుడు, భక్తుల సంరక్షించుటకొఱకు అవతరించిన కథలను వినుట, 2 కీర్తనమనగా, భగవంతుని కల్యాణగుణములను కీర్తించుట, 3 స్మరణమనగా భగవంతుని దివ్యనామములు స్మరించుచుండుట, 4 పాదసేవనమనగా భగవదవతార మూర్తులగు విగ్రహముల సేవించుట, 5 అర్చనమనగా పరమపురుషుని తులసి మొదలగు పుష్పములచే పూజించుటయు, 6 వందనమనగా

భగవంతునికి ప్రదక్షిణ నమస్కారములను చేయుట, 7 దాస్యమనగా భగవన్మందిరములో అన్ని విధములలోను కైంకర్యపరుడై యుండుట, 8 సఖ్యమనగా ప్రాణమువలె భగవంతుని ప్రేమించుటయు, 9 ఆత్మ నివేదనమనగా తన్నును, తనకు సంబంధించిన వన్నిటిని భగవంతునికి సమర్పించుట

1 శ్రవణమువల్ల పరీక్షిద్రాజున్ను 2 కీర్తనమువలన శ్రీనారదమహర్షియు, 3 స్మరణమువలన శ్రీశుకబ్రహ్మర్షియు, 4 పాదసేవనమువలన శ్రీలక్ష్మణ స్వామియు, 5 అర్చనమువలన పృథుచక్రవర్తియు, 6 వందనమువలన అక్రూరుడున్ను, 7 దాస్యమువలన గరుడ హనుమంతులున్ను, 8 సఖ్యమువలన అర్జునుడున్ను, 9 ఆత్మనివేదనము వలన శ్రీబలిచక్రవర్తియు పరమపదమను మోక్షమును బొందిరి

ప్రమాణము -

విష్ణోస్తు శ్రవణే పరీక్షిదభవద్వ్యాసకిః కీర్తనే
ప్రహ్లాదస్స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుః పూజనే ।
అక్రూరస్త్వభివందనేఽథ హనుమాన్ దాస్యే చ సఖ్యేఽర్జునః
సర్వస్వాత్మనివేదనే బలిరభూత్కైవల్య మేషాం నమః ॥

హరేర్నామైకమప్యత్ర కలౌ వదతి యో నరః ।
కలిర్న బాధతే తం చ సత్యం సత్యం న సంశయః ॥

ఈ కలియుగమున హరినామస్మరణమును మాత్ర మేనరుండు చేయుచుండునో, అట్టివానిని కలిదోషము బాధించజాలదు ఇది సత్య మిది సత్యము దీనియందు సంశయము లేదు

*జ్ఞానం తు దుష్కరం లోకే భజనం సుకరం మతమ్ ।*
*విజ్ఞానం న భవత్యేవ ద్విజా భక్తివిరోధినః ॥*
*శంభు భక్తికరస్యైవ భవేద్జ్ఞానోదయో ద్రుతమ్ ॥*

జ్ఞాన మీకలియుగమున ప్రయాసముచే పొందదగినది భజన పరమగు భక్తియో సులభమని మహాఋషుల మతము ఓద్విజులారా ! భక్తివిహీనులకు ఆత్మజ్ఞానము కలియుగమున గలుగదు ఈశ్వర భక్తిగలవానికి ఆత్మజ్ఞానోదయ మతిత్వరలో సిద్ధించును

నమో భగవతే వాసుదేవాయోంకారపూర్వకమ్ ।
మహామంత్రమిదం ప్రాహు స్తత్త్వజ్ఞా ద్వాదశాక్షరమ్ ॥

''ఓం నమోభగవతే వాసుదేవాయ'' అనునది ద్వాదశాక్షర మహామంత్ర మని తత్త్వ జ్ఞానులగు మహర్షులు పలికిరి

*ప్రణవాద్యం నమోమధ్యం నారాయణపదాన్తిమమ్ ।*
*మన్త్రమష్టాక్షరం విద్యాత్సర్వసిద్ధికరం నృణామ్ ॥*

మొదట ఓంకారము మధ్య నమో, నారాయణాయ అంత్యము ఇదే అష్టాక్షర మహామంత్రమని తెలియందగినది, ఇది మానవులకు సమస్త సిద్ధులున్ను మోక్షమున్ను గలిగించును

నమో రామాయేతి విప్ర మంత్రమోంకార పూర్వకమ్ ।
షడక్షరం జపేద్యస్తు సాయుజ్యం ప్రాప్యతే నరః ॥

''ఓం రామాయ నమః'' అను నీ శ్రీరామషడక్షరమంత్రమును నెవండు జపమొనర్చునో, ఓ విప్రోత్తమా ! అట్టి నరుండు సాయుజ్యముక్తిని బొందును

*అహో చిత్రం మనుష్యాణాం చరిత్రమిదముచ్యతే ।*
*రామేతి ముక్తిదం నామ న స్మరన్తి దురాశయాః ॥*

*వక్తుం శ్రమో న చాల్పోఽపి శ్రోతుమత్యంత సున్దరమ్ ।*
*తథాపి రామ రామేతి న వదంతి దురాశయాః ॥*

ఓహో! మానవులయొక్క చరిత్ర మతివిచిత్రమైనదని జెప్పబడు చున్నది ''రామ'' అను మోక్షమును గలుగ జేసెడు నామమును స్మరించుట లేదే వీరిమనసెంత చిత్రమైనదో ఆశ్చర్యము రామ యను పదము నుచ్చరించుటకు కొంచెమైనను శ్రమ యనునది లేనే లేదు వినుటకున్ను ఆరామ వాక్యమెంత సుందరమైనది అట్లుండియు ''రామరామ'' యను దివ్యమైన తారకమంత్రమును జపించుటలేదే ! వీరెంతదురదృష్టులో చెప్పలేమని మహాఋషిసత్తములు నొకరి కొకరు జెప్పుకొని ఆశ్చర్యపడుచున్నారు

*ఇహోం నమశ్శివాయేతి మంత్రేణానేన సిద్ధయః ।*
*న తస్మాదధిగంతవ్యః పరావరవిభూతయే ॥*

ఈలోకమున ''ఓం నమశ్శివాయ'' అను నీమంత్రము చేతనే సమస్త సిద్ధులు గలుగుచున్నవి కావున ఓం నమశ్శివాయ అను మంత్రము అందరిచేతను పొందదగినది ఇది పరాపర విభూతిని గలుగ చేయునది పరబ్రహ్మప్రాప్తిని గలుగ జేయునది పరాపర విభూతిని యనగ ఇహపర సౌఖ్యముల రెండింటిని గలుగజేయునది

*పూర్వం తు సర్వమంత్రాణాం యో జయేత్ప్రణవం శుభమ్ ।*
*ఓంకారః ప్రణవం బ్రహ్మ సర్వమంత్రేషు నాయకః ॥*

సమస్త మంత్రములకు మొదట శుభప్రదముగు ప్రణవమును జేర్చుకొనవలయును ఓంకారమనియు, ప్రణవమనియు జెప్పునది సాక్షాత్పర బ్రహ్మస్వరూపము ఇది సర్వ మంత్రములలోను నాయకము

**83. సూ ॥ ఇత్యేవం వదన్తి జనజల్ప నిర్భయాఏకమతాః కుమార వ్యాస శుకశాణ్డిల్య గర్గ విష్ణు కౌణ్డిన్య శేషోద్ధవారుణి బలి హనుమద్విభీషణాదయో భక్త్యాచార్యాః.**

పద ॥ ఇతి - ఏవం - వదన్తి - జనజల్పనిర్భయాః - ఏకమతాః - కుమార వ్యాస శుకశాణ్డిల్య గర్గ విష్ణుకౌణ్డిన్య శేషోద్ధవారుణిబలి హనుమ ద్విభీషణాదయః - భక్త్యాచార్యాః

టీక ॥ జనజల్పనిర్భయాః = పామరజనులయొక్క నిందాదూషణలకు భయపడనివారు, ఏకమతాః = భక్తియొక్కటియే ముక్తిని గలుగజేయునను ఏకాభిప్రాయము గలవారు, కుమార= సనత్కుమారుడు, వ్యాస = వ్యాసుడు, శుక = శుకుడు, శాండిల్య = శాండిల్యుడు, గర్గ = గర్గుడు, విష్ణు = విష్ణువను ఋషి, కౌండిన్య= కౌండిన్యుడు, శేష = ఆదిశేషుడు, ఉద్ధవ = ఉద్ధవుడు, ఆరుణి = ఆరుణి, బలి= బలిచక్రవర్తి, హనుమత్ = హనుమంతుడు, విభీషణ= విభీషణుడు, ఆదయః = మొదలుగాగల, భక్త్యాచార్యా= భక్త్యాచార్యులు, ఇత్యేవం = భక్తియే ముక్తి నిచ్చునదని, వదంతి = చెప్పుచున్నారు

తా ॥ పామర జనులయొక్క నిందాదూషణలకు భయపడని వారలై, భక్తియొక్కటియే ముక్తిని గలుగజేయునని ఏకాభిప్రాయము గలవారెవరన సనత్కుమారుడు, వ్యాసుడు, శుకుడు, శాండిల్యుడు, గర్గుడు, విష్ణువనుఋషి

కౌండిన్యుడు, ఆదిశేషుడు, ఉద్ధవుడు, ఆరుణి, బలిచక్రవర్తి, హనుమంతుడు, విభీషణుడు, మొదలుగా గల భక్త్యాచార్యులు భక్తియే ముక్తి నిచ్చునదని జెప్పుచున్నారు

వి ॥ దీనియందు ''కుమార'' అని ప్రయోగించుటచేత బ్రహ్మ మానస పుత్రుడగు దేవర్షి యగు నారదుడనగు నేనున్ను భక్తియే ముక్తిని గలుగ జేయునని ప్రభోదము జేయు వారలలో ప్రధముడని భావించి కుమార శబ్దము ముందుగ ప్రయోగించుటకు గారణమైనది లేక తనచే నిర్మింప బడిన భక్తి సూత్రములగుటచే తన పేరు స్వయముగా జెప్పక కుమారుడని జెప్పియుండవచ్చును లేక ఋషులందరిలోను సనత్కుమారుడు గొప్పవాడును, బ్రహ్మమానస పుత్రుడును నగుటచే సనత్కుమారు ల పేరుముందుగా ప్రయోగించి యుండవచ్చును సనక, సనందన, సనత్కుమార సనత్సు జాతులు నలుగురున్ను మహాయోగులని ప్రసిద్ధి గాంచిన వారలు అట్టి మహాయోగసిద్ధియు భక్తి వల్లనే గలిగినదని నిరూపించుట కొరకు సనత్కుమారుల పేర్లు మొదటనే జెప్పడమైనది ''విభీషణాదయః'' అని ఆదిశబ్దము ప్రయోగించుటవల్ల భక్తి వల్లనే మోక్షము గలుగునని అభిప్రాయము గల ఋషులు ఇకను పెక్కండ్రు గలరని తెలుపడమైనది అగస్త్యుడు, భృగువు, దూర్వాసుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు సూతుడు, శౌనకుడు మొదలగు వారెందరో గలరు, ''భక్త్యాచార్యాః'' అని చెప్పుటలో వీరందరు భూలోకములో భక్తిమత ప్రవర్తకులై యుండిరి ఒక మతమును ప్రవర్తమానముగా జేయు వారికే ఆచార్యశబ్దము ప్రయోగించ బడును ద్వైతమతాచార్య, శ్రీమధ్వాచార్యులు, విశిష్టాద్వైతాచార్య, శ్రీరామానుజా చార్యులు, అద్వైతమతా చార్య, శ్రీశంకరాచార్యులు ఈలాగున ఆచార్య శబ్దము ప్రయోగించెడు స్థలములలో ఆయామతములను ప్రపంచములో ప్రబోధించిన వారలని గ్రహించుకొనవలయును ఆలాగున సాంఖ్యమతా చార్యుడు కపిలుడు, యోగమతాచార్యుడు పతంజలి, వ్యాకరణ మతాచార్యుడు పాణిని, ఈలాగున ఆచార్య శబ్దమున కర్థము గ్రహించుకొనునది ఆచార్యుడనగా గురుడు ఆచార్యశబ్దార్థము -

*ఆచినోతి చ శాస్త్రాణి ఆచారే స్థాపయత్యపి ।*
*స్వయమాచరతే యస్మా దాచార్య స్తేన కథ్యతే ॥*

మొదట ఆచార్యులవద్ద శాస్త్రములచక్కగా అధ్యయనము జేసుకొని ఆశాస్త్రములో జెప్పిన చొప్పున ఆచరించువాడై తాను ఆచరించునట్లు శిష్యులచే ఆచరింప

జేయు వాడెవడు గలడో ఆకారణమువల్ల ఆచార్యుడని శాస్త్రములచే చెప్పబడినది ఇకగురు శబ్దార్థమును వినుడు

*గుశబ్దస్త్వంధకారఃస్యాత్ రుశబ్దస్తన్నిరోధకః ।*
*అంధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే ॥*

''గు'' అను శబ్దము అంధకారమునకు సంబంధించినది ''రు' అను శబ్దము ఆ అంధకారమును నశింపజేయు ప్రకాశము గలిగినది అజ్ఞానమను నంధకారమును రహితమొనర్చి జ్ఞాన ప్రకాశమును గలుగజేయు వానినే గురువందురు

**84. సూ ॥ య ఇదం నారద ప్రోక్తం శివానుశాసనం విశ్వసితి శ్రద్ధత్తే స భక్తి మాన్భవతి స ప్రేష్ఠం లభతే స ప్రేష్ఠం లభత ఇతి.**

పద ॥ యః - ఇదం -నారద ప్రోక్తం - శివాను శాసనం - విశ్వసితి - శ్రద్ధత్తే - సః - భక్తిమాౕ - భవతి - సః - ప్రేష్ఠం - లభతే - సః - ప్రేష్ఠం - లభతే - ఇతి

టీక ॥ యః = ఎవడు, ఇదం = ఈ, నారద ప్రోక్తం = నారదమునిచే జెప్పబడిన, శివానుశాసనం = మంగళాశాసనము, విశ్వసితి = విశ్వసితి = విశ్వసించునో, శ్రద్ధత్తే - శ్రద్ధతో నుపాసించునో, సః - వాడు, భక్తిమాౕ = భక్తి గలవాడు, భవతి = అగుచున్నాడు, సః = వాడు, ప్రేష్ఠం = మిక్కిలి ప్రేమాస్పదమైన భగవంతుని, లభతే = పొందుచున్నాడు సః = వాడు, ప్రేష్ఠం = మిక్కిలి ప్రేమ పాత్రుడైన పరమాత్మను, లభతే = పొందుచున్నాడు, ఇతి = ఈప్రకారముగా, నారదః = నారదమహర్షి, ప్రోవాచ = వచించెను ఇతి = శబ్దము గ్రంధాంత మునుపదేశించు చున్నది

తా ॥ ఎవడు ఈనాదమహర్షిచే జెప్పబడిన మంగళ కరమగు నారద భక్తి సూత్రములను విశ్వసించి శ్రద్ధతో నుపాసించునో వాడు భక్తిగల వాడగుచున్నాడు వాడు మిక్కిలి ప్రేమాస్పదమైన భగవంతుని బొందుచున్నాడు వాడు మిక్కిలి ప్రేమపాత్రుడైన పరమాత్మను బొందుచున్నాడు

వి ॥ శ్రద్ధా విషయమై -

శ్రద్ధావాన్లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః ॥
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాదిగచ్ఛతి ॥ (గీ-4-39)

శ్రద్ధ గలవాడును, తదేక నిష్ఠగలవాడును, సర్వేంద్రియ నిగ్రహముగల వాడు జ్ఞానమును బొంది సర్వోత్కృష్టమైన పరమశాంతిని ( ప్రకృతి శమించిన స్థానమును) శీఘ్రముగా బొందుచున్నాడు అనగా మోక్షమును బొందుచున్నాడని యర్థము

*అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।*
*అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసార వర్త్మని ॥ (9-3)*

ఓయర్జునా ! ఈ ఆత్మజ్ఞాన ప్రాప్తి కరమగు ధర్మమును భగవంతునియందు శ్రద్ధలేని మానవులు బొందజాలక జనన మరణ రూపమగు సంసారమార్గము నందే వర్తించుచుందురు భగవత్ప్రాప్తికి శ్రద్ధ యొక్కటియే ముఖ్యకారణమని భగవానుడుపదేశించెను శ్రద్ధగలిగి యుండుటకు బ్రాహ్మణుడై పుట్టవలయునని గాని, సన్న్యసియై యుండవలయునని గాని, శాస్త్రము చదివియుండవలయునని గాని భగవానుడు చెప్పియుండలేదు శ్రద్ధ గలవారెవరైనను భగవంతుని (మోక్షమును) బొందగలరు

*నాస్తి శ్రద్ధాసమం పుణ్యం నాస్తి శ్రద్ధాసమం సుఖమ్ ।*
*నాస్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప ॥*

నారదపురాణము ఇది నారద మహర్షిచే ఒకానొక రాజుకొఱకు పదేశింపబడినది ఓ రాజా! ఈ సంసారములో మానవులకు శ్రద్ధకు సమమైన పుణ్యము లేదు శ్రద్ధకు సమానమగు సుఖమున్ను లేదు శ్రద్ధకు సమమగు తీర్థయాత్రయున్ను లేదు, శ్రద్ధ యనగా? ఏ సమయములో ఏపనిని ఏలాగున జేయవలయునో ఆలాగున శుద్ధముగా జేయుటయే

*సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।*
*సర్వస్సద్బుద్ధిమాప్నోతు సర్వస్సర్వత్ర నందతు ॥*

*ఓం తత్సత్*



ఓమ్

# శ్రీభగవద్గీత

## ( భక్తియోగము)

### భక్తుని యొక్క లక్షణము

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥

సకల భూతములనున్ను ద్వేషింపనివాడును, మిత్రధర్మముగల వాడును, దయ గలవాడును, మమత్వము లేనివాడును, అహంకారము లేనివాడును, సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, ఓర్పుగల వాడును

*సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।*
*మయ్యర్పితమనో బుద్ధిర్యో మద్భక్తస్సమే ప్రియః ॥*

నిత్య సంతోషియు, మనోనిగ్రహము గలవాడును, నిశ్చయ జ్ఞానము గలవాడును, నాయందర్పించిన మనస్సున్ను, బుద్ధియును గలవాడును, ఎవడో అట్టి నిష్కామానుష్ఠానపరుడగు యోగియే ( ధ్యాన యోగము చేయువాడే) నాకు భక్తుడున్ను, నాకు ప్రియుడున్ను అగుచున్నాడు

*యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।*
*హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః ॥*

ఎవనివలన ( లోకము) జనము భయము నొందదో, ఎవడు లోకము వలన భయము నొందడో, ఎవడు సంతోషరోష భయములచే గలతనొందని మనస్సుగలవాడో అట్టివాడు నాకు ప్రియుడు

*అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।*
*సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥*

ఏ నాభక్తుడు దేనియందు నపేక్ష లేనివాడును, బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడును కార్యదీక్షగలవాడును ఎందును తగులుకొననివాడును, మనోవ్యాకులత్వము లేనివాడును, సమస్తాడంబర కర్మలను వదలినవాడును అగుచున్నాడో వాడు నాకు ప్రియుడు

*యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।*
*శుభాశుభ పరిత్యాగీ భక్తి మాన్యస్స మే ప్రియః ॥*

ఎవడు సంతోషింపడో, ద్వేషింపడో, దుఃఖింపడో, కోరడో ఎవడు శుభాశుభములను వదలినవాడో అట్టి భక్తుడు నాకు ప్రియుడు

*సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।*
*శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః ॥*

శత్రువుని యందును, మిత్రునియందును (స్నేహితునియందును) సమానుడున్ను, అటులనే పూజాపరాభవములయందును సమానుడును, శీతము ఉష్ణము సుఖము దుఃఖమును వానియందు సమానుడున్ను, సర్వ సంగవివర్జితుడున్ను ( అనగా సమస్త సంగములనుండి విడుదల పొందిన వాడును )

*తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్ ।*
*అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః ॥*

నిందయందును స్తుతియందును సమానుడును, మననశీలుడును, (మౌనముగలవాడును) శరీరము నిలుచుటకు తగినయే యాహారపదార్థము చేతనైనను సంతోషమునొందువాడును, నియతమైన నివాసము లేనివాడును, నిశ్చయబుద్ధిగలవాడును, నాయందుభక్తి గలవాడునైన నరుడు నాకు ప్రియుడు



# గాంధీ మహాత్ముని ప్రియగీతము

వైష్ణవజనతో తేనే కహియే
జే పీడపరాయీ జాణేరే
పర దుఃఖే ఉపకారకరే తోయే
మన అభిమానన ఆణేరే.
సకలలోకమాం సహునే వందే
నిందా న కరే కేనీరే వాచ కాఛ మననిశ్చల రాఖే
ధన ధన జననీ తే నీరే.
సమదృష్టీనే తృష్ణాత్యాగీ
పరస్త్రీ జానే మాతరే.
జిహ్వాధకి అసత్య న బోలే
పరధన నవ ఝూలే హాధరే.
మోహమాయా వ్యాపే నహిజానే
దృఢ వైరాగ్య జేనా మన మాంరే.
రామనామ సూం తాలిలాగీ
సకల తీరధ తేనా తనమాంరే.
వణలో భీనే కపట రహితఛే
కామక్రోధని వార్యారే.
భణే నరసైంయో తేనుం దరశనకర్తా
కులఏకోం తర తార్యారే.

# నారాయణోపనిషత్తు

మాయా తత్కార్యమఖిలం యద్బోధాద్యాత్యపహ్నవమ్ ।
త్రిపాన్నారాయణాఖ్యం తత్కలయే స్వాత్మమాత్రతః ॥

ఓం సహనావవత్వితి శాంతిః

ఓమ్ అథ పురుషోహ వై నారాయణోఽకామయత ప్రజాః సృజేయేతి నారాయణాత్ప్రాణో జాయతే, మనః సర్వేంద్రియాణి చ ఖం వాయుర్జ్యోతి రాపః పృధివీవిశ్వస్యధారిణీ నారయణాద్బ్రహ్మజాయతే, నారాయణాద్రుద్రో జాయతే, నారాయణాదింద్రోజాయతే, నారాయణాత్ప్రజాపతిః ప్రజాయతే, నారాయణా ద్ద్వాదశాదిత్యా రుద్రావసవః సర్వాణి ఛందాంసి, నారాయణాదేవ సముత్పద్యంతే, నారాయణాత్ప్రవర్తంతే నారాయణే ప్రలీయంతే, ఏతదృగ్వేద శిరోఽధీతే (1) అథ నిత్యో నారాయణః బ్రహ్మ నారాయణః శివశ్చ నారాయణః విదిశశ్చనారాయణః ఊర్ధ్వం చ నారాయణః అధశ్చ నారాయణః అంతర్బహిశ్చ నారాయణః నారాయణ ఏవేదం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్ నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధో దేవఏకో నారాయణః నద్వితీయోఽస్తికశ్చిత్, యఏవం వేద సవిష్ణురేవ భవతి స విష్ణురేవ భవతి । ఏతద్యజుర్వేదశిరోఽధీతే (2) ఓ మిత్యగ్రేవ్యాహరేత్। నమ ఇతి పశ్చాత్ నారాయణాయేత్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతిద్వే అక్షరే నారాయణాయేతి పంచాక్షరాణి ఏతద్వై నారాయణ స్యాష్టాక్షరం పదమ్ యో హవై నారాయణ స్యాష్టాక్షరం పదమధ్యేతి అనపబ్రువః సర్వమాయురేతి విందతే ప్రాజాపత్యం రాయస్పోషం గోపత్యం తతోఽమృతత్వ మశ్నుతే తతోఽమృతత్వమశ్నుత ఇతి ॥ ఏతత్సామ వేదశిరోఽధీతే (3) ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవ స్వరూపమ్ అకార ఉకారో మకారఇతి, తా అనేకధా సమభవత్త దేతదోమితియ ముక్త్వా ముచ్యతే యోగీ జన్మ సంసార బంధనాత్, ఓం నమోనారాయణా యేతి మంత్రోపాసకో వైకుంఠ భువనం గమిష్యతి

తదిదం పుండరీకం విజ్ఞానఘనం తస్మాత్తదిదాభ మాత్రమ్ బ్రహ్మణ్యో దేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః బ్రహ్మణ్యః పుండరీకాక్షో బ్రహ్మణ్యో విష్ణురచ్యుత ఇతి సర్వభూతస్థమేకం వైనారాయణం కారణపురుష మకారణం పరంబ్రహ్మోమ్ ఏతదథర్వశిరోఽధీతే (4) ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి, తత్సాయం ప్రాతరధీయానో పాపోఽపాపో భవతి మధ్యందినమాదిత్యాభిముఖోఽధీ యానః పంచమహాపాత కోపపాత కాత్ప్రముచ్యతే సర్వవేద పారాయణ పుణ్యం లభతే, నారాయణ సాయుజ్యమావాప్నోతి, శ్రీమన్నారాయణ సాయుజ్య మవాప్నోతి య ఏవం వేద ఓమ్ సహనావవత్వితి శాంతిః ఓమ్



# అనుబంధము

## దేశము

*దేశేఽస్మిన్ భారతే వర్షే ప్రాప్య మానుష్యమధ్రువమ్ ।*
*న కుర్యాదాత్మనః శ్రేయస్తేనాత్మా ఖలు వంచితః ॥*

పుణ్యభూమియగు నీ భారత దేశమునందు నశ్వరమగు మనుష్య జన్మము లభించియు ఆత్మ శ్రేయస్సు ( జ్ఞానము) కొఱకెవడైతే ప్రయత్నము జేయుడో అట్టివాడు నిశ్చయముగా తనయాత్మను వంచన జేసినవాడగు చున్నాడు భారతదేశము పుణ్యభూమియని చెప్పుటచే దేశాభిమానముచే నాలాగున జెప్పుచున్నారని గొందరు దలంచవచ్చును లోకచారిత్ర దృష్టితో జూచువారందరున్ను అది సత్యమనియే తలంతురు ఏలన భారతదేశము యోగపరముగాను, ఇతరదేశములు భోగపరముగానుంటున్నవి లోకచరిత్రము జూచిన వారందరికిన్నీ ఇది గోచరముగా గలదు భారతీయు లెంత ప్రయత్నమునైనను ఆత్మప్రాప్తి కొఱకు, దైవప్రాప్తి కొఱకు, మోక్షము కొరకు జేయుదురు ఇతరదేశము వారో ఎంత ప్రయత్నమైనను లోకప్రాప్తి కొఱకు, నితరదేశ జయముకొఱకు పాటు బడుదురు భూలోకమున కంతటికిని విజ్ఞానమును దైవ జ్ఞానమును వెదజల్లినవారు ఆసియాఖండ వాసులగు ప్రవక్తలే, దివ్య పురుషులే భారత దేశమున్ను ఆసియాఖండములో జేరినదే శ్రీబుద్ధదేవుడు శ్రీ యేసుక్రీస్తు, శ్రీమహమ్మదు నబి, ఆదిశంకరులు మొదలగు వారందరున్ను ఈయాశియాఖండములోనే జన్మించిరి ప్రపంచములోగల మతము లన్నియు ముఖ్యముగా నీనాల్గింటితో సంబంధపడియే యున్నవి వ్యాసాద్యనేక మహర్షులు ఈభారత దేశముననే జన్మించి దైవధర్మమును లోకమునకు పదేశించిరి మఱియు భూలోక మంతయు పర్యటన జేసి పరిశోధన సలిపిన అహింసావ్రతపరులు శాకాహారులు నీభారత దేశమున నున్నట్లధికము మరి యే దేశము నందును గనిపించరు

వాంఛన్తి జన్మ మానుష్యం భువి దేవాశ్శతః క్రతుః ।
చిద్విద్యాయాం పరోపాస్తౌ యతో నాన్యోధికారభాక్ ॥

దత్తాత్రేయుడు - భూలోకమందు మానవజన్మము గలుగుట కొఱకు దేవతలున్ను దేవేంద్రుడున్ను నిరంతరము వాంఛించుచున్నారట ! బ్రహ్మవిద్యయందు పారంగతులగుటకున్నూ, ఉపాసన జేయుటకున్నూ మానవజన్మమున మాత్రమే అధికారము గలిగియున్నది ఇతరజన్మములగు దేవతలయందుగాని, యక్షగంధర్వాదులయందుగాని, రాక్షసాసురులయందు గాని, బ్రహ్మ విచారముజేయుటకు తగినహృదయ సృష్టిగలిగి యుండలేదు ఈవిషయమై కఠోపనిషత్తు తెలిపినది జూడుడు కావుననే జన్మములన్నిటిలోను మానవజన్మము శ్రేష్ఠమని చెప్పబడెను

మూ ॥ యథాఽఽదర్శే, తథాఽఽత్మని
యథా స్వప్నే తథాపితృలోకే ।
యథాఽఽప్సు పరీవ దదృశే తథా గన్ధర్వలోకే
ఛాయాఽఽతపయోరివ బ్రహ్మలోకే ॥

ఏవిధముగా నిర్మలమైన అద్దమునందు తన ప్రతిబింబము స్పష్టముగా గనబడుచుండునో, ఆలాగున నీమానవలోకమున మనుష్య జన్మయందు పరమాత్మ స్వరూపము తెలిసికొనుటను దగిన హృదయమున్ను, బుద్ధియున్ను గలిగియున్నది మరియు పితృదేవతల లోకమునందు జన్మించిన వారలకు స్వప్నములో తనదేహము అస్పష్టముగాను వికారములతో గూడినదిగాను కనిపించునట్లే బ్రహ్మము అస్పష్టముగా, గనిపించెడు సృష్టియే గలదు మరియు స్వర్గలోగమున గంధర్వులై దేవతలై పుట్టినను నీటిలో గనిపించెడు తన ఛాయవలె అస్పష్టముగా పరమాత్మను తెలుసుకొనెడి సృష్టియే గలిగియుండును అనగా నీటిలో గనిపించెడు తనఛాయ యేలాగున ఉన్న దున్నట్లు కనబడక నల్లగ గోచరించునో గంధర్వ దేవ జన్మల యందును ఆలాగుననే యుండును ఇక సత్యలోకమగు చతుర్ముఖ బ్రహ్మలోకమునందు జన్మించినను ఎండలో గనిపించెడు తన నీడ వలెనే బ్రహ్మోపాసనయు గలుగును అనగా నెండలో

గనిపించెడు మానవుని ఛాయ స్పష్టముగా శరీరవర్ణము ధరించిన ఆభరణాదులు వస్త్రములు ఉన్నదున్నట్లు గనిపించక పొగరూపముగా నెట్లు గనిపించునో, సత్యలోకమున జన్మించినను స్పష్టముగా బ్రహ్మసాక్షాత్కారజన్మము గలిగే స్థితిలో లేదు దేవతలకన్నను సత్యలోకవాసులకన్నను శ్రేష్ఠమైనదే యీమానవజన్మము ఇంతపావనమైన దైనను మానవులు దీనియొక్క మహిమను దెలుసుకొనుట లేదు

> సృష్ట్వా పురాణి వివిధాన్యజయాత్మశక్త్యా
> వృక్షాన్సరీసృపపశూన్ ఖగదంశమత్స్యాన్ ।
> తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ
> బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥

సృష్టికాలమున బ్రహ్మదేవుండు తనయాత్మ శక్తిచేత , యనేకములైన వృక్షములను, సరీసృపములను, పశువులను, పక్షులను, మక్షికములను, మీనములను మొదలగు ననంతస్థావర జంగమములను, సృష్టించియు వాటికివేటికిన్ని ఆత్మజ్ఞానమును తెలిసికొనుటకు శక్తి లేనందుచే తన సృష్టియంతయు వ్యర్థమైనదిగదా యని తలంచి విషాదమును బొందెను మరల దీర్ఘముగ నాలోచించుకొని తనతపశ్శక్తిని, వేదశక్తిని, ఆత్మశక్తినిన్ని కేంద్రీకరించి బ్రహ్మావలోకమును జేయుటకు తగిన బుద్ధిగల మానవుల సృష్టించెను అట్టిప్రజ్ఞ, జ్ఞానము నిర్మలబుద్ధిగల మానవులజూచి బ్రహ్మ దేవుడానందమును బొందెను దీనివలన మనుజజన్మమెంత గొప్పదో తెలిసికొనవచ్చును అని భాగవతము

> మూ ॥ ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మ హతీ వినష్టిః ।
> భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః ప్రేత్యాస్మాల్లో కాదమృతా భవన్తి ॥

ఈ లోకమున ఆత్మస్వరూపమును తెలిసికొనిన యెడల అప్పుడు సత్యరూపమగు శాశ్వతసుఖము గలదు ఆలాగున నీదేహముతో నున్నప్పుడే ఆత్మస్వరూపమును దెలిసికొనకపోయినచో గొప్పదైన నష్టము ( దుఃఖము) బొందవలసియుండును జ్ఞానులు సర్వభూతములయందును అద్వితీయమగు నాత్మతత్వమును తెలిసి కొని ఈలోకమునుండి మరణమును బొంది మరణహితమగు నమృతత్త్వమును బొందిన వారగుచున్నారు అని కేనోపనిషత్తు

మూ ॥ యదేవేహ తదముత్రయదముత్ర తదన్విహ ।
మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥

జీవుడిచ్చట జీవించుచున్నప్పుడే యవస్థగలిగియుండునో, పరలోకమందును దానిననుసరించిన స్థితినే బొందగలుగును పరలోకమందెట్టి స్థితిలోనుండునో మరల భూలోకమందు జన్మించు నప్పుడు తదనుగుణ జన్మమే గలుగును ఇచ్చట యేకత్వమైన తన యాత్మను దర్శింపక, యనేకత్వముగు దృశ్యములో రమించుచుండునో వాడు జననమరణ కాల చక్రములో నిరంతరము తిరుగుచుండును కఠోపనిషత్తు

మానవుడు సంచిత, ప్రారబ్ధ, ఆగామి యను కర్మత్రయముతో గూడియుండును సంచిత, ప్రారబ్ధముల కధీనుడై యుండవలసి యుండినను, ఆగామికర్మ తన స్వాధీనమైయుండును, అది వర్తమానక్రియ మాణము దీనియందు జాగ్రత వహించిన జన్మరహితమగు మోక్షమును బొందవచ్చును స్వర్గమునైన బొందవచ్చును ఉత్తమమైనజన్మమునైనను బొందవచ్చును లేక నరకమునైన నీచ జన్మమైన గలుగును అది యనుసంధించిన బాణమువంటిది లక్ష్యమును గొట్టవచ్చును లేక లక్ష్యమునైనను మార్చుకొనవచ్చును లేక ఉపసంహరించుకొనవచ్చును ఈ జన్మమున అజాగ్రతగలిగినచో మూడుజన్మములను జెఱచినవాడగును, మెలకువ గలిగి వర్తించిన ఆత్మశుద్ధిని గలుగజేసికొని ఇచ్చటనే పరమ శాంతియు, పరమున మోక్షమునైనను, పుణ్యలోకమునైనను పొందవచ్చును మరల జన్మమునెత్తవలసి యుండిన యుత్తమ జన్మనైనను బొందవచ్చును, కావున మిక్కిలి మెలకువ గలిగి వర్తింపుడు

మూ ॥ ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః ।
తతస్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥

అట్టి పరమాత్మను దేహము పడిపోవుటకు ముందు ఈలోకమునందే తెలిసికొనుట కసమర్థుడైనయెడల పృధివ్యాది లోకములందు, జన్మమెత్తుట కొఱకు సమర్థుడగుచున్నాడు కఠశ్రుతి ఇదేవిధముగ గీతలోను శ్రీకృష్ణభగవాను డుపదేశించెను

*ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।*
*నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥*

ఎవరియొక్క మనస్సు సకల ప్రాణులయందుండు ఆత్మయు, తన యాత్మయు నొకటి యను సమభావన గలిగినట్టి ఆత్మయే తానను స్థిరత్వము గలిగియుండునో, అట్టివార్లచేత ఈ దేహముతో నీలోకమున నున్నప్పుడే జననమరణములకు హేతువగు సంసారబంధము ద్రుంచబడును పరబ్రహ్మము సమభావముగలిగినదియును, దోషరహితమైనదిగదా ! ఆ కారణమువలన అట్టిబ్రహ్మానుభవముగలవారు పరబ్రహ్మమునందే యున్న వారగుదురు

బ్రహ్మమెట్లు నిర్దోషమైనదో ఆలాగున జీవుడుగూడ ప్రకృతి దోషరహిత మైనప్పుడే బ్రహ్మమందైక్యము గలుగును అట్లైన నీటిలో నీరున్నూ, నూనెలో నూనెయున్నూ ఐక్యమగునట్లుండును, అట్లు గానిచో నీటిలో నూనెయు, నూనెలో నీరున్నూ కలియనట్లు భిన్నముగానే యుండును

*శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్షరీర విమోక్షణాత్ ।*
*కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥*

ఎవడీ లోకమునందే శరీరము విడుచుటకు ముందుగానే కామక్రోధజన్యమగు తీవ్రతను సహించుట కొఱకు శక్తుడగుచున్నాడో అట్టి మనుజుడు యోగసిద్ధి గలవాడగుచున్నాడు వాడు శాశ్వతమైన సుఖము గలవాడగుచున్నాడు

**నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా**
**వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాంన జానే విభో !**

**మజ్జన్మాంతర పుణ్యపాక బలతస్త్వం శర్వ సర్వాంతర**
**స్తిష్ఠ స్యేవ హితేన వా పశుపతే తే రక్షణీయోఽస్మ్యహమ్ ॥**

ఎల్లప్పుడుదరపోషణకొఱకు ధనార్జనముచేతను, ఉచ్చనీచము లను పాటింపక సకలజనుల నుద్దేశించి నిష్ప్రయోజనమైన తిరుగుటను జేయుచున్నాను సర్వవ్యాపకుడవైన నీ యొక్క భజనమును గురుతెరుగను ఓ బ్రహ్మాది సమస్త జీవులకును ప్రభువైన యీశ్వరుడా! ఏ కారణమువల్లను నాయొక్క అన్యజన్మల యందలి సుకృతములయొక్క పరిపక్వబలము వలనను, ఓ యీశ్వరుడా!

సమస్తచరాచర ప్రాణికోట్లయొక్క అంతరాళమున సూక్ష్మరూపుడవై యున్నావే, ఆ హేతువుచేతను నేను రక్షింపతగిన వాడనైతిని ( శివానందలహరి )

> **ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనం**
> **ప్రత్యాయాన్తి గతాః పునర్న దివసాః కాలో జగద్భక్షకః**
> **లక్ష్మీ స్తోయతరఙ్గభంగచపలా విద్యుచ్చలం జీవితం**
> **తస్మాన్మాం శరణాగతం శరణద త్వం రక్షరక్షాధునా ॥**

చూచుచుండగనే ప్రతిదినము ఆయుస్సు నశించుచున్నది యౌవనము క్షీణించుచున్నది గడచిన దినములు తిరుగా వచ్చునవి గావు కాలము జగత్తును భక్షించునట్టిది సంపత్తు జలములోని అలలవలె చంచలమైనది జీవితము మెరుపువలె క్షణభంగురమైనది కాన ఓ శరణాగత రక్షణ తత్పరా ! సర్వేశ్వరా! శరణుబొందిన నన్ను నీవు ఇప్పుడు రక్షింపుము, రక్షింపుము



# మోక్షద్వార ప్రకృతి ద్వారములు

ఈ విషయమై ఒక పటముగూడ వ్యాసాశ్రమమున చేయబడియున్నది గీతలో 9 ద్వారములు మాత్రమే దేహమునకు జెప్పబడినవి శిరస్సున నేత్రములు 2, కర్ణములు 2, ఘ్రాణములు 2, జిహ్వ 1, శరీరాధోభాగమున పాయు 1, ఉపస్థ 1, మొత్తము 9 ద్వారములు అనేక శాస్త్రములలోను నీలాగుననే గనబడుచున్నది (''నవద్వారే పురే దేహీ'' గీ, అ 5 ) కఠోపనిషత్తులో తొమ్మిది ద్వారములని చెప్పబడినవి నవద్వారములు పశువులకు గూడ గలవు ఇవి శరీరసంరక్షణ కొఱకు మాత్రమే యుపయోగపడును ఇది కాక ప్రాకృతము, అప్రాకృతము అను రెండు ద్వారములు గలవు అజ్ఞానదశలో నవి మూయబడి యుండును అవి తెఱువబడినప్పుడే జ్ఞానోదయమగును, దానికే దివ్యదృష్టి యనియు, యోగదృష్టియనియు, జ్ఞానదృష్టియనియు, సమ్యగ్‌దృష్టి యనియు పేరులు యోగ శాస్త్రమున మూలాధారములోగల కుండలీ బోధము దీనిని గురించియే చెప్పబడుచున్నది ఊర్ధ్వదృష్టికే సుషుమ్నాద్భోధమనియు, బ్రహ్మరంధ్రమనియు మోక్షద్వారమనియు బేరులు ఇది తపస్సుచేతగాని, యోగాభ్యాసముచేతగాని, భగవద్భక్తి చేతగాని, తీవ్రబ్రహ్మచింతన చేతగాని, పూర్వజన్మసుకృత విశేషము చేతగాని తెఱువంబడును అప్పుడే కనపడని ఆత్మ (బ్రహ్మ) కనిపించును ఇదియే యర్జునుని కొఱకు కృష్ణపరమాత్మ అ 11లో యుపదేశించినది

*న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।*
*దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥*

ఈ మాంసచక్షువులతో నన్ను చూచుటకు శక్తుడవు గానేరవు మరే మన, నీకు దివ్యదృష్టిని ఇచ్చుచున్నాను దానివలన నా యోగ మహిమను అనగా యీశ్వరశక్తిని చూడుము కావుననే గొప్ప మహాత్ములు జెప్పువిషయము, అమానుషమనియు, అతీంద్రియమనియు జెప్పుటకు గారణము అమానుష్య మనగా మనుష్య దృష్టుల కందనిదనియు, దైవసంబంధమైనదనియు అతీంద్రియమనగాసామాన్య మనుజుల యింద్రియములకు గోచరముగాని దనియు భావము ఈతత్త్వమే గురుధ్యానమందు గన్పట్టుచున్నది

*అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।*
*చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥*

అజ్ఞానమనెడు తిమిరవ్యాధిచే అంధుడైనవానియొక్క నేత్రమును జ్ఞానమనెడు అంజనశలాకుచే తెరచిన యట్టి గురువు కొఱకు నమస్కారమని జెప్పుటకు కారణము కఠోపనిషత్తు ద్వితీయాధ్యాయ ద్వితీయవల్లి -

మూ ॥ **పురమేకాదశద్వార మజస్యా వక్ర చేతసః ।**
**అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే ॥**

తా ॥ పదునొకండు ద్వారములుగల నగర మకుటిలమైన ఏకరూపమైన విజ్ఞానముగల ఏ పరమాత్మకు స్థానముగా గలదో, అట్టి పరమాత్మను ధ్యానించువాడు సంసార కష్టములచే దుఃఖపడడు (శాశ్వత సుఖమును బొందగలడు ) రాగద్వేషాదికముచేత వినిర్ముక్తుడై సంసారబంధమునుండి విముక్తుడగుచున్నాడు పురమన్నను, శరీరమన్నను ఒకటేయని గ్రహించవలయును అయితే ఇట్టి పురములోగల ప్రభువైన పరమాత్మను ఎవడు దర్శింపగలుగునో అట్టి వానియొక్క లక్షణము, ఈ యుపనిషత్తున అ 1 2 వల్లిలో నిరూపించడమైనది

మూ ॥ **నావిరతో దుశ్చరితాన్నాశాంతో నా సమాహితః ।**
**నాశానమానసో వాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥**

విధినిషిద్ధమైన దుశ్చరితమునుండి విరమింపనివాడు ఈ ఆత్మను బొందజాలడు మనశ్శాంతి బొందనివాడీ యాత్మను బొందజాలడు ఏకాగ్ర చిత్తములేని వాడీయాత్మను జూడజాలడు మనోనిశ్చలత్వము లేనివాడును ఈ ఆత్మను గనుగొనజాలడు బ్రహ్మ విజ్ఞానముచేతనే ఈయాత్మను బొంద సాధ్యపడును ఈ విషయమై పరాశర స్మృతియందు చెప్పినదిగూడ జూడందగును

*పృధివ్యాం యాన్తి భూతాని జిహ్వోపస్థనిమిత్తకమ్ ।*
*జిహ్వోపస్థ పరిత్యాగే కో న ముచ్యేత బంధనాత్ ॥*

''పృథివ్యాం కిం ప్రయోజనమ్'' అని పాఠాంతరము ప్రపంచములో గల సమస్త ప్రాణులున్నూ జిహ్వేంద్రియ గుహ్యేంద్రియముల కొరకే ప్రవర్తించుచున్నవి ఈ రెండింద్రియములను నిరోధించిన వాడెవ్వండు ముక్తుడు గాకుండును? (ముక్తుడే యగును) ఈ రెండింద్రియము లెంతవరకు తెఱువబడియుండునో అందాక మోక్ష ద్వారము మూయబడి యుండును ఈ యింద్రియ ద్వయమెప్పుడు మూయబడునో అప్పుడు స్వయముగా ముక్తి ద్వారము దెఱువబడును

*ఇంద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ ।*
*ఆదౌ తయోర్జయే యత్నం కుర్యాద్యోగీ విశేషతః ॥*

ఇంద్రియములన్నిటిలోను జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ ములు మహాబలము గలవి అందువల్ల యోగియైనవాడు మొట్టమొదట నా యింద్రియముల రెండింటిని జయించుటకు విశేషమైన యత్నము జేయవలయును ఈ యర్థమునే కృష్ణభగవానుడు గీతలో నుపదేశించెను

*అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।*
*వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥*

యోగము ఆత్మసంయమము లేనివానిచేత పొందుట దుస్సాధ్యము ముక్తికొరకు నిరంతరము యత్నము చేయుచున్న మనో నియమము గలవానిచేత, సాధనోపాయము చేత పొందుటకు సాధ్యమైనదని నా యొక్క అభిప్రాయము అనగా శ్రీకృష్ణభగవానుని సిద్ధాంతము (శాస్త్రాంతరము)

*శుద్ధిద్వయం మహత్కార్యం దేవానామపి దుర్లభమ్ ।*
*కౌపీనశుద్ధిః ప్రథమా వాక్యశుద్ధిరనంతరా ॥*

దేవతలకు సహ యీ మహత్కార్యమగు శుద్ధిద్వయము మహాదుర్లభము మొదటిది కౌపీనశుద్ధి, రెండవది వాక్యశుద్ధి దేవతలు మొదలగు మనుష్యులందరున్నూ ఈ శుద్ధిద్వయమును బొందకనే మాయా మోహములో బడిపోవుచున్నారు

*ద్వయమేతన్న సిద్ధం చేజ్జీవితం తు నిరర్థకమ్ ।*
*యథా త్వం విద్ధి పుణ్యాత్మన్ రంధ్రపాత్రే చ పాచనమ్ ॥*

జిహ్వోపస్థల రెండింటియొక్క శుద్ధి గలుగనిచో నతని జీవితము నిరర్ధకము ఓ పుణ్యాత్ముడా ! అదెట్లనిన వినుము రంధ్రము బడిన పాత్రము పచనక్రియ కెట్లుపయోగపడదో, ఆలాగున నుండును

*నివృత్తిమార్గే దాంపత్యం సానుకూలం భవేద్యది ।*
*పూర్వస్మిన్ పుణ్యపుంజేన నాస్తి చేత్ప్రవజేత్పుమాన్ ॥*

జ్ఞానమార్గములో దంపతులకు అనుకూలము గలిగెనేని అది వారిరువురున్నూ పూర్వజన్మములో గొప్పదైన పుణ్యముజేసి యుండిన మాత్రమే సిద్ధించును అట్లుభయులకు నివృత్తి మార్గము నందనుకూలము గలుగనిచో సన్న్యసించుటయే శ్రేష్ఠము అనుభూతి ప్రకాశమున్నూ ఈ లాగుననే వచించెను

*సోఢ్వాఽపి కర్మవిక్షేపం చిత్తైకాగ్రే క్షమో యది ।*
*తథా వేత్తు గృహస్థోఽపి ప్రవ్రజత్వన్యథా పుమాన్ ॥*

సంసారమందు గలిగెడు కర్మలయొక్క విక్షేపములను సహించి చిత్తమును ఏకాగ్రవముచేయ సమర్థుడయ్యెనేని అప్పుడు గృహస్థుడు గూడ ఆత్మను బొందవచ్చును అనగా మోక్షము నొందవచ్చును అట్లుగానప్పుడు సన్న్యసించు గాక !

*అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్ ।*
*పుణ్యపుంజేన శుద్ధం తచ్చిత్తమైకాగ్ర్యమర్హతి ॥*

అనాత్మయగు దృశ్యవిషయములో అరుచి గలుగుటయు, ఆత్మధ్యాన మందు అభిరుచి గలుగుటయు గలిగెనేని పూర్వజన్మములో జేసిన అనేక పుణ్యకర్మ ఫలమనియే గ్రహించవలయును అందువల్లనే ఆత్మశుద్ధి గలిగి చిత్తైకాగ్రత యేర్పడును

*విషయాసంగరూపో యః పాప్మాఽసావాసురత్వతః ।*
*విద్యేచ్ఛాం ప్రతిబధ్నాతి సోఽయమాదౌ నివర్త్యతామ్ ॥*

విషయాసక్తి స్వరూపమేదిగలదో అది పాపస్వరూపమనియు, ఆసురస్వరూపమనియు గ్రహించుకొనవలయును ఇది మోక్షేచ్ఛను ప్రతిబంధించును అందువల్ల ముముక్షువులు ప్రప్రధమమున విషయవాంఛను నివృత్తి జేసుకొనవలయును

*న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।*
*న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా ॥*

శ్రీమద్భాగవతము శ్రీకృష్ణవాక్యము ఓ యుద్ధవా! దృఢమైన భక్తివల్ల నేను వశీకృతుడనైనట్లు యోగముచేతగాని, జ్ఞానముచేత గాని, ధర్మము చేతగాని, వేదాధ్యయనముచేతను, తపస్సుచేతగాని, సన్న్యాసము చేతగాని వశీకృతుడను గాజాలను

# సర్వసంగ్రహము

*యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః ।*
*యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి ॥*

కఱ్ఱతో జేయబడిన యేనుగున్నూ, చర్మముతో జేయబడిన మృగమున్నూ (రబ్బరుతో జేయబడిన దుప్పియు), అధ్యయనము జేయని విప్రుడున్నూ (సన్న్యాసియు) ఈ ముప్పురున్నూ నామమాత్రమేగాని ప్రయోజనము లేదు అనగా నామధారులని యర్థము

*పరాన్నేన తు భుంక్తేన మైథునం యోఽధిగచ్ఛతి ।*
*యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే ॥*

పరాన్నమును భుజించెడు ఏగృహస్థుడైన, భార్యతో జేరునో వానికి బుట్టెడు సంతానములు ఎవరి యన్నమును భుజించునో వానివే యగును ఏలన నన్నముచేత పురుషులకు శుక్లమున్నూ స్త్రీలకు, రక్తమున్నూ ఏర్పడును ఈ రెండింటివల్లనే పిండోత్పత్తియగును పాపాన్నముచే నేర్పడిన బిడ్డలు పాపరూపులే యగుదురు పుట్టిన తరువాత వారి నెంత శిక్షించినను మంచి స్థితికి రాజాలరు

కావున వంశోద్ధారకులగు ఉత్తమసంతానము గలుగవలసియుండిన మాతాపితరులు ఆహారములో జాగ్రత వహించ వలయును ఆలాగున పాపాహారము భుజించి తపమొనర్చువారు గూడ మెలకువగలిగి యుండవలయును, ఏలన అన్నముచే రసము, రసమునుండి రక్తము, రక్తము నుండి మాంసము మొదలగు సప్తధాతువులున్నూ, మనోబుద్ధులున్నూ గలుగును పరాన్నము భుజించి సరియైన తపస్సుజేయని వాని, మనస్సు మలినమై దుర్గుణముతో గూడినదై పతితుడగును సన్న్యాసులు, సాధువులు, భక్తులు ఈ విషయమై మిక్కిలి మెలకువ గలిగి యుండ వలయును ఒక యంత్రము పోతపోయుటకు ముందుగా శిల్పశాస్త్రప్రకారము ఏ యే లోహములు భాగముల ప్రకారముజేర్చవలయునో అట్లైన యా యంత్రము దృఢముగా బహుకాలముండును హీనలోహమైనచో త్వరలోనే చెడిపోవును ఈ తత్త్వమును బాగుగ జ్ఞాపకములో నుంచుకొనవలయును

*తప్త్వా తపస్వీ విపినే క్షుధార్తో గృహం సమాయాతి సదాన్నదాతుః ।*
*భక్త్యా సచాన్నం ప్రదదాతి తస్మై తపోవిభాగం భజతే హి తస్య ॥*

వనమునందు (విజనప్రదేశమునందు) తపమొనర్చెడు తాపసి ఆకలి గలుగునప్పుడు భిక్షాన్నము కొఱకు అన్నదాతయైన గృహస్థుని బొందుచున్నాడు అట్టి గృహస్థుడు భక్తితో యా తాపసికి అన్నదానము జేయుచున్నాడు అందువల్ల ఆ మునియొక్క తపస్సు నుండి సగము భాగము గృహస్థునికి వచ్చుచున్నది ఈలాగున ననేక యతులకు, సాధువులకు, బ్రహ్మచారులకు అన్నప్రదానము జేయుటచేత వారందరియొక్క తపః స్వాధ్యాయ వ్రతములనుండి సగము వచ్చుటచేత గృహస్థుడు శ్రేష్ఠుడని జెప్పుటకు గారణము అట్లు విధిప్రకారము అతిథి సత్కారాది పంచయజ్ఞములు జేయుని గృహస్థుడు పతితుడగును అందువల్లనే ''సంసారసాగరం'' దుఃఖమని చెప్పబడెను

*సన్మానాద్బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ ।*
*అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా ॥*

బ్రహ్మనిష్ఠుడు సన్మాన గౌరవాదులందు విషమువలె భయపడవలెను అవమానమున అమృతమువలె ఎల్లప్పుడు తలంపు గలిగి యుండవలయును

ఏలన సన్మాన సత్కారములవల్ల తన పుణ్యము నశించును అవమాన నిందలవల్ల పాపము క్షీణించునని గ్రహించు కొనవలయును ఇట్టి యవస్థ ఏ వివేకాత్మునికి గలుగునో వాడే సదానందమును పొందగలుగును లేనిచో ఎట్టి పాండిత్యము గలిగినను దుఃఖమే అతనికి నెదురగును కావుననే స్తుతినిందలలో సమత్వము గలిగియుండవలయునని శాస్త్రము జెప్పుటకు కారణము

*అవ్రతా హ్యనధీయనా యత్ర భైక్షచరా ద్విజాః ।*
*తం గ్రామం దండయేద్రాజా చోరభుక్తిప్రదో హి సః ॥*

బ్రహ్మచర్యవ్రత వేదవ్రతాది వ్రతినిష్ఠలేనివారున్నూ, అధ్యయనమును చక్కగా జేయనివారగు ఏబ్రాహ్మణులుగాని, యతులు గాని భిక్షాన్నము భుజించి ద్రిమ్మరులై దిరుగుదురో అట్టివారికి అన్నము బెట్టు గ్రామస్థులను రాజైనవాడు దండించవలయును ఏలన దొంగలకు అన్నము బెట్టి పోషించువారెట్లు దండనార్హులో వీరున్నూ నట్టివారే యగుదురు అని పరాశరస్మృతి వేదకాలమున రాజ్యమున్నూ, మతమున్నూ రాజశాసనములో నుండెను

*జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః ।*
*యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని ॥*

మానవులకు పాపకర్మలు నశించునప్పుడాత్మ జ్ఞాన ముదయమగును ఏలాగున నిర్మలమగు అద్దమునందు తనయొక్క రూపము ప్రతిబింబితమగునో ఆలాగున ఆత్మయందు పరమాత్మను జూడగలుగును

*అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైశ్శైలోఽపి చూర్ణ్యతే ।*
*బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృంభితమ్ ॥*

పర్వతమైనను ముక్కలుగా గొట్టుటచేత నింపాదిగ తరిగి పోవును సూక్ష్మమైన లక్ష్యముగూడ క్రమాభ్యాసముచే బాణమువల్ల గొట్టబడును నాలాగున అజ్ఞానియైనవాడుగూడ క్రమాభ్యాసమువల్ల జ్ఞానవంతుడగును అభ్యాసము యొక్క బలమెట్టిదో దీనివల్ల తెలుసుకొనవచ్చును

*కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే ।*
*యస్య చేతసి గోవిన్దో హృదయే యస్య నాచ్యుతః ॥*

ఎవని హృదయమునందు భగవద్భక్తి గలిగియుండునో అతడు ఏయుగమందుండువాడైనను కృతయుగముననుండు వాడే ఎవని హృదయము భగవత్స్మరణ గలిగియుండదో వాడేయుగమున నుండువాడైనను కలియుగమున నుండువాడే యగును

*భగవద్భక్తిహీనస్య జాతిశ్శాస్త్రం జపస్తపః ।*
*అప్రాణస్యేవ దేహస్య మణ్డనం లోకరఞ్జనమ్ ॥*

భగవద్భక్తి లేనివాని శ్రేష్ఠజాతి, శాస్త్రపరనము, జపము, తపము ఇవన్నియు ప్రాణములేని శవమును పుష్పవస్త్రాభరణములచే నలంకరించిన నెంత శోభించునో నాలాగున లోకరంజనముగా నుండును

*పరోపకృతి కైవల్యే తులయిత్వా జగద్గురుః ।*
*గుర్వీం చోపకృతిం మత్వా అవతారాన్దశాఽగ్రహీత్ ॥*

జగద్గురుడగు శ్రీమన్నారాయణమూర్తి శ్రీవైకుంఠమున నెల్లప్పుడు యుండుట మేలా లేక పర ప్రాణులకు మేలొనర్చుట మేలా యని నిశ్చయించి యొక త్రాసునందు యీ రెండింటియొక్క ఫలముల నుంచి తూచినప్పుడు పరప్రాణుల కుపకార మొనర్చెడు వైపు భారముతో గూడిన దాయెను, వైకుంఠమునందుండు ఫలముయొక్క వైపు పైకి లేచెను ఇది గ్రహించి దశావతారముల నెత్తెను

*సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।*
*హృదయే నాస్తి సర్వాస్థో ముక్త ఏవోత్తమాశయః ॥*

నిరంతరము సమాధినిష్ఠయందుండనీ లేక పరప్రాణుల కొఱకు కర్మలు జేయనీ ఈ రెండింటిలో గొప్పతనమేమి లేదు నిర్వికల్ప సమాధిలో నుండినను పరప్రాణుల కుపకారము జేయుచుండినను ఎవని యొక్క హృదయములో

సర్వసంకల్పములు నశించి యుండునో అట్టి యుత్తమాశయు డెల్లప్పుడును ముక్తుడే ! సందేహము లేదు

**తండులస్య యధా చర్మ యధా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర ! పురుషస్య తధా మలః ॥**

**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।**
**నశ్యత్యేష న సందేహ స్తస్మాదుద్యమవాన్భవ ॥**

అని యోగవాసిష్ఠము

బియ్యము పుట్టుకతో నేలాగున తౌడు పొట్టుతో గూడ నేర్పడునో ఆలాగున, తామ్రమేలాగున పుట్టుకతో చిలుముతో నుద్భవించునో అట్లైనను దంపుటచేత తౌడున్నూ ఊకయున్నూ పోవుచుండునో, స్ఫుటము జేయుటచేత రాగియొక్క చిలుము బోయి శుద్ధమగుచుండునో ఆలాగున నొకవేళ జీవుడు, పుట్టుకతో మాలిన్యము గలిగి యుండినను చేయవలసిన భక్తి జ్ఞానముల చేత నాదోషము నశించును ఆలాగున జీవుడు పూర్వజన్మకర్మముతో గూడ వచ్చినను ప్రతి క్రియచేత తప్పక కర్మము నశించును దీనియందు సంశయము లేదు కావున నెల్లప్పుడున్నూ ప్రయత్నపరుడవై యుండుము అని వాసిష్ఠమున వసిష్ఠుడుపదేశించెను ఓహో ! యెటువంటి ధైర్యమును బోధించెనో గ్రహించుకొనుడు

***యద్వైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।***
***అల్పమూల్యం ప్రజాయేత తధా జీవోఽప్యహంయుతః ॥***

***యద్వైవ హి సువర్ణాది క్షారాదేః శోధితం శుభమ్ ।***
***పూర్వవన్మూల్యతాం యాతి తధా జీవోఽపి సంస్కృతేః ॥***

ఏలాగున అపరంజి బంగారము హీనలోహమగు వెండి రాగి ఇత్తడి మొదలైనవానితో గలసిన స్వల్ప వెలగలదగుచున్నదో, ఆలాగున జీవుడు గూడ ఈశ్వరస్వరూపుడై యుండియు అహంకారాజ్ఞానమాయతో గూడినదగుటచే

నీచత్వము బొందెను అయితే ఇంతే గతియా? వేరుగతి లేదా? యని సంశయముపడనక్కరలేదు ఏలాగున మలినబంగారము స్ఫుటము చేయుట చేత అపరంజి బంగారమగు చున్నదో, అప్పుడు పూర్వముండిన విలువ నెట్లు బొందుచున్నదో, ఆలాగున ప్రకృతిగత దీనత్వమును బొందిన జీవుడు సహ భగవద్భక్తి జ్ఞానాదులచే సంస్కరింపబడునప్పుడు ఈశ్వరత్వము నొందును అధ్యాత్మ జ్ఞానములో గల ప్రయత్న మిట్టిదని మరువక యుందురుగాక।

*లోకయాత్రాం ప్రయత్నేన వర్జయేదాత్మ చింతకః।*
*నాఽన్యోపనిషదం విద్యామభ్య సేన్ముక్తి హేతుకీమ్॥*

ఆత్మనిష్ఠగలవాడు ప్రయత్నపూర్వకముగా దేశసంచారమును మానవలయును మోక్ష హేతువైన యుపనిషద్విద్యను తప్ప తక్కిన విద్యను అభ్యసింపగూడదు దీనివల్ల శాస్త్రవాసన గూడ వాసనా త్రయముతో గూడినదని తలంచి కొందరు విద్యావిహీనులగు చున్నారు అది దీనియందుదాహరింప బడినది

*దానమిజ్యా తపః శౌచం తీర్థం వేదా శ్రుతం తథా।*
*అశాంత మనసః పుంసః సర్వమేతదపార్థకమ్॥*

దానము, యాగము, తపస్సు, శౌచము, తీర్థయాత్ర, వేదములు, శాస్త్రశ్రవణము మొదలగు వన్నియు శాంతిలేని మనస్సుగల మనుజునికి వ్యర్థమగును

*యథా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి।*
*తథాత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే॥*

ఏలాగున వేగిన విత్తనముయొక్క మొలక నశించి యుండునో ఆలాగున ఆత్మజ్ఞానియొక్క దృశ్యవృత్తులుగూడ నశించి యుండును ఇదే పచ్చివిత్తనమునకున్నూ, వేగిన విత్తనమునకున్నూ గలభేదము ఆలాగున జ్ఞానాగ్నియందు దగ్ధమైనవృత్తిగలవానికిన్నీ, లేనివానికిన్నీ గల తారతమ్యమని గ్రహించునది పచ్చివిత్తనమున్నూ, ఉడికినవిత్తనమున్నూ జూచునపుడొకే

విధముగనున్నను పచ్చిది మొలకెత్తును వేగినది మొలకరాదు ఆలాగున దేహముతో జూచునప్పుడాత్మ జ్ఞానియు, అజ్ఞానియు నొకే విధముగా గనబడినను వృత్తి భేదమువల్ల భిన్నముగానే యుందురు

*విహితస్యా ననుష్ఠానాన్నిషిద్ధస్య చ సేవనాత్।*
*అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥*

ఉన్నతస్థితిని బొందినవాడు పతనమొందుటకు గారణమెద్దియో దీనిలో దెలుపడమైనది తాను చేయవలసిన అనుష్ఠానము సరిగా జేయకబోవుటచేతను, నిషిద్ధకార్యములో ప్రవర్తించుట చేతను, ఇంద్రియముల యొక్క నిగ్రహమును జేయకబోవుటచేతను మానవుండు పతనమొందుచున్నాడు

*కృతే ప్రవర్తతే ధర్మః చతుష్పాత్తజ్జనైర్ధృతః।*
*సత్యం దయా తపో దానమితి పాదా విభో! నృప ॥*

కృతయగమున ధర్మము నాలుగుపాదములతోను, త్రేతాయుగమున మూడు పాదములతోను, ద్వాపరమున రెండు పాదములతోను, కలియుగమున నొకపాదముతోను గూడియుండునట్లు జెప్పుదురు, అయితే ఆ పాదము లెవ్వియో తెలిసినవారరుదుగా నుందురు అది ఈ శ్లోకమున నిరూపించడమైనది అది 1 సత్యము, 2 దయ, 3 తపస్సు, 4 దానము, ఈ నాలుగు ధర్మములు కృతయుగమున జనులచేత ఆచరింపబడుచుండెను ఈ నాలుగింటిలో సత్యములోపించి 1 దయ 2 తపస్సు 3 దానములు త్రేతాయుగమునందుండెను సత్యమున్నూ దయయున్నూ క్షీణించి, 1 తపస్సు 2 దానము గలిగి ద్వాపరమునందుండెను తపస్సున్నూ, క్షీణించి దానబుద్ధి యొకటిమాత్రము కలియుగముననుండును కావన కృతయుగములో జీవులకు గల నీలాగు నాల్గుధర్మములు ఏ యుగమునందైనను నెవరికి గలిగియుండునో వారు కృతయుగములోనుండు వారనియు, తక్కిన 3, 2, 1 ధర్మములు గలవారు ఆయా యుగములలో నుండు వారని గ్రహించుకొన వలయును కృతయుగములో నుండువారు మాత్రమే కృతకృత్యులగుదురు (మోక్షమును బొందుదురు) ఈవిషయమై యధార్థభారతి చిన్నపొత్తమును జూడుడు

*బ్రహ్మచర్య మహింసాం చ సత్యం చైవాపరిగ్రహమ్ ।*
*యత్నేన హే రక్షత హే రక్షత హే రక్షత హేతి ॥*

ఒక మహర్షిదగ్గఱ చిరకాలముండి వేదవేదాంతముల నన్నింటిని నేర్చుకొన్న శిష్యుడు తీర్థయాత్రా విషయమై గుర్వనుజ్ఞను బొంది వెళ్ళునప్పుడు గురువు ఈ మంత్రమును ఉపదేశించెను ఓ ముని పుత్రుడా ! 1 బ్రహ్మచర్యమును 2 అహింసను 3 సత్యమును 4 అపరి గ్రహవ్రతమును ప్రయత్న పూర్వకముగా రక్షింపుమా ! రక్షింపుమా ! రక్షింపుమాయని ముమ్మారు ఆశీర్వదించి వచించెను

*యావజ్జీవం జపేన్మంత్రం ప్రణవం బ్రహ్మణో వపుః ।*
*హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ॥*

పరబ్రహ్మ స్వరూపమగు ప్రణవమును బ్రహ్మనిష్ఠులు జీవించి యుండువరకు జపము చేయందగినది దానియొక్క స్వర్గము హ్రస్వమైనచో పాపములనన్నింటిని నశింపజేయును దీర్ఘమైనచో మోక్షమును గలుగజేయును ఈ విషయము విస్తారముగా నోంకార గ్రంధమున గనందగును

*అసిత గిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రం*
*సురతరువర శాఖా లేఖినీ పత్రముర్వీ ।*
*లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం*
***తదపి తవ గుణానా మీశ ! పారం న యాతి ॥***

నీలగిరి సమానము సిరాపాడియున్నా, సముద్రము సిరాబుడ్డి గాను, కల్పవృక్షశాఖ కలముగాను, భూమియే కాగితముగాను గ్రహించి సరస్వతీదేవి సర్వకాల సర్వావస్థలలో వ్రాసినను ఓ సర్వేశ్వరా ! నీయొక్క గుణములను వ్రాయజాలదు అని శివమహిమ్నస్తోత్రమునందు పుష్పదంతుడను గంధర్వుండు వచించెను అట్లుండగా నాబోటివాడు సర్వేశ్వరా ! నీగుణ గణమును నెట్లు వర్ణించగలడు

ఓం తత్సత్



# పరిశిష్టము - ఆహారనిర్వహణము

*అత్రాహారార్థం కర్మ కుర్యాదనింద్యం*
*కుర్యా దాహారం ప్రాణసంధారణార్థమ్ ।*
*ప్రాణాస్సంధార్యాస్తత్త్వ సంపాదనార్థం*
*తత్త్వం సంపాద్యం యేన భూయో న జన్మ ॥*

ఈ లోకమున ఆహారార్థమై పాపములేని పని జేయందగినది ఆహారము ఎంతవరకుండవలయుననగా ప్రాణసంధారణ మాత్రమే యుండ వలయును ప్రాణములను దేనికొఱకు ధరించవలయుననగా తత్త్వజ్ఞానము సంపాదించుటకొఱకు తత్త్వజ్ఞానము దేనికొఱకు సంపాదించ వలయుననిన, ఏజ్ఞానమువల్ల మరల భూలోకమున జన్మమెత్తి దుఃఖపడి వలసియుండదో దానికొఱకు అనగా జన్మరాహిత్యము కొఱకని భావము

# సప్తసంతానములు

*తటాకం ధననిక్షేపం బ్రహ్మ స్థాప్యం సురాలయమ్ ।*
*ఆరామకృతి సత్రాణి సప్తసంతాన సంజ్ఞకాః ॥*

1 జలాశయమును నిర్మించుట 2 ధర్మకైంకర్యార్థము ధనమును ఫండుగా నేర్పరచుట 3 బ్రహ్మనిష్ఠులకు ఆశ్రమమునేర్పరచుట 4 దేవాలయమును నిర్మించుట 5 ధర్మార్థముగా వనమును నిర్మించుట 6 ఉత్కృష్ట గ్రంథమును తనపేరట నచ్చు వేయించుట 7 అన్న సత్రమును గట్టించుట లేదని తలంచి దుఃఖింప బనిలేదు పుత్రులుండువారైనను ఈ సప్తసంతానములు పరలోకమున పుణ్యలోక ప్రాప్తిని గలుగజేయును ఈ యేడు సంతతులలో ఎవరెవరు ఎన్నెన్ని నిర్వహింపగలరో వారలు అన్ని సంతానములు గలవారగుదురు, అనగా 1 గాని 2 గాని 3 గాని, పై జెప్పిన కార్యములు నిర్వహించువారు అన్ని సంతానములు గలవారని తాత్పర్యము

నవవిధభక్తిమార్గములలో పూజగూడ అనగా అర్చన గూడ నొకటిగా

పరిగణింపబడినది అయితే సాకారార్చన రూపములలో ఈ ప్రపంచ పుష్పము లుపయోగపరచుచుండినను, పరమభక్తులు దానితో తృప్తిబొంద గూడదని విష్ణుపురాణము నిర్ణయించుచున్నది విగ్రహములలో భగవంతునిపట్ల తన భావనమాత్రమే గలిగియుండును సాక్షాద్భగవంతుడే అందరి యాత్మ రూపముగా వెలుగుచుండును అట్టి భగవానుని పూజలకు దివ్యపుష్పములు గావలయును అట్టి పుష్పములను జూడుడు ఈ పుష్పములచే బూజించువాడు దివ్యత్వమును బొందగలుగును ఋషులు పరమైకాంత భక్తులు ఈ పుష్పములచేత పూజించియే పరమాత్మను బొందిరి

*అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః ।*
*సర్వభూత దయా పుష్పం క్షమా పుష్పం విశేషతః ॥*
*శాంతి పుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవ చ ।*
*సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥*

భగవంతునికి ప్రీతికరమైన పుష్పములను వినుడీ ! 1 అహింసయే ప్రథమపుష్పము, 2 ఇంద్రియనిగ్రహమే ద్వితీయ పుష్పము, 3 సర్వభూతదయయే తృతీయపుష్పము, 4 క్షమయనెడు పుష్పము విశేషమైనది చతుర్థపుష్పము, 5 శాంతి పంచమపుష్పము 6 తపస్సు షష్ఠపుష్పము, 7 ధ్యానము సప్తమపుష్పము, 8 ఆలాగున సత్యము అష్టమపుష్పము ఇట్టి పుష్పములతో మానసిక పూజజేయువారు భగవత్కృపకు పాత్రులై భగవత్సాయుజ్యమును బొందగలరు బాహ్యపుష్పములతో బూజజేయుచు ఆత్మపుష్పములచే పూజజేయనిచో అతండు భగవత్కరుణకు పాత్రుండు గాజాలడు స్థూలమునకున్నూ, సూక్ష్మమునకున్నూ తిలపర్వత తారతమ్యము గలదు మన దేహమునకున్నూ, దేహికిన్ని యెంతో వ్యత్యాసము గలదు గదా ! దేహము జడము, నశించునది దేహి చైతన్యము, నాశము లేనిది ఆత్మానాత్మ పూజలకున్నూ గలిగెడు ఫలమిట్టిది

సమాప్తము

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు



ఓమ్

# అకారాదివర్ణానుక్రమము

## కఠోపనిషత్తు

## ముండకోపనిషత్తు

## మాణ్డూక్యోపనిషత్తు



## శ్రీనారద భక్తి సూత్రములు

వర్ధతాం బ్రహ్మవిద్యా చ లోకేభ్యః సుఖమేధతామ్ ।
తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥

## విజయ ఘోషలు

దైవమతము ప్రతిష్ఠిత మగును గాక !
కరుణామతము వృద్ధినొందును గాక !
శాంతిమతము స్థాపితమగును గాక !
సత్యమతము స్థిరప్రతిష్ఠ నొందును గాక!
ధర్మమతము ఉద్ధరింప బడును గాక !
ఋషి మతము వర్ధిల్లును గాక !
స్వాతంత్ర్యమతము జయించును గాక !
జ్ఞాన మతము వ్యాపక మగును గాక !

చరాచర సుఖాభిలాషి
మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు.

